
ర్ణోత్సవ సంచిక
జనవరి 1974
భారతి
వ్యవస్థాపకులు:
దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

50 సంవత్సరాలుగా

సాహిత్య సేవ చేస్తున్న

# భారతికి

మా హృదయపూర్వక

శుభాకాంక్షలు!



సంపాదకుడు,

# యువ

మాసపత్రిక,

హైదరాబాదు - 1.

# భారతి

మాసపత్రిక



శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)



జనవరి 1974

సంపుటము : 51 : సంచిక : 1 :

విడిపత్రిక వెల రెండున్నర రూపాయి

# విషయానుక్రమణిక

## జనవరి 1974

# స్వ వి ష య ము

ఆంధ్ర వ్యక్తి పరిణామమును నిరూపించుటకు కపారమైన విషయానగాహనము జేయుట కాంధ్ర లోకము పూనుకొనవలసియున్నది," అన్న మాటలలో 'భారతి' మొదటి సంచికలో 'సంపాదకుడు' అప్పటి తెలుగువారిని వారి గతాన్ని పరిశోధించవలసినదిగా కోరారు. కాని, భారతి పాత విషయాలని కొన్నిటిని కొందరికి తెలియజెయ్యటంతో ఆగిపోలేదు; తెలుగువారిలో మేలుకొంటున్న భావా లన్నిటినీ ఎన్నో విధాలుగా వెల్లడించటానికి వీలు కల్పించే ఒక సాధనంగా ఉండటానికి ప్రయత్నిస్తూనే ఉంది. ఇటువంటి భావాలకి 'గతం' ఎంత ముఖ్యమో 'వర్తమానం' కూడా అంత ముఖ్యమే. ఏభయి సంవత్సరాల పూర్వంకన్నా ఇప్పుడు చాలా ఎక్కువ మందిని తమ జ్ఞానాన్ని అన్ని విధాలుగానూ పెంపొందించటానికి అవకాశాలు అధికంగా ఉంటున్నాయి. కొత్త విషయాలు తెలిసినకొద్దీ వాటిని గురించి కలిగే కొన్ని రకాల భావాలని ఇతరులకి తెలియజెయ్యాలనే కోరిక ఎందరిలోనో కలుగుతూ ఉంటుంది, వారికీ, వారు చెప్పగలిగినది ఏమిటో తెలుసుకోవాలని అనుకునేవారికీ వీలు కల్పించటాన్ని మించి 'భారతి' చెయ్యగలిగినది ఏమీ లేదు. ఇంతకి మునుపు ఏమి జరిగిందో తెలుసుకోవాలనే కౌతుకాన్ని కొన్ని రకాల రచనలు తీర్చగలవు. మన చుట్టూ ప్రపంచాన్ని ఎప్పటికప్పుడు మార్చివేస్తున్న ఎన్నో విషయాల ప్రభావాలకి లోనవుతూ ఎందరో చెప్పగలిగినది ఎంతో ఉంటుంది. ఇవి ఇక ముందు వారికే కాక ఇప్పటివారికి కూడా ముఖ్యమయినది కాగలదు. 'పాడి' వస్తువు లనిపించే వాటిని గురించి చేసిన రచనలకి మాత్రమే స్థానం కల్పించాలన్న ఉద్దేశం 'భారతి'కి లేనే లేదు. మొదటి సంచికలో భారతి 'సంపాదకుడు' చెప్పినట్లు, 'విద్యా సంపన్నులు యథావిధిని సకల విధములను భారతిని బోషించుటకుఁ బ్రార్థితులు.'

రచయితలకీ, పాఠకులకీ, చిత్రకారులకీ,
ప్రకటనదారులకీ, ఇతర శ్రేయోభిలాషులకీ
'భారతి' శుభాభివందనలు.

# స్వ వి ష య ము

("భారతి" సంస్థాపకులు, సంపాదకులు ఐన—కళాప్రపూర్ణ, విశ్వదాత, దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు—1924 జనవరి, రుధిరోద్గారి పుష్యమాసమున—భారతి మొదటి సంపుటము తొలి సంచికలో వ్రాసిన సంపాదకీయము.)

ఉ॥ కాటుక కంటి నీరు చను
కట్టు పయింబడ నేలయేడ్చెదో
కైటభ దైత్య మర్దనుని
గాదిలి కోడల! యోమదంబ! యో
హాటక గర్భురాణి! నిను
నాకటికిం గొనిపోయి యల్ల క
ర్ణాట కిరాట కీచకుల
కమ్మ త్రిశుద్ధిగ నమ్ము భారతీ.
(పోతన)

శ్రీ మదాంధ్ర మహాభాగవతమును రచియించు సందర్భమునను మహానుభావుండైన పోతనామాత్యునకును భాగ్యభోగ ప్రియుండైన శ్రీనాథునకును సంబంధించిన కథ లనుశ్రుతముగ వచ్చుచున్నవి. ఆ గాథలయందు భాగవత కృతి సమర్పణమునకు సంబంధించిన గాథయు నొకటి గలదు. ఆ గాథయును పోతరాజునకు సహజమైన స్వాతంత్ర్యభావ వైభవమును మనోహరముగ దెలుపుచున్నది.

పోతరాజు తన భాగవతకృతి నేరాజునకో ఇచ్చి దుర్భరమైన దారిద్రమును బాపుకొనుట వివేకమని శ్రీనాథుడు పోతరాజును హెచ్చరించెను. శ్రీనాథుని పలుకులు పోతరాజునకుఁ గొంత సంభ్రమమును గలుగు జేసినవఁట! తన మనోవికారమువలనను భారతికి గలిగిన సంతాపమును పోతన గనుఁగొని పై పద్యమును వ్రాసి భారతికి దుఃఖోపశమనము జేసినాఁడట! పరాధీన స్థితియందున్న భారతి విశుద్ధమైన దేశభాషా రాధకులకు గలుగఁజేసెడి హృదయ సంతాపము నీ పద్యార్థము విశదముఁ జేయుచున్నది.

పోతరాజు పరమ స్వతంత్రుఁడు. ఆ మహాకవికి కావ్యసామ్రాజ్యానుభవమున కాటంకము లెవ్వియును లేవు. భాషయందును భావములందును విజ్ఞానము నందును జీవన ప్రవృత్తి యందును పూర్ణస్వాతంత్ర్యమును గలిగి స్వాధీనభారతి నారాధింపఁ గలిగినను కృతివిక్రయభావము పోతరాజుకు సంతాపమును గలుగఁజేసినపుడు సకల విధములను స్వాతంత్ర్యమును గోల్పోయి యిపుడు పరాధీన స్థితియందున్న భారతిని గనుగొనునపుడు గలుఁగ గల సంతాపమునకు మితిమేరలుం గలవా? మన నిర్మాణమునకు మన పరాధీనస్థితికి మూలశక్తియైన భారతియొక్క పరాధీనస్థితియే మూలము. స్వీయ సాంప్రదాయాచార సిద్ధమైన భారతీ స్వరూపమును సంకల్పించి ధ్యానించి పూజించి వర్ణించి చిత్రించి కీర్తించి భారతిని ప్రత్యక్షము చేసికొనుటయే స్వాధీనస్థితికి సాధనము.

భారతి దీనదశ ననుభవించు చున్నది. అంగములు శుష్కించినవి. కాంతికళలు పోయినవి. విషమస్థితి గలిగినది. ఈ మహోపద్రవమునందు మునిఁగి తేలుచున్న భారతి నుద్ధరించి శుభస్థితిని కల్పింప వలయునను సంకల్పము భారత హృదయమునందు నందు గలిగినది. సేవాపరాయణులు పలువిధముల నీదేవి నారాధించుచు దివ్యరూప సందర్శనమును జేయ గోరుచున్నారు. ఆరాధనాభిలాష యితర రాష్ట్రములందువలె నాంధ్రరాష్ట్రమునందును గలదు. ఆ యభిలాషను సఫలముచేయుటకు పత్రికలను ప్రచురించుచున్నారు. గ్రంథములను వ్రాయుచున్నారు. చిత్తరువులను చిత్రించు చున్నారు. పాటలను బాడుచున్నారు. ఈ ప్రయత్నము లన్నియును భారతిని ప్రత్యక్షము చేయుచు నాత్మవికాసమునకు సాధనంబు లగుచున్నవి.

భారతి ఆదిశక్తి, మహాశక్తి, సావిత్రి, సరస్వతి, మహాలక్ష్మి, త్రిపురసుందరి, కైలాస శిఖరమునందును, కన్యాకుమారియందును, శ్రీ గిరియందును, వేంకటాద్రి యందును, వటమునందును చూతమునందును, మత్తేభమునందును మరాళమునందును, అజంతా యందును ఎల్లోరాయందును, కమలమ్ములందును కేదారములయందును, మందిరములందుమ మహాలులందును,

వేదములందును కావ్యములలదును, పాటలందును పద్యములందును సర్వత్ర భారతి ప్రత్యక్షముగ నున్నది. సర్వత్ర కన్నులుగల వారికి ప్రత్యక్షముగనున్న భారతిని యథాశక్తి నారాధించి భారతీ ప్రసాదమును బడయుటయే ఆత్మోపలబ్ధికి సాధనము.

భారతి దేశభాషారీతుల ననుసరించి బహు రూపములను నెల్లెడలను వెలయుచున్నది. ఆ మహాదేవి వంగ మహారాష్ట్రాది దేశములందు నవవికాసముతో విహరించుచున్న విధమును నా రాష్ట్రముల కళా వాఙ్మయముల వికాసము విశదము చేయుచున్నది. వంగభాషయందుఁ బ్రచురింపఁ బడుచున్న గ్రంథములు చిత్రపటములు పత్రికలు పరిశోధనలు వారి యుత్సాహమునకు నిదర్శనములు. ఆంధ్ర భారతియును వంగభారతియును కర్ణాటక భారతియును భారతీ స్వరూపములు. భారతీదేవి నెవరేరీతినిగొలిచిన వారికారీతిని బ్రత్యక్షమగుచు కామితార్థముల నొసంగుచున్నది. శ్రీకాకుళంనుండి నాసికవరకు మహావైభవ విలాసములతోఁ బూర్వ మానందముగ నాంధ్రావనియందు విహరించి భారతి యిపుడు పరాధీనయై దైన్యము ననుభవించుచున్నది. స్వాతంత్ర్య వాతావరణము చెలరేగుచున్న వర్తమాన సమయమునందు దైన్యదశ కంటికిఁ బాగుగ బొడగట్టుచున్నది. మానవులకు భావదాస్య విమోచనము గలుగకను బాహ్యదాస్య విమోచనము గలుగఁజాలదు. ఆత్మవికాసమునకు సాధనంబులైన భాష భావములు కళలు శాస్త్రములు సాంప్రదాయాచారములు కాంతికళలు లేకను జీవన ప్రవాహము సంకుచితమైనది. హృదయ వికాసమునకు సాధనంబులైన కావ్యకళా నాటకాదుల యుద్ధరణమున కాత్మసంస్మరణము సాధనముగ నున్నది. ఆత్మసంస్మరణమున కవసరమైన దేశావృతమైన సాధనల నారాధించి భావదాస్య విమోచనమును బడయవలసిన శుభ ముహూర్తము సంప్రాప్తమైనది.

ఆంధ్ర యువజనహృదయ ముత్సాహపూరితమై వర్తమాన సమయమునందు భావకర్మ రంగములందు నిర్మాణమార్గము నవలంబించుటకు పరితపించుచున్నది. కళాభిజ్ఞులు కళాభ్యుదయమునకు బాటుపడు చున్నారు. పండితులు శాస్త్రపరిశోధనలకు బూనుకొనుచున్నారు. కవులు మనోభావములను వర్ణించుచున్నారు. గాయకులు పాడుచున్నారు. చిత్రకారులు చిత్రించుచున్నారు. శాస్త్రజ్ఞులు పరిశోధించుచున్నారు. అన్నిదిశలయందును జిజ్ఞాసకాంతులు ప్రసరించుచున్నవి. అన్నికులముల వారును మతములవారును ఆత్మోపలబ్ధిని బడయఁ గోరుచున్నారు. ఆంధ్ర హృదయమునందు స్వకీయమైన స్వరూప స్వభావములను నిర్ణయించి స్వధర్మము నారాధింపవలయునను సంకల్పము గలిగినది. ఆ సంకల్పమును సఫలము చేయుటకు చరిత్రకారులు పండితులు పరిశోధకులు కళాప్రవీణులు ప్రచారకులు చేయుచున్న పరిశ్రమ దేశవ్యాప్తమై ప్రజా పోషణము బడయుచున్నది. దేశవ్యాప్తములైన ప్రయత్నము లనేకముఖములను నాంధ్ర ప్రపంచములకు వ్యక్తముచేసి ప్రజాదృష్టిని నవజీవన ప్రవృత్తియందు లగ్నము చేయవలసిన యవసరము గలిగినది. ఆ యవసరములు సఫలముచేయుట కాంధ్రప్రపంచము పూర్వాపర సంస్కారములను సమన్వయమును జేయుటకు బూనుకొనుచున్నది. ఆంధ్ర ప్రవృత్తిని పరిశీలించునపు డీ విషయము సువ్యక్తమగుచున్నది.

ఆంధ్ర వ్యక్తిత్వము చిరకాలాగతంబైన సంస్కార ఫలము. అ వ్యక్తిత్వమునందును నితర వ్యక్తిత్వములందువలె విశేషణములు గలవు. ఆంధ్రహృదయశీల మభివ్యాపకముగాని వ్యావర్తకముగాదు; ఉదారముగాని సంకుచితముగాదు; సరళముగాని వక్రనుగాదు. ఆంధ్ర హృదయక్షేత్రమునందీ విశేషణము లాది కాలమునుండియు నప్రతిహతమునఁ బ్రకాశించుచున్నవి. ఆంధ్రభాష, వాఙ్మయము, మత సాంప్రదాయచారములు, ఆచార వ్యవహారములు, కళలు, శిల్పములును నీ శీలమును విశదము చేయుచున్నవి. దేశవ్యాప్తములైన ప్రతిష్ఠాపనలం దీ సహజశీలము గోచరంబగుచున్నది. శ్రీశైలము వేదయుగమునను ఋష్యాశ్రమము; బౌద్ధయుగమునను బౌద్ధవిహారము; శంకరయుగమునను శివక్షేత్రము; బసవయుగమునను జంగమమఠము; ఇపుడు శిథిల

క్షేత్రము. శ్రీశైలము దశాభేదముల పాలైనను నేటికిని సుప్రసిద్ధమైన యాంధ్రక్షేత్రముగ నున్నది.

ఆంధ్రభాష సంస్కృత సాంప్రదాయ బద్ధమైనను ప్రత్యేక సాంప్రదాయముల ననుసరించి వికసించినది. ప్రాకృత సంస్కృత ద్రవిడభాషల సంపర్కము భాషాభ్యుదయమునకు దోడ్పడినను భావము భాషాశీలమును శిథిలము చేయలేదు. ఆంధ్రభాష స్వరాంతమై సరళవర్ణ రంజితమై మృదుమధుర స్వభావమును గాపాడుకొనఁ గలిగినది. ఆంధ్రవాఙ్మయము ప్రాకృత సంస్కృత కర్ణాటక వాఙ్మయముల సంపర్కమును గలిగినను ప్రత్యేకరీతిని వికసించినది. మతాచారములు వైదిక జైన బౌద్ధ శంకర వీరశైవ రామానుజాది మత సంపర్కమును గలిగియున్నను జ్ఞానమార్గము నవలంబించుచు వ్యక్తిత్వమును విశదము చేయుచున్నవి. కళలు దేశకాల పాత్రస్థితిగతుల కనుగుణముగను వృద్ధిక్షయములను బొందినను ప్రత్యేక లక్షణములను గలిగియున్నవి. జీవన ప్రవాహము నిమ్నోన్నత తలముల నధిగమించినను నిర్మలాకృతిని గలిగి ప్రవహించు చున్నది.

ఆంధ్రవ్యక్తి పరిణామమును నిరూపించుట కపారమైన విషయావగాహనమును జేయుట కాంధ్ర లోకము పూనుకొనవలసియున్నది. విషయావగాహనమునకు సాధనములైన ప్రాచీనమందిరములు బౌద్ధ స్తూపములు తామ్ర శిలాశాసనములు తాళపత్ర గ్రంథములు కళావిచిత్రములు వాఙ్మయస్వరూపములు నిగూఢములై ప్రకాశము నపేక్షించుచున్నవి. ఆంధ్ర వ్యక్తి ద్యోతకములైన అమరావతి సాంచి మొదలగు స్తూపముల వైభవ మజ్ఞాతముగ నున్నది. శాసన పరిశోధనాలయమునందు వందలకొలఁది తామ్ర శాసనములు త్రుప్పుపట్టి పోవుచున్నవి. ప్రాచ్యలిఖిత పుస్తక భాండారమునందును తంజావూరు గ్రంథ భాండారమునందును ప్రాంతప్రతులు శిథిలములగుచున్నవి. అజంతాయందలి మనోహరమైన చిత్తరువులు ప్రకాశమును గోరుచున్నవి. రసవంతమైన వాఙ్మయము ప్రకాశమును పరిశీలనమును గోరుచున్నది. దేశమునందు మూలమూలలను దాఁగియున్న శాసనములు గ్రంథములు కళలు వెలుతురును గోరుచున్నవి. ఈ విషయావగాహనమునకు దోడుగను ఆంధ్ర ప్రపంచమునందు భావన రంగమునందు గలిగిన మహాసంచలనము సాదర పరిశోధనమును ప్రకాశమును గోరుచున్నది. గ్రంథకర్తలు చిత్రకారులు కళాప్రవీణులు సరసములైన నవరచనలను జేయుచు నవజీవనోదయమును జేయుచున్నారు. ఈ మహోదయ సమయమునందు యథాశక్తిని భారతిని గొలుచుట కవకాశములారాధకులకు గలవు.

ఈ విషయావ లోకనమునకును సంస్మరణమునకును గారణ మాత్మ సందర్శనాభిలాషగాని స్వకీయ ప్రతిష్ఠగాదు. విషయసాగర మథనమును ప్రాజ్ఞులు చేయుచు నాత్మసందర్శనమును జేయుచున్న విధమును విజ్ఞానకాంతులు విశదము చేయుచున్నవి. పరిశోధక మండలులు పత్రికలు సాహిత్యసంఘములు చిత్రకళా సంఘములు విద్యానిలయములు విషయసాగర మథనమును జేయుచు ఫలప్రాప్తికి సాధనములను విశదము చేయుచున్నవి. ఈస్వల్పారంభమును లబ్ధావకాశములను విషయావ గాహనమును జేయుట కేర్పడినదిగాని మహత్ఫలమును సమకూర్పఁబడు నను నభిమానముతో నేర్పడలేదు.

భారతియందు భాష వాఙ్మయము శాస్త్రములు కళలు మొదలగు విషయములు సాదరభావముతోఁ జర్చించుట కవకాశములు గల్పింపబడును. వాఙ్మయ నిర్మాణమునకిపుడు జరుగుచున్న ప్రయత్నములు పరిస్ఫుటము చేయబడును. శిల్పమునకు చిత్రలేఖనమునకు శాసనములకు సంబంధించిన విషయములు చిత్రములతో బ్రచురింపఁబడును. సామాన్యముగఁ బత్రికా ప్రచురణమునందు గల సాధక బాధకము లనుభవ వేద్యములైనను ఈ క్రొత్త ప్రయత్నము సాహస కార్యముగఁ గనఁబడును. మాసపత్రిక నొకదానిని బ్రచురింపవలయునని తలఁచి కార్యసిద్ధికిఁ బ్రయత్నములు జరిగినవి. విజ్ఞాన సంపన్నులు కొమఱ్ఱాజు లక్ష్మణ

రావుగారీ భారమును బూనుట కంగీకరించిరి. ఆ మహానుభావునకు నూతేండ్లు నిండినవి. వారి సహాయము దుర్లభమైనది. రెండేండ్లు లక్ష్మణరావుగారి నిమిత్తమునను గతించినవి. సంకల్పము రిక్త మనోరథముగ నిలిచినది. కొంతకాలము పెరిగిన సంకల్పమును చేసిన ప్రయత్నములను సఫలముచేయుటకుఁ గల యవకాశములను వినియోగించుట కీ ప్రయత్నము కారణము. ఫలము దైవాధీనమునందు గలదు.

విపులమైన యాంధ్రావనియందిట్టి ప్రయత్నముల కెన్నిటికైనను నవకాశములుగలవు. భారతిని పెంచి పోషించవలసినభార మాంధ్ర లోకాధీనమై యున్నది. ముఖ్యముగ నీభారము విద్యావంతులమీఁదను గలదు. పత్రికకు జీవకళను విద్యావంతుల వ్యాసములు సమకూర్చునటులు బొమ్మలును పటములును నచ్చును సమకూర్పఁజాలవు. విద్యాసంపన్నులు యథాశక్తిని సకల విధములను భారతిని బోషించుటకుఁ బ్రార్థితులు. వ్యాసములను పద్యములను పాటలను చిత్రపటములను బంపి ప్రచురణకుఁ దోడ్పడిన మహాజనులకు వందన శతంబులు. ఆంధ్ర మహాజనులు సదయహృదయులై భారతికి స్వాగతంబు నొసంగి దీవించి నాప్రయత్నమును సఫలము చేయుటకు సాయపడుదురుగాక!

**సంపాదకుడు**

---



# స్వర్ణభారతి
## (పంచదశి)
### శ్రీ బులుసు వేంకటేశ్వరులు

సీ. శ్రీకాశినాథ వరిష్ఠవంశాబ్ధికిఁ, బున్నమచంద్రుఁడై పొలిచె నెవఁడు?
వాగేశ్వర పవిత్ర నామధేయుం డయి, నిత్యశివార్చన నెగడె నెవఁడు?
సముచిత భంగి లక్షలు లక్ష లార్జించి, విశ్వదాతగ భువి వెలసె నెవఁడు?
కనియె దేశోద్ధారక ఖ్యాతి మఱి దీన, జనపోషకుం డయి మనియె నెవఁడు?

గీ.. అట్టి మహనీయు నిర్మల హస్తయుగళిఁ బుట్టి పెరిగిన సత్కళా పూర్ణరాశి!
భారతీ! నీదు స్వర్ణోత్సవంబువేళ, నందుకొను మమ్మ! మాయభినందనములు.

చ. దినదిన వర్ధమానమయి తేజరిలం గని యాంధ్రజాతి పా
వనయశమున్ దిగంతముల వ్యాప్తము చేసితి వద్భుతంబుగన్
జనకుఁడు సంతసించునటు సర్వమహాంధ్ర కవీశ విజ్ఞ స
జ్జన కలహంస బృందముల సంగతి భారతి! మానసంబవై.

సీ. నవరసాలంకార కవితా చమత్కార, సలలిత రీతి శయ్యల గడించి
పరతత్త్వరసమును బ్రవహింపఁ జేయుచు, నానంద మొసఁగుచు నందఱికిని
మృదు మధురతఁ గడు మేలిమి జిగిబిగి, కలుగు మాటలు హస్తగతములుగను
చదువు వారలకు నుత్సాహంబు జవజీవ, సముదయం బొసఁగెడి చతురతఁ గని

గీ. ఆంధ్రకవు లెందఱో నీకృపార్ద్రవీక్ష, నతిశయం బగుసత్కీర్తి నంద గవిత
మేలి స్వర్ణోత్సవశ్రీలఁ దేలి నీవు, భారతీ! వే. డితోధిక భాగ్యముఁ గను.

ఉ. భారతదేశ సత్కవులపై మమకారము నీకుఁ గాన నే
భారతి నందు రేమొ నినుఁ బావన జన్మము నంది యాంధ్రిపై
"భారతి" చల్లఁగంటివి కృపాసుధ వృష్టిగ నూతనత్వ శో
భా రమణీయతం గనియె భాగ్యము పండఁగ నాంధ్రి యెంతయున్.

మ. మహనీయం బగు సత్కవిత్వ ధురిఁ జిమ్మంగన్న యమ్మా! కడున్
మహనీయప్రభుతన్ వహింపఁగఁదె! యుష్మ ద్దివ్యతన్ విల్వ మ
న్వహమున్ గోమల భావమాధురులు తత్త్వజ్ఞానముం గల్గి స
న్మహితోదాత్త వయోనుకూలముగ నౌన్నత్యంబునన్ భారతీ!

గీ.. నేల విడిచిన సాము సట్వాలు లేని, ధూమశకటము నియమ సంస్తోమ రహిత
కవిత వ్యక్తిత్వ సంప్రదాయ విహితపథ, మందె చరియింపు భారతీ! సుందరముగ.

మ. శతసంవత్సర విస్తృతం బయిన పాశ్చాత్యప్రభావంబు నౌ
చితి పాటించి గ్రహింప నౌను. మన వౌ సిద్ధాంతముల్ వీడుటల్

మతి లేమిన్ పరదాస్యలంపటుల మేమాత్రతంబుఁ, గాదా భా
రతి! నైసర్గిక సుందరప్రతిభ ధైర్యం బూని నిల్పందగున్.

క.. మనవ్యక్తిత్వము సంస్కృతి, మనవిలువలు మఱి స్వధర్మ మహితత్వంబున్
జననీ! భారతి! దీక్షం, గని చాటుము శతసహస్రగతులన్ వతులన్.

సీ. జనియించితివి సుప్రశస్తంబు గాఁగను, మహిత నాగేశ్వర మాన్య చలువ
వ్యాపింపఁజేసితి వల దశ దిశలను, సారస్వత నితాంతశక్తిని గడు
చక్క శ్రీ శంభుప్రసాదు లాలనమున, వృద్ధి నందితి వెన్నొ విధములుగను
పరమాంధ్ర సాహితీమరుచిర క్షేత్రముల్, సుఫలంబు లొసగంగఁ జూచినావు

గీ.. ఇప్పు డిట్టి రాధాకృష్ణ హితకర మృదు, సేవఁ బెంపెక్కి సకలసంసిదిఁ గూర్పు
భారతీ! నీవు స్వర్ణోత్సవ ప్రశస్తిఁ, గనుట యది యావదాంధ్ర భాగ్యంబు నిజము.

గీ.. ఒనరుచేశకు షష్టి పూర్త్యుత్సవంబు, నీ వితోధిక భాగ్యసంభావిత వయి
తుష్టి పుష్టుల నంది యదృష్ట వృద్ధి, నందుదువు గాక! భారతీ! సుందరముగ.

మ. శతథా కాదు సహస్రధా మిగుల విశ్వస్తుత్యవై యజ్ఞతాం
ధతఁ బోద్రోలి మహాంధ్రిపై విమలసౌందర్యంబు విజ్ఞాన సం
భృత విస్తార మహాత్మ్యమున్ నిలిపి దేవీ! భారతీ! లోక సం
స్తుత సాహిత్య రసావగాహ వటువుమీ శుద్ధాంతరంగంబుతో.

సీ. పదికాలములపాటు హృదయ సుస్పందన, కరముగా నిల్వ నీకథ లవెల్ల
పదిలంబుగా భద్రపరచుకో దగినట్టి, సరసముల్, నీపద్యజాలములుగ
హితములై యాఖ్యానస్మృతములై బుతములై, నీవ్యాసరాజముల్ నెగడుచుండ
కమనీయ సత్కావ్యఖండిక లేకాంకి, కలు నాటకంబులు విల సిలంగ

గీ.. నవరసస్ఫోరకంబులై శ్రవణసుఖద, మానసోల్లాసకర సద్విమర్శనములు
గుణయుతంబులు నీ పుటల్ కొమరు మిగుల, భారతీ! నీవు విలసిల్లవలయు నమ్మ!

ఉ. భారత భారతీ విమలభాగ్య నిధానమవై మనోజ్ఞ వి
స్తార రసాత్మకప్రథిత శబ్దమహోర్మిరి వొచు గాఢ గం
భీర హితోపదేశయుత విశ్వహితైషిణివై మహాంధ్రిలో
భారతి! సత్సహస్రదళ పద్మమవై వెదచల్లు శోభలన్.

మ. సరస స్వర్ణ మహోత్సవ స్థిర వికాస శ్రీలఁ బొల్పొందు సుం
దరవేళన్ మహితాశీ వందనములన్ దైవారు వాశీస్సులన్
వరుసన్ గైకొను భారతీ! దినదినప్రఖ్యాతితో నిత్య బం
ధుర కీర్తిన్ శుభవృద్ధి నంది మనుమీ తోరంబు హర్షంబుగన్.

శా. రాధాకృష్ణుడు తోడునీడ యయి నిన్ రక్షించుచుండన్ మహా
మేధావంతులు నీపవర్యలను నెమ్మిం జేయుచుండంగ నీ
గాథల్ పాడఁ గవీంద్రగాయకులు మ్రొక్కన్ భక్తులున్ సాహితీ
పీఠిన్ వర్షశతంబు లుండ గదవే! పెంపొందుచున్ భారతీ!

---

# లండన్ లో
# రాజహంసలు
# అందంగా వుంటాయి సుమా!

## అందుకే మేము అన్నిసార్లు వెళ్ళి వస్తుంటాము!

లండన్ పట్టణము —
పార్కుల్లో కాలం గడుపుటకు,
నక్షత్రాల తేరి చూచుటకు, షాపింగునకు,
చక్కని థియేటర్లు, బాలెట్ మరియు
సినిమాలు చూడదగిన ముఖ్యపట్టణము.

**ఎయిర్-ఇండియా**
మీకు ఎంతో ప్రియమైనది ఎయిర్ లైన్



# స్వర్ణోత్సవ భారతి

## కళాప్రపూర్ణ నిడదవోలు వేంకటరావు

"రమణీయాక్షరాకృతింబొలిచి
వర్ణశ్రేణి వ్యాసాను భా
వము రీతిం గరగించి, స్వచ్ఛత
రసం బత్రాభిరామమ్మునై
సుమనః కావ్యకళాన్వితంబగుచు
సంస్తుత్య "ఆంధ్రసాహిత్య స
త్వమహస్య" మ్మగు దివ్యమూర్తి
గొలుతున్ స్వర్ణోత్సవన్ భారతిన్".

ఇప్పటి కరువదియైదేండ్ల క్రిందట "ఆంధ్రపిత" శ్రీ లాతవాసి కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు నానాముఖములుగా తెల్లారిదద్దైన నాంధ్రులను—

### ఆంధ్రపత్రిక

మూలమున ఆంధ్రత్వమును పెంపొందించి, ఏకైకముగా రాజకీయ సాంఘికోత్తేజనము గలిగించి విశాలాంధ్ర రాష్ట్ర నిర్మాణమునకు మూలస్తంభాయమానులైనారు.

శ్రీ పంతులుగారే మరి పదునైదేండ్ల తరువాత క్రీ. శ. 1924 జాన్యువరిలో ఆంధ్రసారస్వత ప్రపంచమున సాహిత్య వైజ్ఞానిక చైతన్యము నుజ్జీవింపజేయుటకై

### భారతి

మాసపత్రిక నెలకొల్పి బహుముఖములుగా ప్రవర్తిల్లుచున్న భాషాజగత్తులో—ఏకైక సాహిత్య పత్రికగా పరిణమింపజేసిరి.

అట్టి భారతి కీనాడు సువర్ణోత్సవము. ఈ యుత్సవము భారతికే కాదు— తెనుగున పత్రికా వాఙ్మయ చరిత్రమున సువర్ణ ఘట్టము[1]— అద్యతనాంధ్ర సాహిత్య చరిత్రమున ముఖ్యఘట్టము. ఆంధ్ర సాహిత్య సంస్కృతి చరిత్రలో సంస్మరణీయ ఘట్టము.

క్రీ. శ. 1938 నుండి క్రీ. శ. 1972 వరకు ముప్పదినాలుగేం డ్లమోఘముగా శ్రీ శివలెంక శంభుప్రసాదు గారు 'భారతి' పత్రికాధిపత్యము, సంపాదకత్వము వహించి, ఆంధ్రభాషా పత్రికా ప్రపంచమున— భారతి నత్యున్నత స్థానమలంకరింప జేసిరి.

శ్రీ నాగేశ్వరరాయ నిర్మితమై, శ్రీ శంభుప్రసాదు గారిచే, నిరుపమాన సాహిత్య కళానిలయముగా దిద్ది తీర్చబడిన భారతి సౌధమునకు సువర్ణ శిఖరము నెత్తించి, అత్యుత్సాహముతో భారతి ఉత్తమ స్థాయిత్వ సంప్రదాయము నిరవద్యముగా నిల్పుచున్న ప్రస్తుత సంపాదకులు శ్రీ శివలెంక రాధాకృష్ణ గారికి భగవంతు డాయురారోగ్య భాగ్యములు ప్రసాదించు గాక!

### భారతి అవతరణము

భారతి అవతరించు నాటికి తెలుగు వాఙ్మయమున నవ్యయుగము వికాసము నందినది. పాశ్చాత్య సాహిత్య సంస్కార ప్రభావము పరిణత రూపము దాల్చినది. నవ్యసాహిత్య ప్రక్రియలలో — ఖండకావ్య రచన గణనీయమైనను, వచనము ప్రధానస్థాన మాక్రమించినది. నవల, కథానిక—నాటిక— వ్యాసము దైనందినాభివృద్ధి నందినవి. పాశ్చాత్య విమర్శనా, పద్ధతులపై సాహితీ విమర్శనలు, భాషావాఙ్మయ చారిత్రక గవేషణ పలురీతులుగా విస్తరిల్లినది. ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరమున పాశ్చాత్యదేశములలో ప్రచురముగా నున్న వైజ్ఞానిక పరిశోధనలు— పాశ్చాత్య రాజకీయ సాంఘిక విప్లవ వ్యవస్థలు మన కంతర్జాతీయమైనను సన్నిహితములైనవి. ఆ వాతావరణ ప్రాబల్య మాంధ్రసాహిత్యముపై సోకినది.

ఇట్లు నవ్యత ప్రచురము గానున్నను, భారతీయ సంస్కృతిని గూర్చి, సంస్కృత భాషా విశిష్టతను గూర్చి ప్రాచ్యపండితులు విచారణలు సేయుచునే యుండిరి. ప్రాచీనాంధ్ర సాహిత్యమున ప్రసిద్ధములైన కావ్యములపై సంప్రదాయానుసార దృష్టితోను భాషాకోవిదులైన పండితులు ప్రశస్త విమర్శనలు వెలయించుచునే యుండిరి.. కాని ప్రాచీన సాహిత్య విమర్శనముల పట్ల— భాషాపాండిత్యము

---

1. తెలుగున మాసపత్రికలో సువర్ణోత్సవము జరుపు కొన్న పత్రిక— ఒక్క భారతియే— చూడుడు—నా ఆంగ్ల వ్యాసము.

Literary Journalism-History of Telugu Journalism V' R- Narla shastyabdapurti Commemoration Volume.

సంప్రదాయ పరిజ్ఞానము గల— ప్రాచ్యపండిత విమర్శనముల కన్న, పాశ్చాత్య సంస్కారము మాత్రమే అలవఱచుకొన్న పాశ్చాత్య పట్టభద్రుల చారిత్రక విమర్శనలకే పలుకుబడి కలిగినది. సంప్రదాయ విమర్శనకు క్రమముగా స్థానము సన్నగిల్లినది. ఆంధ్ర విశ్వవిద్యాలయమున—తెలుగున శాస్త్రోపాధ్యాయ (ఎం.ఏ.) పరీక్షకు సాహిత్య పరిణామము విస్మరించి కేవలము వాఙ్మయ చరిత్రయే ప్రధానముగా చేయుటయు నీ అవ్యవస్థకు దోహదము చేసినది. ప్రాచీనత - నవీనత— సమన్వయము చెందుటకు మూలముగా విడివడినవి.

ఇట్టి పరిస్థితులలో ప్రాచీనసాహిత్య సంప్రదాయమును— నవీన పాశ్చాత్య సంస్కారమును సమన్వయించి—, ప్రాచీన సాహిత్యమును పరిరక్షించి, నవీనసంస్కారమునకు నవత మొసంగి నూతన వైజ్ఞానిక శాస్త్రీయ దృష్టితో— సర్వతోముఖముగా వ్యాప్తి చెందుచున్న సమస్త సాహిత్య కృషిని, సమీకరించి --యావదాంధ్రదేశపు సాహిత్యమును కేంద్రీకరింపజేసినది భారతి.

భారతీయాధ్యాత్మిక విజ్ఞానమును —పాశ్చాత్యసంస్కార వికాసమును తెలుగు సాహితిని ప్రతిఫలింపజేసినది భారతి—

కేవలము సాహిత్యపత్రికగా గాక — సారస్వతము— చరిత్ర— సంస్కృతి— వ్యవస్థలకు — నవ్య విజ్ఞానప్రసారమునకు ప్రధాన వాహికగా నిలిచినది భారతి—

ఆధ్యతనాంధ్ర సాహిత్యజగత్తులో —అర్ధ శతాబ్ది చరిత్ర ప్రతిబింబింపజేసినది — భారతి.

ఏబదేండ్ల కాలమున భారతి సాధించిన పురోభివృద్ధిని అవధరింపుడు— దీనికి ముందుగా భారతి పరిణామ చరిత్ర తిలకింపుడు—

## భారతి పరిణామ చరిత్ర

భారతి పరిణామ చరిత్రలో రెండే ఘట్టములు.

1. ప్రథమ ఘట్టము వ్యవస్థాపకత్వము.
2. ద్వితీయ ఘట్టము సంపాదకత్వము.

## ప్రథమ ఘట్టము

భారతి, తక్కిన మాస పత్రికలవలె వచన ప్రాధాన్యము గలదేయైనను, ఆంధ్ర సాహిత్య సంప్రదాయము ననుసరించి పద్య రచనతో ప్రారంభించినారు పంతులుగారు. భారతి మొదటి సంచిక భారత పిత మహాత్మాగాంధి త్రివర్ణ చిత్రముతో మంగిపూడి వేంకటశర్మగారి గాంధీ శతకముతో ప్రారంభమైనది. పాలమీగడవంటి కాకితములమీద, ముత్యముల బోలిన ముద్రాక్షరములతో భారతపిత చిత్రముతో నా సంచిక సర్వాంధ్ర లోకమునేగాక—భారతీయ రాష్ట్రేతర ప్రజలను బహుళముగా నాకర్షించినది.2 పద్యములతో ప్రారంభమైన యీ సంప్రదాయము నేటికిని నడచు చున్నది.

## కలగూరగంప

1927 ఫిబ్రవరిలో కలగూర గంప అను శీర్షిక ప్రవేశ పెట్టబడినది. ఇందలి విషయములు—వ్యాసములలో చేరక, పరిశోధకులు ప్రత్యేకముగా కనుగొన్న నూత్న సంగతులు—అముద్రిత గ్రంథములనుండి తెలియదగిన యంశములు— ఇతర పత్రికలయందు ప్రకటితములైన అద్భుతములు సంగ్రహముగా నందుండెడివి. కలగూరగంపలోని యంశములు మెఱుపు తీగవలె భారతి పాఠకులకు స్ఫూర్తి గల్గించెడిది. ఇదియు నేటికిని భారతి నలంకరించు చున్నది.

## వ్యాసకర్తల ఛాయాచిత్రములు

వ్యాసములతోపాటు వ్యాసకర్తల ఛాయా చిత్రములు ప్రకటితములగుట నొక పరిపాటిగా నా సంవత్సరముననే మొదలిడినది. తరువాత నప్పుడపుడు ప్రకటితమగు చుండెడివి. క్రమ క్రమముగా గ్రంథ విమర్శనలతో, సాభిప్రాయ విశేషములతో— ప్రథమ ఘట్టముననే సాహిత్య చైతన్యము నుజ్జీవింపజేసి ప్రజామోదము చూఱగొన్నది.

నెల కాగానే 'భారతి' ఎప్పుడు వచ్చును? ఎంతలో వచ్చును ? అని పాఠక లోక మత్యాతురతతో చూచుచుండెడివారు. సంస్కారులు, రచనా సామర్థ్యము గలవారు, కవులు, తమ పద్యములుగాని, వ్యాసములుగాని భారతిలో పడిన ధన్యుల మనుకొనెడివారు. అంత ప్రచార, ప్రజాదరణలను పొందినది భారతి.

## ద్వితీయ ఘట్టము—సంపాదకత్వము

శ్రీ శంభుప్రసాదుగారు ఆధిపత్య సంపాదకత్వము వహించిన నాటినుండి భారతి— బహుముఖములుగా భాసించి, విశ్వతోముఖముగా విరాజిల్లినది. వారి దృష్టిలో భారతి పత్రికాధిపత్యమొక పవిత్ర కార్యము. వారి మనోభావన యెల్లప్పుడు భారతి పత్రికా పురోగమనమునందే కేంద్రీకృతమై యుండెడిది.

వ్యవస్థాపకులైన శ్రీ నాగేశ్వరరావుపంతులుగారి యెడల

---

2. భారతి ప్రథమ సంచికను కాకినాడలో 1924 లో జరిగిన దేశీయ మహాసభయందు మూడువేల ప్రతులు ముద్రించి శ్రీ నాగేశ్వరరావు పంతులుగారు ఆంధ్ర 'భారతి'ని యావద్భారత ప్రజల దృష్టి కి నెట్లు తెచ్చిరో— ఆ విషయము మొన్నటి సంవత్సరాది సంచికయందు ఆధునికయుగము— గాంధీ సాహిత్యము అన్న వా వ్యాసమున దెలిపితిని.

వారికి గల భక్తి ప్రపత్తులు వర్ణనాతీతములు. ఒకే ఒక్క సంఘటన వివరింతును.

1963 నాటికి వారు భారతి సంపాదకత్వము వహించి 25 య్యేండ్లయినది. దానిని పురస్కరించుకొని ఆ సంవత్సరమే ఏప్రియలు 11 తేదిని శ్రీ పంతులుగారి ఆరాధన తిథినాడొక సమావేశము గావించితిమి. అందు నేను ప్రసంగించుచు నిట్లు చెప్పితిని.

"శ్రీ నాగేశ్వరరావుపంతులుగారు స్థాపించిన— ఆంధ్ర పత్రిక, భారతి రెండు సంస్థలను చెక్కు చెదరక నిల్చునట్లు చేయుటయేగాక, ఇతోధికముగా నవి వర్ధిల్లునట్లు చేసిన కీర్తి శ్రీ శంభుప్రసాదుగారిదే— వారి భారతి ఆధిపత్య సంపాదకత్వమున కిది రజతోత్సవ దినము" అని ఇంకయు చెప్పబోగా, వారు వెంటనే లేచి "ఈ సృష్టి యంతయు శ్రీ పంతులుగారిదే. ఇందులో నా చేసిన దేమున్నది" అని చెప్పి నా ప్రసంగము నాపి వేయించిరి. శంభుప్రసాదుగారికి, నాగేశ్వరరావుపంతులుగారే యిష్టదైవము, గురువు, సర్వస్వమును.

## పర్యవేక్షణ

సంపాదకుడున్నను— వారి నిశిత పర్యవేక్షణ క్రిందనే భారతి ప్రకటితమగు చుండెడిది. సంపాదకుడు క్రొత్త పద్ధతి పెట్టినపుడది పాఠక లోకమునకు రుచింపకపోయిన తక్షణమే దాని నుపసంహరింప జేసెడివారు. 1940—41 లో గిడుగు సీతాపతిగారు సంపాదకులుగా నున్నప్పుడు—భారతిలో ప్రకటించు వ్యాసములపై తమ యభిప్రాయములను 'భారతి' అభిప్రాయములుగా దెలిపెడివారు. ఇది భారతి సంప్రదాయమునకు విరుద్ధమగుటచేత వారిని వెంటనే తప్పించివేసినారు. పాఠకుల యభిరుచులను వారెంత సూక్ష్మముగా గ్రహించిరో తెలుపుటకు దీని నుదాహరించినాను.

## ఆశయములు

భారత వర్షమునవేగాక, ప్రపంచమున విజ్ఞానవీథిలో వెలువడుచున్న నూత్న విషయములు భారతిలో ప్రకటితములు కావలెనని వారి యాశయము. అవి తెలుగు సాహిత్యము ద్వారా ప్రసారము కావలెనని వారి యాకాంక్ష. ఒక్కొక్కపుడు "వివిధ విషయములపై వ్యాసములు వ్రాసెడివారే మనలో లేరే" అని విచారము వ్యక్తపఱచెడివారు.

1. ప్రాచీన సాహితీ సంస్కృతులను— నూతన సంస్కార దృష్టితో వివేచనతో వివరించుట.

2. నవీన వైజ్ఞానిక విషయములను, సాంకేతికముగాక— సర్వజన సులభముగా వెల్లడించుట వారి లక్ష్యములు. మొదటి లక్ష్యమున కొక్క యుదాహరణ. ఒకవారు లండనులో బి.బి.సి. వారు "వాత్స్యాయన కామసూత్రము"లను గూర్చి ఒక ప్రసంగము ప్రసారము చేసినారు. శంభుప్రసాదుగారు దానిని తెప్పించి, వెంటనే నాచేత తెలుగు చేయించి, భారతిలో ప్రకటించినారు,[3] వాత్స్యాయన కామ సూత్రములనగానే మనకో పెల్లుబుకు లైంగిక వాంఛ నరికట్టి, ఎంతో ఉదాత్తముగా శాస్త్రీయముగా నున్న దా ప్రసంగము. విషయ గ్రహణమున వారి సూక్ష్మ దృక్పథమున కిది యొక నిదర్శనము.

## గ్రంథ సమీక్షలు

భారతిలో గ్రంథ సమీక్షల కొక ప్రత్యేక విశిష్టత చేకూర్చిన వారు శ్రీ శంభుప్రసాదుగారు. అంతకుముందు సాహిత్యదృష్ట్యా ఎంత విలువగల గ్రంథమైనను, దాని గుణ విశేషములు— గ్రంథ సమీక్ష శీర్షిక పరిధిలో నిమిడిపోవలసి వచ్చెడిది. దాని వలన కొన్ని గ్రంథములలో ముఖ్యముగా భాష, పదకోశ, సాహిత్య వాఙ్మయ చరిత్రలోని గుణ విశిష్టతగాని—దోష నిరూపణగాని సంపూర్ణముగా వివరించుట కవకాశములేక పోయెడిది. అందువలన కొన్ని ఉద్గ్రంథములకు— వాఙ్మయ చారిత్రక గ్రంథముల సమీక్షలను— ప్రత్యేక వ్యాసములుగానే ప్రకటించు పద్ధతి నేర్పాటు చేసినారు. అది నేటికిని ఆచరణలోనున్నది. ఇందువలన భాషా సారస్వత చారిత్రక విమర్శల కెంతో దోహదము గలిగినది.

## నిష్పక్షిక సమీక్ష

శంభుప్రసాదు గారు భారతిలో ప్రకటింపబడిన వ్యాసములు ప్రత్యక్షరము కంటవత్తినిడుకొని పరిశీలించెడివారు. వ్యక్తిపక్షముగాగాని సంఘ పక్షమునగాని, ఎట్టి పాక్షికాభిప్రాయములున్నను—వానిని తొలగించి ముద్రించెడి వారు. "సమీక్షలో—గుణముల నెట్లు చూపుచున్నామో, అట్లే దోషములను చూప వలెను. దానివల్ల గ్రంథకర్తకేగాక, సాహిత్యలోకమునకు మేలు కలుగును. "గ్రంథ సమీక్షకుని దృష్టి— గ్రంథముపైననేగాని, గ్రంథకర్తపై యుండగూడదని వారి నిర్ణయము. ఇట్టి నిర్ణయముతోడనే వారు నన్ను ఆరుద్ర సమగ్ర ఆంధ్ర సాహిత్యం పండ్రెండు సంపుటముల సమీక్షకు నియోగించినారు. నేటికిని నా సాహిత్య సమీక్షలలో వారి నిర్ణయమునే అనుసరించుచున్నాను.

## ప్రాచీన పద్య ప్రచారము

రసగుళికలని చెప్పదగిన ప్రాచీన పద్యములు చాటువులో —శతకముల పద్యములు— ప్రచారములోనికివచ్చి, ప్రాచీన పద్య పఠనాసక్తి భారతి పాఠకులలో పెంపొందింపజేయుటకు

3. భారతి జాన్యువరి 1961.

వారు—వ్యాసముల వివరములట్టి పద్యములను ప్రకటించెడి వారు. ఇవి చమత్కారముగావే గాక విజ్ఞాన ప్రదముగా నుండెడివి4—

### వ్యాస వివేచన

భారతిలో ప్రకటితములగుచుండు వ్యాసములన్నియు మౌలికములై యుండవలె ననిసాహిత్య చారిత్రక విషయములో నిదివరకు ప్రకటితములైన విషయములు ప్రకటింపరాదనియు వారి లక్ష్యములలో నొకటి— ఆయా విషయముల నిష్ణాతులైనవారితో సంప్రతించి నిర్ణయము చేసెడి వారు—

క్రీ. శ. 1962—63 సంవత్సరములలో భారతి వ్యాసములను సంప్రతించుటలో వారికి సహకరించు భాగ్యము నాకు గలిగినది. వ్యాసములన్నియు సుపరిశీలితములై ప్రకటితములగు చుండెడివి.

నేను 1964లో హైదరాబాదు వచ్చినను వారు నాతో సంప్రతించెడివారు. ఒక పర్యాయము భారతికి రాజరాజ నరేంద్రుని మండ శాసనముపై వ్యాసము వచ్చినది. వారీ శాసనమంతకుముందు ప్రకటితమైనదో లేదో తెలుసుకొనుటకు నాకు "ట్రంకు టెలిఫోను" చేసిరి! వెంటనే నేను మండ శాసనము 1943 జనవరిలో భారతిలోనే ప్రకటితమైన దని ఆ"ఫోను"లోనే తెలిపితిని. వారు దానిని ప్రకటింపలేదు.

ఇది వారు భారతి వ్యాసప్రకటన విషయమై ఎంత జాగరూకత వహించెడి వారో లోకమునకు వెల్లడించుటకై తెలిపితిని గాని సోత్కర్షకు గాదు. ఇట్టి వెన్నియో గలవు.

ముప్పది వాల్గేండ్ల వారి హయాములో భారతి మూడు పూవులారు కాయలు కాచినది. ఆంధ్రులకేకైక సాహిత్యపత్రిక యైన భారతిని వారు 'విజ్ఞాన సర్వస్వపత్రిక'గా భాసింప జేసిరి.

### భారతి

ఏకైక సాహిత్య పత్రికగాదు.
విజ్ఞాన సర్వస్వము—

మనకు విజ్ఞాన సర్వస్వములున్నవి గాని భారతి, పత్రికా రూపమున నున్న విజ్ఞాన సర్వస్వము—

భాషాసాహిత్యములతోపాటు సమస్త వైజ్ఞానిక విషయములు నిండుండుటచే 'భారతి' విజ్ఞాన సర్వస్వముగా పరిణమించినది. విజ్ఞాన సర్వస్వములలో అకారాద్యను క్రమణిక ననుసరించి విషయములుండును. ఇందు ప్రత్యేక వ్యాస రూపమున నుండును. ఇంతే భేదము—

అణువు మొదలు బ్రహ్మాండము వరకు గల అన్ని విషయములు ప్రపంచించి, భారతి విజ్ఞాన సర్వస్వముగా రూపొందినదని నిర్వివాదముగా నిరూపింపవచ్చును.

దీనంతటిని బట్టి—భారతినిగూర్చి—విశ్వవిద్యాలయము లలో—

భారతి వ్యాససూచి
నవ్యాంధ్ర సాహిత్య చరిత్ర
భారతి యుగము—

అను రెండు విషయములపై సంవత్సరములకొలది పరిశోధన చేసి సిద్ధాంతగ్రంథములు (Thesis) రచన చేయుటకు తగినంత సాధన సామగ్రియున్నదని గ్రహింప గలము—

విస్తృతి దిక్ప్రదర్శనముగా ఈతరమువారికి పరిచయము లేని కొన్ని విషయములను మాత్రమే తెలుపుచున్నాను—

పాఠకలోకము మన్నింప వేడికోలు——

### సాహిత్యము—

సంస్కృత సాహిత్యము—

మహిత సాహిత్య జీవి— మానవల్లి మౌలిక రచన లన్నింటిని ప్రకటించినది భారతి—

(1) తుక్కా పంచకము (2) సురేశ్వరాచార్యు లెవరు? (3) కాళ కలభకవి (4) మల్లినాథుడు (5) సర్వజ్ఞసింగభూపతి (6) కవి కంఠపాశము (7) సంగీత రత్నాకర వ్యాఖ్యలు—లీలావతీకథ (ప్రాకృతము) పైవానితో బాటు—కురుగంటి సీతారామయ్యగారి—"తంజాపుర నాయక రాజాస్థాన సంస్కృత కవులు" అను వ్యాసము గలదు. శ్రీ శంకరాచార్య చరిత్ర—నడిమింటి సర్వమంగళేశ్వరశాస్త్రి—బెల్లంకొండ రామారావు—తాతా సుబ్బరాయశాస్త్రి— మొదలగు జీవితములు ప్రకటితములైనవి— ఇంకను కాళిదాస మహాకవిగూర్చి—ఆతని కవితా విశేషములను గూర్చి—ఇతర సంస్కృత కవులను గూర్చి యే గాక, సంస్కృత నాటకాలంకార విమర్శనలు భారతిలో వెలువడినవి—

### తెనుగు సాహిత్యము

సంస్కృత సాహిత్యము నందువలె—తెలుగు సాహిత్యమున మానవల్లి వారి రచనలు మౌలికములు—అట్లే వేటూరి ప్రభాకర శాస్త్రి రచనలు—వీరిరువురి రచనలు వేటి పరిశోధకులకు పరమాధారములు—

మానవల్లి—(1) విష్ణువర్ధనమంత్రి—చారు లీలావిలాసము (2) దశకుమార చరిత్ర. (3) వీరభద్ర విజయము (4) ఉదయ నోదయము (5) సంస్కృతాంధ్ర వరస భూపాలీయములు. (6) ఎలకూచి వెంకటకృష్ణ రాయకవి (7) గ్రంథచౌర్యము. (8) మధురవాణి

4. వీనిని భారతి 1962—1963 సంవత్సరములలో చూడనగును.

వేటూరి—(1) శివకవులు—(2) వాఙ్మయ పరిణామము (3) వినోద విమర్శన విన్యాసములు (4) రాయల జన్మదినము—(5) రాయల విద్యాగోష్ఠులు (6) ఉద్భటారాధ్య చరిత్ర (7) అరసున్న (8) తెలుగు లిపి సంస్కరణము—అవీ—ఇవీ—

## సాహిత్య విమర్శన

నన్నయ భారతారణ్య పర్వ శేష రచనను గూర్చి—నన్నె చోడనిగూర్చి పాల్కురికి సోమనాథుని గూర్చి క్రీడాభిరామ కర్తృత్వమును గూర్చి పెక్కు వ్యాసములు వెలువడినవి. ఇవి కొన్ని పట్ల, వాదోపవాదములతోనున్నను—కొన్ని నూతనాంశ ములను వెల్లడించు చున్నవి—

ప్రాచీన సాహితీ సంప్రదాయ పద్ధతిని రచితమైన విమర్శనా వ్యాసములలో—నడకుదిటి వీరరాజు గారి "నన్నయ యతులు—కొన్ని గతులు" అనునది నిశిత పరిశోధనామూల కము. పాశ్చాత్య విమర్శనాపద్ధతి ననుసరించి విమర్శనా వ్యాస ములలో కీ. శే. నండూరి బంగారయ్య—తిక్కన—ద్రౌపదీ పాత్ర చిత్రణము—ప్రస్తుతి గన్నది— కీ. శే. తాడూరి లక్ష్మీ నరసింహారావుగారి తిక్కన ఉద్యోగపర్వము అనునది ప్రాచీన సంప్రదాయిక విమర్శననుసరించిన వ్యాసము.

నన్నయ ప్రసన్న కథా కలితార్థయుక్తి

కళాప్రపూర్ణ విశ్వనాథ సత్యనారాయణ గారి యీ సాహిత్య విమర్శనము—భారతి—1949 జనవరి మొదలు 1949 డిసెంబరు వరకు పన్నెండు సంచికలలో ప్రచురిత మైనది. శ్రీ విశ్వనాథ వారి గ్రంథ నామము—

"ప్రసన్న కథా కలితార్థయుక్తి"

"కలితార్థయుక్తి" అన్న పాఠమే సరియైనదనుకొని వారీ వ్యాసములను రచించివారు—కాని నేడు— ఉస్మానియా విశ్వ విద్యాలయమువారు ప్రకటించిన—సంశోధితమహా భారతముద్ర ణమున—

"ప్రసన్న కథా కవితార్థయుక్తి"

అన్న పాఠమే నిరాఠితమై మూలమున ముద్రింపబడినది. ఇందువలన—నన్నయది ప్రసన్న కథా కవితార్థయుక్తిగాని— "కలితా'ర్థయుక్తిగాదని నిశ్చితమైనది— అప్పుడీవిమర్శనకు విలువ యెట్టిదో పాఠకలోకమూహింపవచ్చును.

సాహితీ విమర్శనము శ్రీ మల్లంపల్లి శరభయ్యగారి హరివంశము—సంవృతి మాధుర్యము అను వ్యాసములు ప్రశంస నీయములు—

## ప్రాచీన కవిత

సంప్రదాయ సిద్ధముగా వచ్చుచున్న సంస్కృత భాషాంత రీకరణములకు భారతి స్వాగతమిచ్చినది. కీ.శే. మల్లాది సూర్యనారా యణశాస్త్రులుగారి ఆంధ్ర భవిష్యపర్వము, కీ.శే. త్రిపురాన ప్రసాదరాయకవి రతివిలాసము. (కుమార సంభవరతి విలాపం చతుర్థ సర్గ కాంధ్రానువాదము) భారతి. తృతీయ చతుర్థ సంపు టములలో ప్రకటితములు—

సంస్కృత శతకానువాదములలో— మయూరుని సూర్య శతకమునకు, 'భానుకర విక్రాంతి' అనుపేర కీ.శే. కొమాండూరి కృష్ణమాచార్యుల రచనము — కీ. శే. చిలకమర్తి లక్ష్మీనరసిం హముగారి, భల్లట శతకము— శ్రీ కల్లూరి వెంకటసుబ్రహ్మణ్య దీక్షితులుగారి నీలకంఠ దీక్షితుని కవి విడంబన శతకములను భారతి ప్రచారమునకు దెచ్చినది —

## ఉదాహరణ ప్రక్రియ

పాల్కురికి సోమనాథుని తెనుగు బసవోదాహరణము. ప్రథముగా భారతిలో ప్రకటితమై, ఉదాహరణ శాఖా పరిశోధన మునకు దోహదమును నొసంగినది[5]— ఉదాహరణశాఖను నేను క్రీ.శ. 1935 లో నుద్ధరించిన వెనుక— కైలాసవాసి కాశీ నాథుని నాగేశ్వరరావుగారి పేర నాగేశ్వరోదాహరణము రచిత మైనది. అది కీ.శే. మండపాక పార్వతీశ్వరశాస్త్రి రచితము.[6]

## శ త క ము లు

కీ.శే. మంగిపూడి వేంకటశర్మగారి గాంధీశతకము, పూర్తి యైన చాలా కాలమునకు తర్వాత — కీ.శే. కూచి నరసింహము గారి రామచంద్రప్రభూశతకము భారతిలో ప్రకటితమైనది. వీరశతకమును తమ అర్వదియైదవ యేట రచించిరి.

## న వ్య క వి త

భారతి ప్రాచీనకవితతోబాటు నవ్యకవితకు ప్రోత్సాహ మొసగినది. వర్థమానులగు కవులను వర్ధిష్ణువులుగా దిద్ది తీర్చినది—ఇది నవ్యాంధ్రసాహిత్య జగత్తులో నొక ముఖ్యఘట్టము. నవ్యకవితాక్రమ పరిణామమును దెలిసికొనుటకు నేడు భారతియే ప్రథమాధారము — తరువాత పుస్తక రూపమున వెలువడిన ఖండకావ్యములను భారతి ప్రథమముగా వ్యాప్తికి దెచ్చుట ప్రశంస నీయము —

## నవ్యకవిత— ముక్తక రచనలు

ప్రాచీన సంప్రదాయము ననుసరించినవ్యకవిత నాలాపించిన వానిలో ప్రథములు వేంకటపార్వతీశ్వర కవులు — వారి రచనలు ఉత్కంఠ, ఆత్మప్రబోధము. పద్మిని, పురాణస్మృతి తరంగిణీ— నిర్వేదము మున్నగునవి యామోదము వడసినవి —

5. చూడుడు. నా ఉదాహరణ వాఙ్మయచరిత్ర— ద్వితీయ ముద్రణము 1968.

6. దీనిని ఈ వ్యాసమునకనుబంధముగా నిచ్చినాడను —

"జాషువా కవి" యని సన్నుతిగన్న జాషువా కవి కవితా వైదుష్యమును తొలుత వెల్లడించినది భారతి—

ఛందోబంధములను సడలించి, అతి వాస్తవిక కవిత నావిష్కరించిన శ్రీశ్రీ ప్రాథమిక రచనలు — అభిసారిక, ప్రళయ నర్తనము—రజనీగానము—పూర్వసంప్రదాయ రీతిని —

> "సాయంప్రస్ఫుట రాగరంజిత లసత్సంపూర్ణ
> సౌందర్య రాశీయుక్తామల దివ్యమూర్తి."
>
> "కాలాంత ప్రభవార్క కోటి ఘృణి సంకాశ
> ప్రతాపోజ్జ్వల త్ఫాలాక్షస్ఫుర దగ్ని హోత్ర
> దహిత బ్రహ్మాండ భాండుడునై"

సమాస యుక్తమై పారంభమైనవి—

### ఖండ కావ్యములు

రాయప్రోలు "మధు కలశము"తో రామిరెడ్డి "పాన శాల" మాధుర్య రసము వర్షించినవి— వేటూరివారి, అచ్చు టాంధ్రతాముద్రతో 'కడుపుతీపి'ని గణనీయముగా వెలార్చినది — ప్రభాకరశాస్త్రి—కపోతకథ — విశ్వాసము — ప్రశంసనీయ రచనలు— నీటిబిందువు మొదలు నీరధి వరకు గల జలపరిణామము— దెలుపు నఖండకృతి కంకణము — భోగరాజు నారాయణమూర్తి మృదుమధుర రచన.

మర్దుకత — నవ్యకవితలో జానుతెనుగు ఖండకావ్యము మంగిపూడి వేంకటశర్మ మంజరీద్విపదలో మానవతియైన యొక హరిజన వనిత ప్రదర్శించిన — త్యాగశీలతను చిత్రించినది. "కులముకాదు — గుణముప్రధానము" అను సూక్తికిది లక్ష్యము.

భారతియందు ప్రకటితములైన ఖండకావ్యములలో వేటూరివారి కడుపుతీపి — రామిరెడ్డి పానశాల సాహితీవిమర్శకుల ను హెచ్చుగా నాకర్షించినది — మచ్చున కొక్కొక పద్యముదాహరింతును. కడుపుతీపి—

> మ. కుచసంపన్నత కూలిపోవుననియో
> క్రొవ్వారు మై సోరు విం
> త చమత్కారము లంతరించు నని
> యోస్తన్యంబు లేకుండ గు
> బ్బ చనుల్ దిబ్బలుగా నొనర్చుకొని
> డబ్బాపాలచే నిప్డు పు
> త్త్రచయంబుం బరిమార్చు మాతలటె
> మాతల్ కాలదూతల్ గదా.

పానశాల—

> ఉ. గతము గతంబెయెన్నటికి
> కన్నుల గట్టదు సంశయార్థ సం
> వృతము భవిష్యదర్థము వివేకవతీ!
> యొక వర్తమానమే
> సతత మవశ్య భోజ్యమగు
> సంపద, రమ్ము విషాద పాత్రకీ
> మతముస తావులేదు క్షణమాత్ర
> వహింపుము పాన పాత్రికన్.

"శిలలు ద్రవించి యేడ్చినవి" — అని చేతము చెమ్మగిల్లునట్లు, హంపీ శిథిల వైభవమును వర్ణించిన — కొడాలి వెంకటసుబ్బారావు — హంపీక్షేత్రమాకర్షణీయమైన ఖండ కావ్యకృతి—

### భాషాంతరీకరణ పద్య రచనలు

కేవలము భావకవితా ధోరణిలోగాక — ప్రాచీన రీతిని. సంస్కృత భాషానువాదరచనలు భారతి ప్రచురించినది. కీ. శే. మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి ఆంధ్ర భవిష్య పర్వము — చిలకమర్తివారి భల్లట శతకము నిట్టివి. మొట్టమొదటిసారిగా హిందీ తులసీదాసకృత — రామమానస చరితమును తులసీ రామాయణమనుపేర భాగవతుల నరసింహశర్మగారనువదించిన కృతిలో ప్రతాపభానుని చరిత్ర మున్నగు భాగములను ప్రకటించి, దానినాంధ్రలోకమునకు పరిచయమొనర్చినది భారతి.

హిందీ భాషనుండియేగాక, తమిళభాషలో జగత్ప్రసిద్ధి గాంచిన, "తిరుక్కురల్" నుండి కొన్ని పద్యములకు అనువాదము వెలువడినది — ఇవి సెట్టి లక్ష్మీనరసింహము రచన—

పద్యోపన్యాసములలో కీ. శే. వోలేటి వేంకటరామశాస్త్రిగారి "పరశురామ కవిగారి పద్యోపన్యాసము" పేర్కొన దగినది.

### నవ్యకవితా పరిణామము

భారతి యవతరించునాటికి — ప్రాచీన సంప్రదాయానుసారియై, నవ్యత నాపాదించిన కవితయే ప్రధానముగా నుండెడిది. నవ్యకవిత నాటినుండియు నేటివరకును నాలుదశలు క్రమించినది. నవ్యకవిత—భావకవిత—అభ్యుదయ కవిత—అతివాస్తవిక కవిత—వచన కవిత—దిగంబర కవిత— అను నీ యాతింటిలో మొదటి రెండు దశలలోని కవితలను భారతి ప్రోత్సహించి ప్రకటించి, నవ కవులకు నాణ్యమిచ్చినది — అభ్యుదయ, అతివాస్తవిక కవితలను గూర్చి విమర్శనలను, వెలయించినది— వచన కవితలో వాడి వేడిగల తిలకు రచనలు ప్రకటించినది— దిగంబర కవితాసంకలనములను సమీక్షించినది —

### గేయ కవిత

నవ్యకవితా వైతాళికుడు గురుప్రాయుడును — నగు గురజాడ "కలువల్లారా' అను గేయము ప్రకటించుటయే గాక— "కొల్లాయి గట్టితేనేమి, మా గాంధి కోమటై పుట్టితేనేమి"అను

బసవరాజు అప్పారావు— గేయము— ఇతరకవుల గేయములను భారతి ప్రకటించినది —

## క థ లు

పూర్వసంప్రదాయముననుసరించి చెప్పుకొను కథలు భారతి ప్రకటించి, ప్రాచీన కథావాఙ్మయమును విస్మృతము గాకుండ చేసినది— వానిలో కొన్నింటిని పేర్కొందును —

### మహాపతివ్రత—ఆనంద కందము

ఈ రెండును కీ.శే. క్రొత్తపల్లి సూర్యారావు రచనలు — తేటతెలుగు శైలిలో—తెలుగుదేశపు సాంఘిక సాంసారిక వృత్తమును వర్ణించునవి —

### జైనుల మతకథలు

జైనవాఙ్మయమునకు సంబంధించిన కథలను తెలుగులోనికి దెచ్చుటకు ప్రయత్నించి, సఫలీకృతులైనవారు కీ.శే. పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి — భారతిలో వరుసగా ప్రకటితములైన—

సమంత భద్రుని కథ.

మృగసేన ధీవరుని కథ.

సోమప్రభ కథ.

మున్నగునవి — పాఠకులనాకర్షించినవి — సోమప్రభ పెండ్లికథ స్త్రీల పాటలలో నున్నది — అది—

"ఆటలాడి యలసి నావు —
పాటపాడి సొలసి నావు"

అను పల్లవితో ప్రారంభమగును— జనమనోహరమైన యీ కథలు పునర్ముద్రితములు కావలెను — చక్కని శిష్ట వ్యవహార భాషా రచన గలవి —

ప్రత్యేకముగా భారతి పాఠకుల నాకర్షించినవి—శ్రీ పాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి, చింతాదీక్షితులుగారి కథలు —

పైని భారతిలోని కథలను నొక—

భారతి కథాసంపుటిగా

ప్రకటించిన — నవ్యసాహిత్యమున — కథావాఙ్మయుశాఖకు గల ప్రత్యేకత విశిష్టత ప్రస్ఫుటమగును — పాఠకలోకమును విశేషముగా నాకర్షించును —

## క థా ని క

ఆధునిక సాహిత్యమున నుత్తమమైన కథానికలను భారతి ప్రకటించినది. భారతి కథానికా రచయితలలో—వేలూరి శివరామశాస్త్రి విశిష్టులు. వీరి కథానికలు క్షమాపణ, వోబయ్య, సులతానీ డిప్రెషన్ చెంబు, పిత్తల్కా దర్వాజా, పద్మాక్షి, కృతి, ధర్మ్య, సధాచారుడు, దర్జా మొదలైనవి.

పై కథలలో వోబయ్య, సులతానీ కథలు ఆంగ్ల భాషలోని కనువదింపబడినచో, తెనుగు కథానిక అంతర్జాతీయ ఖ్యాతినందియుండెడిది.[7]

## న వ ల

ధారావాహికగా నవలలను భారతి ప్రకటించినది. విశ్వనాథ సత్యనారాయణగారి ఏకవీర, రాచకొండ విశ్వనాథశాస్త్రిగారి అల్పజీవి ముఖ్యములు. తెలుగు నవలా రచయితలలో తొలి తరమువారైన చిలకమర్తి లక్ష్మీనరసింహము గారి అసంపూర్ణ నవల, "విజయలక్ష్మి" భారతిలో ప్రచురితమైనది.

పెక్కు నవలల సమీక్షలు—గ్రంథ సమీక్షలలో వెలువడినవి.

భారతి ప్రకటిత నవలలో పేర్కొనదగినది వాసిష్ఠ ముని—

## పూ ర్ణ

వాసిష్ఠ గణపతి ముని కావ్యకంఠ గణపతిశాస్త్రిగారని యాంధ్ర దేశమున ప్రసిద్ధిగన్న విద్వాంసులు. సంస్కృత భాషలో ననర్గళ వాగ్ధోరణి గలవారు—ఒక పరియాయము వారు తమ సంస్కృతోపన్యాసమునంతయు సస్వంతముల తోనే చెప్పినారన్న వారి భాషా పాండిత్యము విశదమగును. రమణగీతలు, ఉమా సహస్రము, భారత విమర్శనము వీరి గ్రంథములు. కుండలినీ యోగము నకుంఠితముగా సాధించిన వారు.

## వ్యా స ర చ న

ఆంధ్రపత్రిక—సారస్వతాను బంధముతో ప్రారంభమైన పానుగంటి సాక్షి వ్యాసములు భారతితో భరత వాక్యము పలికినవి.

దొరకిన యుపన్యాసము సు. స. గారికి బహిరంగ లేఖ. సు. స. వ్రాసిన బహిరంగలేఖ అను నాల్గను సాక్షి చివర వ్యాసములు. సాక్షి సంపుటములలో పునర్ముద్రణ మందినవి.

జై సీతారామ్—రామరామ—అను రెండు కథలు భారతిలో ప్రకటితమైనవి.

### భారతి—వ్యావహారిక భాష

గిడుగువారి వ్యావహారిక భాషావాదమును శ్రీ నాగేశ్వరరావు పంతు గా రంగీకరింప లేదు. ఆంధ్రపత్రికను గ్రాంథిక భాషతో ప్రారంభించి నారు. సారస్వతానుబంధమున సాక్షి వ్యాస

7. ఇది 'కథా సప్తకము' అను పేర కొన్ని కథ లొక సంపుటముగా ప్రకటితములైనవి.

# ప్రసాద్ ప్రాసెస్ ప్రైవేట్ లిమిటెడ్

"చందమామ బిల్డింగ్స్"

వడపళని :: మద్రాసు-26



బ్రాంచీలు :

బొంబాయి – న్యూఢిల్లీ – కలకత్తా

బెంగుళూరు & హైదరాబాద్



ములను నితర వ్యాసములను సంపాదకీయములును గ్రాంథిక భాషలోనే యుండెడివి.

గ్రాంథిక భాషలోని అర్ధానుస్వారములు, శకట రేఫలు తీసివేసి ప్రసన్న గంభీరము, సలక్షణము, జాతీయాంతర్జాతీయ వైజ్ఞానిక సాంస్కృతిక సకల వ్యవస్థలకు సమీచీనముగా ప్రవచించు ప్రతిభా భాషకు పితామహులు పంతులుగారే.[8] అయినను దేశకాల పాత్రలను గుర్తించి పంతులుగారు వ్యావహారిక రచనలకు భారతి పత్రికలో స్థానము నిచ్చిరి. గిడుగువారి వ్యావహారిక భాషా పరిష్కార నిరసనమును ప్రకటించినారు. శతావధాని చెళ్లపిళ్ల వేంకట శాస్త్రులుగారి—వ్యావహారిక భాషా వ్యాసములన్నియు భారతిలో ప్రకటితములైనవి. కాశీ సోమయాజుల సుందర రామమూర్తిగారి హరిశ్చంద్ర నాటకము—వ్యావహారికము[9] శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి కథలు, వ్యావహారికము. వ్యావహారిక రచనలు వచనముననేగాక గేయములను గూడ భారతి ప్రకటించుట ప్రశంసనీయము.

చిత్రశాల—భావ శబలత - మున్నంగి శర్మ

భారతిలో వెలువడిన వచన రచనలలోనొక ప్రత్యేక విశిష్టత బడసినది చిత్రశాల— భావశబలత అను రచన[10]— మహాపురుషుల జీవితములను నక్షర రూపమున చిత్రించుట భావశబలత— అనగా చర్మ చక్షువులకు గోచరమగు రేఖాచిత్రము వలెగాక, భావనకే గమ్యమగు జీవిత భావ వ్యక్తీకరణము— అందువలన నిది—

రూప శబలత

భావ శబలత

సమ్మేళనము— కాని యిచట భావమునకు ప్రాధాన్యము గలుగుటచేత— నిది బావశబలత— అయినది. ఇదియు నొక లేఖన శిల్పము. ఆంగ్లభాషలో దీనిని స్ఫులింగములు., ధూమములు అని అందరు.[11] ఆధునిక వచన రచనలో నూతన ప్రక్రియ.

ఇట్టి రచనను తెలుగున వెలయించినవారిలో మొదటివాడు— కడపటి వాడు— మున్నంగి శర్మ— (మున్నంగి లక్ష్మీ నరసింహ శర్మ).

ఈ శీర్షికలో ప్రకటితములైనవి—

1. కందుకూరి వీరేశలింగము.
2. కాశీనాథుని నాగేశ్వరరావు.
3. కొమర్రాజు వేంకట లక్ష్మణరావు.
4. పానుగంటి లక్ష్మీ నరసింహారావు.
5. మొక్కపాటి సుబ్బారాయుడు.
6. వేదము వేంకట రాయశాస్త్రి.
7. మారేపల్లి రామచంద్రశాస్త్రి.
8. నాళము కృష్ణారావు.

ఈ రచనలన్నియు అచ్చులో నూరుపుటలకన్న హెచ్చుగా రాకపోవచ్చును. అయినను, వేయిపుటల భావముల నిమిడ్చిన భావగర్భిత రచన— "వాక్యం రసాత్మకం కావ్యమ్" అని సూక్తి.

కవుల చరిత్రలు—వాఙ్మయ చరిత్రలు

కవులచరిత్ర— వాఙ్మయచరిత్రలలో— భారతి ముద్రితాముద్రిత వాఙ్మయములను రెండింటిని గూర్చిన వ్యాసములను ప్రకటించి, ఆంధ్ర సారస్వత చరిత్రకు నత్యంత దోహదము సమకూర్చినది.

అముద్రిత వాఙ్మయము

కవుల చరిత్ర కెక్కని ప్రాచీనకాల మధ్యకాల కవులను గూర్చి— కవి చరిత్రలకెక్కని కవుల గూర్చి— కావ్యములను గూర్చి పెక్కు వ్యాసములు భారతి ప్రకటించినది— భారతిలో ప్రకటితమైన— అముద్రిత కావ్యములు, మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారములో కూడ లేకపోవుట గమనింపదగినది.

ముద్రిత వాఙ్మయము

కవుల చరిత్ర కెక్కని ప్రాచీనాంధ్రకవుల గూర్చి— కవికాల నిర్ణయములను గూర్చి— చారిత్రక ప్రమాణములతో పెక్కు వ్యాసములు ప్రకటితములైనవి.

గ్రంథ సమీక్షలు

గ్రంథ సమీక్షల మూలమున— కవుల చరిత్రకు వాఙ్మయ చరిత్రకు నెంతో, వికాసము గలిగినది. ఆరుద్ర సమగ్ర ఆంధ్ర సాహిత్యం పండ్రెండు సంపుటములు — నాచే సమీక్షింపబడినవి.[12]

---

8. ఆధునికయుగము— గాంధీ సాహిత్యము --భారతి మార్చి 1973 పుట 13.

9. కాస్యోల రామమూర్తి అని వాడుకనామము— ఏబదేండ్లు దాటిన వెనుక ఆంగ్ల భాషలో శాస్త్రోపాధ్యాయ (ఎం. ఏ.) పట్టము గడించిన ఆంగ్లభాషా నిష్ణాతుడు.

10. ఆంధ్రవచన వాఙ్మయము— నవ్యయుగము— వచనరచన— (అముద్రితము.)

11. **Sparks & Fumes. Penportait — K. Eswara Dutt.**

12. భారతిలో ప్రకటితములైన కవి వాఙ్మయ చారిత్రక వ్యాసములలో ప్రాయికముగా నా వ్యాసములే బహుళములు—సాహిత్య చరిత్రలో మౌలికములు కావున—వానిని— అకారాది వ్యాససూచి. అనుబంధముగా పాఠక లోకమున కందించితిని— చూడుడు. అనుబంధము.

సహృదయాత్మకములై గ్రంథ సమీక్షలనేగాక — సాహిత్య వ్యాసములచే ప్రశస్త విద్వాంసులు శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు — భారతి నలంకరించిరి.

### భాషా చర్చలు

సాహిత్య విమర్శనలతోబాటు— భాషా విషయిక చర్చ లను భారతి ప్రచారములోనికి దెచ్చినది. వాస్తవమును 'కవిత్రయము వారఖండ యతిని పాటించినారా' అనురీతి చందస్సంప్రదాయిక చర్చలు— ధనంజయ ప్రవరుకరమ్మా— లోపడు సాధువా అసాధువా". "కమ్మని అతాంతముంకు మ్మొనని"— అను నిట్టి వ్యాకరణ సంబంధ చర్చలు— ప్రచు రించుటకు ప్రత్యేక పత్రిక లుండవలెను. కాని నేడట్టివి లేవు— అవి సాహిత్య విమర్శనములవలె పాఠకుల నెంత మాత్ర మాకర్షింపవు. అయినను— భారతి సంపాదకులు, చర్చలపై చర్చలు — వచ్చినను— అవి భాషా సంబంధ మైనవి గనుకను, పాండిత్య విశిష్టము లగుటచేత, తప్పక ప్రచు రించెడివారు. ఈ నాడివి ప్రకటించుటకు పత్రికలే లేనప్పుడు13 భారతి ప్రకటింపకపోయిన— నవి విస్మృతములై యుండెడివి.

### ఆధునిక భాషాశాస్త్రము

ప్రాచీన సంప్రదాయిక భాషా చర్చలేగాక— ఆధునిక భాషా శాస్త్ర చరిత్ర— సిద్ధాంతములు— తెలుగు భాషకు సంబంధించినవి భారతి ప్రకటించినది— అందు భాషాశాస్త్రము (Linguistics) ధ్వనిశాస్త్రము (Philology) మొదలైన వానిని గూర్చి సులభగ్రాహ్యముగురీతిని — వ్యాసములు ప్రకటితములైనవి. ఇవి విశ్వ విద్యాలయములో— భాషాశాస్త్ర విద్యార్థుల కెంతో యుపకారిగా నున్నవి— ఇందువలన ప్రాచ్య సంప్రదాయ పండితులు నీ నూతన భాషాశాస్త్ర విషయము లవగాహనచేసికొనుట కనుకూలమైనది.

### హాస్య రచనలు

భారతిలో హాస్య రచనలనగానే మనకు జ్ఞాపకము వచ్చు నది— కీ. శే. భమిడిపాటి కామేశ్వరరావు— కచటతపలు— బాగు బాగు— ఆంధ్రా యూనివర్సిటీ పట్టుదలలు— మొదలగు హాస్యరచనలు భారతి మూడవ సంపుటముతోనే ప్రారంభమై చాలాకాలము భారతి నలంకరించి— భమిడిపాటివారికి "హాస్య రస బ్రహ్మ" అన్న బిరుదు గడించినది.

### ప్రకీర్ణకములు

కీ. శే. వేదము వెంకటాచలయ్యగారి— కతిపయ శబార్థ స్వరూపనిరూపణము— అన్న నాలుగు వ్యాసములు— కీ. శే. వంగోలు వెంకటరంగయ్యగారి— ద్వాదశ జ్యోతిర్లింగము వేంకట, సుబ్బ శబ్ద వివరణ— ఆనందరంగపిళ్ళె— మొదలగు వ్యాసము లన్నియు పునర్ముద్రితములు కావలెను.

విశేష విషయ విలసితములై విద్వల్లోకము నాకర్షించి నవి— శ్రీ తిరుమల రామచంద్రగారి— సాహితీ సుగతుని స్వగ తము— అను వ్యాసములు— ఇవి ప్రత్యేక గ్రంథముగా ప్రక టితములైనవి.

యాత్రాచరిత్రలలో కీ. శే. జొన్నలగడ్డ సత్యనారా యణ మూర్తిగారి "నా మహారాష్ట్ర యాత్ర" అనునది. జీవిత చరిత్రలలో మహాపురుషుల జీవితములు— అనునది. (ఇదియు వారి రచనమే) — పాఠకుల నాకర్షించినవి.14

సాహిత్య విమర్శనములలో కీ. శే. పారనంది రామశాస్త్రి గారి— నన్నయ భావప్రకాశిక— నాణ్యమైనది—

తాంత్రిక శాస్త్ర వ్యాసములలో శ్రీ వాసిరెడ్డి పార్థ సారధిగారి వ్యాసములు వన్నెకెక్కినవి—

ముఖ్యమైన కొన్నింటి మాత్రమే పేర్కొన గలిగితిని. ప్రాజ్ఞులు మన్నింతురుగాక!

### ఆంగ్ల సాహిత్యము

"ఆంధ్ర సారస్వతముపై ఆంగ్ల సాహిత్య ప్రోద్బలము" అను విషయమై— భారతి— మొదటి రెండు సంచికలలో రెండు వ్యాసములు ప్రకటితములైనవి. ఇవి రెండునుకీ.శే. దేశభట్ల అప్పల నరసింహముగారి రచనలు—

---

13. పూర్వము— అముద్రిత గ్రంథ చింతామణి (నెల్లూరు) అను మాసపత్రిక యుండెడిది— అందు కేవలము అముద్రిత గ్రంథములనేగాక— భాషాచ్ఛందోవ్యాకరణ విషయము లన్నింటిని కూలంకషముగా చర్చించెడిది— భాషా పాండిత్యమునకు పరమావధియైన యీ పత్రిక (1885— 1904) 19 సంపుటములు పునర్ముద్రి తము గావలసినదే—

భాషా విశేషములను—చర్చలను హెచ్చుగా ప్రకటించి నది కీ. శే. వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రిగారి త్రిలింగ పత్రిక— (వారపత్రిక) ఇది క్రీ. శ. 1955 నాటినుండి ప్రకటితమగుట లేదు.

14. ఈ రెండింటిలో "నా మహారాష్ట్ర యాత్ర" అను వ్యాసము ప్రత్యేక గ్రంథ రూపమున వెలువడినది. తెలుగు దేశమున వాగ్ధోరణికి ప్రసిద్ధిగన్న— జకారత్రయము— 1. జటా వల్లభుల పురుషోత్తము. 2. జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి. 3. జమ్మలమడక మాధవ రామ శర్మ— వీరి ముగ్గురిలోనొకరు. వీరిలో నేడు శ్రీ మాధవ రామ శర్మ గారు సజీవులు.

ఆంగ్ల పద్య కావ్యములు— ఆంగ్ల పద్య ఖండికలు— వీని యనువాదములు ప్రథమముగా ప్రకటించినది భారతి. మిల్టను మహాకవి పేరడైజులాస్టు— (paradiselost) అను మహాకావ్యమును— "స్వర్భంగము" అనుపేర కీ. శే. మొసలికంటి హనుమంతరావు— రచించెను. ఇందు కొంత భాగము భారతి ద్వితీయ తృతీయ సంపుటములో ప్రకటితము. ఇంకను సోహ్రాబు రుస్తుము— అను ఖండ కావ్యము— పెక్కు ఆంగ్ల ఖండగీతికల కనువాదములు భారతిలో వెలువడినది—16

## పారిభాషికపద నిర్మాణము

స్వాతంత్ర్యావతరణ మైనవెనుక— ఆంగ భాషా విసర్జనతో, పారిభాషిక పదకోశములు ప్రచారములోనికి వచ్చినవి— కాని— అంత కిరువది మూడేండ్లకు ముందే భారతి పారిభాషిక పద నిర్మాణమును ప్రారంభించినది— అందు పారిభాషిక పదము తొలుత నిచ్చి— ఆ వెనుక ఆంగ్లములో వానిని తెలిపెడి వారు— మచ్చునకు కొన్నింటిని మాత్రము చూపు చున్నాను. ఇంతకుముందు— ఆధునిక విజ్ఞానమున నిట్టివి కొన్ని యిచ్చి యున్నాడను.

Auronates — వైమానికయాన శాస్త్రము. Back ground — ప్రాతిపదిక. Convention — సాంకేతికము. Director of Agriculture — సీతాధ్యక్షుడు. Geronfology — ఆయుర్దాయ శాస్త్రము. Gramaphone — అనువాదినీ యంత్రము. Logical Sequence — తర్కశుద్ధి. Medical Hygine — వైద్యస్వాస్థ్యము. Penitrawaverninsight — నిశిత దృష్టి Self Control — ఆత్మనిగ్రహము. Tahasildar — సమాహర్త. Utopia — స్వాప్నికజగత్తు.

నేటి పారిభాషిక పదకోశములు పదములు మాత్రమే యిచ్చినవి. భారతి పదబంధముల నిచ్చినది. భారతి నామూలాగ్రముగ పరిశీలించిన— ప్రత్యేక పారిభాషిక పదకోశ మేర్పడును—

## చరిత్ర — శాసనములు

సాహిత్యము— సంస్కృతి— చరిత్ర మూడు అవినాభావ సంబంధము గలవి యని గుర్తుంచుకొని— వ్యవస్థాపకులు— భారతి ప్రారంభమునుండి, చారిత్రక వ్యాసములనే గాక— చరిత్రకు ప్రధానాధారములైన శాసనములను— ప్రతిబింబములతో— విపుల భాషాచారిత్రక వ్యాఖ్యానముతో ప్రకటించినారు— వాస్తవముగా నిటి చారిత్రక వ్యాసములకు, చర్చలకు— శాసన ప్రకటనమునకు ప్రత్యేకముగా పత్రిక యుండవలెను. కాని భారతికి ముందు16— సాహిత్యపత్రికయైన— ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో శాసనములు ప్రతిబింబములతో వ్యాఖ్యానములతో ప్రకటితములగు చుండెను— ఆ పత్రికయు, మొదటి దశలో కొన్ని శాసనములు— నలుబదేండ్లయిన వెనుక నుతి కొన్ని శాసనములు— అల్ప సంఖ్యాకములు ప్రకటించినది.

శాసనములు చరిత్రకు— సాహిత్యమునకు నత్యంతోపయుక్తములగుటచేత— భారతియందు శాసనము లొక— ప్రత్యేక లక్షణముగా ఆదిని భారతి— 1924 జనవరి నుండి — నేటికిని శాసనము లవిచ్ఛిన్నముగా భారతి ప్రకటించు చున్నది— ఇందుల కుదాహరణము కడచిన మార్చి— 1973 లో ప్రకటితమైన— డాక్టరు టి. వి. జి. శాస్త్రిగారి అమరావతిలోని అశోకుని శాసనము.

చరిత్రతోబాటు—సాహిత్యమున ననేక నూతనాంశములను వెలుగులోనికి దెచ్చిన— భారతి ప్రకటిత శాసనము లన్నింటిని గూర్చి వివరించుటకు సాధ్యముగాదు— ఆ శాసనము లశోకుని కాలమునుండి క్రీ. శ. 16 వ శతాబ్ది వరకుగలవానిని— పాలించిన రాజవంశక్రమమున— వర్గీకరించి సంగ్రహ వివరణతో—

"చారిత్రక వ్యాసానుక్రమణిక" కావలయును— దానికీ వ్యాసమున చోటులేదు— కావున— కొన్ని ముఖ్య శాసనములను గూర్చి మాత్రము వివరించు చున్నాను—

### ప్రాకృత శాసనములు
### (నాగార్జునకొండ)

రెండువేలేండ్ల క్రిందట తెలుగు— నాగబు పదము— వేటూరి ప్రభాకరశాస్త్రి— గలదని నిరూపించునది—

### తూర్పు చాళుక్య శాసనములు

గుణగ విజయాదిత్యుని సాతలూరి శాసనము— కొమఱ్రాజు వేంకట లక్ష్మణరావు— ఆయన మరణానంతరమున ప్రకటితమైనది.

ఇది తెలుగు ఛందశ్శాస్త్రమున కుపయుక్తము—ఇందు సంస్కృతమున లేక, తెలుగుననే గల చంపకమాలావృత్తమున్నది—

---

15. ఆంధ్ర సాహిత్యముపై, ఆంగ్ల సాహిత్య ప్రభావమును గూర్చి డాక్టరు కొత్తపల్లి వీరభద్రరావుగారు పరిశోధన చేసి పట్టము పొందినారు. అది ముద్రితమైనది.

16. భారతికి ముందుగా— ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికల యందు శాసనములు ప్రకటితములగు చుండెడివి. అందువలన— ఆంధ్ర సాహిత్య పరిషత్ పత్రిక కన్న శాసనములు ప్రకటించిన కీర్తి ఆంధ్రపత్రికదే—

అరినృప వాజి వారణ పదాతి
మహో(భ విరామ మారుతః
వర కరి కార సుస్థిర విభావ
వినాశత భాను సన్నిభః
గురుతర దీన భాగవత మానస
మానిత కల్ప పాదపః
చర గరి గల్ల భూమిప భుజా
సిరి హొజి భువి (పహసతే.

ఈ పద్యమున— భాష సంస్కృతమైనను— తెలుగునకు నియతమగు (ప్రాస యున్నది— మొదటి రెండు పాదములలో యతి నియమము గలదు— ఇది తామ్ర శాసనము.

(భారతి 1 సం. 1, 2 సంచికలు) 1924—జనవరి, ఫిబ్రవరి.

అద్దంకి శాసనము (క్రీ. శ. 849.
ధర్మవర శాసనము
కందుకూరి శాసనము.

ఈ మూడును— తెలుగున— యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము ((క్రీ. శ. 930) కన్న పూర్వము తెలుగు కవిత యుండెనని నిరూపించుచున్నవి— ఇందు— అద్దంకి శాసనమున తరువోజ— ధర్మవర శాసనమున సీస పద్యము గలవు— కీ. శే. మల్లంపల్లి సోమశేఖర శర్మ. ఇవి శిలాశాసనములు. భారతి, ఏప్రియలు 1928.

కలిదిండి శాసనము— క్రీ. శ. 1040.
మండశాసనము. ,,

రాజరాజనరేంద్రుని శాసనములీ రెండింటిలో మండ శాసనము— నన్నయభట్టరచితము— ఇవి రాజరాజు చరిత్రకుపయుక్తములు— నన్నయకు రాజరాజునకు సంబంధమీ మండ శాసనముతో నేర్పడినది— ఈ రెండును తామ్రశాసనములే.

పంచధార్ల శాసనము— క్రీ. శ. 1402.

చాళుక్య విశ్వేశ్వరరాజు పంచధార్ల శాసనము వలన విన్నకోట పెద్దన కవి కాలము సరిగా నిర్ణయించుట కవకాశము గలిగినది. ఈ శాసనములోనొక శ్లోకమునకు, పెద్దన కావ్యాలంకార చూడామణిలో భాషాంతరీకరణ మున్నది— ఈ శాసనమున— సంస్కృత చ్ఛందస్సులోని తెనుగునకు ప్రత్యేకమైన ఆటవెలది సంస్కృతమున నున్నది.

ఆ. వె. మహిత గండవెండ మధ్య దేశాధీశ
జనక దత్త రాజ్య సమధికేన
తేన కిల నృపేణ తృప్త చాతుర్వర్ణ్య
మమర తరువితీర్ణ మజప హాస.

భాష సంస్కృతమున నున్నను తెనుగు పద్యము— తెనుగు పద్యమునకు నియతమైన యతిప్రాసలు గలవు.—

ఇది శిలాశాసనము— కీ. శే. మల్లంపల్లి సోమశేఖరశర్మ

కాకతీయ శాసనములు

ఖాజీపేట శాసనము— క్రీ. శ. 1090.

ఇది కాకతి భేతరాజు కాలము నాటిది. ఇది కాకతీయుల చరిత్రకేగాక— నన్నెచోడుని కాల నిర్ణయమున కుపయుక్తమైనది.—

ఇది శిలాశాసనము—కీ. శే. ముట్నూరి వేంకట రామయ్య జూలై, 1940.

ఈ తరువాత 49 వ సంపుటమున ప్రకటితమైన బయ్యవర శాసనము ముఖ్యమైనది.

కకుద్గిరి క్షేత్ర శాసనము—

ఇది కాకతీయరాజులలో కడపటివాడైన రెండవ ప్రతాపరుద్రునిది— ఈ కకుద్గిరి క్షేత్రము— మైసూరు— కోలారు మండలమున నున్నది. ఇందువలన— కాకతీయరాజ్యము దక్షిణమున— మైసూరు మండలము వరకు వ్యాపించినదని నిశ్చయింప వచ్చును.

ఇది తామ్రశాసనము — శే. యన్. కోదండరామయ్య— మార్చి 1966.

కీ. శే. మానవల్లి రామకృష్ణ కవి గారప్పటి కప్రకటితములైన కొన్ని కాకతీయ శాసనములను ప్రకటించిరి. (జూలై— 1925).

తెలుగు నాయకులు—

విలసశాసనము— (క్రీ. శ. 1330— 1345) ప్రాంతము.

ఇది తెలుగు దేశమున— ముస్లిముల నరికట్టి— స్వాతంత్ర్యము నిలిపిన మునుసూరి ప్రోలయ నాయకునిది— ఆంధ్రదేశ చరిత్రకు చాలా ముఖ్యమైనది— కీ. శే. మల్లంపల్లి సోమశేఖర శర్మ—భారతి మార్చి 1942.

మద్రాసు మ్యూజియము క్రీ. శ. 1355.
చోడశాసనము.

ఇది తెలుగుచోడ క్షత్రియులలో నొకడైన భక్తిరాజు శాసనము. ఈతడు వేము వీరభద్రారెడ్ల సమకాలికుడైన అన్న చోడ దేవుని పూర్వుడు— భారతి జూలై 1931.

విజయనగర రాజులు.
కృష్ణరాయల యుగము.
గయ శాసనము.

ఇది ముక్కు తిమ్మన— కృష్ణరాయని విజయములను ప్రశంసించుచూ ఉత్తర భారతమున— గయలో వేయించిన శిలా శాసనము. ఇందు తెలుగు కంద పద్యమున్నది. ఈ శాసనము— "గయశాసనమా", "జయశాసనమా" అను చర్చలకు స్థానమైనది.

కీ. శే. కె. హెచ్. వి. శర్మ భారతి— జూలై 1960.

జిన వల్లభుని
గంగాధర శాసనము— క్రీ. శ. 945.

ఇది చారిత్రకముగా కాకపోయినను— సాహిత్యమునకు ముఖ్యమయినది. కన్నడమున పంప మహాకవి సోదరుడగు— జినవల్లభుడు— వేయించినది— ఇందు తెలుగున కంద పద్యములు గలవు —

శ్రీ డాక్టరు నేలటూరి వేంకటరమణయ్య— భారతి మార్చి1967

## శాసన చర్చలు

సాధారణముగా చారిత్రక పత్రికల యందు తప్ప— శాసన చర్చలు ప్రకటించుటకు సాహిత్య పత్రికలలో స్థలము లేదు— అయినను, భారతి— శాసనములను ప్రకటించుటయే గాక, శాసన చర్చలను సంపూర్ణముగా ప్రచురించినది— ఒక్క యుదాహరణ నిచ్చెదను.

అహదనకరశాసనము— క్రీ. శ. 718—752. ప్రాంతము.

అహదనకర శాసనము— సంపూర్ణ వివరణ సమేతము— కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రి— భారతి— 5 సం. సం. 7.

అహదనకరశాసనము— క్రీ. శే. మల్లంపల్లి సోమశేఖర శర్మ— భారతి 5 సం. సం. 8.

అహదనకర శాసనము— పునర్విమర్శనము—
డా. నేలటూరి వేంకట రమణయ్య.17

## చారిత్రక వ్యాసములు

"ప్రాచీనాంధ్రు లెవ్వరు - ఆర్యులు కారా" అను—చరిత్ర చతురానన చిలుకూరి వీరభద్రరావుగారి వ్యాసములు— "ఆంధ్రు లెవరు" అను గాదె నరసింగరావుగారి వ్యాసములు— ఆంధ్రులను గూర్చి యనేక చారిత్రకాంశములు వెల్లడించు చున్నవి— ఇవి భారతి రెండు, మూడు, నాల్గు సంపుటములు. (1925—27) లో గలవు.

ఆ వెనుక చారిత్రక వ్యాసములు వ్రాసినవారిలో గణనీయులు కీ. శే. భావరాజు వేంకట కృష్ణారావుగారు— వీరి వేంగీ చాళుక్యులు— చాళుక్య చోళులు— అను వ్యాసములు పేర్కొనదగినవి.

## చిత్ర కళ

లలిత కళలగు, కవితా సంగీత కళలతోబాటు భారతి— చిత్రకళకు దోహదమిచ్చినది— భారతీయందు వ్యంగ్యరేఖా చిత్రము లన్నియు చిత్రించినది— కీ. శే. తలిసెట్టి రామారావు— వృత్తిచే న్యాయవాది యయ్యు ప్రవృత్తిచే — చిత్రకళోపాసకుడు—ప్రత్యేక చిత్రములు రచించుటయేగాక— 'చిత్రకళ' అనుపేర నొక గ్రంథము వ్రాసియున్నాడు— అది— ఆంధ్ర గ్రంథమాలలో ప్రకటితమైనది— భారతి చిత్రకళ — అనగానే మనకు జ్ఞాపకము వచ్చునది తలిసెట్టి.

## శిల్పకళ—అజంతా శిల్పములు

ఆంధ్రుల కజరామర కీర్తి గడించిన— అజంతా శిల్పములను లేపాక్షి చిత్రములను తెలుగున మొదట ప్రకటించినది భారతి— అజంతా గుహలు— అందలి చిత్రములు— స్త్రీలు— ఆభరణములు— శిరోవేష్టనములు మొదలగువానికి వివరణము గలదు—

## శ్రీశైల దేవాలయ శిల్పములు

త్రిలింగములలో బహు ప్రాచీన ప్రసిద్ధమైన— శ్రీశైల క్షేత్రమున గల పౌరాణిక గాథా చిత్రము లన్నియు వివరణముతో ప్రకటితములైనవి— శ్రీశైలక్షేత్ర స్థల దేవాలయ, పాతాళగంగాది దివ్య స్థలము లన్నింటి చిత్రములు భారతియందు ప్రకటితములు. —(2 సం. 1925).

## శిల్పమునుగూర్చి వ్యాసములు

అమంచర్ల రామ గోపాలరావుగారు—శిల్పములను గూర్చి— శ్రీ పాద గోపాల కృష్ణ మూర్తిగారు వివిధ శిల్పములను గూర్చి వ్రాసిన వ్యాసములు గణనీయములు —

## శాస్త్రీయ విజ్ఞానము

నవ్య వైజ్ఞానిక సంపత్తి జగత్సంతతియు నాక్రమించినను, భారతీయ శాస్త్ర విజ్ఞానము, మనమెరుంగుట యావశ్యకము. ఇట్టి శాస్త్రీయ విజ్ఞానమును ప్రసారము చేసినది భారతి— వీనిలో రెండు మూడు పేర్కొందును.

---

17. ఇప్పటివరకు భారతిలో ప్రకటితమైన శాసనములను కాలక్రమమున వర్గీకరణమును చేసి— వాని వ్యాససూచిని, నా పెద్ద కుమారుడు చి. శివసుందరేశ్వరరావు తయారుచేసి యున్నాడు— అతడు— భారతిశాసనములను ప్రకటించి సాధికారమైన పరిశీలనతోనొక విపుల గ్రంథము ప్రకటింప సంకల్పించి నాడు— అతని పరిశ్రమ సఫలమగుగాత యని యాశీర్వదించు చున్నాను.

### వ్యవసాయము

1. క్షాత్రకాలపు వ్యవసాయ చరిత్ర.
2. సూత్రకాల వ్యవసాయ చరిత్ర.
3. పౌరాణికకాల వ్యవసాయ చరిత్ర.
4. బౌద్ధకాల వ్యవసాయ చరిత్ర.
5. మహమ్మదీయుల కాల వ్యవసాయ చరిత్ర.

నేడు యంత్ర మూలమున జరుగు వ్యవసాయ విధానము పూర్వ భారత దేశమున నెట్లుగా నుండెడిదో తెలుపు నీ మూడు వ్యాసములలోను, విషయము లమూల్యములై శ్రుతి స్మృతి, పురాణేతిహాసముల నుండి— ప్రమాణములు చూపబడినవి. ఇవి పునర్ముద్రణమైన యెడల— తెలుగువారికి, తక్కిన సాహిత్యములతోబాటు— "కర్షక సాహిత్యము" గలదని తెలియ గలదు. వ్యాసకర్త— కీ. శే. పేంద్యాల వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి— (భారతి 1, 2, 3 సంపుటములు).

### జ్యోతిశ్శాస్త్రము[18]

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి జ్యోతిశ్శాస్త్రము— నిడుమోలు కనక సుందరముగారి హిందూదేశమున గ్రహారాధనము నెన్నికగన్న వ్యాసములు. —

### నక్షత్రమండలము

ఈ శీర్షికతో భారతియందు కొన్ని యేండ్లు ప్రతి నెల నక్షత్ర మండల చిత్రపట సహితముగ వ్యాసములు వెలువడినవి— ఇవి పాశ్చాత్య జ్యోతిశ్శాస్త్ర పద్ధతుల ననుసరించి వ్రాయబడినను, ప్రాచ్య భారతీయ జ్యోతిశ్శాస్త్ర సంప్రదాయములతో సమన్వయము గలిగి యున్నవి. ఇవి పునర్ముద్రణము కావలెను. వ్యాసకర్త కీ. శే. గొబ్బూరి వేంకటానంద రాఘవరావు. —

### ప్రాచీన ఖగోళము

ఈ శీర్షికలోని వ్యాసములలో, వేలూరి వారు గ్రహమండలమునకు మన దేశీయాచారములకు గల సంబంధము చక్కగా నిరూపించినారు— ఇవి గ్రంథ రూపమున పునర్ముద్రణము దాల్చినవి.

### సూచనలు

తెలుగు దేశమునకు, తెలుగు భాషా సాహిత్యములకు వేకైకముగా 'భారతి' ఒక్కటియే ప్రచారమున నున్నది. ఇప్పటికి కర్ధ శతాబ్దమైనది గావున ద్వితీయార్థ శతాబ్దిలో 'భారతి' అద్వితీయముగా నుండుటకు నీ క్రింది సూచనలను గావించు చున్నాను.

1. స్వాతంత్ర్యావతరణమున కేంద్ర ప్రభుత్వమే— శకము మార్చి వ్యవహరించు చున్నది. అట్లనే కాలానుగుణ్యముగా భారతి భారతీయ శక సంవత్సర మాస నామములతో వెలయు వలెను.

అట్టమైపై
భారతి.
ప్రమాది పుష్యము. శా. శ. ౧౮౯౫
జనవరి 1974.

లోపల
భారతి
మాసపత్రిక
ప్రమాది పుష్యము. శా. శ. ౧౮౯౫
జనవరి 1974.
సంపుటము ౫౧. సంచిక ౧.

2. భారతి ప్రారంభము నుండి కొన్ని యేండ్లవరకు సంవత్సర సంఖ్యలేగాక— పుటల సంఖ్యలు, అన్నియు తెలుగంకెలో యుండెడివి— వ్యవస్థాపకులైన నాగేశ్వరరావు పంతులుగారు— ఇది తెలుగుపత్రిక— అని తెలుగు ముద్రగల— తెలుగంకెలనే వాడినారు. క్రైస్తవ శక సంవత్సరమునకు వారు— తెలుగు అంకెలనే వాడెడివారు. భారతి— విషయసూచిక తరువాత— వేరు పత్రము లేక— భారతి పేరుతో, వ్యాస శీర్షిక ప్రారంభముగు నుండెడిది. అప్పటి భారతి ప్రారంభమిది.

**భారతి—చెన్నపట్టణము ౧౯౨౪**

సంపు. ౧. రుధిరోద్గారి సం. పుష్య మా. సంఖ్య ౧.

గాంధీ శతకము—మంగిపూడి వేంకటశర్మ

పైరీతిగా క్రొత్తసంపుటము ప్రారంభమైనప్పుడే కాక ప్రతి సంచికా ప్రారంభమున నుండెడిది. ప్రస్తుత మీ పద్ధతి వాడుకలో లేదు. ఇందువలన భారతిలో ప్రకటితమైన వ్యాసమిది యని నిర్ణయించుటకు వీలు లేకున్నది. కావున నీ పద్ధతిని పునరుద్ధరింపవలెను.

తెలుగంకెలు, తెలుగక్షరములవలె గుండ్రదనము గలిగి మనోహరముగా నుండును. ఇంతకుముందువలె భారతిలో తెలుగంకెలనే తప్పక వాడుటవలన తెనుగు ప్రత్యేకత్వము ప్రదర్శించును. స్వాతంత్ర్యము రాకమునుపు తెనుగంకెలను వాడినపుడు, స్వాతంత్ర్య మనుభవించుచున్న యీ కాలమున గూడ ఇంగ్లీషంకెలను వాడుట సమంజసముకాదని విజ్ఞప్తి.

3. పూర్వ భారతి పత్రికలలో వ్యాసములు "ఇది భారతి పత్రికలో నీ సంవత్సరమున నీ మాసమున ప్రకటింప

18. ఈ శీర్షికలోను కొన్నింటిని మాత్రమే పేర్కొనగలిగితిని. ఇవియును ప్రత్యేక సంపుటముగా వెలువడదగినవి.

బడినది యని తెలుపుటకై వ్యాస పద్య శీర్షికలున్న పుటలు తప్ప తక్కిన పుటలపై సంవత్సర మాసములు ముద్రితము లగుచుండెడివి. ఉదా:—(రక్తాక్షిసం. చైత్రము క్రోధన సం. వైశాఖము—ఇత్యాది). ఈ కాలమానము ప్రతి పుట యందు ముద్రితము కాకపోయినపుడు— భారతులను సంపుటములుగా సమకూర్చినపు డట్టలు, ముఖ పత్రము పోవును. ఆ పరిస్థితిలో ఏ వ్యాసమే భారతియందు ప్రకటితమైనది అన్న సందేహము తక్కిన వారి మాట యటుండనిచ్చి ఆ వ్యాస కర్తకే కలుగును. కాన దీనిని తిరిగి ప్రారంభింపవలెను.

4. భారతి ప్రతి సంపుటము పూర్తికాగానే, పండ్రెండవ సంచికయందు—

వ్యాసములు—అకారాదిక్రమము

వ్యాసకర్తలు—అకారాదిక్రమము

“విధిగా నుండెడిది— ఇది భారతి వ్యాసకర్తలకేగాక— పాఠకులకు, పరిశోధకులకు నత్యంతోపయుక్తము — నేడు దీనిని తిరిగి ప్రారంభింపవలెను.

5. పూర్వమువలె భారతిలో ముద్రిత గ్రంథముల పట్టిక ప్రకటించుట యావశ్యకము. ఇందులో పఠనీయ గ్రంథములు విడువబడి, సాహిత్యమున నా సంవత్సరమున ప్రకటితములైన గ్రంథములు, వర్గీకరణము గావింపబడి, ప్రకటితమగు చుండెడివి. స్వాతంత్ర్యానంతరము తెలుగున సాహిత్య వాఙ్మయ చారిత్రక గ్రంథము లపారముగా వెలువడినవి. వెలువడుచున్నవి. వెలువడగలవు. అవి పరిశోధకులకు భాషా వాఙ్మయ చరిత్రకారుల కత్యంత సహాయకారులు—

6. వ్యాసములతోపాటు వ్యాసకర్తల ఛాయా చిత్రములను ప్రకటించుట క్రీ. శ. 1927 లోభారతి ప్రారంభించినది. ఇందువలన విస్మృతులైన పూర్వ వ్యాసకర్తల స్వరూపముల నెరుంగుటకు మనకు వీలగుచున్నది. వ్యాస ముఖమున గాకపోయిన ప్రతి సంవత్సరాంతమున చివరి సంచికలో ప్రకటింపవచ్చును.

7. తెలుగున ప్రాచీన సాహిత్యమునకు సంబంధించిన గ్రంథములలో, ముద్రితములైన వానికన్న అముద్రిత గ్రంథములే వ్రాత ప్రతులలో నధికముగా నుండి— అజ్ఞాతములై యున్నవి. అవి వెలుగులోనికి వచ్చినగాని మనకు సమగ్రము, సాధికారమునైన వాఙ్మయ చరిత్ర సమకూరదు. ఇందులకు భారతిలో ప్రతిమాసము—

అముద్రిత వాఙ్మయము

అను శీర్షికతో—కొన్ని పుటలు ప్రకటించుట కేర్పాటులు జరుగవలెను. దీనివలన భారతికొక ప్రత్యేకత గలుగును. సాహిత్య చరిత్రకు, విమర్శకు నవి యమూల్యమగును.

8. తెనుగు, జాతి—మత— సంఘ— సాహితీ సంస్కృతులను నిరూపించుటకు వూరిపేరు— ఇంటిపేరు— వ్యక్తిపేరు. సామెతలు—నుడికారములు అనునవి యైదును పరమాధారములు. వీనినిగూర్చి సమగ్ర పరిశీలన యింతవరకు ప్రారంభము కాలేదు—వీనినిగూర్చి సమగ్ర పరిశీలన జరిగిన తెనుగునకు భారతీయ దేశ భాషలలోగల దివ్యస్థానమేగాక, అద్వితీయ స్థానము తేటపడును. వీనిని గూర్చి యానుపూర్వికముగా వ్యాసములు లభ్యమగుట కష్టము. కావున—

కలగూరగంపలో ‘తెలుగు వెలుగు’

అను శీర్షికతో పైవానికి సంబంధించిన విషయములు ప్రచురితములు కావలెను. కలగూరగంపలో విషయములు క్లుప్తముగా నుండుటయేగాక ముక్తకములవలె నుండును. గాన—నా యీ విషయములను గూర్చి ఆనుపూర్వికముగా వ్యాసములు వ్రాయువారికి దోహదకారులు కాగలవు.

9. తెనుగు సారస్వత సౌధమునకు మూలస్తంభము ప్రాచీన కావ్య సాహిత్యము. ఆ ప్రాచీన . కావ్యాధ్యయనము, శబ్దార్థ విచారణ నానాటికి దేశమున సన్నగిల్లుచున్నది. కేవలము భాషా సాహిత్య విషయికములే గాక, నవీన వైజ్ఞానిక జగత్తులో వ్యాప్తమగుచున్న అణు సిద్ధాంతాది యాంత్రిక విధానములన్నియు మన తెలుగు కావ్యములో నిమిడియున్నవి. వానిని లోకమునకు వెలడించుట అత్యావశ్యకము! సాహిత్యమున శాస్త్రీయ విజ్ఞానమున భారతి ప్రథమమునుండియు ప్రాచీన నవీనతా సమన్వయమునకు ప్రతీకమై యున్నది.

న వ సూ చ న లు

ఈ నవ సూచనలను భారతి సంపాదకులకు విన్నవించినాడను—ఇది యాచరణ రూపము దాల్చిన—‘భారతి’ ఇతోధికముగా నవనవోన్మేషయై విరాజిల్లగలదు.

భారతి నవ్య భారతిమూర్తిగా భాసిల్లుగాక!
భారతికి శతజయంత్యుత్సవము పరిణమించు గాక!

—జయతు.

అనుబంధము—(1)

వ్యాస సూచి—భారతికి కృతజ్ఞత

ఆధునిక యుగమున కీ. శే. మానవల్లి రామకృష్ణకవి కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారల తరువాత ఆంధ్ర వాఙ్మయమున మౌలిక పరిశోధన జరిపినవాడను నేనే. భారతి పుట్టుకతో ప్రారంభమైన నా పరిశోధనా వ్యాసంగము నవిచ్ఛిన్నముగా నేటికిని భారతియందు ప్రకటించుచున్న భారతి సంపాదకులకు నే నా జన్మాంతము కృతజ్ఞుడనే గాక ఋణిని—

# స్వర్ణోత్సవ భారతి

సాహిత్య చరిత్ర పరిశోధకుల కుపయుక్తముగునట్లు నా వ్యాసములను వాఙ్మయ చారిత్రక యుగ విభజన పూర్వకముగా తెలుపుచున్నాను.

## భాష

భారతి

తెలుగు—సంస్కృతము (మార్చి 1968)
తెలుగు ప్రాకృతము (ఆగస్టు 1966)
ప్రాకృతభాష—శ్రీ పరవస్తు వారి సేవ (జూలై 1959)) (జూలై 1966)
అన్యభాషలు
తెలుగు తమిళము (నవంబరు 1967)
శాసన పదములు వివరణ (ఆగస్టు 1944)
కవి ప్రయోగ పరిశీలన (ఏప్రియలు 1964)
ప్రయోగ విశేషములు—పాఠభేదములు (జూలై 1964)
కొన్ని ప్రయోగాల పరిశీలన (ఏప్రియలు 1959)
ఆక్షేపము—సమాధానము (జూలై 1959)
ప్రాచీన గ్రంథ పరిష్కరణము (ఫిబ్రవరి 1964)

## లిపి

తెలుగు లిపి— (డిసెంబరు 1971)

## నిఘంటువులు

అముద్రిత నానార్థ నిఘంటువు (అక్టోబరు 1963)

## పదకోశములు

మాండలిక పదకోశము (మార్చి 1971)
మాండలిక వృత్తి పదకోశము (ఏప్రియలు 1970)

## సామెతలు

తెనుగు సామెతలు (జనవరి 1966)

## శాస్త్రము

తెలుగులో ఆకర గ్రంథాలు (డిసెంబరు 1963)
వాత్స్యాయన కామసూత్రములు (మార్చి 1963)

## చరిత్ర

ఆంధ్రదేశ చరిత్ర భూగోళ సర్వస్వ ముఖద్వారము (సెప్టెంబరు 1970)
ఆకర్తాలో సందె చీకటి (మే 1963)

## పత్రికా వాఙ్మయము

ప్రాచీనాంధ్ర వార్తాపత్రికలు (1849—1875) (మే 1930)
అముద్రిత గ్రంథ చింతామణి (ఆగస్టు 1930)

## ఆంధ్ర వాఙ్మయ చరిత్ర

### నన్నయ యుగము

నన్నయ ఇష్టదేవతాస్తుతి (ఏప్రియలు 1963)
నన్నయ వాగను శాసనుడా? (జూన్ 1963)
—డిటో— (ఆగస్టు 1963)
నన్నయ నన్నిచోడ కవులు (మే 1963)
సంశోధిత మహాభారతముద్రణము
ఆది సభారణ్య పర్వములు (నవంబరు 1972)

### శివకవి యుగము

మల్లికార్జున పండితుడు
పండిత త్రయము (మార్చి 1926)
శివతత్త్వసార పాఠాలు
మార్పుతగునా (ఏప్రిలు 1960)

### నన్నెచోడకవి

నన్నెచోడని కవిత్వము (జూన్ 1964)
నన్నెచోడని శైవ సంప్రదాయము (ఏప్రిలు 1969)
నన్నెచోడని పద ప్రయోగ సూచిక (జనవరి 1963)
కంజబ తత్త్వ భంజనము (నవంబరు 1970)

### పాల్కురికి సోమనాథుడు

పాల్కురికి సోమనాథుని గురుప్రశంస (ఫిబ్రవరి 1925)
పాల్కురికి సోమనాథుడు వృషాధిపశతకము (జూన్ 1926)
పాల్కురికి సోమనాథుని లఘుకృతులు (డిసెంబరు 1962)
పాల్కురికి సోమనాథుని చతుర్వేదసారము (సెప్టెంబరు 1962)
పండితారాధ్య చరిత్ర (జూన్ 1966)
—డిటో— (జూలై 1966)
యథావాక్కుల అన్నమయ్య (జూలై 1944)
—డిటో— (ఆగస్టు 1944)
ఆంధ్ర వీరశైవ వాఙ్మయము (జనవరి 1949)
భారతి రజతోత్సవ సంచిక—(1—25పుటలు)

### తిక్కన—ఎఱ్ఱన యుగము

తిక్కన పద ప్రయోగ కోశము (జూన్ 1973)
ఈ కుమార చరిత్రము (కేతన) (సెప్టెంబరు 1967)
కేయూర బాహు చరిత్ర (మంచెన) (ఆగస్టు 1967)
మంచెన కవితా శిల్పము (ఏప్రిలు 1963)
ప్రథమాంధ్ర కవితా పితామహుడు శివదేవయ్య (జూన్ 1952)
వచన వాఙ్మయ ప్రథమాచార్యుడు

**ఎఱ్ఱన—మత సమన్వయము**

ఎఱ్రన—ఇతరకవులు (జూన్ 1967)
దోనయామాత్యుడు (మే 1952)
సస్యానందము
శ్రీ గిరి (జూలై 1937)
పశుపతి నాగనాథుడు (ఆగస్టు 1945)

**శ్రీనాథ యుగము**

శ్రీనాథుడు
శృంగారనైషధము— పాఠ భేదములు (నవంబరు 1963)
శృంగారనైషధము— సువరి ష్కృత ముద్రణము (ఫిబ్రవరి 1964)
హరవిలాస కిరాతార్జునీయము (జూలై 1954)
వీరశైవ సంప్రదాయములు
సాహిత్య అకాడమీ వారి భాగవతము (జూన్ 1964)
మడికి సింగన కాలము (జూన్ 1967)
నాగులూటి శేషనాథుడు (మార్చి 1938)
ఉదయనోదయ ప్రబంధము (నారన సూరన) (మార్చి 1963)
కవి మహేంద్రుడు (ఏప్రియలు 1936)

**కృష్ణరాయ యుగము**

ఆముక్తమాల్యద— ఆశ్వాససంఖ్య. (జూలై 1971)
ఆంధ్రసాహితీ సార్వభౌముడు (విమర్శ) (అక్టోబరు 1963)
పెద్దన మనుచరిత్ర (నవంబరు 1954)
ప్రసన్న రాఘవ నాట్య ప్రబంధము. (మార్చి 1963)
తాళ్లపాక కవులు—
కట్టా వరదరాజు (ఏప్రియల్ 1936)

**దక్షిణాంధ్ర వాఙ్మయము**

క్షేత్రయ క్షేత్రజ్ఞ (మార్చి 1964)
రెడ్డిరాజులు— సాహిత్యపోషణ
జొంగులూరి నిర్మాత పెదకెంప గాడ[19]

**ఉత్తర ప్రబంధ యుగము**

కానాల నరసింహకవి (ఆగస్టు 1963)
చెన్నా ప్రెగడ నాగేశ్వరకవి (సెప్టెంబరు 1962)
పోచిరాజు వీరన (డిసెంబరు 1963)

**కుంఫిణీ పాలన**

ప్రౌనుయుగము (1800—1857).
ప్రౌను జీవితము (నవంబరు 1929)
ప్రౌను జీవితమును గూర్చి
తొలి వ్యాసము— ఇది బొంబాయిలో ప్రచు రింపబడెను.
Telugu Samachar పత్రికలో— ఆంగ్లభాషలోనికి భాషాంతరీకరింపబడి ప్రక టింపబడినది— భారతి— పేర్కొనబడినది—
ప్రౌను స్వీయ చరిత్ర
ప్రౌను ప్రశస్తి (మే 1967)
ప్రౌను నిఘంటువు పునర్ముద్రణ
సి.పి.ప్రౌన్ సమీక్ష (సెప్టెంబరు 1963)

**ఆంగ్ల పాలన**

గ్రాంథికయుగము (1858—1900)
చిన్నయసూరి— కొక్కొండ—
బాలవ్యాకరణము— పుట్టుపూర్వోత్తరములు (ఏప్రియలు 1961)
,, (మే 1961)
కొక్కొండ వేంకటరత్నము పంతులు (జూన్ 1951)
,, (జూలై ,, )
,, (ఆగస్టు ,, )
,, (సెప్టెంబరు ,, )
తడకమళ్ల వెంకటకృష్ణారావు (జూలై 1953)
అభినవపండితరాయలు అవధానప్రతిభ (ఫిబ్రవరి 1960)
మండపాక పార్వతీశ్వరశాస్త్రి (జూన్ 1930)

19. దక్షిణాంధ్ర వాఙ్మయమును గూర్చి— దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము— అనునొక— 800 పుటల విపుల గ్రంథము వెలయించుటచే, భారతియందు ప్రత్యేక వ్యాసములు ప్రకటింపవలెను. ఈ గ్రంథము మదరాసు విశ్వవిద్యాలయమువారు రెండు పరియాయములు ముద్రించిరి. ఇప్పుడది తిరిగి ముద్రితము కావలసి యున్నది.

**ఆధునిక యుగము—1900**

కందుకూరి వీరేశలింగకవి (మే 1948)
వీరేశలింగకవి చరిత్రము (ఫిబ్రవరి 1963)
తిరుపతి కవుల సాహిత్యసమీక్ష (సెప్టెంబరు 1966)
,, (అక్టోబరు 1966)
తిరుపతి వేంకటకవులు—సరస్వతీ పత్రిక (ఏప్రియలు 1971)
తిరుపతి వేంకటకవులు సువర్ణపాత్రికము (మే 1971)
వేటూరి ప్రభాకరశాస్త్రి (మార్చి 1951)
కాటూరి వెంకటేశ్వరరావు (మార్చి 1961)
ఆధునికయుగము, గాంధీసాహిత్యము (ఫిబ్రవరి మార్చి 1973)

సాహిత్య చరిత్ర

పూర్వసాహిత్యవీథులు (మార్చి 1949)
పూర్వకవికృతులు పునర్ముద్రణావశ్యకత (జూన్ 1949)
కవికాలనిర్ణయము శాసనాధారములు (జూలై 1949)
సమగ్ర ఆంధ్రసాహిత్యం (ఆరుద్ర)
1—3 సం. (ఆగస్టు 1965)
4—6 సం. (అక్టోబరు 1965)
మలిరాయల యుగం 7సం. (డిసెంబరు 1965)
నవాబుల యుగం 8సం. (ఫిబ్రవరి 1966)
ఆర్వీటిరాజుల యుగం 9సం. (మార్చి 1966)
10సం.
11సం.
కడపటిరాజుల యుగం 12సం. (నవంబరు 1968)

సాహిత్య ప్రక్రియలు

ద్విపదవాఙ్మయము (అక్టోబరు 1967)
యక్షగానవాఙ్మయము
కొందరు యక్షగానకవులు (అక్టోబరు 1951)
కంఠీరవరాజా యక్షగాన కృతులు (నవంబరు 1951)
ఆంధ్రవచనరచనాభేదములు (జనవరి 1959)
ఆంధ్రగద్యచంద్రిక (నవంబరు 1969)

సాహిత్య విమర్శలు

నవసాహిత్యచరిత్రలు—విమర్శలు (మే 1964)
సాహిత్యోపన్యాసములు (ఫిబ్రవరి 1963)
శాంతిసామ్రాట్టు అశోకచరిత్ర ఉర్లిచేసినమేలు (సెప్టెంబరు 1959)
అశోకునిజననము
పుష్పావతి (జూలై 1949)
అమరుకము— ఆంధ్ర భాషాంతరీకరణములు (డిసెంబరు 1951)

# శ్రీ నాగేశ్వరోదాహరణము

[శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారిని గూర్చినది]

శా. శ్రీ నీలాచలశేష శైల కటక శ్రీ పీఠ సంజాతముల్
భూనాథ స్తవనీయ కావ్య రచనాంభోధి ప్రమోదప్రద
శ్రీ నిత్యంబులు నిష్కళంకములు సాంద్రీ కీర్తి చాంద్రి ద్యుతుల్
నానా దేశములందు గ్రమ్మి వెలుగున్ నాగేశ్వరోదాహృతిన్.

## ప్రథమా విభక్తి

శా. శ్రీ నాగేశ్వర పాదసేవకుడు కాశీనాథ వంశాంబుధి
శ్రీ నీహారకరుండు సాధునికర క్షేమంకర ప్రాభవ
శ్రీ నిత్యుండు దయా శమాది సుగుణ శ్రీ రాజితుండౌచు నా
శ్రీ నాగేశ్వరుం డింపునన్ జెలగె సాంద్రీ పూర్వ పుణ్యంబునన్ —

కళిక

మరియు భారత భూమిః బుట్టిన మాన్యులందఱిలో సమర్థుడు —
మఱపు పుట్టగరాని త్యాగము మై ధరించిన మొదటి పార్థుడు

## భా ర తి

కలియుగంబున నవని బుట్టిన కవుల పాలిటి కామధేనువు
తెలుగువారల తెలివి తేటలదీర్చి పేర్చిన రత్నసానువు
వరున మెన్నడు బలుక జాలని పలుకు మెత్తదనంపు దొరవు
పరువులను గని యీవులిచ్చెడి బాగు మెచ్చుల కెల్లదీరము.

### ఉ త్క లి క

దీన జనముల బ్రోవ నేర్చెను
మౌని జనములఁ గాచి పేర్చెను
అడుగు వారికి వన్న మిచ్చెను
బడుగు వారికి బలము దెచ్చెను —
తెలుగు తల్లిని గొలుచు ధన్యుడు
తెలుగు బిడ్డల బ్రోచుమాన్యుడు
తెలుగు దమ్ముల కును శరణ్యుడు
తెలుగు జనులకు ప్రథమ గణ్యుడు.

## ద్వి తీ యా వి భ క్తి

ఉ. ఆంధ్ర జనంబులార! భవదభ్యుదయంబునకై నితాంత నీ
రంధ్ర మహోద్యమంబులను రాగమునన్ బచరించు వాని సై
రంధ్రివి బోలె యన్యులఁ గరమ్ము దిరమ్ముగ గొల్చి స్రుక్కునీ
యాంధ్రిని బ్రోచు శక్తి నలరారు మహాత్ముని చింత సేయరే

### క లి క

మరియు దీనులఁ బ్రోవనేర్చిన మహిమగల యౌదార్య వంతుని
బిలుదు మగలెలుగంగ జాలని పేరుగాంచిన పరమశాంతుని
తెలుగుసీమకు పేరుదెచ్చిన దిట్టతనమున తగు దయాళుని
తెలుగు మొఱ విని కళుగు మనమున దేశ మొందిన త్యాగశీలుని.

### ఉ త్క లి క

తెలుగువారికి తెలుగు వ్రాతల
తెలుప గలిగిన తెలుగుసేతల
తెలుగుసీమల విడిచి దూరము
నిలిచి తెలుగున నిలిపి బీరము
తెలుగు వారలు తెలుగు దినమున
వెలుగు రీతులు వెలచి మనమున
తెలుగు సేమము దలచు వానిని
వెలుగు నిలువున నలరు వానిని —

## తృ తీ యా వి భ క్తి

శా. వావాటన్ కృశియించె నాంధ్ర కవితా వారిపతంసంబు స
మ్మానంబుల నడియించి క్రమ్మర రహింపం గల్గి వెల్గొందెగా



భారతి స్వర్ణోత్సవ శుభసమయమున
మా శుభాకాంక్షలు !



# విజయలక్ష్మీ మూవీస్

(ప్రొడ్యూసర్స్ & మోషన్ పిక్చర్ డిస్ట్రిబ్యూటర్సు)
19/1, రాజాబాదర్ ముదలి వీధి.
టి. నగర్ — మద్రాసు-600017.

అధినేత
శ్రీ జి. వి. ఎస్. రాజు

బ్రాంచి
గుంతకల్లు—2

సబ్ ఆఫీస్
తిరుపతి.

జయప్రదంగా ప్రదర్శింపబడుచున్న చిత్రములు:—

నమ్మినబంటు — నాదీ ఆడజన్మే — మల్లీశ్వరి — దాగుడుమూతలు — ఆప్తమిత్రులు
వీరకంకణం— సంతానం — భూలోకరంభ— ఖైదీ కన్నయ్య — దాసి— భలే అమ్మాయిలు
అభిమానం — పెళ్ళి సందడి — పెద్దమనుషులు—కనకదుర్గ మహిమ మరియు వైభవము.—
గాయ్ ఔర్ గోరీ (హిందీ కలర్)

మా రాబోవు చిత్రములు :—

**పెద్దలు మారాలి** : క్రిష్ణ—జమున—గుమ్మడి—అంజలి మొదలగువారు.

**నిజరూపాలు** : ఎస్. వి. రంగారావు, విజయనిర్మల, రామకృష్ణ, నాగభూషణం, రాజబాబు, అల్లు రామలింగయ్య.

విజయలక్ష్మీ మూవీస్ వారి

## ప్రొడక్షన్ నెం. 3

డైరెక్షన్ : కె. విశ్వనాథ్ బి.ఎస్‌సి., మాటలు : డి. వి. నరసరాజు బి.ఎ.
సంగీతం : కె. వి. మహాదేవన్ నిర్మాత : జి. వి. ఎస్. రాజు.

Devar Films Presents
**"Haathi Mera Saathi"** (Hindi - Colour)

World Negative Rights Controlled by
**M/s. Vijayalakshmi Movies**
MADRAS – 600017.

## భా ర తి

శ్రీనాథాహ్వయ వార్ధి శీతకరుచే శ్రీమద్యశః కాయుచే
శ్రీ నాగేశ్వరుచే మహామహిముచే శ్రేయస్కర త్యాగిచే

### క లి క

మఱియు కవులకు నెల్ల మనసు వచ్చిన యీవి
గురుతు కల్గిన యీవి కోరి వచ్చిన యీవి
యమరించు వానిచే నలరించు వానిచే
కమనీయ మధుర వాగ్గరిమ గలవానిచే

### ఉ త్క లి క

అమృతాంజన మొనర్చి
అమృతంబు చేకూర్చి
పసిఁడి కొండ కరంచి
పసవారి యొడినించి
యసదైన కలిమిచే
నలరారు బలిమిచే
తెలుగుతల్లి వెలింగె
తులితు చేత జెలంగె

### చ తు ర్థీ వి భ క్తి

దేశోద్ధారకుడై మహామహిముడై ధీమంతుడై శాంతుడై
యాశాపూరణమే మహావ్రతము నాంధ్ర ప్రభావర్ధియై
కోశంబుల్ రచియింప జేసి తమ కోర్కుల్ దీర్చి యున్నట్టి నా
గేశాభిఖ్యునకై సమస్త విబుధుల్ శ్రేయోయి సంధింపరే —

### క లి క

మఱియును భారత మహిమను భారత మహిలో నిల్పిన మాన్యునకై
ఎరిగిన వారల నెఱిఁగి మఱిగి తన యీవులఁ దలపు వదాన్యునకై
ఈవియ వ్రతముని యెదలో నెంచుచు నిచ్చుచు నగవని ధన్యునికై
ఈవికి గనియై, తావికితావై యెంచిన గురు సౌజన్యునికై

### ఉ త్క లి క

ఆంధ్రులు కట్టిన చెన్నపురంబున
నాంధ్రత శూన్యతనంద రయంబున
నాంధ్రపత్రికను గొప్ప జయంబున
నాంధ్రత నిల్ప నయంబున డంబున
నాంధ్రుల కుత్సాహము పుట్టించిన
నాంధ్రుల ప్రతిభకు నతుల తపించిన
ఆంధ్రవరేణ్యునకై గణ్యునకై
ఆంధ్ర శరణ్యునకై పుణ్యునకై

# స్వర్ణోత్సవ భారతి

## పంచమీ విభక్తి

శా. వాగర్థంబుల కూరిమిం దెలిపి కావ్యంబుల్ రచింపంగ వి
ద్యాగారం బగు నాంధ్రపత్రిక — సమస్తాంధ్రాళికిం గూర్చి సీ
రాగ ప్రాగ్రిమప్రై విమర్శనములన్ వ్రాయించెన్ గేయుఃడా
నాగేశాఖ్య కళాప్రపూర్ణువలనన్ త్యాగంబు రాగిల్లెడున్

### కళిక

మఱియు భారత భూమి మనుపు ధీరునివలన
చెలువకేగి సేమంబు గురియు శూరుని వలన
దవ్వుతెలుగుల ప్రేమ దనుపుమహితుని వలన
మవ్వంపు నెయ్యంబు మలపు విహితుని వలన
ప్రత్యేకరాష్ట్ర నిర్మాణ దీక్షుని వలన
సత్య వాక్పాలనాచరణ దక్షుని వలన
విశ్వవిద్యాలయా భీష్టపక్షుని వలన
శశ్వత్కళాపూర్ణచటుల శిక్షుని వలన—

### ఉత్కళిక

యోగీశ్వరుని వలన
వాగీశ్వరుని వలన
త్యాగేశ్వరుని వలన
నాగేశ్వరుని వలన —

## షష్ఠీ విభక్తి

శ్రీ గౌరీశ్వరు నాజ్ఞ భారత ధరిత్రీపూర్ణ కామాప్తికై
భోగా సక్తిని వీడి త్యాగ మహిమం బూర్ణంబు గాఁ జూపి కా
రాగారంబున కష్టముల్ గనిన ధైర్య స్థైర్య విస్ఫూర్తికిన్
నాగేశాగ్రణికిన్ సమస్తవిబుధానందాను సంధాయికిన్—

### కళిక

మరియును భారత మహిళాసంతతి మహిమను గాపాడిన గుణికిన్
కొఱతలు గలిగిన కూరిమి తమ్ముల కొలఁదులు నిల్పిన యగ్రణికిన్
దేశ దేశముల నాంధ్రుల మహిమను ద్రిప్పి ద్రిప్పి నానినగుణికిన్
నాశ మెఱుంగని కీర్తి గడించిన నవ్య మధుర వాగ్ధోరణికిన్ —
ఖండాంతరముల నిండిన యాంధ్రుల కష్టము లరయు నుదారునకున్
పండితమండలిపై దయజూపిన భవ్యవిచార విహారునకున్
అమృతాంజన మను నద్భుత వస్తువు నవనికి దెచ్చిన వీరునకున్
అమరుతెఱుంగని యమృత మిచ్చి యఖిలాంధ్రులఁ బ్రోచిన ధీరునకున్—

ఉత్కళిక

చేతులు మోడ్పుడు నాగేశునకున్
ప్రీతిని జూపుడు నాగేశునకున్
చేతలు రీతులు నాగేశునకున్
ఖ్యాతిగ నొసగుడు నాగేశునకున్ —

సప్తమీ విభక్తి

శా. శ్రీనిత్యంబయి యొప్పు బొంబయిపురిన్ శృంగార రూపంబుతో
నానాంధ్రస్తవనీయ వాక్యరచనా నవ్య ప్రభావంబుతో
దానాంధ్రంబున బత్రికా రచన సంధానించెన్ భవ్యుడా
శ్రీ నాగేశ్వరునందుఁ జిత్తములు—నిల్చెన్ నేటి యాంధ్రాళికిన్ —

కళిక

మరియు నాంధ్రుల ప్రతిభమను ప్రకావ్యుని యందు
కొరలేని నిర్భరము గూర్చు దివ్యునియందు
"భారతీ" పత్రికా ప్రకట సేవ్యుని యందు
భారతీయ ప్రేమ భరణ నవ్యుని యందు —

ఉత్కళిక

పరమశాంతుని యందు
సరసదాంతుని యందు
చాగశీలుని యందు
నాగేశ్వరునియందు —

సంబోధన — సార్వవిభక్తికము

శా. నీవే తావని నిన్ను నమ్మె మదిలో నీచేత సత్కార్యముల్
వేవేల్ వెల్గఁగ జేసె; నీకయి సమర్పించెన్ మహైశ్వర్యముల్
తావుల్ నీ వలనన్ గ్రహించె కృతి కర్తల్ నీకు కావ్యంబులన్
నీవారై యొసగంగజేసె గలసెన్ నీ యందు నాంధ్రీశ్వరీ!

చ. సముడధికుండులేడు పురశాసను డొక్కడు దక్కనింత ని
క్కము భవదీయ వృద్ధికయి కాయము వాక్కును ధారపోసి నీ
య్యమరత వెల్గఁజేయు నమృతాంజనమున్ సృజియించె నాంధ్రి! నీ
వ మలినమైన యాతని యుదాహరణంబునఁ బ్రీతి బొందుమా.

ఉ. మండిత మండపాకకుల మండన కామ కవీశ్వరాగ్ర పు
త్రుండు లసత్కవిత్వ పరితోషిత రాజ సభాంతరస్థ సత్
పండిత పార్వతీశ కవి పౌత్రుడునై తగు పార్వతీశ్వరా
ఖ్యుండు రచించె నాంధ్ర కవికుంజర తృప్తిగ నీయుదాహృతిన్.

(భారతి— సం. 15., సం. 7. 1938 జులై — కీ. శే. మండపాక పార్వతీశ్వర శాస్త్రి.)

# సాహిత్య విమర్శ

## శ్రీ మరుపూరు కోదండరామరెడ్డి

**పూర్వయుగము:**

సంస్కృత సాహిత్యంలోవలెనే, ఆంధ్ర సాహిత్యంలో గూడా విమర్శనమంటే తప్పులేజూపి తిటుట అనే అర్థమో, అపార్థమో గట్టిగా ఏర్పడిపోయి ఉన్నది. 'దిఙ్నాగానాం పథి పరిహరన్ స్థూలహస్తావలేపాన్' అని కాళిదాసు మేఘుడిని ఎచ్చరిస్తే— అది, దిఙ్నాగాచారి అనే ఒక ప్రపంచ బౌద్ధవిమర్శక పండితుని పట్ల, ఆ మహాకవికున్న భయమునే బయట బెట్టుకొనుచున్నాడని, అంతరార్థాలు లాగి, విమర్శనమంటే మన కవి పండితులకున్న అభిప్రాయాన్ని రూఢిచేస్తున్నారు. ఇట్లే విమర్శ అంటే—రచనలో విశేషములను ఔచిత్యములను విప్పి ఎత్తిచూపి అనువుదప్పిన చోట తిట్టిన్నీ అనువైనపట్టున పొగడుట అనేభావం తెనుగు వారికి గూడ అంతగా ఉన్నట్లు కనబడదు.

కాబట్టే డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి 'మన పండితుల వివాదములలో పరుషములే గాని సరళములు లేవు' అని చమత్కరించినారు.

కావ్యలక్షణాలను అలంకారాలను వివరించి చెప్పిన గ్రంథాలను సూత్రాలను పాటించని కవితలను పారబట్టులే మనకున్న విమర్శనమంతా! అలంకారవాదము రీతివాదము గుణవాదము వక్రోక్తివాదము ధ్వని వాదము ఔచిత్యవాదము రసవాదము మొదలైన అంశములు తప్పినచోట్ల ఎత్తిచూపిన కావ్యవిమర్శలు మనకు మెండుగా ఉన్నవి.

కాని, ఈ లక్షణములను ఒక గ్రంథములో ఎత్తిచూపి, మరియొక దానితో పోల్చి చూపి, బాగోగులను తూచి చెప్పేవిధానం మనకు మృగ్యం. చాలా వ్యాఖ్యానాలలో ఒకపాటిగా అతిక్రమణలను ఏరి పరిహారముల సూచించి, ఉదాహరణలను ఏరి వ్రాయుట జరిగిఉన్నది. ఇది ఒకమాదిరి విమర్శ సూత్ర ప్రయోగ మన వచ్చును. ఇదే మన సాహిత్యవిమర్శక కాళరాత్రిలో మిరుమిట్లుగొలిపిన ఒక చిన్న మెరుము. ఈ సంస్కృత ఫక్కికి అన్నోతమ్ముడో మన తెనుగు బాణి. మన విమర్శలు పిడుగులను మాత్రం కురిపించి, సాహిత్య లోకంలో కొత్తత్రోవల చూపను మరచి పోయినవి.

లక్షణ గ్రంథాలకు వ్యాఖ్యానాలను, ఆ వ్యాఖ్యానాలు వ్రాయుటలోనే ప్రొద్దంత క్రుంకించుకొన్నారు మన పూర్వసాహిత్య విమర్శకులు. సహేతుకంగా విమర్శించి మార్గదర్శక సూత్రప్రవచనం చేయడం మనవారికి ఒంటబట్టని విద్య. జయదేవుడు 'చంద్రాలోకం' అనే అలంకార గ్రంథంవ్రాస్తే, దానికి అప్పయ్య దీక్షితుల వారు 'కువలయానందం' అని వ్యాఖ్య వ్రాసినారు. దానికి ఆనంద కారణం సూచించనో అన్నట్లు కువలయానందానికి 'చంద్రిక' అని, దీనికి వ్యాఖ్యానం 'శరదాగమనం'. ఇట్లా వ్యాఖ్యాన పుత్రీపౌత్రికల వృద్ధి జరిగినది.

ఈ స్థాయిలోనే తిట్ల జడివాన రేగినది. భట్టోజీ దీక్షితుల సిద్ధాంత కౌముదికి 'ప్రౌఢమనోరమ' అనే వ్యాఖ్యానం వ్రాస్తే 'మనోరమ కుచమర్దనం' అనే కారుకూతల పుస్తకం బయలుదేరినది. ఈపని చేయగలిగిన మొనగాడు—ఆ తెనుగుబిడ్డ జగన్నాథ పండితరాయలే గదా! అంతటి అప్పయ్య దీక్షితులను 'ద్రవిడ శిశువ'ని , 'లంబకర్ణుడ'ని గేలిచేసి నాడు. తెనుగులో ఇంతటివాడు — తెనాలి రామకృష్ణుడు, ఆ తర్వాత పిండిప్రోలు లక్ష్మణకవి. ఈ పోరుకే రెచ్చిపోయి భట్టుమూర్తి 'ఇక తిట్టుకమాన, కుట్టుకయున్న వృశ్చికము కుమ్మరి పుర్వునియందు రేగదా' అని తిట్టినాడు. ఆనాటి సాహిత్యవిమర్శక సరసమిది! కాబట్టే యీ ఆకటువు వెగటును బుట్టించినది. తెనుగులో 'శ్రవణానంద శృంఖ' లాదులు ఈ తీరుకు చెందినవే.

**చాటువులు:**

మనకు ప్రత్యేకమైన చాటుపద్య కవిత్వంలో విమర్శనమంటే—తప్పు బట్టుట, ఎగబడి నోరు పార

వేసికొనుటేగాని. సృజనాత్మక సూచనలు చేసిన పాపాన పోయిన వారులేరు. అయినా ఈ చాటువులు ఆంధ్ర భారతికి చారుతర అమూల్యాలంకారములు. ఇది ఒక విధంగా శాస్త్రరూపం దాల్చిన సాహిత్య విమర్శరేఖలు కావచ్చును. వీటిచేత కన్నడులు ఆకర్షింపబడుటచే తమ లిపిలో కన్నడ లఘుటీకలతో తమ సాహిత్యంలోకి వీటిని ఎక్కించుకొన్నారు. క్రొత్త తెన్నుల చూపక పోయినా ఈచాటువులు హృద్యములై తెనుగుకు తేనె వాకలై తెనుగుతనాన్ని చాటుచూ, ఇంకా ప్రచారంలో ఉన్నవి.

మన కావ్యాలంకారచూడామణి, నరస భూపా లీయాదులు ఆదేశాలేగాని ఆచరణలు గాకపోయినవి.

**యుగాంతరము: పాశ్చాత్యులు**

ఐరోపా ఖండమువారు, తాము మెట్టిన దేశా లన్నిటిలోను, ఆధునికి నాగరకత వాసనలయందేగాక వాఙ్మయ ప్రపంచమునగూడ ఒక యుగాంతరోదయ మునకు వేగుజుక్కలైనారు. లిపి భాషలకేగాక మానవత మానసిక వికాస పురోగమనంలో తప్పటడుగుల నేర్పి నది. గ్రంథరచన నడక నేర్పినది. చివరకు ముద్రణకళ దౌడుతీయించినది. ఈ పరిణామము హైందవ భాష లన్నిటియందును ప్రస్ఫుటంగా గోచరించే అభివృద్ధి లక్షణము. తెనుగులో పొడచూపిన క్రొత్త పోకడలన్నీ భారతీయ భాషలన్నిటిలోను ఒకేతీరున సాగినవి. ఇది ఆంగ్లేయ సాహిత్యప్రాబల్యం. దీనితో వాఙ్మయ మహా మహీజ శాఖలన్నీ భిన్నరీతులతో భిన్న దీప్తులతో మొగ్గదొడిగి పూచి కాచినవి.

ఆంధ్రభాషా లక్ష్మి నవ్యరమ్యాలంకారములను—వారి వారి శక్తిని రక్తిని బట్టి ఆంధ్ర పండితులు కవులు సంతనపరుప సాగినారు.

**సాంప్రదాయిక మధ్య యుగము**

ఈ శతాబ్దాదిలో, సాంప్రదాయిక పండితులు కొన్ని వ్యాఖ్యలను విమర్శలను ప్రారంభించినారు. సంస్కృత పండితులు సంస్కృత నిధులను తెనుగుకు దించినట్లే, ఆంగ్ల—వంగభాషాకోవిదులు, తాము ఆయాభాషలలో సేకరించిన విషయాలను ఆంధ్రం లోనికి కలుపుకొంటూ వచ్చినారు. కాని విమర్శన రంగమున క్రొత్తత్రోవ లరయరైరి. 'కవితాశిల్ప మునన్ పొరగుడన్' అని తిక్కన ఏనాడో చెప్పుకొన్నా, కళగా కవితను తీర్చిదిద్ది విప్పిచెప్పిన రచనలు మచ్చు కున్నవేమో—అంతే. తిక్కయజ్వ తర్వాత మొగల్ జహంగీర్ దివాణంలో పండితరాయలు (1590) రస్యమైనపదమే కావ్యమని దాని పరిధిని దూరంగా పరచిపెట్టినా, నవ్యరీతులలో విస్తరించి అన్వయించి, ఇతర వాటితో పోల్చి పొందు కుదర్చగలిగిన వ్రాతల పొంతకే ఆంధ్రులు అంతగా పోరైరి.

కందుకూరు వీరేశలింగం పంతులు నవ్యాంధ్ర జగత్తులో ఎగిరి అందుకొనని ఎత్తుగాని, దూకి తాకని లోతుగాని లేకపోయినా, విమర్శనా నవ్య వైఖరిని అంట లేదు. వారికవుల చరిత్రలో, కవులందరి జాతక చక్ర ములను బిగించి, ఆయాకవుల ప్రస్తావనలో, స్థాలీ పులాక న్యాయంగా మాత్రమే సాహిత్య విమర్శమును కొంత తడవి వదలినారు. ఇదే ఆసస్యమునకు బీజా వాపమైనది. పంతులువలెనే విభిన్నప్రజ్ఞను చూపిన కొమర్రాజు లక్ష్మణరావు, ఆంధ్రుల చరిత్రను చమ టూడ్చి శోధించి అచటచట కవుల కవితను ప్రస్తా వించిన చిలుకూరు వీరభద్రరావు, పరిశోధక చక్రవర్తి మల్లంపల్లి సోమశేఖరశర్మ, కవులచరిత్రను వ్రాసిన గురజాడ శ్రీరామమూర్తి, ఆంధ్రకవి తరంగిణిలో చాగంటి శేషయ్య, సమగ్రాంధ్ర సాహిత్యంలో ఆరుద్ర సాహిత్యవిమర్శను కొంత చూపినారు. కాని, అవి పూర్ణవికాస ఛాయలను వెల్లడించలేదు; ఇంతేగాదు అని శాస్త్రస్థాయికి ఎదుగ లేదు. ఇంతవరకు వెలువడిన వాఙ్మయచరిత్రల యథార్థవిమర్శనా రూపము, కొండను అద్దములో చూపినట్లుగానే ఉన్నది.

1900 సంవత్సరానికి అటు ఇటుగా వెలు వడిన మాసపత్రికలు, భాషా విషయములను గూర్చి వ్రాసినా, విమర్శ అంటే తప్పులుపట్టుటే అన్నభావంతో, ఆ సంపాదకుల తలలు వారిపత్రికలు పొరటలు నిండి పోయినవి. నెల్లూరు పూండ్ల రామకృష్ణయ్యగారి 'అముద్రిత గ్రంథ చింతామణి' కవికుంజర కేసరి అయినది. పాతకొత్త రచయితలను బెదరగొట్టి తరిమి కొట్టినది. దీనివల్ల చదువరికి భాషాజ్ఞానం ఎదిగినదే గాని, తిట్లవల్ల సభ్యత తరిగినది. కందుకూరివారి 'వివేకవర్ధని' శ్రీపాద కృష్ణమూర్తిగారి 'వజ్రాయుధము' ఈకోవకు చెందినవే.

# సాహిత్య విమర్శ

కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రి 'శారదా కాంచకా కింకిణాలు' సాంప్రదాయిక భాషా సేవచేసి గిలగిల మ్రోగినవి. కొక్కొండ వేంకటరత్నం పంతులు గారి 'ప్రసన్నరాఘవం' పై శాస్త్రిగారు చేసిన నిశిత విమర్శ, భాషకు ఒక కోశమువంటిది. 'సంగీతకము' అన్నమూలానికి 'చిన్నసంగీతం' అని కొక్కొండ వారు అనువదిస్తే, శాస్త్రి ఎగతాళి పట్టించి. సంగీతకమంటే వనితా గానమనిచెప్పి ఒక విధమైన భాషాసేవ చేసినారుగాని, ఇందు సహృదయతగాని ముందుతరానికి సూచనలుగాని చాల తక్కువగా ఉన్నవి. వేదమువారు ఎప్పుడూ విమర్శకు హాస్యం అనుపానంగా అందించేవారు కాబట్టి పాఠకులకు హృద్యంగా ఉండి, భాషాభివృద్ధికి — నాటికి నేటికి రేపటికిగూడ తోడ్పడినవి, తోడ్పడుచున్నవి, తోడ్పడు చుండ గలవు.

ఆ తర్వాత వావిలికొలను సుబ్బారావు, కందుకూరు ఈ సాహిత్య సమరంలో దిగినారు. వాద ప్రతివాదాలు ఔచిత్య సీమల అతిక్రమించినా, ఇప్పటి విప్లవవాదుల బూతులతో పోల్చిచూచిన సొబగే అవుచున్నవి. తిరుపతి వేంకటకవులు దేశమందంతటా షికారువిహారంచేసి, భాషాభిరుచిని ప్రజల మానసములలో ఊరించినా, వారి విమర్శనలు చిట్లిన పిడుగులే గాని, సహానుభూతితో వ్రేలుబెట్టి, క్రొత్త త్రోవల వైపుకు చూపరైరి. వారు భాషకు పట్టించిన 'శనిగ్రహము' చాలకాలం వదలిపెట్టలేదు.

వాడుక భాషావాదంతో గిడుగు శ్రీ రామమూర్తిగారు చదువుల గరిడీలోదిగి, సాంప్రదాయిక పండితులనందరిని తూర్పారబటి, ఆ కృతకభాషను తప్పులు లేకుండా వ్రాయును అబ్బులు లేచిరావాలని తన వాదాన్ని ప్రకటించినారు. కాని, ఇది తులాదండము అటు ఇటు మొగ్గకుండా బాగోగులు రెంటిని సృజనాత్మకంగా చెప్పిన సహృదయ సరస ఫక్కి కాలేక పోయినది. వీరందరు ఇంగ్లీషు భాషాపండితులైనా నూతన విధానాన్ని చేపట్టకపోయినారు. ఈనాటి విలువల చూపుతో వెల మదింపుచేసి చెప్పిన వీటికి ఈ సాహిత్యశాఖలో స్థానము ఉండనే ఉన్నది.

**నూతన ప్రపత్తి**

ఈ కొత్తదారి చూపేపనిగా కట్టమంచి రామలింగారెడ్డికోసరం ఆంధ్ర కవితాలోకం కనిపెట్టుకొని ఉండినది. ఆయన 'కవిత్వ తత్త్వ విచారము' ఆంధ్ర సాహిత్యమున తులనాత్మకమైన ప్రథమ సహేతుక విమర్శా గ్రంథము! సాంప్రదాయిక భిత్తికలకు గండ్లు గొట్టి, ఉదార భావైక్యతను చెరనుండి విడిపించినది - ఈ పుస్తకము. ఇంగ్లీషు మహాకవుల భావశబలతో తిక్కన వేమన పింగళి సూరనల రసమయ రచనలను పోల్చి, అందలి మెరుగులకు ముసుగులు దీసి భాసింప జేసినాడు. రెడ్డి ఆనాడు నాటిన ఆ బీజమే నేడు ఆంధ్రసాహిత్య విమర్శక తరువైనది; సారస్వత వన నవోన్మేషమునకు ఆమని అయినది. కాబట్టే 'త్రోవలరయు నవకుమారులకు తోడు గావలయు నీవు రామలింగా వతంస' అని ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు స్వాగత నివాళి ఎత్తినారు. దీని తర్వాత ఎన్నో పిల్ల కవిత్వతత్త్వ విచారములు బయిలుదేరినవి.

**నూతన పద్ధతి :**

ఇదిగో! కొత్తపంథా అనుటేగావి, ఆ వ్రాతలోతుకు దిగి వెదకినా లాభించే వస్తువు పాఠకునికి దొరక కుండినది. అబ్బా! నన్నయ తిక్కనలు ఎంత గొప్పగా వ్రాసినారు! అని ఆశ్చర్యపడిన వారేగాని సారస్యములు ఎత్తిచూపినవారు అంతగా లేరైరి. సంస్కృత మూలంతో పోల్చిచూపి, వీరు ఇందు మించినారు అని 'కంపేర్'చేసి చెప్పితేనేగదా ఈ కవుల గొప్ప వెలుగొందేది. ఒకవానికొకటి సంబంధం లేకుండానే ప్రక్క ప్రక్కనే ప్రత్యేకంగా పెరిగి పరిమళించే 'ప్యారలల్' భావాలు రీతులు ఎన్నో ఉంటవి. విమర్శకుడు వాటిని చూపవలదా? ఊరకే ఎంత బాగున్నది. అనగానే 'కంపారటివ్ స్టడి' అవుతుందా? 'After me the deluge' అనిన నానుడికి సరిగా 'తన చావు జలప్రళయము'—అన్నాడు సుమతి శతకకారుడు. పరాసుమహావీరుడు — నెపోలియన్ సెంట్ హెలీనా దీవిలో ప్రవాసమనుభవించేటప్పుడు 'I exist, but I don't live' అన్నదానిని, అప్పటంగా తిక్కన ధృతరాష్ట్రునిచేత (కర్ణపర్వం మొదట) 'ఈ ఉనికి ఒక నునికియే' అని పలికించినాడు. ఇట్టి ఆణి ముత్యాలను ఏరి కూర్చవలదా సాహిత్య మాలను. ఇది ఎంతో ఉపకారి కాగలదు.

ఇట్లే పదసారస్యములెత్తి చూపు విమర్శనా పద్ధతిలోగూడ ఒక సొబగు గలదు. 'వచ్చినవాడు

ఫల్గుణు డవశ్యముగెల్తు మనంగరాదు' అని భీష్ము డంటాడు— గోగ్రహణ ఘట్టంలో. ఉత్తర ఫల్గుణీ జయతార; అందు పుట్టినవాడే యీ ఫల్గుణుడు; కాబట్టి అతనిని మనం జయించలేమన్న సూచన భీష్ముడు చేసినట్లు కవి చెప్పినాడు. 'దుర్వారోద్యమ బాహువిక్రమ రసాస్తోక ప్రతాప స్ఫురద్గర్వాంధ ప్రతివీర నిర్మథన విద్యాపారగుల్ మత్పతుల్... మానము బ్రాణముం గొమట తథ్యం బెమ్మెయిం గీచకా' అన్న పద్యంలో కీచకమంటే వెదురు—ఆ వెదురు బొంగును వలెనే నిన్ను సులభంగా విరిచివేస్తారని ద్రౌపది చెప్పినట్లు కవి సూచించుట, ఆయన పాండిత్య ప్రకర్ష. ఇట్లా వివరించే ఈ పనికి పూనిన వ్యాఖ్యానా లున్నవి గాని, విమర్శకులు ఇట్టివాటిని చూపకనే విమర్శ లంటున్నారు.

**ఆధునిక యుగం :**

ఈ యుగాన్ని భారత స్వాతంత్ర్యానంతర కాల మనుకొందాం. గ్రంథాలకు ఉపోద్ఘాతాలు — అవతారికలు— పీఠికలు— మున్నుడులు మొదలైన పేర్లతో ఈ విమర్శక ప్రక్రియ, ఇంతకుముందే వావిళ్లవారి ప్రచురణాలతో ప్రారంభమైన దనవచ్చు. ఒకటి రెండు అంశాలను ఎత్తిచూపే ఈ అలవాటు క్రమంగా ఎదిగినది. దీనినే ఆనంద ముద్రణాలయ గ్రంథాలలో తేవప్పెరుమాళ్లయ్య (దేవరాజసుధి) చేపట్టినా విరివి కాలేదు. ఇది ఇంగ్లీషు సంప్రదాయం సంక్రమింపజేసిన సత్ఫలితం. బెనార్డ్‌షా తన అసలు నాటకాలకంటే పెద్దవిగా ఉపోద్ఘాతాలు వ్రాసేవాడని ప్రతీతి. ఇప్పుడు ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ వారు ప్రబంధాలను ఈ పీఠికల కొరకే ప్రచురించుట ఒక ప్రత్యేకత. ఇందు కవిని గురించి కవితను గురించి, అన్ని కోణాలలో చర్చించి భాషాభివృద్ధికి తోడ్పడ జేస్తున్నారు. అకాడమీ పెట్టిన పోటీలలో ఉత్పన్నమయ్యే విమర్శక గ్రంథాలు చాలా ఎన్నదగి ఉన్నవి. అధునాతన విమర్శా లక్షణాలన్నీ వీటిలో ఇమిడి పోతున్నవి. కాశీనాథుని నాగేశ్వరరావు సాగించిన 'ఆంధ్ర గ్రంథమాల' గ్రంథాలలో గూడ ఈ అవతారికలు లెక్కలోనికి వచ్చినవి. ప్రతి గ్రంథకర్త సొంతంగానో, ఇతరుల చేతనో ఈ వివరణములనుచేసి, చేయించి మూలగ్రంథానికి జత చేస్తున్నారు. ఇవి కవితావస్తువును రీతులను సమీక్షించి ఆ గ్రంథావగాహనకు పాఠకునికి ఎంతో ఉపకరిస్తున్నవి. ఇందు ఈ విమర్శక పద్ధతి ప్రస్ఫుట రూపాన్నిదాల్చిన దనవచ్చును. కొన్ని సందర్భాలలో పుస్తకాన్నిగూర్చి కవిమిత్రులైన పండితులు పరిశీలకులు ఇచ్చే యోగ్యతా పత్రములు చాలవరకు మితిమీరిన భట్టుపొగడ్తలుగానే ఉండుట భాషా దౌర్భాగ్యమనక తప్పదు. మొగమాటంతో వీరు చదువరికి మొగం మొత్తేటట్లు చేస్తున్నారు. ఇట్లే కొన్ని పత్రికలలో అనుశీలనలుగూడ, ముష్టాతికా ముష్టిసం మొగమాటపు వ్రాతలుగానే ఉంటున్నవి. ఈ పద్ధతి భాషాభివృద్ధికి వాంఛనీయం కాదేమో !

**సాహిత్య పత్రికలు :**

గడచిన యాభై ఏండ్లలో పుట్టి, ఇంకా వర్ధిల్లుమన్న కొన్ని మాసపత్రికలు ఈ ప్రక్రియకు ఎంతో ప్రోత్సాహమిచ్చి వృద్ధికి కారణభూతమైనవి. ఇందు 'భారతి' సేవ అద్వితీయమనవచ్చును. ఇది పరువు పేరుతో పని స్వర్ణోత్సవం చేసికోవడం ఆంధ్రలో అరుదైన విషయం. కోలవెన్ను రామకోటీశ్వరరావు కొంతకాలం నడిపిన 'జయంతి'గూడ మంచి పనిచేసినది. బందరునుండి వెలువడిన 'శారద'గూడ బ్రతికినంతే కొంత ఉపకరించి యుండేది. డాక్టర్ పి. వి. రాజమన్నారు 'కళ' నూతనోత్సాహాన్ని ఇచ్చినది. 'ఆంధ్ర సాహిత్య పరిషత్తు పత్రిక' కేవలం పాతపుస్తకాల ప్రచురణకే ప్రాధాన్యమిచ్చినది. ఆంధ్ర పత్రిక ఎప్పుడో అరవైయేండ్లనాడు ప్రారంభించిన 'ఉగాది సంచికలు' వార దిన పత్రికలోని ఆదివార 'సారస్వతానుబంధము' విమర్శక వ్యాసాలకు ప్రోత్సాహమిచ్చి, నవకవుల ఒద్దిక వ్రాతలకు చోటిచ్చి కవులను జేసినది. ఈ సారస్వతానుబంధం నేడు ప్రతిదిన పత్రికకు ప్రముఖాంగ మగుట ప్రశంసించదగిన విషయము. అయినప్పటికిని యీ విధాన కీర్తిమూర్తికి ముఖం ఇంకా బాగా ఏర్పడలేదు.

అధునాతన వారపత్రికలు చాల వాటిలో కథలకు కథానికలకే ప్రధానస్థానమిస్తున్నవి. సారస్వతమునకుగూడ కొంత చోటిచ్చిన బాగుంటుంది.

**సిద్ధాంత వ్యాసాలు**

ఇదిగాక, నేడు డాక్టరేట్ పట్టమునకుగాను వ్యాసములు ఎక్కువగా బయలుదేరుచున్నవి. వీటిలో

# "స్వర్ణ" భారతికి

# "లావణ్యా" శుభాకాంక్షలు



నిర్మాణంలో

లావణ్యా పిక్చర్స్ వారి

# అనగనగా ఒక తండ్రి

| | |
|---|---|
| గుమ్మడి | సావిత్రి |
| కృష్ణంరాజు | భారతి |
| నాగభూషణం | విజయలలిత |
| రాజబాబు | సూర్యకాంతం |
| అల్లు రామలింగయ్య | రమాప్రభ |
| గిరిబాబు | రోజారమణి |

డైరెక్టరు ... సి. ఎస్. రావు
సంగీతం ... చక్రవర్తి
కెమెరా ... జి. కె. రాము
మాటలు ... దాసం గోపాలకృష్ణ
కథ, నిర్మాత ... మహేష్

యథార్థ విమర్శనములు, మంచి చెడ్డల ఏర్పరచి చెప్పుట, చరిత్రాంశముల చర్చించుట, నూతన సిద్ధాంత సూత్రములను పోల్చి చెప్పుట బాగా వ్రాయబడుచున్నవి. ఇవే ఈ యుగంలో భాషా విమర్శక స్వభావం కలిగి, ఈ నూతన విధానాన్ని ఆంధ్ర భాషాలక్ష్మికి పూజా పుష్పములుగా సమర్పించి మాన్యపరుపబడుచున్నవి. ఇది విపుల విషయఖనులు. వీటిలోగూడ కొన్ని చులకన విషయములపై వ్రాయబడి ఆ సాహిత్య విమర్శస్థాయికి రాలేకపోతున్నవి. దేవుని భూచక్ర గొడుల ప్రక్కననే చిన్నగొడుగులు పుట్టగొడుగులుగూడ ఉండటం సహజమే! ఈ థీసిసు వ్రాతగాండ్రలో పేర్కొన్నదగిన పెద్దలు.

దివాకర్ల వెంకటావధాని (ప్రాగ్వన్నయయుగం) బి. రామరాజు (యక్షగానం) యశోదారెడ్డి (నాచన సోమన) రామకోటిశాస్త్రి (తిక్కన) టి. కోటేశ్వరరావు (ఆముక్తమాల్యద) శ్రీరామమూర్తి (శ్రీనాథ) తూమాటి దొణప్ప (తెనుగు వెలుగులు, వ్యాసావళి) జి. వి. సుబ్రహ్మణ్యం (ప్రథమాంధ్ర పురాణం) ఎస్వీజోగారావు (యక్షగానం) కె. వి. ఆర్. నరసింహం (సాహిత్య దర్శనం) .అమరేశం రాజేశ్వరశర్మ (ఆంధ్ర వ్యాకరణ వికాసం) జీరెడ్డి చెన్నారెడ్డి వ్యాసం అచ్చయినంతవరకు ఎన్నదగి ఉన్నవి. మరికొన్ని సిద్ధాంత వ్యాసాలు అచ్చుకావలసి యున్నవి.

**విమర్శక పండితులు :**

విమర్శక పాటవము గలిగిన చాలమంది పండితులు ఈ శాఖలో గణనీయ కృషిచేసి ఖ్యాతిగాంచి యున్నారు.

వారిలో కొందరు: పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి, కురుగంటి సీతారామయ్య, బండారు తమ్మయ్య, తాపీ ధర్మారావు, దువ్వూరు రామిరెడ్డి, మొదలగు పరమపదించినారు. ఇంకను రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, ఆండ్ర శేషగిరిరావు, వేదం (చిన) వేంకటరాయ శాస్త్రి, నేలటూరు రామదాస అయ్యంగార్, నేలటూరు వెంకటరమణయ్య, దీపాల పిచ్చయ్యశాస్త్రి, పుట్టపర్తి నారాయణాచార్యులు, నిడదవోలు వేంకటరావు, ఆర్. ఎస్. సుదర్శనం, కొత్త సత్యనారాయణ మొదలగు మహామహులు అనేక కవుల రచనలపై మంచి విమర్శనలు వెలువరించి ఉన్నారు. వీరందరికిముందు కోరాడ రామకృష్ణయ్య, మానవల్లి రామకృష్ణకవిగారలు ఈ శాఖలో మొదటివారనవచ్చును; అంటే మిగతవారిని క్రించు చేయడం కాదు.

**ప్రత్యేక సంచికలు :**

ఈ నూతన చైతన్య ప్రభావం క్రింద, ఇంగ్లీషు పలుకుబడి వలన, కొన్ని ప్రత్యేక సంచికలు—విశేషాంకములు (సోవినీర్సు) సంకలనం గావింపబడినవి. వీటిలో చరిత్రాంశాలతోబాటు, వాఙ్మయ రీతుల వివేచనం శాస్త్రీయరీతులలో జరిగినది. పలువురు పెద్దలు వ్రాసిన ఈ వ్యాసాల సంపుటీకరణం భాషాయోషకు నిండు తొడవులైనవి. ఆ సంచికలలో ఎన్నదగినవి:— విజయనగర సామ్రాజ్యసంచిక, రాజరాజ నరేంద్ర పట్టాభిషేక సంచిక, కళింగసంచిక, కాకతీయ సంచిక, రెడ్డిసంచిక, శాతవాహనసంచిక మొదలగునవి. ఆంధ్ర భాషావిరోధి— నైజాం ఏలుబడిలో ఆంధ్ర సాహిత్య ధ్వజమును నిలిపిన బహుముఖ ప్రజ్ఞాశాలి సురవరం ప్రతాపరెడ్డి సంకలనంచేసిన గోలకొండ కవుల సంచిక, ఆయన కవితావిమర్శలు పేర్గాంచినవి.

**భాషాతత్త్వ శాస్త్రము :**

నేడు వాఙ్మయరంగంలో భాషాతత్త్వ శాస్త్ర పరిశీలనము (లింగిస్టిక్సు) వికాసస్థితిని అందుకొనుచున్నది. ఈ విమర్శలు వైద్యుడుచేసే శారీరక పరీక్ష వంటిది, అయినా ఈ సద్విమర్శ భాష సర్వతోముఖాభివృద్ధికి పట్టుకొమ్మ కాగలదు. ఈ శాస్త్రమున డా. భద్రిరాజు కృష్ణమూర్తిగారు పేరెన్నిక గాంచి, ఆంధ్రకీర్తి చంద్రికలను ఖండాంతరములయందుగూడ ప్రకాశింపజేయుచున్నారు.

మున్ముందు ఈ విమర్శకపద్ధతి నవ్యమార్గాల ద్రొక్కి ఆంధ్రిని సేవించగలదని నిండు నమ్మకము.

———

# మీనాక్షీస్తవం

శ్రీ వేదము వేంకటేశ్వర శర్మ

త్వాం మీనాక్షి జటాటవీ పరిలుఠద్గంగాం ప్రియస్య ప్రియాం
దృష్ట్వా క్రోధవినమ్ర లజ్జితముఖీ భూత్వైవ భాగీరథీం
సద్య శ్శీర్షచరీం నిపాత్యకలహం కృత్వా ప్రియేణ క్రుధా
త్వద్దృష్టే ర్నపురో నివేశయసి కిం హాలాస్యనాథ ప్రియే

మహాదేవి త్వం చా కథిత లలితాకార సుషమా
పరీవాహీ భూతాం తుహినగిరి కన్యే నిజ తనుం
విలాసార్థం పాండ్యే మధురపుర నామాఖ్య నిగమే
త్రిబీజార్థీ భూతాం ప్రణతజన రక్షార్థ మకరో:

త్వదాజ్ఞాం ధృత్వా వై కమల భవనస్సృష్టి మకరోత్
మహావిష్ణు శ్శ్రీశో నత జనసమాజం తు సతతం
అరక్షచ్ఛ్రీకంఠో వ్యపరిమిత నాశం తు కురుతే
విరించోపేంద్రేశా స్తవనుతి పరా మీన నయనే

త్వ ద్దృష్ట్యాసి ద్వితనుతే నిజరాజ్యభారం
త్వద్దృష్టిరేవ సతతం పరిపాతి భక్తాన్
త్వద్దృష్ట పూరుషవశాహి సదాతు ముక్తి:
త్వన్నేత్రయోర్న హి సమామృగదృక్ చలాపి

త్వం దక్షస్య సుతాసి దేవి తదహంకారంతు పంవీక్ష్యతం
త్యక్త్వాగ్నౌ నిజదేహ ధారణవిధౌ నీహారశ్శైలం శ్రితా
తత్రాపీశ్వర తోషణం తు వహిచే త్యాశ్రిత్య కన్యా భవ:
ధీ పాండిత్య పరాత్తు పాండ్యమహిషా జ్ఞాతాసి మీనాంబికే

మీనాక్షీం పరిచిన్తయామి మనసా శ్రీబిందుమధ్య స్థితాం
ధ్యాయామ్యన్వహ మాదిచక్రనిలయాం శ్రీసున్దరేశ ప్రియాం
షట్చక్రోపరి సంస్థితాం సుఖకరీం శ్రీశాం పరాం దేవతాం
నీపారణ్య నివాసినీం చ మధురాపూర్ణాయికాం శ్రీ శివాం

త్వన్నాసికాగ్ర విలస న్నవ నాగరత్న కాంతి:
తటిత్ స్ఫురిత దిక్తట కాంతి రమ్యా
జ్యోత్స్నావిలాసి రజనీవ విభాతి భూమి:
ప్రాహ్ణాపి సుందరప్రియేశ్వరి పాండ్యకన్యే

మీనాక్షి తావక శినూతన నాగరత్న
కాంతి ర్త్రిశో ధవళతా మనుయచ్ఛతీతి
శ్రుత్వా భవాని విధురేవ విరస్త ధైర్య:
త్వత్పాదమూల వఞరోహి బభూవ దీవ:

యన్నా మామృత పానమత్త హృదయా నిత్యం సనందాదయ:
సౌందర్యాధిక వర్ణ్యరూప విభవాం స్తుత్యాఖిలేశీం పరాం
జాతాస్స్వచ్ఛ సువర్ణకాంతవపుషో బ్రహ్మాది దేవాస్సదా
తాం ధ్యాయే పరదేవతాం సురనుతాం మీనాంబికాం త్ర్యక్షరీం

శక్త్యాహీన జనాస్తు నిత్యమపి యాం ధ్యాయన్తి సర్వేశ్వరీం
యత్కారుణ్య కటాక్ష లేశజనితా నందాస్త్య మన్దాంముదం
ప్రాప్యోచ్చై ద్విపదస్తరన్తి కమలా కాంతాది సంపద్వృతో
హ్యానందామృత వాహినీం భజతభో మీనాంబికా రూపిణీం

నిత్యం చోపనిషత్పరాయణ పరా: తస్యార్థ సంచిన్వకా:
భాష్యాది త్రయ శాస్త్రినోపిచ సదా త్వన్నామ విస్మారకా:
జ్ఞానం కుత్ర మహేశి కాంశ్చ నికషే వ్యాప్య తావేవ తే
స్మృత్వా పాదయుగౌ తరన్తి జననం మీనాక్షి తౌరక్ష్య తావ్

పుష్పార్థం చ జలార్థమంబ సపున స్స్నానార్థ మత్యాదరాత్
మన్త్రార్థం చ ఫలార్థమానిశ మతి క్లిశ్నాతి మూఢాత్మక:
దంభార్థం జనవంచనార్థమపి నో కార్యం సదా త్వజ్జపాత్
స్వచ్ఛే నిశ్చల ధీః ప్రభాతి సతతం ధ్యాయామి మీనాంబికే

నాగాస్సప్తవసన్తి తే తవధవ స్యాష్టోతు నాగోమణి:
నాసాగ్రే తవచాస్తి దేహమఖిలం పత్యుర్హి నాగాత్మకం
నాథస్యాస్తి కఠోర దాహక విషం తేనాస్తి మాతర్విషం
తస్మాత్తేధికతా సుధాస్తి పృథుకస్యా దేహి మే తత్సుధాం

త్వం నాథస్యతు కేళికాసు చ భవానీ రూపిణీత్యుచ్యసే
క్రోధే తామస రూప ధారిణి సదా త్వం కాళికే త్యుచ్యసే
రక్షాయాం పురుషత్వమేసి చ తదా త్వం విష్ణురిత్యుచ్యసే
దుర్గే త్వేవతు నామ యుద్ధసమయే మీనాక్షి చాతుర్విధమ్

నీవారశూక మివ నీలమణీవ సూక్ష్మ
న్తైర్యేపరీత మతిసూక్ష్మ తమాతి సూక్ష్మం
హేతేస్తు మధ్యగతమంబ తవాతి సూక్ష్మ
రూపంతు వేదితు మిహోద్యతు కస్య శక్తి:

మీనాక్షీపరిచింతనేన మనుజ: కష్టాద్విముచ్యేతయ:
తస్యానంత్య గుణాభిరామ ముదయే త్తస్మాత్తు భక్తిర్దృఢా
భక్త్యా నామజపం కరోతి సతతం నామ్నాం జపావృత్తివా
చిత్తం దార్ఢ్యయుతం భవే దచలనా చ్చిత్తస్య ముక్తిర్దృఢా

# భారతీయ రాజరిక వ్యవస్థలో ప్రజల పాత్ర

## శ్రీ పి.వి. పరబ్రహ్మశాస్త్రి

ప్రభుత్వమనేది ప్రజాపరిపాలన కొరకేర్పడిన అధికారమును తెలుపును. పూర్వము భారతదేశమునందు అనేక ఇతరదేశములందు ఈ యధికారము రాజులచే నిర్వహింప బడెడిది. ప్రస్తుత ప్రజాపాలన విధానములో తమను తామే ప్రజలు పరిపాలించుకొనెదరు. ఈ విధానమే అనేక దేశములందు నడుస్తున్నది. మన భారతదేశమునందు కూడ ప్రస్తుతము అట్టి ప్రజాపాలనమే సాగుచున్నది. బలాబలములను ప్రదర్శించి యధికారము చేజిక్కించుకొనుట పూర్వపు రాజరికములోను, ప్రస్తుతపు ప్రజాప్రభుత్వములోను, ఇంకా నియంతృత్వము వంటి యితర విధానములలోను భిన్నరీతులలో కనుపించినప్పటికి తుదకు బలవంతునిదే పాలనాధికారము. అట్టిబలప్రయోగము చేయలేని ప్రభుత్వము దుష్టులనుండి ప్రజలను రక్షింపజాలదు. అట్టి ప్రజారక్షణ కొరకంగీకరింపబడిన బలప్రయోగము ప్రజలను పీడించుటకై దుర్వినియోగము కాగూడదని ప్రభుత్వ విధానాల్లో అనేక మార్పులు ప్రపంచమంతటా జరుగుతునే యున్నవి. పూర్వము భారతదేశమందు నడుస్తూ వచ్చిన రాజరిక విధానము, ఆ వ్యవస్థలో సామాన్య ప్రజలకెట్టి సంబంధముండెడిది అను విషయములను గూర్చి మన గ్రంథముల ద్వారాను, శాసనముల ద్వారాను కొంత తెలుసుకొన యత్నించెదము.

చరిత్రను ఇతిహాసమనికూడ అందురు. 'ఇతిహాస'మను దానికి మన ప్రాచీనులు కొన్ని నిర్వచనములు చెప్పిరి. ధర్మార్థ కామమోక్షములనే పురుషార్థముల నుపదేశించుచు పూర్వవృత్తమును కథారూపముగ చెప్పుట ఇతిహాస మనబడునని సంగ్రహముగా పురాణ వాఙ్మయములో తెలియవచ్చును.

'ధర్మార్థ కామ మోక్షాణాం ఉపదేశ సమన్వితమ్,
పూర్వవృత్తం కథాయుక్తం ఇతిహాసం ప్రచక్షతే॥

ఇంక కౌటిల్యుని నిర్వచనం 'పురాణ మితివృత్త మాఖ్యాయి కోదాహరణం ధర్మశాస్త్రం మర్థశాస్త్రంచ' ఇతి ఇతిహాసః॥ (అర్థశాస్త్రం 2 వ ప్రకరణము) అంటే పూర్వము జరిగిన వృత్తాంతమును కథారూపము నను, ఉదాహరణ రూపమునను, ధర్మమును బోధించుచు రాజనీతిని, అర్థశాస్త్రమును కలిగి యుండునది ఇతిహాసమని యర్థము. ఇచట 'అర్థశాస్త్ర'మను పదముచే రాజనీతి, అర్థశాస్త్రములు గ్రహింపబడినవి. అట్లే 'ధర్మశాస్త్ర' మను పదముచే మతసంప్రదాయములు, సాంఘిక విషయములు గ్రహింపబడును. కనుక రాజనీతిని అర్థ విధానమును, మతసంప్రదాయమును, సాంఘిక విషయములను, మానవనీతిని చెప్పుట ఇతిహాసము లేక చరిత్ర అనబడుతుంది. ఇందు గమనించవలసిన ముఖ్య విషయం భారతీయచరిత్ర యితరదేశ చరిత్రల కంటె భిన్నముగ ధర్మమనే కట్టు గట్టు చుట్టూ తిరుగుతుంది. అది వైదిక ధర్మముగాని, బౌద్ధ ధర్మము గాని, జైన ధర్మముగాని, శైవముగాని, వైష్ణవము గాని, వర్ణాశ్రమ ధర్మముగాని, ఉదాహరణకి బౌద్ధ ధర్మ విశేషాలు లేకపోతే యిక్ష్వాకుల నాటి ఆంధ్రదేశ చరిత్ర శూన్యమే గదా. శాంతమూలుడు, వీరపురుషదత్తుడు అనబడే కొందరి రాజుల పేర్లు తెలిసినంతమాత్రంచేత చరిత్ర కాజాలదు గదా. కొన్ని బౌద్ధ అవశేషాలు, శాసనాలు కనిపించుచున్నవి గనుక అప్పటి సాంఘిక స్థితిని, మత స్థితిని తెలుసుకొనగలుగుచున్నాము. హరప్పా, మొహంజదారో, మున్నగు చోట్ల దొరికిన పురావస్తువులను బట్టి ఆ కాలాని కొక చరిత్రను వ్రాయగలుగుచున్నారు. కనుక రాజుల పేర్లు తెలిస్తేనే చరిత్ర నిర్మించబడుతుందనుకొనరాదు. అట్టి పేర్లేమి తెలియకపోయినా ఆనాటి సాంఘిక చరిత్రను మత చరిత్రను వ్రాయవచ్చును. భారతీయ సంస్కృతిలో ధర్మ మనేది రాజకీయాలతో పూర్తి తెగతెంపులు చేసుకోకపోయినా రాజకీయాల మీదనే పూర్తిగా ఆధారపడలేదు. అది ప్రజా జీవితమునకు చెందిన వ్యవస్థ. రాజులు చాళుక్యులైనా, కాకతీయులైనా, రెడ్లయినా, విజయనగరం రాజులైనా తుదకు మహమ్మదీయులైనా సంఘ జీవనంలో ధర్మానికి విశిష్టస్థానం ఉంటూనే వచ్చింది. కనుక భారతీయ ప్రాచీనేతిహాస గ్రంథములు ధర్మంతో

గూడిన చరిత్రను తెలుపును. వాటిలో రాజకీయాంశ ములు అప్రధానంగా కనుపించును. ఆంధ్ర శాతవాహ నుల చరిత్ర నాలుగు పురాణాల్లో చెప్పబడింది. అయి నను వాటివల్ల మనకు నిర్దిష్టమగు శాతవాహన వంశక్రమము తెలియదు. శాసనాధారాలు తగినంతగా లభింపకపోవుటచే ఆనాటి రాజకీయ చరిత్రను స్పష్టంగా తెలుసుకొనలేకపోవుచున్నారు. ధర్మ విషయ ములకే ప్రాధాన్య మిచ్చిన ఆనాటి యితిహాస కర్తలు రాజకీయ విశేషముల నుపేక్ష చేసిరి.

ఇంతేగాక భారతీయ రాజరిక మనేది ధర్మరక్షణ కొరకేర్పడిన వ్యవస్థ యని ధర్మశాస్త్రము, భారతాది యితిహాసములు, అనేక సందర్భములలో చెప్పును. అంత టితో గాక 'రాజా రాష్ట్ర కృతం పాపమ్' అని రాజ్యంలో జరిగే అధర్మాల కంటికి రాజే పాపాన్ని అనుభవిస్తాడని కూడ జెప్పబడెను. దుష్టశిక్షణ, శిష్టరక్షణయే రాజరికమునకు పరమాశయమై యున్నట్లు శాసనాల్లో కూడ కనుపిస్తుంది. విజయ నగరరాజ్య స్థాపన హైందవ మతమును రక్షించుట కొరకేర్పడినదని మనకు తెలుసు. పల్లవరాజ్యము కూడ వైదిక ధర్మము నుద్ధరించుట కేర్పడినదియే. ఈ సందర్భమున ప్రాచీన పల్లవశాఖకు చెందిన విష్ణుగోప మహారాజుయొక్క ప్రశస్తి నుదహరించెదను.

'మహారాజస్య శ్రీ స్కన్దవర్మణః పుత్రస్య భగవ ద్భక్తి సద్భావ సమ్భావిత సర్వకల్యాణస్య ప్రజా నం రంజన పరిపాలనోద్యోగ సతత సత్రవ్రత దీక్షితస్య అనేక సమర సాహసావమర్దలబ్ధ విజయ యశః ప్రకాశస్య కలియుగ దోషావసన్న ధర్మోద్ధరణ నిత్య సన్నద్ధస్య రాజర్షి గుణసర్వ సన్దోహ విజిగీషోః ధర్మ విజిగీషోః భగవత్పాదానుధ్యాతస్య పరమ భాగవతస్య భారద్వాజస్య పల్లవానాం యువ మహారాజ శ్రీ విష్ణుగోపస్య.........'[1]

ప్రజలను బాగుగ రంజింపజేయుచు పరి పాలించుటయనెడి యుద్యోగము వేల సంవత్సరములు అవిచ్ఛిన్నముగ నాచరింపబడు సత్రయాగ దీక్ష వంటిది. యజమాని, ఋత్విక్కులు వేల సంవత్స రములు జీవించకున్నను వారి స్థానాల్లో కొత్తవారు వస్తూ యాగమును నడిపించునట్లు రాజులు ప్రజా పాలనమనే యాగాన్ని దీక్షగా నిర్వర్తించవలెనని భావము. కలిదోషముచే క్షీణించుచున్న ధర్మము నుద్ధ రించుటకై నిత్యసన్నద్ధుడైన విష్ణుగోపుడట్టి దీక్షను నిర్వహించుచు తనను 'ధర్మవిజిగీషోః' అని సగర్వముగా జెప్పుకొనెను. ఆ నాటి పరిపాలకున కుండవలసిన లక్షణము లిందు సంక్షిప్తముగ జెప్పబడినవి. అనేక మంది రాజులు తమ ప్రశస్తుల్లో నిదే విధముగ వ్రాయించుకొని యున్నట్లు శాసనములద్వారా మనకు తెలుస్తుంది. ఇవి కేవలం ఘనతకొరకు వ్రాయించు కొన్న ప్రశస్తులేగాని నిజముగ ప్రజానురంజకముగ రాజ్యములేలిన రాజులు చాల తక్కువమటకు వీలులేదు. వ్యక్తిగతముగ తానెట్టి అక్రమములనైనాచేసి సింహా సన మెక్కినను, రాజైన తర్వాత ధర్మబద్ధముగ ప్రజలను పాలించి వారి మన్ననను పొందవలెను. అట్టి వాడు కానిచో దీర్ఘకాలము అధికారమును సాగింప జాలడు. ప్రజలయొక్క ధర్మమును కాపాడుటకే రాజధర్మము లేక రాజనీతి యేర్పడినది. పై ప్రశస్తి వంటివి కేవల ముత్కర్షకొరకు వ్రాసినవమకొన్నను, విజయనగర సామ్రాజ్యము వంటివి హైందవ ధర్మ రక్షణ కొరకే స్థాపించబడినవని అందరు అంగీకరించిన విషయము. కృష్ణదేవరాయ విరచితమగు ఆముక్త మాల్యద రాజనీతి ప్రకరణములో నిట్లు చెప్పబడెను.

'ఏ పట్టున విసువక ర
క్షా పరుడవు గమ్ము ప్రజల చక్కి, విపన్ను
ల్గా పెట్టిన విని తీర్పుము;
కా పురుషుల విూద నిడకు కార్యభరంబుల్.'[2]

కనుక రాజరికమనేది సామాజిక ధర్మమును కాపాడుట కేర్పడిన వ్యవస్థ. రాజనీతి గ్రంథములన్నీ ప్రజావ్యవస్థలను నియమించు ధర్మశాస్త్రానుగుణంగా రచింపబడినవి. ఈ యంశము నింకను స్పష్టముగా చెప్పియున్నారు. ఏ సందర్భములోనైనా రాజనీతికి సామాజిక ధర్మమునకు పరస్పర వైరుధ్యము వచ్చిన యెడల ధర్మమునకే ప్రాధాన్య మొసగబడెను.

'యత్ర విప్రతిపత్తిః స్యా
ద్ధర్మ శాస్త్రార్థ శాస్త్రయోః ।

1. ఎపిగ్రాఫియా ఆంధ్రికా. I. P. 1?
2. ఆముక్తమాల్యద. ఆ. 4. 204.

అర్థ శాస్త్రోక్త ముత్సృజ్య
ధర్మశాస్త్రోక్త మాచరేత్'॥.

నారద స్మృతి : I. 39.

**స్మృత్యో ర్విరోధే న్యాయస్తు**
బలవాన్ వ్యవహారతః ।
అర్థ శాస్త్రాత్తు బలవ
ద్ధర్మశాస్త్ర మితి స్థితిః॥.

యాజ్ఞ. స్మృతి II. 21.

రాజులు తమ యధికార బలముతో ప్రజలను పీడించుదురనెడి భయముతో చేసిన వ్యవస్థ యిది. ఈ వ్యవస్థనుకూడ అతిక్రమించి వ్యవహరించే రాజులుంటే మంత్రి పురోహితాదులు వారినెప్పుడు మందలించుచునే యుందురు. రాజరిక వ్యవస్థలో మంత్రికి రాజనీతి విషయంలోను పురోహిత, ప్రాడ్వివాకులకు ధర్మన్యాయములందును సర్వాధికార మొనగబడి యున్నది. సన్ధివిగ్రహి, పెర్గడ, మహాప్రధాని, ప్రధాని, సర్వాధికారి, మున్నగు, అధికార నామములతో అనేకమంది రాజోద్యోగులు శాసనములందు కనిపించుదురు. ఈ యధికారులకు ఏయే కాలంలో ఎంతెంత అధికారమున్నది తెలుసుకొనుట కొంత కష్టమే యగును. కొంతకాలం గడిచిన తర్వాత ఈ యధికారుల వంశములోనివారుకూడ తామా పదవిలో లేకున్నను, తమ పేర్లముందు ప్రధాని, పెర్గడ, ఇత్యాది బిరుదలనుంచుకొనుట మామూలు. ఇది విషయాంతరము. పై చర్చవల్ల తేలిందేమనగా సమాజ ధర్మమును కాపాడుటకు రాజు, అమాత్యుడు, పురోహితుడు, ప్రాడ్వివాకుడు అనువారు సమిష్టిగా పాటుబడవలయునని. అయితే ప్రజలయొక్క మంచి చెడులు రాజు, రాజాశ్రితులైన కొంతమంది పెద్ద అధికారుల చేతుల్లో వుంటుంది కనుక వీరు జనపదాలో (గ్రామాల్లో) నివసించు సామాన్య ప్రజల యోగక్షేమాలను కనిపెట్టి రాజ్యపాలన చేయుదురనుకొనుట సందేహమే. కనుక ప్రజలే అనేక విధములగు సంఘముల నేర్పాటు

ESTD. 1964 Phone : 77016

**SUNDARAM ELECTRICALS**
**GANDHINAGAR : Opp. Taluk Office**
**VIJAYAWADA-3.**



**Dealers in All Kinds of Electrical Goods**

**Customer's Satisfaction is Our Motto**

చేసుకొని వాటిద్వారా అనేక ప్రయోజనములను నెర వేర్చుకొనుచుండెడివారని కొన్ని శాసనములలో నిదర్శనములు కనిపించును. నాటిలో కొన్ని సంఘములు రాజుచే నిర్మింపబడుటగాని లేక ఆమోదింపబడుట కాని కలదు. వర్తక సంఘములు, న్యాయసభలు కొన్ని అధికారములతో రాజుచే నిర్మింపబడెడివి. న్యాయ విచారణ కొరకేర్పడు సభనుగూర్చి రాజనీతి రత్నాకరమందీ విధముగ జెప్పబడెను.

ప్రతిష్ఠితా ఽప్రతిష్ఠితా సుముద్రితా శాసితా సభా।
చతుర్విధా సభా ప్రోక్తా సభ్యాశ్చైవ తథా విధాః॥
ప్రతిష్ఠితా పురే గ్రామే నానాగ్రామే ఽప్రతిష్ఠితా।
ముద్రితాధ్యక్ష సంయుక్తా రాజయుక్తా చ శాసితా॥

(రాజనీతి రత్నాకరే, సభ్యనిరూపణమ్—5]

పుర గ్రామము (రాజగ్రామము)లో నేర్పాటు చేయబడిన సభను ప్రతిష్ఠితసభయందురు. ఇతర గ్రామములందుండు సభలను అప్రతిష్ఠిత సభ లందురు. ఈ రెండును మరల ముద్రితములు, శాసితములు, అని మొత్తం నాలుగు విధములుగ చెప్పబడినవి. ముద్రితములనగా న్యాయాధికారి (ప్రాడ్వివాకుడు) మొదలగు అధికారి అధ్యక్షుడుగా గలవి. శాసితసభయనగా రాజే అధ్యక్షుగా తీర్పు చెప్పు సభ.

ఇట్లే వ్యాపారనిర్వహణకు శ్రేణులు, నకరములు, ఇతర సామూహిక కార్యకలాపముల నిర్వహణకు సమయములు ఉండెడివి. మతసంఘములు కూడ సమయములనబడెడివి. ఆ సమయముల ద్వారానే మత కార్యములు నిర్వహింపబడుచున్నట్లు శాసనములందనేక నిదర్శనములు కనుపించును. పూర్వమందు కూడ పాలనావ్యవస్థ ప్రజలకు దూరము గాక, ప్రజాధర్మము ననుసరించియేయుండెడిది. రాజు న్యాయము దప్పి విపరీత నిర్ణయములు జేయునపుడు సభ్యుడు న్యాయమును తెలియజెప్పి రాజును మందలించవలెనని చెప్పబడెను. అట్లు చేయనిచో సభ్యునిదే పాపమగును. రాజు వినకపోయినను సభ్యుడు న్యాయమును చెప్పి తీరవలయునని ధర్మము శాసించుచున్నది.

అధర్మాజ్ఞాం యదారాజా నియుంజీత వివాదినామ్
విజ్ఞాప్య నృపతిం సభ్యస్తదాకార్యంనివర్తయేత్॥
న్యాయమార్గాదపేతంతు జ్ఞాత్వాచిత్తం మహాపతేః।
వక్తవ్యం తు ప్రియం నాత్ర న సభ్యం: కిల్బిషీ భవేత్॥

(రాజనీతి రత్నాకరము: సభ్య నిరూపణము: 5)

న్యాయము దప్పి తీర్పుచెప్పు రాజునకు చిత్తప్రియముగునట్లు సభ్యుడు పలుక కూడదు. అట్లుగాక రాజుకి ప్రియవాక్యములే చెప్పు సభ్యుడు పాపము నొందును. కనుక పూర్వపు రాజరిక వ్యవస్థలో కూడ సభ్యులకు (న్యాయాధికారులకు) న్యాయమునే చెప్పవలెనని ధర్మశాస్త్రం రక్షణ నొసగెను. అప్పటికిన్నీ రాజుయొక్క అధికార బలమునకు న్యాయాధికారులు గాని ఇతర ముఖ్యోద్యోగులు కాని లొంగి సరిగా పాలించక ప్రజలను పీడించు పరిస్థితి యేర్పడితే అట్టి రాజును వధించవలెనని మహాభారతం అను శాసన పర్వంలో భీష్ముడు చెప్పెను. ప్రజలకు రక్షకుడు కానట్టియు, నాశకుడైనట్టియు, ప్రజలను దోపిడి చేయునట్టియు, నాయకుడు గానట్టియు, రాజును ప్రజలు దయాదాక్షిణ్యములు లేకుండ చంపవచ్చునట.

అరక్షితారం హర్తారం విలోప్తార మనాయకం।
తం వై రాజకలిం హన్యుః ప్రజాః సన్నహ్య నిర్ఘృణమ్॥
అహం వో రక్షితే త్యుక్త్వా యో న రక్షితి భూమిపః।
స సంహత్య నిహంతవ్యః శ్వేవ సోన్మాద ఆతురః॥

(మ. భా. అను. 61. శ్లో: 32, 33)

ప్రజలను రక్షించెదనని శపథము చేసి పట్టాభిషిక్తుడైన రాజు అట్లు రక్షించక పోయినచో ఆ రాజును పిచ్చికుక్కను చంపునట్లు చంపవలెనట. కనుక పాలనావ్యవస్థ రాజరికమైనను, ప్రజాశ్రేయస్సు సంరక్షింపబడుటయే ముఖ్యాశయముగ నుండునట్లు గట్టి నిబంధనలు చేయబడినవి.

ఇంతవరకు రాజనీతినిగూర్చి ఇతర గ్రంథముల నుండి మాత్రమే తెలుసుకొంటిమి. మరి మనకు ప్రమాణబద్ధమైన అంటే శాసనముల ద్వారా చరిత్రలో తెలియునదేమైన ఇట్టి విషయములలోకలదా యను సందేహము కలుగక పోవదు. మధ్యయుగము నాటి దక్కను చరిత్రలో పై చెప్పబడిన కొని

యంశములకు నిదర్శనములు లభించును. కళ్యాణి చాళుక్యుల రాజ్యమును కూలద్రోసి క్రీ. శ. 1156 ప్రాంతమున చాళుక్య సింహాసన మాక్రమించుకొన్న కాలచురి బిజ్జలుడు తన దుర్మార్గమునుబట్టియే వధింపబడెను. సుస్థిరమై ప్రజారంజకముగ సాగుచు సువిశాల సామ్రాజ్యమనిపించుకొన్న వ్యవస్థను ఛిన్నాభిన్న మొనర్చెనే గాని తానేమియు సాధింపలేకపోయెను. పెద్ద రాజనెడి యపకీర్తితో తుదకు నిహతుడయ్యెను. తన వంశమువారి పరిపాలనకూడ తర్వాత పదిహేను ఇరువది సంవత్సరములకు మించి సాగలేకపోయినది. సుస్థిరసామ్రాజ్యమును కూలద్రోయునంతటి శక్తిసంపన్నుడైనను ప్రజలయొక్క ఆగ్రహమునకు గురి కావలసివచ్చెను. ఎట్లు వధింపబడెనను విషయములో సందేహములున్నను చంపబడినమాట సత్యము. రాజకీయకుట్రలతోగూడిన హత్యయనియు చెప్పవీలులేదు. తన బలసామర్థ్యముల లోపమందుకు కారణమనియు చెప్పజాలము. దుష్ప్రవర్తనయే కారణమనక తప్పదు. మతద్వేషమున్నను తప్పించుకోలేని యసమర్థుడు కాడు. ఇదే విధమైన రాజద్రోహముచేసి విజయనగర సింహాసనమెక్కిన సాళువ నరసింహరాయలు అతి విజయవంతముగ సామ్రాజ్యమును కాపాడలేదా? అతనిని రాజద్రోహి యనుటకంటె రాజ్య రక్షకుడనుట చెల్లును. అందువల్లనే ప్రజలు అతనిని గాని అతని పుత్రుని త్రోసిరాజని సింహాసన మాక్రమించి తుళు వంశ స్థాపకుడైన నరసనాయకుని పుత్రుడైన వీరనరసింహరాయలుగాని ప్రజానురంజన మనెడి ముఖ్య రాజలక్షణమునకు తోడైన తమ బలపరాక్రమములలో శత్రువుల నుండి సామ్రాజ్యమును కాపాడగలిగిన మహా ప్రతిభా సంపన్నులు. దీనికి విరుద్ధముగ బిజ్జలుడు తన కాలంలోనే చాళుక్యులు సుమారు రెండు శతాబ్దుల లవిచ్ఛిన్నముగ పోషించి కాపాడిన సామ్రాజ్య వృక్షము యొక్క కూకటివేళ్ళు తెంచివేశాడు. ఒకవైపున కాకతీయులు, ఒకవైపున దేవగిరి యాదవులు, ఇంకో వైపున హొయసలులు, ఇంకోవైపున తనచే పదభ్రష్టులైన చాళుక్య దాయాదులు. వీరిలో నెవ్వరు బిజ్జలుని దుర్మార్గమును హర్షించలేదు. దీనికితోడు ప్రజలలో తన ప్రోత్సాహముతో రేకెత్తిన మత కలహములు, దుష్పరిపాలన. ఇంతకంటె కారణ మేమికావలె రాజహత్యకు? అన్యాయంగా ఆక్రమించుకొన్న రాజ్యాన్ని ప్రజారంజకముగ పాలించుటకై దుర్యోధనుడు వలె కూడ బిజ్జలుడు ప్రయత్నించలేదు.[3]

విషయాంతరమునకు పోవుదము. రాజవ్యవస్థలో ప్రజలకు తమ వ్యవహారములను తామే దిద్దుకొను పాలనా విధాన మెట్టిదో చూతము. గ్రామములు సాధారణముగా రెండు రకములుగా నుండెడివి. మహాగ్రామాలు, కుగ్రామాలు. మహాగ్రామములకు ప్రక్కనుండు కొన్ని కుగ్రామాలు అనుబంధంగా ఉండేవి. వాటి పరిమితిని బట్టి రాజు ఉద్యోగముల ద్వారా అధిపతులను నియమించుట జరిగెడిది. మహా గ్రామాలను అనుబంధ గ్రామముల సంఖ్యతో కలిపి చెప్పెడివారు. ఉదా॥ కొండూరు స్థలమూడ్ను 18, అని కొండూరు శాసన మొకదాని యందున్నది.[4] ఇట్లా అనేక శాసనాల్లో గ్రామ పరిమాణము నిర్దేశింపబడుతూంది. దీన్ని అటి అప్పట్లో కొన్ని గ్రామాలు కలిపి యిప్పటి రెవిన్యూ ఫిర్కావలె నొక 'స్థలం'గా ఉండేది. దానికి సంబంధించిన కరణాలు వగైరా అధికారులు గాక 'స్థలసమయము' లనెడి సంఘములు వేరుగ నుండెడివి. వృత్త్యనుసరించి సంఘము పదునెనిమిది తరగతులుగ నుండెడిది. వీరిలోనే తరచు శాసనములందు 'అష్టాదశ' ప్రజ అని మొత్తం ప్రజలు అనే అర్థంలో వాడుచుందురు. లేపాక్షికి చెందిన క్రీ. శ. 1680 నాటి యొక తామ్ర శాసనములో ఆ పదునెనిమిది జాతుల ప్రజల ఈ విధంగా పేర్కొన బడిరి. బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులనెడి నాలుగు జాతులు, (5) వ్యవహారికులు, (ఉద్యోగులు

---

3. ఈ సందర్భమున మహాకవి భారవి వర్ణన స్మరణకు వచ్చును. దుర్యోధనుడు కపట ద్యూతము వలన దురాక్రమణ చేసుకొన్న రాజ్యమును నయ, వినయాది గుణములతో ప్రజలలో ధర్మరాజుకంటె తానే మంచివాడ ననిపించుకొనుటకు యత్నించెనట.

'దురోదరచ్ఛద్మ జితాం సమీహతే నయేన
జేతుం జగతీం సుయోధనః
తథాపి జిహ్మః స భవజ్జిగీష యా తనోతి
శుభ్రం గుణ సంపదా యశః. కిరా. 1 7 8

4. S. I. I. X—521.

కావచ్చు) (6) పాంచాల (కుమ్మరి, కంచరి వగైరాలు) (7) కుంభాలిక (కుమ్మరి) (8) తంతువాయి, (సాలెవారు) (9) వస్త్ర బేధక (అద్దకం చేసేవారు (10) తిలఘాతక (తెలుకులు) (11) కురణ్టక (చర్మకారులు) (12) వస్త్ర రక్షక (కుట్టుపని వారు) (13) దేవాంగ, (14) పరికె లెత్తువారు, (ఎడ్లమీద, గాడిదల మీద, సరుకులు మోయువారు) (15) గోరక్షక, (16) కిరాత, (ఎలుకలవాండ్రు, ఇతర ఆటవికులు.) (17) రజక, (18) క్షౌరక, [5] ఈ పదునెనిమిది శాఖల ప్రజలకు ప్రత్యేకించి సమయములనెడు సంఘములుండెవి. వీటికి స్థల (స్థానిక) సమయాలనిపేరు. ఇట్టి సమయముల పాత్రమెట్టిదో చూతము.

ఉదా : కాకతి ప్రతాపరుద్రుని నాటియొక తంగెడ శాసనములో

'మాచానాయనింగారి కొడుకు దేవరినాయనింగారి సన్నిధిని తంగెడ స్థలము పదునెనిమిది సమయాలవారూను, ఉభయ నానాదేశిపెక్కండ్రూను, తంగెడ గంటల రామనాథ దేవరకు రంగ భోగానకు అమ్మబడి విలువలకు మాడకు మాడబడి సీసాము ... ...'[6] వంతున దానముచేసినట్లు కలదు.

ఇట్లాంటి గ్రామాదాయాన్ని ఆయూరి దేవునికి దానంచేసేటపుడు స్థానిక స్థలసమయాల పెద్దలు క్రయవిక్రయాలు జరిపే ఉభయ నానాదేశిపెక్కండ్రు (పరాయి వర్తకులసంఘాలు) రాజోద్యోగి, (యిట్టి ప్రభుత్వాదాయాన్ని దేవునికివ్వగల అధికారముగల ఉద్యోగి ప్రస్తుత శాసనంలో దేవరినాయనింగారు) అను ముగ్గురు కలిసి చేయదగిన వ్యవహారము. వ్యక్తులు మారుచున్నను కట్టుబాటు మారకుండుటకై స్థానిక ప్రజలపై బాధ్యతపెట్టబడింది. ఇందు గమనించవలసిన మరొక విశేషము కలదు. రాజుకిగాని, రాజప్రతినిధికిగాని, చెందవలసిన అంగడి సుంకములను స్థానిక ప్రజలు తమ దేవాలయానికి మళ్ళింపచేసుకొన్నారు. ఇప్పుడుకూడ గ్రామ పంచాయతీలు, సమితులు, జిల్లాపరిషత్తులు, ప్రభుత్వానికి రెల్లుగడ్డి, తాటాకులు, మరికొన్ని మున్నగు తమ తమ గ్రామశివార్లలోని లేక సమితుల లోని వస్తువుల నమ్ముట ద్వారా వచ్చెడి ఆదాయమును తామే పొందుచు కొన్ని ప్రజోపయోగకరమగు పనులను జేయుట మనము చూచుచుంటిమి. లేకపోతే సమితుల కాదాయ మెక్కడిది. ఇదే పద్ధతి పూర్వ కాలంలో కూడ స్థానిక సమయములు నిర్వర్తించెడివి. ఇందు స్థల సమయాల వారు వేరుగాను, ఉభయ నానాదేశి పెక్కండ్రు వేరుగాను జెప్పబడియున్నారు. స్థానిక ప్రజలు అష్టాదశ లేక పదునెనిమిది తరగతులుగ నుండెడి వారని చెప్పితిమి. ఎవరి సంఘమునకు చెందిన మంచి చెడ్డలు న్యాయ విచారణ వారే తీర్చుకొనెడివారు. 'సమయ'పదము మత సంఘములకు కూడ వాడబడెడిది. వైష్ణవసమయము, శైవసమయము, బౌద్ధసమయము, జైనసమయము, అను నాలుగు సమయములు తమ తమ మత సంబంధమునకు చెందిన కార్యకలాపములనే గాక సంఘమునకు చెందిన యితర విషయములను గూడ శాసించెడి వారు. ఇట్టి మతసమయములు నాలుగు మన తెలుగు నాట దాదాపు పదమూడవ శతాబ్ది తుదివరకు పని చేయుచుండెను. తదుపరి వైష్ణవ, శైవమత సమయములే ప్రధానంగా కనుపించును. శకం 1334 (క్రీ. 1412)నాటి సర్పవరం భావనారాయణస్వామి గుడిలో నొక శాసన మీ క్రింది విధముగ తెలుపుచున్నది. [7]

'స్వస్తి శ్రీ శకవర్షంబులు 1334 అగునేంటి శుభ కృతుపం
వత్సరమార్గ శిర బ 5 సో శ్రీ భావనారాయణ పెరుమా
ళ గుడ్ల సరియు పొలసను జంగ్గాలు నందికం
బాలు వేస్తేను ఆకంచాలు వి
రుగుమొత్తి సమయం నిర్వహించ్చిన సమయుల
కుం బెట్నిర్వితులు.

ఇచట సమయము నిర్వహించటమనగా సంఘము యొక్క ఆదేశమును నిర్వర్తించుట. ఇట్లు సమాజ జీవనంలో వృత్తులు, మతము, సమయముల ద్వారా

5. A. R. 1918 పుట: 174.

6. S. I. I. X - 495.

7. S. I. I. V. No. 26.

చాల కాలము నిర్వహింపబడుచుండెడివి. రాజోద్యోగులు కొన్ని కొన్ని వృత్తులకు పన్నులు విధించుట కొన్నిటికి మిన్నించుట (Tax remission) జరిగెడిది. అది చెల్లించితే సమాజ జీవనం రాజకీయములకు దూరంగా కొంత స్వేచ్ఛాయుతమై యుండెడిది.

గ్రామాల మధ్య, సమయాల మధ్య తగవు లొచ్చినపుడు రాజుగారు స్వయముగా గాని తన ప్రతినిధి ద్వారాగాని ఆ గ్రామ తగాదాను తీర్చెడివాడు. పైజెప్పిన విధంగా ప్రతి గ్రామంలోను ఒక 'సభ' యుండెడిది. దానిని తగవులు తీర్చుటకై యేర్పాటు చేసుకొనెడి వారు. దానికి అప్రతిష్ఠిత సభ అని పైన జెప్పిన పేరు గాకున్నను మన తెలుగునాట 'తీర్పరి సభ' అనెడివారు.[8] ఇందలి సభ్యులు సాధారణంగా వృత్తుల సంఘాల పెద్దలే యుందురు. ఉదాహరణకు గణపతి దేవుడు వెల నాటిని జయించినపుడు దుగ్గిరాల, ఈమని, మోరం పూడి గ్రామాలవారు తమ గ్రామ పొలిమేర్ల వివాదాన్ని విజ్ఞాపన చేసుకొంటారు. రాజు ఆ వివాదమును పరిష్కరించుటకై మల్లనరాజు, రుద్రనరాజు, అను నిరువురు పెగ్గడ్లు (మంత్రుల)ను బంపును. వారు వచ్చి స్థానిక మహాజనాలను సమావేశపరచి ఈమని పొలిమేరి (పొలిమేరను కాచియుండు స్థానికోద్యోగి)చే హద్దుల నిర్ణయము చేయించినట్లు దుగ్గిరాలలోని శాసన మొకటి తెలుపుచున్నది.[9] అంటే స్థానిక 'తీర్పరుల సభ' ద్వారా రాజప్రతినిధి యధ్యక్ష తన యేర్పడిన న్యాయవిచారణ సభ యిది. ఈ న్యాయవిచారణ వ్యవహారములో కూడ (1) రాజో ద్యోగి (స్థానిక పొలిమేరకాపరివానికి విషయములు బాగుగ తెలిసియుండును గనుక (2) స్థానిక మహా జనులు (ఇది న్యాయవిచారణకు సంబంధించిన వ్యవ హారము గనుక ధర్మమెరిగిన విద్వాంసులని యర్థము) (3) 'సభ'కు అధ్యక్షులుగా పంపబడిన యిద్దరు మంత్రులు, అను ముగ్గురు పాల్గొందురు. అందు మహాజనులు ఇరుపక్షములవారి వాదములు విని కర్త వ్యము నిర్దేశించెదరు. స్థానికోద్యోగి దానిని యథాతథ ముగ నాచరించును. ప్రస్తుత వ్యవహారములోని పొలి మేరివానికి చిరకాలంనుండి తెలిసియున్న పదునాలుగు సీమస్థానములను సభ్యులకు చూపును. రాజామాత్యులు దాని బాగోగులు వాదప్రతివాదులకు వినిపించిన పిదప ఆ నిర్ణయముపై తమ యధికార ఆమోదముద్రను వేయుదురు. ఇట్టి సభను 'ముద్రిత అప్రతిష్ఠిత సభ'యని రాజనీతి రత్నాకరమను గ్రంథమందు చెప్పబడిన దానివంటిదని గ్రహించవచ్చును. ఇట్టిదే గణపతిదేవుని నాటి మరియొక శాసనము కరీంనగరు జిల్లాలో నొక కాలువనీటి తగాదాను ఒక అమా త్యుడు (మంత్రి) రాజప్రతినిధిగా వెళ్ళి స్థానిక తీర్పరులను పిలిచి న్యాయపరిష్కారము చేసినట్లు తెలుపుచున్నది.[10] న్యాయవిచారణ సందర్భములో మరి యొక విధానము చెప్పబడినది. గ్రామములో తీరని తగవు లను దశగ్రామాధిపతికి, అక్కడ పరిష్కృతము కానిచో వింశతిగ్రామాధిపతికి, అక్కడ కూడ కానిచో వరుసగ శతగ్రామాధిపతికి, సహస్ర గ్రామాధిపతికి చెప్పుకొని తీర్పును పొందవలెనని మహాభారత శ్లోకములుగా రాజనీతి రత్నాకరమందు జెప్పబడెను. శాసనాల్లో గ్రామపరి మితులు,నాడుల పరిమితులు, (సబ్బిసహస్రమువంటివి) విషయ పరిమితులు (వెలనాడు — ఆరువేలు, కొల్లి పాక—ఏడు వేలు మొదలగునవి) కేవలము ప్రభుత్వా దాయమును గూర్చి యేర్పడిన విభాగములే గాక న్యాయ విచారణాది బాధ్యతలను గూడ నిర్వహించెడి అధి కారులు లేక రాజప్రతిధులచే పాలింపబడు విభాగములు లేక రాష్ట్రములు. దీనిని బట్టి తెలుసుకొన్న దేమనగా ఆనాటి ప్రజా జీవనమునకు సంబంధించిన వ్యవహారములన్నియు రాజుల కోటలలోనే కేంద్రీకృత ములై యుండు ననుకొన బనిలేదు. అధికభాగము సమయముల ద్వారాను, ప్రాంతీయాధికారుల ద్వారాను, నిర్వహింపబడెడివి.

పై జెప్పిన ఉదాహరణలు రాజకీయ వ్యవస్థలో ప్రజల పాత్ర యెంతగా నుండెడిదో స్థాలీ పులాకముగ తెలుపును. మొదటి దానిని బట్టి ప్రభువులు గ్రామా దాయాన్ని కొంత ఆ గ్రామం కొరకే వినియోగిం చెడివారనిన్నీ, అందుకు స్థానిక సమయముల పెద్దలు పర్యవేక్షకులుగ నుండెడి వారనిన్నీ తెలు స్తుంది. అనేకగ్రామాల్లో ప్రభుత్వాదాయాలు

8. SII - x - No. 480.

9. SII - x - No. 261.

10. ఇది అప్రకటితము.

కొన్ని యిటే స్థానిక ప్రయోజనాలకు వినియోగించబడుట శాసనముల ద్వారా తెలియవస్తుంది. ఇట్టి సమాచారాన్ని వివరంగా తెలిపే శాసనాలు అనేకం శిథిలములై మనకు నిరుపయోగముగ మున్నవి. అట్లే రెండవ ఉదాహరణమ బట్టి ప్రజలకు సంబంధించిన న్యాయవిచారణ న్యాయస్థానాల్లో కంటె ఆ వివాదం వచ్చినచోటే ప్రజల సమక్షంలోనే వారి పెద్దల అనుమతితోనే జరిగేది. వర్తక వ్యవహారములను నిర్వహించు సంఘములు కూడ తమ క్రయ విక్రయములపై వచ్చు లాభములను కొంత స్థానిక సంస్థలకే యిచ్చెడి వారు. ఈ విధంగ గ్రామీణ ఆర్థిక వ్యవహారములు, న్యాయ వ్యవహారములు స్థానిక ప్రజల పర్యవేక్షణలో జరిగెడివి. కనుక పూర్వకాలపు రాజరిక వ్యవస్థలో గూడ ప్రజలకు కొంత స్థానిక బాధ్యత, స్వేచ్ఛ యుండెడివని తెలుస్తుంది. అది మన నేటి పంచాయతీ సంస్థల యధికారమును పోలియుండు నవచ్చును. సమయ నియమాల మలంఘించుట ఆనాడు గొప్ప అపరాధంగా పరిగణింపబడేది. అట్టి అక్రమాలను సమయము వారే విచారించి శిక్షలు విధించెడివారు. ఆ శిక్షలకు లోబడని వారిని సమయము నుండి బహిష్కరించెడివారు. శాసనములందు సాధారణముగ కనుపించు 'సమయానికి వెలియగుదురు' అను వాక్యము అట్టిదే. వర్తకుల నుండి ప్రభుత్వాదాయము నుండి సమయములకు లభించెడి ద్రవ్యమును దేవాలయములు, సత్రములు, విద్యాసంస్థలు మున్నగు సంస్థల కొరకుపయోగించెడివారు. అట్టి ధర్మశాసనము లెన్నియో గలవు. రాజకీయాధికారులతో నిమిత్తము లేకుండ నట్టి ధర్మములను స్థానిక సమయాధిపతులకే యొసగెడివారు.

భారతీయేతిహాసమును రచించునపుడు దృష్టి యందుంచుకొనవలసినది ప్రధానముగ సమాజ వ్యవస ను గూర్చిన కథనము. అనగా ప్రజలద్దైనందిన జీవిత విధానమును గూర్చి వివరించుటయే చరిత్ర రచనలో ముఖ్యోద్దేశ్యము కావలెను. తర్వాతనే రాజకీయములు. 'యధారాజా తథా ప్రజా' యనెడి ఉక్తి రాజులు తమ యధికారమును దుర్వినియోగముచేసి ప్రజలను తప్పుడు మార్గము పట్టించకూడదని మందలించుటకు చెప్పబడినమాట. కాని మనం గ్రహించవలసినది 'యధా ప్రజా తథా రాజా' అనగా ప్రజా జీవితమును నియమించియున్న ధర్మమునకు అనుగుణంగానే రాజు పరిపాలన చేయవలయునని. ఇంక విపులముగ చెప్పవలెనన్న భారతీయైతిహాసిక యుగములో ప్రజలలో ధర్మము రాజులలో రాజనీతి యీ రెండు కూడ రాజ్యాంగము, అంటే నేటి రాజ్యాంగం (Constitution) మాదిరిగా నుండెడివి. రాజరికము సర్వాధికారములతో గూడిన స్వతంత్ర వ్యవస్థ కాదు. పైగా సామాజిక ధర్మానికి లోబడి యుండవలసిన గొప్ప ఆశయము బాధ్యతలతో నేర్పడినది. తమ బల పరాక్రమములతో కొంతకాలం మన దేశంలో కొన్ని భాగములను పాలించిన విదేశీయులగు శకులు, కుషాణులు, మున్నగువారు (మహమ్మదీయులు గాక) భారతీయ ధర్మమును స్వీకరించి, ధర్మ ప్రతిపాలన చేసి నట్లు చరిత్రలో తెలియవచ్చుచున్నది. నేటి ప్రజాప్రభుత్వములో ప్రతి వోటరుకి పరిపాలనలో కొంత స్వతంత్ర మున్నట్లే (అంటే పాలకుల నెన్నుకొనే హక్కు) ఆనాడు రాజుకే పాలనాధికారము నొసగి సామాజిక వ్యవస్థను రక్షించుమని రాజనీతి యేర్పడింది. ఈ దృక్పథంతో యోచించినయెడల సమాజ జీవితానికి సంబంధించిన అంశములను వివరించి వ్రాయుటయే చరిత్ర రచనలో ముఖ్యోద్దేశ్యము కావలెను. రాజకీయములకు రెండవ స్థానము.

సమాజ జీవితమునకు సంబంధించిన విషయము లనగా ఆనాటి వారి వృత్తులు, ఆర్థిక విధానము, మతము, వాడెడి వస్తువులు, భాష — వాఙ్మయము, కళలు, వినోదములు, పండుగలు మున్నగువని యెన్నియో చేరి యుండును. వీటిని గూర్చి పరిశోధించి చరిత్రను వ్రాయుట యని పైజెప్పిన దాని కంతకు తాత్పర్యము. అట్టి చరిత్రమే నిజమగు భారతీయ సంస్కృతిని తెలియజేస్తుంది.

---

స్వర్ణోత్సవమును జరుపుకొనుచున్న
ఏకైక సాహిత్య మాసపత్రిక
'భారతి'కి
శుభాభివందనలు!



# శ్రీ డి. వి. ఎస్. రాజు

డి. వి. ఎస్. ప్రొడక్షన్స్
91, జి. ఎన్. చెట్టి రోడ్,
త్యాగరాయనగర్,
మద్రాసు-17.

# కానన జ్యోత్స్న

## శ్రీ మల్లంపల్లి శరభయ్య

చిరహేమంత దశావిశీర్ణ తనుయష్టిన్ పాండురీ భూత మ
ర్మర పత్త్రిమ్యాలి మ్రోడువాఱితి భవన్మార్గంబునన్, నీవు చై
త్ర రమాదేవత వింత చేరఁగనె యంతఃప్రాణనాళీ విని
ర్భర మాధుర్య మహానుభూతి మెయి స్తంభం బేర్పడెన్ జుమ్మిటన్॥

సుధ నాప్యాయిత మైనటుల్ తను మనస్సుల్ రెక్కొనన్ పూర్ణిమా
తిథి యేతెంచు గతిన్ ప్రసన్న మృదు దీప్తిన్ దవ్వులన్ తోచనా
తిథివై వచ్చెదు నీయుదాత్త శుభమూర్తిన్ డగ్గరన్ జాలకే
పథ మల్లంతఁ దొలంగి నిల్చితిఁ జుమీ! పారిప్లవచ్చేతనన్॥

తొవెలి యెన్నఁడున్ విడక లోఁగొని యంతట నీవె నిండియున్
నీ వెదురౌటయే కలుగనేరదు నా చను త్రోవ నెన్నఁడున్
భావ సుధాబ్ధి వీచికలపై కలపై నడయాడు నీవా! యీ
నీవు మతేవా! యేనెఱుఁగ నేరక నూవె! తొలంగి నిల్చితిన్॥

నీ రాకన్ గనినంత లోయెద యెదో నిర్మథ్య మానాంతర
క్షీరాంభోనిధి గర్భవీధియయి లేచెన్ వీచి, యువ్వెత్తు జ్యో
త్స్నా రారాజ దనంత పూర్ణ శశిలిప్సా వ్యగ్రమో కాక! త
ద్భారం బోర్వఁగరాక యేఁ దొలఁకితిన్ పర్యంత మర్యాదకున్॥

సమ లెన్నెని గతింపనిమ్ము ప్రథమాశా రాగమున్ దోఁగి బిం
బమవై యే తొలినాట నిల్చి మధురస్పందంబు నానిండు డెం
దమునన్ జాబిలి వోలె నూఁచితివో! స్పథంబద్దియే సుమ్ము దై
వము వోలెన్ నిముగన్నవేళల మదిన్ వైవశ్యమున్ గూర్చెదున్॥

మత్పరధ్యాన మేమందు! మార్గమందు
త్వత్పర ధ్యానముద్ర నా తలఁపు నిండి
అరుగుచుంటిన; నాయఖిలాధ్వములను
అఖిల వేళలయందు నెక్కొ ననఁగాని —
నీ వెదురు వచ్చుటది కల్గనే! యటంచు
ప్రాణమున కంటి పరిదుర్బలాశ యొకఁడు॥

## కానన జ్యోత్స్న

కడచి యెన్నేని యుత్కలికాభరమ్ము
లరిగి మజ్జీవితానేహ మంతనంత—
నీ వెదురెరావా! బ్రదుకులెన్నేని గడచి—
అణఁగె నాయాశ భస్మసుప్తాగ్ని యగుచు॥

నా సుకృత లేశమేమొ! జ్యోత్స్నాయమాన
మయ్యె వేఁడిదె మన్నయనాగ్ర పథము!
ఓ చిర నిరీక్షితాతిథే!! ఓపఁజాల
నీ యెదుట నిల్వనైన—

నీ కభిధలేదు— ఒకటను నిన్నెఱుంగ
రాదు నీ మూర్తి యవిదిత స్వాదు వేదియొ
కేవల వ్యంజనవుగ మద్భావనిభృత
గేహాళిని నిల్చి నను ప్రతీక్షింతు వెపుడు॥

నీవు మత్ప్రాణమూలమ్ము నెలవు కొనియె
నిస్వనింతువు కల విపంచికయు వోలె
ఆకలధ్వని సంప్లాన మరయరాక
నిలువనేరక నే బ్రతి నిస్వనింతు॥

నీవు నాలోనె కనరాక నిలిచియోఁదో
విధుర భావ ప్రపంచమ్ము విస్తరించి
తలఁచిన తలంపు పలికిన పలుకు నమృత
సించి యిమ్ముగఁ గృప విరచించు చుందు॥

నీవు నాయందె సుచిర నిర్ణీతవయ్యు
నలసితెందెందొ గ్రీష్మ శైవలిని వోలె
నీయవిజ్ఞాత హృదయ భరాయతోష్మ
మంద మందోచ్ఛ్వసితమె నామది నదింప॥

నీవు నిద్రాళు మచ్చిత్త నీరనిధిని
నర్తన మొనర్తు వవిరతావర్త శోభ—
నెగయ శీకరములును డిండీరములు న
భంగ భంగమ్ము లతల గర్భగతమణులు॥

నీవు లోలో జపారాగ నిబిడశోభ
నావరించితి మచ్చర మాశయెల్ల

లీన మద్భావ గగనాధ్వనీన శతస
హస్ర తారలు తెర తీసినట్లు వెలుఁగ॥

నీవు పవలెల్ల మత్ప్రాణ నిలయలీన
వగుటఁ గనరాక నాకు నిశాత్యయముల
నిగిడి యొక్కింత వడి రజనీ ముఖముల
లీల వెలిఁగింతు వమృతాంశు లేఖవగుచు॥

నీ వఖిల శబ్దశక్తి నిర్ణేతి సార
ధీ ప్రమాణవు రసజగజ్జీవన మవు
నీ కృపా పాలితంబు మన్నిఖిల కావ్య
నిర్మితి సమీహమాన మనీషయెల్ల॥

నిన్ను నా శైశవమునాఁడు నిరత కావ్య
జలధి మథనావసాన ప్రశాంత సంధ్య
నరయ దిగఁలయ్యె గగన దూరాంచలమున
నలఁతి నెలవంక డోల నుయ్యాలలూఁగ॥

అమర వాణీప్రణీత కావ్యామృతములు
కరువునం బోయ నాయెదఁ గరడుగొనుచు
నిగిడి నీ మూర్తి మిన్నుల నిలిచె; గళిత
బహుళ భయ నిత్యశారద తుహిన రుచిగ॥

అబ్ధి గగనమ్ములను దాటి యవల నున్న
విన్ను జేరంగరాద; నా కెన్నఁడైన
మిన్నుదిగి నీవె వత్తువో! యన్నయాశ
అబ్ధి గగనమ్ములకునైన నాఁగరాదు॥

ప్రతి దినాంతమ్ము ఘుసృణ ప్రవాళశోణ
చరమ గగనాధ్వముల భవచ్చరణముల శ
శాంక డోలా చలాచలోచ్చలిత కింకి
ణీ నినాదమ్మె నాయెద నిర్మథించు॥

నీవు రావేని ధరణికి నిర్ధనన్మ
దీయ హృచ్ఛోణితమున ద్వితీయ సంధ్య
నావహించెదీ నరుణ వర్ణాభిరామ
మగుచు నీ మూర్తి నాయెద హత్తుకొనఁగ॥

నా స్థితి యిదేమొ! శీర్ణదగ్ధ హిమపాత
తీవ్ర హేమంత చిరనిశాస్థాణు వనఁగ
ముకుళితాళిక నయనమై మూర్ధ గగన
నిహత మిహికాంశు రుచిలవోన్మిషితమగుచు॥

ఛన్నమౌళి శిలాభ తుషారఘటల
నిటల బర్హిః ప్రరోహమ్ము నెట్టుకొనక—
విలుళిత మృణాళ సూత్రపేశల సుధాంశు
పారణీ రేఖ నమృతంపు జాలులేక—

కాలమునకైన కాలమ్ము కాలగళుఁడు
మృత్యువునకైన మృత్యువు హృదయవీథి
విలయ శీతల భావమ్ము నొలయఁజేసి
పరముఁడుండె సర్వక్రియా విరతవృత్తి॥

* *

ఉత్తరమ్మున హిమగిరి నెత్తముపయి
నగసుత యనంగ సూతికాపాంగ రేఖ
యోగనిష్ఠాంతమునఁ బుచ్చె నూరుపోకటి
జడజగత్ప్రాణ 'మూల'మూష్మలతదాల్ప॥

నా వనికి నామనియె రాదు రావు జలద
మాలలును నిత్యమిచట హేమంతమె పయిఁ
గలదు నయిదోడు శిశిరమొక్కఁడు; పురాణ
పర్ణములకైన క్షణము నిల్వంగరాక॥

మఱి—అనీదృశ శిశిర హేమంతములకు
మాఁపులోఁబడి చెల్లు సామంత మిదియు
నీ తలంపు వెన్నెలలట నిండిరేయి
శాశ్వత శరన్నిశీథైక శాసనంబె॥

లేవు రేలివ్వి నందనాళిందములను
చైత్ర రథ వీథులను రావు రాత్రులివియు
నీ విచటఁ గాయుచుంటి నిర్నిద్రశోభ
కానన జ్యోత్స్న వీవును స్థాణువేను॥

---

# అర్ధశతాబ్దంగా రాజకీయాలలో వచ్చిన పరిణామాలు

శ్రీ తెన్నేటి విశ్వనాథం

అర్ధ శతాబ్దం అనేసరికి మన దృష్టి మహాత్మా గాంధీ మొదలుపెట్టిన సహాయ నిరాకరణ యుగారంభం మీదకి వెడుతుంది. మనదేశ చరిత్రలో 1921 నుంచి ఒక నూతన యుగం ఆరంభం అయింది. అంతకు పూర్వం ముప్పయి అయిదుసం వత్సరాలనుండి కాంగ్రెసు మహాసంస్థ దేశంయొక్క రాజకీయ విముక్తికోసం ఉద్యమం నడిపిస్తూ ఉన్నా గాంధీగారువచ్చి సహాయ నిరాకరణం 1921 లో ప్రారంభించిన తరువాతనే స్వరాజ్యంవైపు, స్వరాజ్య సంపాదనకై చేసే యత్నాలు ఉపన్యాసాలలో ఆగిపోకుండా ఒక బిగువయిన కార్యక్రమం మొదలయింది. దాని ఫలితంగా ఈ రోజున మనం స్వతంత్ర భారతదేశంలో ఉన్నాము.

1921 సంవత్సరంలోని మొదటి మార్పు ప్రజల మనస్సునకు సంబంధించినది. అంతకు పూర్వం వాదనలలోను, యుక్తిలోను, చర్చలలోను బ్రిటిషు సామ్రాజ్య పతాకచ్ఛాయన బాధ్యతాయుతమయిన పరిపాలనపైన ఉండే మోజు, గాంధీగారి బోధతో స్వతంత్ర భారతదేశం అనే లక్ష్యంపైన మనస్సు తిరిగింది. ఇది గత అర్ధ శతాబ్ద ఆరంభంలో జరిగిన మొదటి పరిణామం.

ప్రజల మనస్సు ఎప్పుడైతే మారిందో అప్పుడు దేశంలోవున్న రాజకీయవాదులుకూడా కాంగ్రెసు వాదులనిన్నీ, తదితర వాదులనిన్నీ రెండు భాగాలుగా మారారు. మితవాదుల దృష్టి బ్రిటిషు ప్రభుత్వంతో కలిసి ఉండటం మన దేశానికి మంచిదని ఉండేది. గాంధీగారి సహాయ నిరాకరణ ఉద్యమం ప్రతిపాదన జరిగిన తరువాత మితవాదులు ప్రత్యేకమై పోవటమే కాక, గాంధీగారి ఉద్యమానికి వ్యతిరేకంగా బ్రిటిషు ప్రభుత్వం ఏర్పరచటానికి ప్రభుత్వాలలో మంత్రి పదవులు స్వీకరించి కాంగ్రెసు ఉద్యమాన్ని అణగ దొక్కడం కోసమని చెప్పి—తెలిసో, తెలియకో—బ్రిటిషు గవర్నమెంటుతో చేతులు కలిపిన స్థితిలో పడ్డారు.

## నూతన సూత్రాలు

గాంధీగారు ఆ సంవత్సరంలో ప్రవేశపెట్టిన నూతన సహాయనిరాకరణ సూత్రాలు, త్రివిధ బహిష్కారమనే ప్రాతిపదికపైన స్వాతంత్ర్యాభిలాషుల మనస్సులను ఆకర్షించి, రాజకీయ పోరాటాలలో ఇటువంటి బహిష్కరణ ఒక అనుపమానమైన సాధనగా ప్రజలు గుర్తింప సాగారు. అప్పుడు గాంధీగారు చెప్పిన మూడు బహిష్కారాలు ఏమిటంటే — శాసన సభలు, న్యాయస్థానాలు, విద్యాకేంద్రాలు. ఇప్పటికి కూడా ఏదైనా గడ్డు సమస్య వచ్చినప్పుడు శాసన సభలలో సభ్యులు రాజీనామా చెయ్యవలసినదిగానూ, విద్యార్థులు తరగతులను బహిష్కరించవలసినదిగానూ, మొదటి ప్రక్రియల కింద, ప్రజలు చెప్పవలసినవారికి చెబుతున్నారు. మొన్న ఆంధ్ర ఉద్యమంలో న్యాయస్థానాల బహిష్కరణని కూడా న్యాయవాదులు ఒక ఉపకరణం క్రింద ఉపయోగించారు. ఇటువంటి సాధన ప్రక్రియలపైని ఆకర్షణ సహాయ నిరాకరణ ప్రారంభ దశలో గాంధీగారు ఇచ్చిన ఉపదేశాలయొక్క ఫలితమే అనవచ్చు. ఇది రెండవ పరిణామం.

అంతకి పూర్వము రాజకీయాలలో సత్యానికి, అహింసకి అంతగా ప్రాధాన్యత లేదు. మహాత్మాగాంధీయొక్క ప్రబోధంవల్ల సత్యం, అహింసలకు రాజకీయాలలో ప్రథమస్థానం—నాటినుండి నేటివరకు కలిగింది. ఆచరణలో లోపం ఉన్నప్పటికీ సిద్ధాంతరీత్యా చాలామంది రాజకీయవాదులు శిరసావహిస్తున్న సూత్రాలివి. ఇది మూడవ పరిణామం.

కాం(గెసుపక్షాలు మం(త్రివర్గాలు ఏర్పాటు చెయ్యటం (పారంభం అయ్యాక, 1937 తరువాత, మం(తుల (పవర్తన గురించికూడా మహాత్మాగాంధీ గారు అవలంబించిన విధానంవల్ల ఒక నూతన పరి ణామం కలిగింది. ఇద్దరు మం(తుల విషయంలో (కాం(గెసుపక్షాన)ఉన్న (పవర్తన, శీలము సంబంధముగా అనుమానములు వచ్చినప్పుడు, గాంధీగారి సలహాపై వారిని పదవులనుంచి తప్పించటం జరిగింది.

నాటినుంటి నేటివరకు (పతిపక్షాలవారు, (పజా సామాన్యముకూడా (పజల అనుమతితో పదవులలో (పవేశించిన వారియొక్క (పవర్తనపై నిశితమైన విమర్శనా దృష్టిని (పసరింపజేస్తున్నారు. నైతిక (పమాణాలని నిలబెట్టటానికి మహాత్మాగాంధీగారి బోధనలు ఈ విధంగా తోడ్పడ్డాయి. ఇదే ఐదవ పరి ణామం.

## గీటురాయి

గాంధీగారివల్లనే దేశవ్యాప్తమైన భావం మం(తులు అవసరమైనప్పుడు తమ పదవులనుండి రాజీనామా చెయ్యటానికి సిద్ధంగా ఉండాలన్నదే. ఇది సత్ప్రవర్తనకి ఒక గీటురాయిగా పరిగణించబడుతోంది.

1939 లో భారత (పజల, (పభుత్వం సంబంధం లేకుండా (బిటిషు (పభుత్వంవారు హిట్ల రుతో యుద్ధంలోకి భారతదేశాన్ని కూడా ఒక మి(త దేశాన్నిగా దింపుతున్నట్లు (పకటించారు. ఇది మన మం(త్రివర్గాలకి అవమానకరమని ఏడు రాష్ట్రాలలో నడుస్తున్న కాం(గెసు మం(త్రివర్గాలు గాంధీగారి సలహామీద తమ పదవులు వదులుకొనవలసిందని కాం(గెసువారు ఆదేశం ఇవ్వటం జరిగింది. శాసన సభ లను వదులుకుని బయటికి రావాలన్న ఆదేశం ఇవ్వటం కూడా జరిగింది. శాసన సభలలో సభ్యులుగా ఉండి పోరాటం సాగించటం తగదనీ, అనేక సమయాలలో లక్ష్యానికీ, (పవర్తనకీ వైరుధ్యం రాగలదనీ ఆలో చించి ఆయన ఈ విధంగా ఆదేశం ఇచ్చారు. నైతిక ధర్మంపైన ఆకర్షణ నేటికికూడా (పజాబాహుళ్యం యొక్క మనస్సులో ఇమిడి ఉంది. ఇది శాశ్వత (పవర్తనా (పమాణ సంబంధమైన ఆరవ పరిణామ ముగా నిలబడింది.

ఇంతేకాక, గాంధీగారు కాం(గెసులో (పవే శించిన వెంటనే 'కార్య(కమాలు దేశ భాషలలోనే జరుగ వలెను,' అనేటువంటి నియమం దానంతట అదే అమలు లోకి వచ్చింది. బహిరంగ సభలు దేశ భాషలలోనే జరి పించటం రాజకీయాల మీద తన (పభావాన్ని చూపింది. భాషా రాష్ట్రాల నిర్మాణానికి దోహదం ఇచ్చింది.

1940 సంవత్సరంలో, వ్యక్తి సత్యా(గహ ఉద్యమం ఆరంభంకాక పూర్వం, గాంధీగారి సలహా పైన స్వాతం(త్య సిద్ధి అయిన పిమ్మట దేశంలో కల రాష్ట్రాలు, కాం(గెసు రాష్ట్రాలు—వీటిని కార్య సౌకర్యంకొరకు భాషలనుబట్టి పునర్నిర్మాణం చెయ్య వలసినదిగా తీర్మానించటం జరిగింది. స్వాతం(త్యం లభించిన వెంటనే కాకపోయినా కొద్ది సంవత్సరాలకు ఆ ఆశయం ఫలించింది. ఇది ఏడవ పరిణామం.

## నైతిక ధర్మం

స్వాతం(త్యం అనంతరం కూడా వ్యక్తుల యొక్క (పవర్తన, శీలముల విషయమై; వారి రాజ కీయ వాదాల పద్ధతిపైనా గాంధీగారి సిద్ధాంతాల (పభావం నేటివరకూ పని చేస్తోంది. ఆనాటి సహాయ నిరాకరణ ఉద్యమం (పభావమూ, పరిణామమూ నేటి రాజకీయ వాదులు నైతిక ధర్మాన్నే (పధాన సూ(తంగా స్వీకరించడమే అనవచ్చును.

ఆనాడు గాంధీగారి అనుయాయులై కాం(గెసు ఉద్యమంలో స్వాతం(త్య సాధనకై పనిచేసిన మహా నీయులయొక్క సచ్చరి(త కూడా అర్ధ శతాబ్ద చరి (తయే అయిఉన్నది. అటువంటివారిలో ముఖ్యంగా తలుచుకోదగినవారు దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు గారు, దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారు, ఆం(ధకేసరి (పకాశం పంతులుగారు, మహర్షి సాంబ మూర్తిగారు—ఇటువంటి త్యాగధనుల జీవిత చరి(తలు కూడా ఆనాటి చరి(తయొక్క పరిణామాలే.

ఆ రోజులలో దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారి ఆం(ధప(త్రిక బొంబాయిలో వార ప(త్రి

కగా ఆరంభమై 1914 లో మదరాసుకు తరలించ బడింది; మొదటినుంచీ ఆంధ్రపత్రిక పైనచెప్పిన పరిణామా లన్నింటికీ ప్రతిబింబంగా వెలిసి, ఆంధ్రుల జీవితాలలో ఒక మరువరాని భాగమై ఉన్న విషయం సర్వజనవిదితం.

మహాత్మాగాంధీగారి ఉద్యమంయొక్క ప్రభావం కేవలం రాజకీయాల మీదనేకాక ఈ అర్ధ శతాబ్దం పొడుగునా భాష, సంస్కృతులపైన కూడా ప్రకటిత మైనది. ఆంధ్రదేశానికి సంబంధించినంతవరకు అర్ధ శతాబ్దంనుంచి నాగేశ్వరరావు పంతులుగారు స్థాపించిన భారతి సాంస్కృతిక విషయాలలో నవ్యాభ్యుదయ ప్రమాణమైన పత్రికగా క్రమక్రమాభివృద్ధి చెంది ఉన్నది. ఇట్టి సాంస్కృతిక, అభ్యుదయ పద్ధతులు కూడా గత అర్ధ శతాబ్దంలో వచ్చిన పరిణామాలుగా భావించవలసి ఉన్నది. ఈ సాంస్కృతిక పత్రికను అను సరించి అనేకమంది ఇతర సాంస్కృతికాభిలాషులు కూడా అటువంటి యత్నాలను అప్పుడప్పుడు చేస్తూనే ఉన్నారు. ఇది అర్ధ శతాబ్దపు పరిణామాలలో సాంస్కృతిక, అభ్యుదయ పరిణామముగానే చెప్పవలసి ఉంటుంది.

### అభ్యుదయ స్రవంతి

మొత్తంమీద అర్ధ శతాబ్ద సమీక్ష చేస్తే 1921 సంవత్సరానికి పూర్వం ఉన్న భారతదేశం రాజకీయంగా, సాంఘికంగా, సాంస్కృతికంగా చెప్పుకో తగిన నూతన పరిణామాలను పొందిందని తెలుస్తుంది. ఈ అభ్యుదయ స్రవంతి నాటికీ నేటికీ కూడా కూలం కషంగానే ప్రవహిస్తోంది.

గత అర్ధ శతాబ్దమందు భారత దేశంలో స్వాతంత్ర్యప్రాప్తి అన్నది 1947 సంవత్సరంలో కలిగిన తరువాత, ముందు రాజకీయ రంగమందు, దృక్పథమందు, ప్రవర్తనా ప్రమాణములందు అనేక మార్పులు

భారతి స్వర్ణోత్సవ శుభ సందర్భమున
మా శుభాకాంక్షలు

Phone No. 73843
శ్రీ రామకృష్ణా ఐరన్ షాపు
సోల్ ప్రొప్రయిటర్: కొమ్మారెడ్డి రామకృష్ణారావు
పెయింట్సు & హార్డ్‌వేర్ మర్చెంట్సు
స్టాకిస్ట్సు ఏషియన్ పెయింట్స్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్
బొంబాయి
AND
రాక్‌వెల్డు ఎలక్ట్రోడ్స్ ఇండియా లిమిటెడ్, మద్రాసు
బి సెంట్ రోడ్, గవర్నరు పేట,
విజయవాడ—2

వస్తున్నాయి. అర్ధ శతాబ్దం ముందున్న నైతిక ప్రమాణములందు జరిగిన మార్పులు కొంచెంగా, అప్పుడప్పుడు బాధాకరంగా తోచినప్పటికీ సహజమైన మానవ ప్రకృతి సద్ధర్మ సహితమై ఉన్నదన్న ఒక ఆశ నాకు గట్టిగా ఉంది. అచిర భవిష్యత్కాలములో అటువంటి ప్రమాణాలు పునరుద్ధారం కాగలవని నా ఆశ.

ఇది ఇలాగ ఉంటూఉండగా మన స్వాతంత్ర్యంతోపాటు దేశ విభజన జరగటం; పాకిస్తాన్ ప్రత్యేక, స్వతంత్ర దేశంగా నిర్మాణం కావటం; భారత భూభాగం కొంత పోయినదన్న విచారం కలుగటం; విభజన జరిగిన క్షణంనుంచి ఈ క్షణంవరకూ మన దేశానికి పాకిస్తాన్‌వల్ల సంక్షోభం కలుగటం; దీని కారణంగా అనవసర వ్యయం ఇంతా, అంతా అని చెప్పలేనంతగా జరుగటం—ఇదంతా సర్వవిదితమే. అయితే 1971 సంవత్సరంలో మన దేశం సహాయంతో పాకిస్తాన్‌నుండి బంగ్లాదేష్ స్వతంత్ర దేశంగా విడిపోవటంతో పాకిస్తాన్‌వల్ల కలుగుతున్న సంక్షోభం తీవ్రత కొంతవరకు తగ్గిన మాట వాస్తవం. కాని పాకిస్తాన్, చైనాతో కలిసి మన దేశానికి వృధా వ్యయం, మనస్తాపం కలుగచెయ్యటంచేత భారతదేశంయొక్క ఆర్థికాభ్యుదయం కొంతవరకు కుంటుపడిన విషయం అందరికీ తెలిసినదే.

## ప్రజల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు

గత అర్ధ శతాబ్దకాలంలో జరిగిన రాజకీయ పరిణామాలయొక్క సమీక్ష చేసినప్పుడు హెచ్చిన వివరాలలోనికి పోవటం అనవసరం కాని నైతిక, సాంఘిక జీవితాలకు; రాజకీయ, ఆర్థిక రంగములకు దగ్గర సంబంధం ఉండటంవల్ల దేశంలో గల రాజకీయ విధానాన్ని గురించి ఒక రెండు మాటలు చెప్పక తప్పదు. 1921 లో సహాయ నిరాకరణ ఉద్యమం కొరకు మహాత్మాగాంధీగారి శంఖారావం విని ఆ ఉద్యమంలో చేరిన నావంటివారికి ప్రజారాజ్య సూత్రాలపైన గట్టి నమ్మకం ఉంది. అసలు గాంధీగారు ప్రభుత్వం ఎంత తక్కువగా ఆంక్షలు విధిస్తే ప్రజలకు అంత సుఖం అని చెప్పేవారు. మహాత్మాగాంధీగారి పేరు చెప్పి ప్రభుత్వం నడుపుతున్నవారే ఎంతో పట్టుదలతో పని చేస్తున్నారు—స్వాతంత్ర్యం తరువాత ప్రజల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు క్రమంగా అరికట్టటం విషయంలో.

ప్రజల స్వేచ్ఛని అరికట్టటమే ప్రగతి మార్గమని ఆలోచించే ప్రభుత్వాలు, పరిపాలకులు దేశంయొక్క చారిత్రికమైన సాంప్రదాయాలకు భిన్నంగా నడుచుకోనటం గత రెండు దశాబ్దాలుగా కలిగిన నూతన పరిణామం. దీనివలన ప్రజలకు సౌఖ్యం కలుగుతోందో, అసౌఖ్యం కలుగుతోందో కమగానే అనుభవజ్ఞతలు గల పరిపాలకులు అరుదు అవుతున్నారు.

ప్రజలకు శాంతి, సౌకర్యం, సదుపాయం, తృప్తికరంగా ఆహారలబ్ధి, వస్త్రలబ్ధి, వసతిలబ్ధి, వైద్యలబ్ధి చేయగలిగిన పద్ధతి మంచిదే. కాని, పరదేశ నినాదాల సంతృప్తికొరకు పరిపాలనా పద్ధతులను ప్రతినిత్యం మార్పు చేసుకొనటంవలన ప్రజలకు పైన చెప్పిన సౌఖ్యము లేవీ కలుగనేరవు. ప్రస్తుతం దేశంలో కలుగుతున్న సంక్షోభం పరిపాలకులు చేసే నినాదాల పరిణామం. సర్వసంపత్తులకూ నిలయమైన భారత దేశంలోని సామాన్య ప్రజల ఇక్కట్లని వర్ణించేందుకు నా వచనాలు చాలవు.

నైతిక ప్రమాణాలను పునరుద్ధరించుకొనాలనుకొనే పరిపాలకులు సంభవించినప్పుడు కాని గాంధీగారు ఆశించినటువంటి సుఖశాంతులు కలుగనేరవు. అయినా, మనం భవిష్యత్తుని గురించి నిరాశ చెందరాదు. ప్రజాసౌఖ్యమే తమ సౌఖ్యమని తలచే పెద్దలు ఇంకా దేశమందు లేకపోలేదు. పరిపాలనా యంత్రం అటువంటివారి స్వాధీనం చెయ్యటమే ప్రజలయొక్క ముఖ్యకర్తవ్యముగా భావిస్తున్నాను.

---

# పరిణామపథంలో భారతదేశం

## డాక్టర్ ముదిగొండ శివప్రసాద్

నాగార్జునసాగర్ కే ననుకుంటాను శంఖుస్థాపన చేస్తూ 'ఇవి మన నవీన దేవాలయాలు' అన్నారు జవహర్‌లాల్ నెహ్రూ. ఈ మాట వెనక ఇటీవలి కాలంలో భారతదేశంలో జరిగిన మార్పులన్నీ స్థూలంగా ధ్వనిస్తున్నాయి.

ఆచార్య నాగార్జునుడు బౌద్ధంలో మాధ్యమిక వాదాన్ని ప్రవేశపెట్టి భక్తితత్త్వమూ అవతార విధానమూ బౌద్ధంలో అంతర్భాగం కావడానికి పరోక్షంగా దోహదం చేసిన మహాప్రవక్త. ఆత్మ విషయంలో బౌద్ధం మౌనాన్ని పాటించినా బౌద్ధం కూడా హిందూత్వ సమగ్రతకు తత్కాలీనమైన ఒక సంస్కరణోద్యమంగా వచ్చి విశ్వ వ్యాప్తమైన ఒక మతంగా విరిచి పోయింది. నాగార్జునుడు మత ప్రవక్త అయినప్పటికీ ఆయన పేరుమీద నిర్మించబడే సాగరం మాత్రం కేవలం భౌతికావసరాలను తీర్చేందుకు నిర్మించబడే ఒక కట్టడమని మనకు తెలుసు!!

### 'స్వాతంత్ర్య' కల్పన

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చేవరకూ 'స్వాతంత్ర్య' మంటే ఏమిటో మన నాయకులకు నిర్దుష్టంగా తెలుసు. తిలక్ మాలవీయా గోఖలే గాంధీజీ ఇత్యాది రాజకీయ నాయకులూ అరవింద వివేకానంద రవీంద్రాది ఆధ్యాత్మిక సాంస్కృతిక నాయకులూ తమ దృష్టిలోని భారతదేశమేమిటో ఖండితంగా అసందిగ్ధంగా తమ ప్రసంగాలలో వ్యక్తం చేసి ఆచరణలో ప్రత్యక్షీకరించి మనసా వాచా కర్మణా ఈ జాతి సర్వతోముఖ స్వాతంత్ర్యానికి పాటు పడ్డారు. స్వాతంత్ర్య సాధనం గాంధీజీ దృష్టిలో రాజకీయమైన ఒక స్వేచ్ఛా కల్పన మాత్రమే కాదు; ఆయన జరిపిన రాజకీయ సంగ్రామం మొత్తమూ తన 'సత్యాన్వేషణలో ఒక 'ప్రయోగం' మాత్రమే! అచుంబితమైన కొన్ని ఆధ్యాత్మిక శిఖరారోహణలలో రాజకీయాలూ జనజాగరణ కార్యక్రమాలూ సువ్యవస్థితమైన సోపాన పంక్తులు. ఆత్మ సాక్షాత్కారంలోని సాధనలు. స్వాతంత్ర్యం ఒక రాజకీయ భావన మాత్రమే కాదు వ్యష్టియొక్క సమష్టియొక్క భౌతిక మానసిక ఆధ్యాత్మిక విముక్తులను సాధించి ఆర్థిక, సాంస్కృతిక రాజకీయ పారతంత్ర్యాన్ని నిర్మూలించే ఒక బృహత్కల్పన. గాంధీజీ అనంతర యుగంలో ఈ పదం తన విస్తృతార్థాన్ని కోల్పోయి 'నల్లవారు నల్లవారిని పాలించడమే రాజకీయ స్వాతంత్ర్యం' అన్న పరిమితార్థానికి సంకోచం చెందింది. ఆంగ్లేయులు ఈ గడ్డమీదినుండి వెళ్లిపోవడమే స్వాతంత్ర్యమనే భ్రమ ప్రమాదాలకు దారి తీసింది!!

### దిగుమతి చేసుకున్న జీవన విధానం

ఆ మాటకొస్తే అసలు ఆంగ్లేయులు మన దేశం వదిలిపెట్టి ఎందుకు వెళ్లారు?—ఒక్కొక్క జాతికీ ఒక్కొక్క జీవలక్షణం వుంటుంది. ఆంగ్లేయుల జీవ లక్షణం వ్యాపారం.[2] వ్యాపారార్థం వారీ దేశానికి వచ్చారు. వ్యాపారంకోసం జయించారు. వ్యాపారాభివృద్ధి కోసమే రాజకీయంగా ఈ దేశాన్ని విముక్తం చేసినట్లు ప్రకటించి ఆర్థికంగా సాంస్కృతికంగా బలీయమైన సార్వభౌమాధికారాన్ని సంపాదించుకున్నారు. ఆహారం కోసం ఆయుధాలకోసం విద్యకోసం వేషధారణకోసం అన్నిరంగాలలోనూ దాదాపు మనం ఏదో ఒక దేశం మీద ఆధారపడే వున్నాము. 'ఏతద్దేశ ప్రసూతస్య[3] అని మనువుకాలంలో గొప్పలు పలికిన మనం ఈనాడు కప్పలను ఎగుమతిచేసి హిప్పీలను దిగుమతి చేసుకుంటూ జాతి కొక నూతన జీవన విధానాన్ని తెలియకుండానే ప్రసాదిస్తున్నాం.

తెల్ల విప్లవం పచ్చ విప్లవం ఎర్ర విప్లవం—ఇలా ఏడు రంగుల విప్లవ నినాదాలు మనం ప్రచారం చేస్తున్నా కళంకితమైన అవినీతి విప్లవం మాత్రమే నల్లగా రాత్రింబవళ్లు మనలను పీడిస్తూ వున్నది. ట్రాక్టర్లు జర్మనీనుండి దిగుమతి చేసుకుంటున్నాము. వాటిని నడిపే యంత్రకారులను మరో దేశంనుండి దిగుమతి చేసుకుంటున్నాము. ఎరువులు ఇంకో దేశం విత్తనాలు మరో దేశం సరఫరా చేస్తున్నది. పెట్టుబడి

మరో పి. ల్ 480 నుండీ, ప్రగతి సిద్ధాంతాలూ కార్మిక చట్టాలూ నిర్వచనాలూ మరో దేశంనుండీ తెచ్చుకుంటున్నాము. ఇన్నీ తెచ్చుకోని ఇంతా శ్రమించి సంవత్సరాంతానికి తిరిగి తిండిగింజలను మళ్లీ మాస్కో గోధుమ పడవలనుండి దిగుమతి చేసుకుంటున్నాము. మరి మనం చేసిందేమిటి?? ఈ అవ్యవస్థకూ అపజయానికీ మూలకారణం ఏమిటి??

### తిరోగమన పథంలో భారత్

ఆర్థికమైన ప్రగతిని సాధిస్తే ఈ జాతి సుభిక్షమవుతుందని మన ప్రణాళికాకారులూ నాయకులూ భావించారు. ఫలితంగా దీర్ఘకాలికమైన ప్రాతిపదికపైన ఈ 'నవీన దేవాలయాలు' ప్రారంభింపబడ్డాయి. ఖర్చు కోట్లకు కోట్లు పెరుగుతున్నా ప్రతిఫలంమాత్రం దశాబ్దాలు గడిచినా రాక, ప్రజ 'ఇది మాకర్మం' అని కర్మసిద్ధాంతానికి దుర్వ్యాఖ్యానం చెప్పకొని దాని చాటున దాక్కొంటున్నది. విదేశీ ప్రణాళికలను భారత జాతీయ పరిస్థితులను కనుగుణంగా మలచుకోవడం (Adaptation) చేతకాక యథాతథంగా దిగుమతి చేసుకోని సద్యోఫలితాల నిచ్చే చిన్న పరిశ్రమలనూ ప్రాజెక్టులనూ నిర్లక్ష్యం చేయడం వల్ల జరిగిన ప్రమాదమిది. యుద్ధంలో సర్వనాశనమైన జపాన్ శ్మశానపు చితా భస్మాల నుండి మూడు దశాబ్దాలలో జాతిని సర్వతోముఖాభివృద్ధికి చేర్చగలిగింది. 'ఇదే వేగంలో పురోగమిస్తే 1980 నాటికి అది ప్రపంచంలో ఏకైక అగ్రరాజ్యం కాగలుగుతుంద'ని ఇటీవల ఒకచోట నేను చదివాను. యాభై ఏండ్లలో రష్యా, పాతికేండ్లలో చైనా అగ్రరాజ్యాలైనాయి. కాని 'ఇండియా దటీజ్ భారత్' ఎందుకని ఇలా అయింది??

దీనికి మూలకారణాన్ని పైపైన విచారిస్తే సమాధానం మనకు కన్పడదు. సరియైన వైద్యుడు శరీరం మీద కన్పడే జ్వరానికీ కురుపులకూ మందు కడుపులో వేసినట్లే 'ప్రగతి' (?) చెందుతున్న కొద్దీ పరాజయమూ తిరోగమనమూ చెందే ఈ జాతీయ రోగానికి 'నిదానం'గా పరిశీలించి ఔషధాన్ని బయట' కాక లోపల వేయవలసి వుంటుంది.

### అర్థం పరమార్థమూ?

ఈ సందర్భంలో ముందుగా మనం గమనించవలసిన ప్రాథమిక సత్యం ఆర్థికాభివృద్ధితో ఈ జాతి సుఖవంతం అవుతుందనేది భ్రమ మాత్రమేనని. అదే నిజమైతే అందరికన్నా ఎక్కువ సంపాదించే బ్యాంకు ఆఫీసర్లు ఇంజనీర్లూ పైలెట్లూ జీతాలు చాలడం లేదని ఎందుకు సమ్మెలు చేస్తున్నారు? జీతాలు పెరిగిన కొద్దీ ధరలు ఎందుకు పెరుగుతున్నాయి? తక్కువ పని ఎక్కువ జీతం' అనే నినాదంలో ఆందోళనలే తప్ప 'తక్కువ జీతం ఎక్కువ పని నాకు కావాలి' అనే నినాదంతో గత పాతికేళ్ల చరిత్రలో ఒక్కరైనా సమ్మె నడిపినట్లు నాకు తెలియదు. కాని ఏ జీతమూ మంత్రి పదవీ ఆశించకుండానే గాంధీజీ ఎందుకంత ఉద్యమం నడిపారు? ఏ 'ఎక్స్పో 70'లు చూడాలనే మోజు లేకుండానే వివేకానందుడు పరివ్రాజకుడై ప్రపంచమంతా ఎందుకు తిరిగాడు? ఎందుకు భగత్‌సింగ్, చంద్రశేఖర్ అజాద్, రాజగురు — సావర్కార్‌లు చిరునవ్వులతో ఉరికొయ్యల మీదికి ఉరికి—మృత్యువునే భయపెట్టగలిగారు? ఈ మహనీయ కీర్తికి మూలకారణమైన స్ఫూర్తి వారికి ఏ అంతరాంతరాళాలలోనుండి వచ్చింది?? మృణ్మయులైన ఈ మానవులను చిన్మయులను చేసిన 'శక్తి' ఏమిటి??— దానినే మనం అన్వేషించాలి.

### ప్రతి క్రియాత్మక సమైక్యత

ఆర్థికాభివృద్ధి సాధిస్తేనే సమస్యలు తీరుతాయనేదే నిజమైతే మొదట, సర్వసంపన్నమైన భారత దేశం గజినీ గోరీ తైమూర్లూ నాదిర్షాలచేత ఎందుకని దోపిడీ చేయబడింది? వేయేండ్లుగా ఎందుకని బానిసతనం అనుభవించింది? ఆంగ్లేయులు వెళ్లడమే సర్వరోగనివారిణి అయితే—వెళ్లాక ఇంకా అనైకమత్యం ఎందుకు పెరిగింది? ఇంకా పరాధీనత ఎందుకు ఎక్కువైంది??ఆంగ్లేయులతో పోరాడేటప్పుడూ చైనా పాక్ దండయాత్రల సందర్భంలోనూ మాత్రమే జాతి సమైక్యమైనట్లు కన్పడి ఆ తర్వాత ఎందుకు విఘటితమవుతున్నది— శత్రువులు ఉన్నారన్న ప్రతి క్రియా భావంతో వచ్చిన 'సమైక్యత' శత్రువులు పోగానే తొలగిపోవడం సహజం. కాబట్టే ఈ జాతిలో సమైక్యత శాశ్వతమైన ప్రాతిపదికపై నిర్మింపబడలేదు. ఇది ఈ జాతి పతనానికీ నాడూ నేడూ కూడా మౌలికమైన కారణం.

ఆరోగ్య సౌభాగ్యములకు
మహిళలు ఆధారపడునవి -

ఆరోగ్య అనారోగ్య పరిస్థితులలో

లోధ్ర



గర్భపోషణకు,
సుఖ ప్రసవమునకు

గర్భరక్షక



వేవిళ్ళకు, మలబద్ధకమునకు :

మాదీఫల రసాయనం



ప్రసవానంతరం బలమునకు
క్షీరవృద్ధికి

సౌభాగ్య శొంఠి



73 సంవత్సరములకు పైగా
ప్రసిద్ధినొందిన ఔషధములు

కేసరి కుటీరం ప్రైవేట్ లి.
మద్రాసు - 14.

ఏజంట్లు : సీతారామ జనరల్ స్టోర్సు (ఏజన్సీస్)
విజయవాడ.

SWASTIK


### వ్యష్టి — సమష్టి

సమైక్యతకూ సంఘర్షణకూ ఏ దశలోనూ పొత్తు కుదరదు. ఒకటి శాంతిని విస్తరణనూ పిలిస్తే రెండవది కల్లోలాన్నీ సంకోచాన్ని ఆవాహన చేస్తుంది. జాతీయ సమైక్యత ఒక రాజకీయ నినాదం కాదు ఆత్మాన్వేషణలో అనివార్యమైన అవసరం. వ్యష్టికి బహువచనం శక్తి అని అంగీకరించినప్పుడు శక్త్యారాధన ద్వారానే వ్యష్టి పరమసౌఖ్యాన్ని పొందగలుగుతాడని తెలియడం వేరే తత్వం.

దురదృష్టవశాత్తూ వ్యక్తి ఈనాడు తనకు తాను ఒంటరివా డయిపోతున్నాడు. సమష్టి కుటుంబాల నిర్మూలన దగ్గరినుండీ ప్రాదేశిక జాతీయవాద విజృంభణ (Territorial Nationalism) వరకు ప్రపంచంలో ఈనాడు ఒంటరితనమే రాజ్యం చేస్తున్నది. వ్యక్తి తనను తాను క్షేమనుపెట్టి హెచ్చు వేసుకున్నప్పుడు సమాజ పరమేశ్వర సాక్షాత్కారం జరుగుతుంది. భారత జాతీయ జీవనంలో వ్యష్టికీ సమష్టికీ మధ్య సంఘర్షణ కాక సమన్వయమే అనాదిగా ప్రతిపాదించబడింది. సామ్యవాదానికీ సామ్రాజ్య వాదానికీ బదులుగా ఈ సమన్వయ వాదాన్ని ఏ వివేకానందుడో నేడు ప్రపంచం ముందు ఆదర్శ జీవనానికి మౌలిక సూత్రంగా ప్రతిపాదించవలసిన అవసరం ఏర్పడింది.

### ఇంద్రియాణి పరాణ్యాహుః

ఉద్యోగులు కీసులు చేయకుండా జీతాలు తీసుకుంటున్నారనీ విద్యార్థులు చదవకుండా డిగ్రీలు కావాలంటున్నారనీ వ్యాపారస్థులు శ్రమించకుండా రాత్రికి రాత్రి ధనవంతులు కావాలనుకుంటున్నారనీ అర్హతలు లేకుండా రాజకీయ నాయకులు ధనంతో పదవులు కొనుక్కుంటున్నారనీ ఈనాడు అనుదినమూ మనం వింటూ చదువుతూ వుంటాం. వీటన్నిటి వెనుక ఇంద్రియాలను సుఖపెట్టాలనే మనస్తత్వం మౌలికంగా కన్పడుతుంది. ఇది మనకు కొత్తకాదు 'అప్పుచేసి పప్పుకూడు తిను—చచ్చాక తీర్చేవాడెవడు? వచ్చేవాడెవడు?' అన్న చార్వాక వాదం 4 దగ్గరినుండీ 'అహంబ్రహ్మాస్మి' అన్న పూర్ణాద్వైతం వరకూ అన్ని విధాలైన తాత్విక చర్చలూ ఈ గడ్డ మీద జరిగాయి. అయితే మన ఋషులు ఇంద్రియసుఖాలు

చాలా తాత్కాలికమైనవనీ అల్పమైనవనీ పరిణామంలో దుఃఖ హేతువులనీ అనుభవంమీద గ్రహించారు. సుఖం ఇంద్రియానుభవంలో కాక మనస్సులో వుందని తెలుసుకున్నారు. అయితే మనస్సు కూడా స్వతంత్ర శక్తి కలది కాదనీ అది బుద్ధికి అనుగుణంగా పని చేస్తుందని వారు విశ్లేషించారు. ఆ బుద్ధి కూడా ఆత్మకు వశవర్తిగా సంచరించినప్పుడే వ్యక్తి ఆనందం పొందగలుగుతాడని నిర్వచించారు. అంటే విదేశాలలో అర్థం ప్రాతిపదికగా రాజకీయ సాంఘిక సాంస్కృతి కోద్యమాలు విప్లవాలూ వస్తే మన దేశంలో పరమార్థం ప్రాతిపదికగా సమాజ రచన జరిగింది. అర్థం కాక ఆత్మను కేంద్ర బిందువుగా మన వారు స్వీకరించారు.

## చిత్ – జాతీయాత్మ

ప్రతి వ్యక్తికీ ఒక ఆత్మ ఉన్నట్లే మొత్తం జాతికీ ఒక సమష్టి చైతన్యం వుంటుంది. దీనినే 'చిత్' లేక 'జాతీయాత్మ' అని మనం పిలువవచ్చు.[6] ఈ 'చిత్'యొక్క జాగరణమీద జాతీయ వైభవం ఆధారపడి వుంటుంది. తిలక్ గణేశోత్సవాల ద్వారానూ గాంధీజీ రాట్నం ద్వారానూ ఉప్పు ద్వారానూ ఈ 'చిత్'ను జాగరణ చేయడానికి ప్రయత్నించారు. వ్యక్తి వ్యష్టిగా బలహీనుడైనా చిదాత్మలో — సమాజ విరాట్స్వరూపంలో చాలా ఉన్నతుడు కావచ్చు. ఒక జాతియొక్క ఉన్నత వైభవమూ 'చిత్' మీద ఆధారపడ్డదని మనం అంగీకరించినప్పుడు నేడు భారతదేశం ఆర్థిక పారిశ్రామిక రంగాలలో పురోగమించినట్లు కన్పడుతున్నా అవినీతి లంచగొండితనమూ ఆశ్రిత పక్షపాతమూ శ్రమయెడల విరక్తి లైంగిక ప్రవృత్తుల అతివేలమైన విజృంభణా, అరాజక ధోరణులూ ప్రబలుతున్నాయంటే ఈ 'చిత్' జాగరణ చెందలేదని అర్థం చేసుకోవాలి.

సమాజంలో హిమాలయ శిఖరాలవంటి సమున్నతులు కొందరు వుండవచ్చు. లేదా తృణ సదృశులైన బలహీనులు మరికొందరు ఉండవచ్చు. ఈ విభిన్నతలు వ్యక్తికి సంబంధించినవి. కాని సమష్టి చైతన్యంలో వ్యక్తిత్వం 'మరుగున'పడిపోయి జాతీయాత్మ సాక్షాత్కారం చెందినప్పుడు ఉన్నతులు సమాజం దగ్గరికి దిగి వస్తాను. బలహీనులు జాతీయావసరాలకు అనుగుణంగా ఎదుగుతారు. గాంధీజీ దిగివస్తే సత్యాగ్రహులు ఎదిగారు. అరవిందుడు దిగివస్తే అరవిలో ఆవిర్భవించింది. సామ్యవాద వ్యవస్థలో వ్యక్తిత్వం నిర్మూలింపబడుతుంది. పెట్టుబడిదారీ వ్యవస్థలో బలవంతులైన కొందరు వ్యక్తులు మొత్తం సమాజాన్ని పిడికిట బిగిస్తారు. కాని మన జాతీయ విధానంలో వ్యక్తి తన ఆత్మానందంకోసం సమిష్టి చైతన్యంతో 'తాదాత్మ్యం' చెందుతాడు.[7] తాదాత్మ్యంచెందినా వ్యక్తి నిర్మూలింప బడడు. అనుభవానికి కేంద్ర బిందువు వ్యక్తియే !!

## పునరుద్ధరణకై తపస్సు

అంటే జాతి భౌతికంగా పొందినట్లు కన్పించే ప్రగతి మొత్తం బలుపుకాక వాపుగా మనం నేడు గుర్తించాలి.[8] అలాగే నేడు కన్పడే అవ్యవస్థ అరాజక తత్వమూ విదేశీ సిద్ధాంతాల జీవన విధానాల అనుసరణ ఫలితమేననీ మనం గ్రహించాలి. గత అర్థ శతాబ్దంగా ఈ జాతిలోని 'చిదాత్మ'ను జాగరణ చేసేందుకై వివిధ రంగాలలో గాంధీజీ, తిలక్, మాలవీయా, రవీంద్రారవిందాదులు ప్రయత్నాలుచేస్తూ వచ్చారు. ఈ చిదాత్మయొక్క జాగరణకై నిర్విరామంగా నిశ్శబ్దంగా నేడూ తపస్సు సాగుతూనే వుంది. మానవతకు మకుటంపెట్టే ఈ వాదం, వేదం, విజయం పొందడమే జాతిలో జరుగబోయే మహత్తర పరివర్తనం! అది జరిగిన నాడు వ్యష్టికీ సమష్టికీమధ్య—భౌతిక వాదానికీ ఆధ్యాత్మిక దర్శనానికీ మధ్య[9] జాతీయతకూ అంతర్జాతీయతకూ నడుమ[10] సంఘర్షణా వైరుధ్యము గోచరించదు. సమన్వయమూ తాదాత్మ్యమూ సాక్షాత్కరిస్తుంది. భగద్దగితమైన ఆ ప్రభాతారుణ ప్రసారానికై ఈ జాతి ఎదురు చూస్తున్నది !!

వివరణ :

1. An experiment with Truth. Sri M. K. Gandhi.
2. స్వామి వివేకానంద (సంపూర్ణ గ్రంథావళి.)
3. 'ఏతద్దేశ ప్రసూతస్య సకాశా ద్గ్రగ జన్మనః
స్వంస్వం చరిత్రం శిక్షేరన్ పృధివ్యాం సర్వమానవాః' (మనుస్మృతి—2—20.)
4. 'యావజ్జీవే త్సుఖం జీవే దృణం కృత్వాఘృతం పిబేత్
భస్మీ భూతస్య దేహస్య పునరాగమనం కుతః'
'స్వర్గస్థితా యదాతృప్తిం గచ్ఛేయుస్తత్ర దానతః
ప్రాసాదస్యో పరిస్థానా మత్ర కస్మాన్న దీయతే' (చార్వాక మతము—బృహస్పతి.)
5. 'ఇంద్రియాణి పరాణ్యాహు రింద్రియేభ్యః పరం మనః
మనసస్తు పరా బుద్ధిర్యో బుద్ధే పరతస్తుసః' (గీత—3—42.)
6. ఏకాత్మతా మానవ వాదం—శ్రీ దీనదయాల్ ఉపాధ్యాయ.
7.



పాశ్చాత్య జీవన పద్ధతి.



భారతీయ జీవన పద్ధతి.

8. 'పాశ్చాత్య ప్రపంచం ఆధ్యాత్మిక అవినాభావ సంబంధమైన సమన్వయ ప్రవృత్తికి స్వస్తి చెప్పతూ వైవిధ్యానికే ప్రాధాన్యత నిస్తూ తన స్వంత పేరు ప్రతిష్ఠలు నిలబెట్టుకోడానికి తాపత్రయ పడ సాగింది. అందుచేతనే కొన్ని శతాబ్దాలనుంచి పాశ్చాత్య ప్రపంచం దృష్టి ఐహిక వాంఛాగ్రస్తమైంది. వాటిని నిలుపుకునేందుకు పశు బలప్రయోగం చేయసాగింది. దానివల్ల భౌతిక ఆధ్యాత్మిక శక్తుల సమన్వయానికి అవసరమైన ఏకస్వనమూ, శ్రావ్యతా సన్నగిల్లాయి.........ఈ సందర్భంలో భారతదేశంపై తన విజయ పతాకం ఎత్తడానికి, విశ్వప్రయత్నాలు చేసింది కూడా. (అరవిందులు : The Foundations of Indian Culture)

9. 'దీనికంతు తెల్చుకోవడానికి తగిన మార్గం ఇటు ఆధ్యాత్మిక మానసిక శక్తులను అటు భౌతిక తత్వాలను సమన్వయం చేయడం.' ('అరవిందులు—అదే గ్రంథం)

10. 'భారతదేశం సమస్త మానవాళికోసమే నిలిచివుంది. కాని కేవలం తన కొరకే కాదు. భారతదేశ వైభవం విశ్వమానవ వైభవానికే కాని కేవలం తనకొరకు కాదు.'

(అరవిందులు—'ఉత్తరపారా' ప్రసంగం)

స్వర్ణోత్సవము జరుపుకొనే

"భారతి" కి

మా శుభాకాంక్షలు!



శ్రీ వి. విశ్వేశ్వరరావు

**విశ్వశాంతి పిక్చర్స్**

50-ఎ, ఉస్మాన్ రోడ్డు

మద్రాసు-600017.

# తెలుగు నాటకాలు

డాక్టర్ పోణంగి శ్రీరామ అప్పారావు

తెలుగులో నాటక రచన రెండు దశలలో రెండు విభిన్న శాఖలుగా సాగినది---తెలుగులో సాహిత్యము ఆరంభమైన కాలంనుంచి ఇంచుమించుగా క్రీ. శ. 1860 వరకు మొదటిదశ; ఇది యక్షగాన వీథి నాటకాల యుగము. ఇంక రెండవదశ క్రీ శ. 1860 నుంచి; ఆంగ్ల, సంస్కృత నాటకాలు ఆదర్శంగా రచన జరిగిన యుగమిది. న్యాయ్యంగా ఈ రెండవ దశలోని రచనలకు మొదటి దశలోని రచనలు పునాది కావలె; కాని, అట్లా జరగలేదు. ఈ రెండు దశలకు మధ్య ఎటువంటి సమన్వయంలేదు---ఇది ఒక విచిత్రమైన సత్యము.

ప్రస్తుతాంశము రెండవదశ. తెలుగు దేశంలో ఆధునిక నాటక రచనా ప్రదర్శనాలకు దారి తీసినవారు కళాశాలలలో, పాఠశాలలలో పనిచేసిన ఉపాధ్యాయులు; ప్రధానంగా తెలుగు పండితులు. ఈ నాటకాలను ప్రదర్శించిన సమాజాలకు వారే అధ్యక్షులు; దర్శకులు కూడా వారే. వీరి రచనలకు అటు ఆంగ్ల నాటకాలు (ప్రధానంగా షేక్స్పియర్ రచనలు), ఇటు సంస్కృత నాటకాలు మార్గదర్శకాలైనవి. ఇంక నటులకు ఇతర రాష్ట్రాలనుంచి సంచారం వచ్చిన నాటక సమాజాల ప్రదర్శనలు మార్గదర్శకాలైనవి. ఈవిధంగా తెలుగు దేశంలో ఆధునిక నాటక రచన క్రీ. శ. 1860 ప్రాంతాల, నాటక ప్రదర్శన క్రీ. శ. 1880 ప్రాంతాల ఆరంభమైనవి.

ఈ ఆధునిక యుగంలో చాలా దశలున్నవి. ఇందులో తొలిదశకు సంబంధించినవారు నలుగురు. వీరిలో ప్రథములు శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రి (బందరు); వీరు 'మంజరీ మధుకరీయము' అనే ప్రకరణాన్ని స్వతంత్రంగా కీ. శ. 1860 ప్రాంతాల రచించినారు (ముద్రణ మాత్రము చాలా ఆలస్యంగా 1908 లో జరిగింది.) తరవాత 1871 లో శ్రీ కొక్కొండ వేంకటరత్నం పంతులు 'నరకాసుర విజయము' అనే సంస్కృత వ్యాయోగాన్ని ఆంధ్రీకరించి, 1872 లో ప్రకటించినారు. సంస్కృత రూపకానువాదంలో ఆనాడు వీరు అనుసరించిన పద్ధతి—అంటే శ్లోకాన్ని పద్యంలోకి, వచనాన్ని వచనంలోకి అనువదించటం మొదలైనవి—నేటికీ అమలులో ఉంది. శ్రీ పరవస్తు వేంకటరంగాచార్యులు 1872 లో కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలాన్ని అనువదించి, రెండంకాలు వారి పత్రికలో ప్రకటించినారు. మూలంలోని ప్రాకృత భాషల స్థానంలో ఆచార్యుల వారు అచ్చతెలుగు ప్రవేశపెట్టినారు. 1875 లో కోరాడవారి శిష్యులు శ్రీ వావిలాల వాసుదేవశాస్త్రి అనే పట్టభద్రులు షేక్స్పియర్ నాటకం 'జూలియస్ సీజర్'ను 'సీజరు చరిత్రము' అనే పేర ఆంధ్రీకరించి ప్రకటించినారు. నాటి సంఘంలోని అంతఃకలహాలను నిరూపిస్తూ 'నందకరాజ్యము' అనే స్వతంత్ర సాంఘిక రూపకాన్ని కూడా 1880 లో వీరు ప్రకటించినారు. కాగా వావిలాలవారు ఆంగ్ల రూపకాంధ్రీకరణకు పూనుకొన్న ప్రథములేకాక స్వతంత్ర సాంఘిక రూపకకర్తలలో కూడా ప్రథములే. అంతేకాదు. ఈ రెండింటిని తేటగీతలలో రచించటంవల్ల వీరు తొలి పద్యనాటకకర్తలు కూడా అవుతున్నారు. ఈ నలుగురి నాటకాలు ప్రదర్శింపబడినట్లు కన్పట్టదు. అందుచేత వీరు మొదటిదశకు, అంటే రచనారంభదశకు చెందినవారు అవుతున్నారు.

రెండవదశ—ఆధునిక నాటక ప్రదర్శనారంభ దశ. క్రీ. శ. 1880---81. ప్రాంతాల ధార్వాడ నాటక సమాజ మొకటి తెలుగు దేశంలో సంచారం చేసి ఆధునిక పద్ధతులలో అనేక నాటకాలు ప్రదర్శించింది. ఆ ప్రభావానికి లోనైన కందుకూరి వీరేశలింగం పంతులుగారు 1880 లో విద్యార్థి నాటక సమాజాన్ని స్థాపించి, ఆ సమాజంచేత స్వీయరచనలు ప్రదర్శింప జేసినారు. ధార్వాడ నాటకసమాజ ప్రదర్శ

నాలవల్ల తెలుగు దేశంలో ఒక కొత్త చైతన్యం వచ్చింది. 1886 లోపల గుంటూరు, బందరు, కాకినాడ, విశాఖపట్టణము మొదలైన ముఖ్య పట్టణా లన్నింటిలో నాటక సమాజాలు వెలసినవి. ఈ దశలో నాటకకర్తలే సమాజ స్థాపకులు, అధ్యక్షులు, దర్శకులు.

వీరేశలింగం పంతులుగారి తొలి స్వతంత్ర రచన బ్రాహ్మ వివాహము, సంస్కృతాంగ్ల నాటకాల కనువాదాలైన రత్నావళీ—చమత్కార రత్నావళులు 1880 లోనే ప్రదర్శింపబడినవి. చమత్కార రత్నావళి షేక్స్పియర్ నాటకమైన 'కామెడీ ఆఫ్ ఎర్రర్స్'కు అనుసరణము. పంతులుగారు దీనికి దేశీయతా ముద్ర వేసి, స్వతంత్ర రచన అనే భ్రాంతి కలుగజేసినారు. గుంటూరులో కొండుభొట్ల సుబ్రహ్మణ్య శాస్త్రి గారు 1881—85 ప్రాంతాల 'గుంటూరు హిందూ నాటక సమాజము (దీనికి ఫస్టుకంపెనీ' అని తరువాతిపేరు) స్థాపించి, గయోపాఖ్యానము, హరిశ్చంద్ర, యుగంధర విజయము, ద్రౌపదీ వస్త్రాప హరణము మొదలైన ముప్పది వచన నాటకాలు రచించి, ప్రదర్శింప జేసినారు (కాని, ఈ వ్రాత ప్రతులన్నీ నశించి పోయినవి). అర్వాచీనకాలంలో సుప్రసిద్ధాలైన నాటకాల కథలన్నింటినీ కొండుభొట్ల వారు ఆనాడే నాటకీకరించి నారని చెప్పవచ్చు. రాజ మహేంద్రవరంలో వడ్డాది సుబ్బారాయడు (వ. సు. రాయకవి)గారు 1883 ప్రాంతాల 'హిందూ నాటకో జ్జీవక సమాజము' స్థాపించి. తాము అనువదించిన వేణీ సంహారాదులను ప్రదర్శించినారు. అంతేకాదు, తాము స్వయంగా పాత్రధారణ కూడా చేసినారు. కందుకూరివారి అభిజ్ఞానశాకుంతలము (1883), వడ్డాదివారి వేణీసంహారము తెలుగు నాటకరంగాన్ని చిరకాలం పరిపాలించినవని చెప్పవచ్చు. బందరులో నాదెళ్ల పురుషోత్తమ కవిగారు అచ్చటి 'హిందూ నేషనల్ థియాట్రికల్ సొసైటీ' వారి కొరకు 1882—84 ప్రాంతాల రామదాస చరిత్రము మొద లైన ముప్పదిరెండు హిందూస్తానీ నాటకాలనేకాక సత్యహరిశ్చంద్ర మొదలైన తెలుగు నాటకాలుకూడా వ్రాసినారు. వడ్డాదివారివలె వీరుకూడా పాత్రధారణ చేసినారు. కవిగారు హిందూస్తానీలోను, తెలుగులోను కూడా పాత్రానుకూల భాషాప్రయోగంచేసి, పాత్రోచిత భాషా వాదానికి మూలపురుషులైనారు. కొండుభొట్ల వారి సమాజము రాజమహేంద్రవరము మొదలగు పట్టణాలలో కూడా ప్రదర్శనలిచ్చి, ప్రశంసలందినది. 1885 లో కాకినాడలో ఏర్పడిన 'హిందూనాటక సమాజము' లో జయంతి భావనారాయణగారు నాటక కర్తలేకాక నటులు కూడాను.

క్రీ. శ. 1886 ప్రాంతాలనుంచి మూడవదశ ఆరంభమైనది. ఈ దశలో రచన బహుముఖాలుగా విస్తరించినది. 1886 లో బళ్లారిలో ధర్మవరం రామకృష్ణమాచార్యులవారి ఆధ్వర్యంలో 'సరసవినోదినీ సభ' ఏర్పడింది. ఆచార్యులవారు ప్రాచ్య పాశ్చాత్యరీతుల సమ్మేళనంతో చిత్రనళీయము (1887), విషాదసారంగధరము (1889), మొదలైన ముప్పది స్వతంత్ర నాటకాలను రచించి ముఖ్య పాత్రధారణచేసి, 'ఆంధ్రనాటక పితామహ' బిరుదాంకితులైనారు. ఆచార్యులవారు ఉత్తమశ్రేణికి చెందిన నటులేకాక దర్శకులు కూడా. తెలుగులో విషాద నాటకాన్ని స్వతంత్రంగా రచించిన ప్రథములు ఆచా ర్యులవారే. అంకాలలో రంగాలు కల్పించటం, శైలిని ప్రాబంధికం చేయుటం, పద్యాలతోపాటు పాటలను కూడా విరివిగా ప్రయోగించటం మొదలైనవి ఆచా ర్యులవారి రచనలలోని ముఖ్యలక్షణాలు. అసలు, తెలుగు నాటకాలలో పాటల ప్రవేశానికి ఆచార్యులవారే ఆద్యులు. 'సరస వినోదినీ సభ' (S. V. S.) వారు ఆంధ్ర తమిళ—కర్ణాట ప్రాంతాలలో విరివిగా సంచా రంచేసి, ప్రసిద్ధికెక్కినారు. వీరి ప్రదర్శనలచేత ప్రభావితులైన శ్రీ పి. సంబంధం మొదలియార్ ప్రభృ తులు మద్రాసులో 'సుగుణ విలాససభ' (S. V. S.) ను స్థాపించి తమిళ భాషలో రచయితలు, నటులు అయి, పలుభాషలలో నాటకాలు ప్రదర్శింపజేసినారు.

రాజమహేంద్రవరంలో చిలకమర్తి లక్ష్మీనర సింహంగారు 1889 నుంచి గయోపాఖ్యానము మొదలైన నాటకాలను రచించి, స్వీయపర్యవేక్షణలో ప్రదర్శింపజేసినారు. 'హిందూనాటక సమాజము'వారు ప్రదర్శించిన ఈ నాటకాలలో శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులు నాయికా పాత్రలను ధరించి సుప్ర సిద్ధులైనారు. అంతేకాదు, ఆ నాడు గుంటూరులో

కొండా వెంకటప్పయ్యపంతులు, బందరులో కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు, రాజమహేంద్రవరంలో టంగుటూరి ప్రకాశంపతులు నాటకరంగంమీద నాయికా పాత్రధారణచేసి, తరవాతి కాలంలో రాజకీయరంగంలో మహానాయకులు కావటం ఒక విశేషము. చిలకమర్తి వారి గయోపాఖ్యాన, ప్రసన్న యాదవ నాటకాలు తెలుగు నాటకరంగాన్ని గుత్తకొన్నవన్నచో అతిశయోక్తికాదు. గయోపాఖ్యానపు ప్రతులు 1940 నాటికే లక్షకుపైగా అమ్ముడు పోయినవట! నెల్లూరులో వేదము వేంకటరాయశాస్త్రిగారు నాగానందము (1891) మొదలగు నాటకాలను రచించి నెల్లూరు 'ఆంధ్రభాషాభిమాని సమాజము' వారిచే ప్రదర్శింప జేసినారు. శాస్త్రిగారు పాత్రోచిత భాషావాదానికి చేయూత నిచ్చినారు. ఈ దశలో క్రీ. శ. 1897 వ సంవత్సరము తెలుగు నాటక చరిత్రలో చిరస్మరణీయమైనది—వేదమువారి ప్రతాపరుద్రీయము, గురజాడ వేంకట అప్పారావుగారి 'కన్యాశుల్కము' ప్రథమ ముద్రణము ప్రకటితాలైన సంవత్సరమిది. ఈ రెండు నాటకాలు అర్వాచీనకాలంలో విస్తరించిన చారిత్రక, సాంఘిక నాటకాలకు ప్రేరకాలు, మార్గదర్శకాలు అయినవని చెప్పవచ్చు. నాటకాన్ని అంతటిని వ్యావహారిక భాషలో రచించుటకు ప్రయత్నించిన ప్రథములు వీరేశలింగం పంతులుగారే; కాని దానిని తుదిముట్ట విజయవంతంగా నిర్వహించిన ఖ్యాతి అప్పారావుగారికి దక్కినది.

1895 ప్రాంతాల విశాఖపట్టణంలో మారేపల్లి రామచంద్రశాస్త్రి ప్రభృతులు 'కళాభిలాషక నాటక సమాజము' స్థాపించి పెక్కునాటకాలు ప్రదర్శించినారు. శాస్త్రిగారి 'బిల్హణీయము' మొదలైనవి సుప్రసిద్ధాలు. 1895 ప్రాంతాలలోనే వనారస గోవిందరావు 'సురభినాటక సమాజ'మును స్థాపించి, పలువురిచేత నాటకాలు వ్రాయించి ప్రదర్శించినారు (ఇది నేడు ముప్పది నలువది సమాజములుగా విస్తరిల్లినది.) ఇందులోని నటీనటులందరు, సంస్కృత నాటక ప్రస్తావనలలో పేర్కొన్న విధంగా, ఒకే కుటుంబానికి చెందినవారు. స్త్రీలు స్త్రీ పాత్రలను బాహాటంగా ధరించే అలవాటు వీరితోనే ప్రారంభమైనది.

ఈ దశ చివరిభాగంలో నాటక రచన ఆరంభించి, సుమారు ముప్పదేసి నాటకాలువరకు రచించి సుప్రసిద్ధులైనవారు శ్రీ కోలాచలం శ్రీనివాసరావు, శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు, బళ్ళారిలో ధర్మవరంవారికి ప్రత్యర్థిగా 1894–95 ప్రాంతాల 'సుఖమంజరీ పరిణయము'తో నాటక రచన ఆరంభించి, సుమనోవిలాస సభకు ప్రత్యర్థిగా వెలసిన 'సుమనోరమసభ'కు అధ్యక్షులై, చారిత్రక నాటక పితామహులుగా పేరొందినవారు శ్రీ కోలాచలంవారు. వీరు రచించిన రామరాజు చరిత్ర (1907) మొదలగు నాటకాలను ప్రదర్శించి శ్రీ బళ్ళారి (తాడిపత్రి) రాఘవాచార్యులు సుప్రసిద్ధ నటులుగా దేశానికి పరిచయమైనారు. కోలాచలం వారు వేదవాఙ్మయాన్ని పరిశోధించి పెక్కు వ్యాసాలు, గ్రంథాలు ప్రకటించటమేకాక 'ప్రపంచ నాటక చరిత్ర'ను ఆంగ్లంలో రచించి, 1908 లో ప్రకటించినారు. పానుగంటివారు పిఠాపురం మహారాజావారి పోషణలో 1900 లో నాటక రచన (నర్మదాపురు కుత్సీయము) ఆరంభించినారు. వీరి రాధాకృష్ణ (1901), విప్రనారాయణ (1909), కంఠాభరణము (1917) నేటికీ తెలుగు నాటకరంగాన సుప్రసిద్ధాలు. రామాయణగాథ నంతటినీ తెలుగులో నాటకీకరించిన ప్రథములు పానుగంటివారే. (వీరి సాహిత్య కృషిలో రెండవ భాగమైన సాక్షి వ్యాసాల రచన 1913 లో ఆరంభమైనది.)

క్రీ. 1901 నుంచి 1920 వరకుగల కాలాన్ని తెలుగు నాటక చరిత్రలో నాలుగవదశగా పేర్కొనవచ్చు. ఈ కాలమున నాటక రచన అన్నిశాఖలలోను విరివిగా సాగినది. చారిత్రక నాటకాలలో ప్రధానంగా పేర్కొనదగినవి ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణగారి 'రసపుత్ర విజయము, ఉమ్మాలీషాగారి 'చంద్రగుప్తుడు' శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి 'బొబ్బిలియుద్ధ నాటకము' (1909), ధర్మవరం గోపాలాచార్యుల వారి రామదాసు మొదలగునవి. శ్రీ పాద కామేశ్వరరావు, మాచిరాజు దుర్గాశంకరామాత్యుడు ప్రభృతులు వంగాది భాషలనుంచి పెక్కుచారిత్రక నాటకములను ఆంధ్రీకరించినారు. ఈదశలో వెలసినన్ని పౌరాణిక నాటకాలు మరి ఏ దశలోను వెలువడలేదని చెప్పవచ్చు. తిరుపతి వేంకటకవులు మొదలగు వారు సాహితీ గౌరవమునకూడ

భారతి స్వర్ణోత్సవ శుభ సమయమున

మా శుభాకాంక్షలు !



డాల్టన్ సమర్పించు

# 'జీవితరంగము'

నిర్మాత : గుళ్లపల్లి నాగేశ్వరరావు

దర్శకుడు : పి. డి. ప్రసాద్

తారాగణం :

గుమ్మడి చలం

ఎస్వీ రంగారావు (గెస్టు)

చంద్రమోహన్ ప్రమీల

సావిత్రి జయసుధ

రమాప్రభ శాంత

విడుదల : లక్ష్మీ ఫిలింస్

మిన్నలగు రచనలుచేయగా మరికొందరు కేవలము ప్రయోగ సౌలభ్య దృష్టితో, కేవలము సమాజాలను, అందలి నటులను దృష్టిలో పెట్టుకొని విరివిగా నాటక రచన చేసినారు. మల్లాది అచ్యుతరామశాస్త్రి, ద్రోణంరాజు సీతారామారావు, కాశీనాథుని వీరమల్లయారాధ్యుడు, అయినాపురపు సుందరరామయ్య, చక్రావధానుల మాణిక్యశర్మ, విష్ణుభొట్ల సుబ్రహ్మణ్యేశ్వరుడు, సోమరాజు రామానుజరావు (రంగూన్‌రౌడి, ధరణికోట మొ॥) ప్రభృతులిందుల కుదాహరణము. ఈ దశలో వెలువడిన పౌరాణిక నాటకాలలో తిరుపతి వేంకటకవుల 'పాండవోద్యోగ విజయాలు' (1911), బలిజేపల్లి లక్ష్మీకాంత కవిగారి 'సత్యహరిశ్చంద్ర' (1911) శ్రీరాముల సచ్చిదానంద శాస్త్రిగారి 'సావిత్రి' (1915) నేటికీ రంగస్థలమున విజయవంతములగుచున్న రచనలు. 1907 లో కలకత్తా కాంగ్రెసు సభలో స్వరాజ్య తీర్మాన మంగీకృత మవటంతో దేశంలో ఒక కొత్త ఉత్సాహము బయలుదేరింది. కాని, తమ భావాలను బాహాటంగా ప్రకటించటానికి రచయితలు జంకేవారు. అయినా కొందరు రచయితలు ప్రాచీన చారిత్రక పౌరాణిక గాథలను నాటకీకరిస్తూ భంగ్యంతరంగా దేశభక్తి ప్రబోధం చేయసాగినారు. ఇటువంటి నాటకాలలో రస పుత్ర విజయము, పాండవోద్యోగ విజయాలు పేర్కొనదగినవి.

ఈ దశలో సంస్కృత—ఆంగ్ల—బెంగాలీ ప్రభృతి భాషలనుంచి అనేక నాటకాలు అనూదితాలైనవి. ఈ దశలో ప్రహసన రచన కూడా విరివిగా సాగినది. తెలుగులోని ప్రహసన రచనకు ఆద్యులు కందుకూరివారు. తరవాత పేర్కొనదగినవారు చిలకమర్తివారు. పానుగంటివారు. పానుగంటివారి కంఠాభరణము నాటి స్వతంత్ర ప్రహసన రచనకు పరాకాష్ఠ. సెట్టిలక్ష్మీ నరసింహంగారి లుబ్ధాగ్రేసర చక్రవర్తి (1914), వేదము వేంకటాచలయ్యగారి 'విధిలేక వైద్యుడు' (1911) అనువాద ప్రహసనాలలో ప్రధానమైనవి. విధిలేక వైద్యుడు నెల్లూరు మాండలిక భాషలో చేయబడిన రచన. ఈ దశలో కొందరు రాజకవులు—రాజావిక్రమదేవవర్మ, రాజామంత్రిప్రగడ భుజంగరావు, రాజా కోటగిరి వేంకటకృష్ణారావు, రాజా మేకా వేంకటాద్రప్పారావు ప్రభృతులు—పెక్కు నాటకాలు రచించినారు.

ఈ దశలో ఇతరుల నాటకాలకు—కవి కోరిక మీదగాని, సమాజాల కోరికమీదగాని—పాటలను వ్రాసే వాగ్గేయకారులు వెలసినారు. ఇటువంటి వారిలో ప్రధానులు పాపట్ల కాంతయ్యగారు 'సంగీత' అనే ఉపపదం గల నాటకాలు (సంగీత సావిత్రి మొ॥) ఈ దశలో చాలా వెలువడినవి. 1913 ప్రాంతాల నాటక పోటీలు ఆరంభం కావటంతో నటులను గురించి వీరపూజ ఆరంభమైనది. వ్యాపార నాటక సమాజాలు ఆరంభమైనవికూడ ఈ దశలోనే. సమాజాలు, రచయితలు అధికం కావటంతో ఒకే కథను పలువురు చేపట్టటం జరిగింది. ఒక్క అభిజ్ఞాన శాకుంతలానికి ముప్పదికి పైగా అనువాదాలు వెలసినవి! అట్లే స్వతంత్ర నాటకాల విషయంలోను పునరుక్తి అధికమే.

స్వాతంత్ర్య సమరోజ్జృంభణంతో 1920 నుంచి దేశమల్లకల్లోలంగా ఉంది. 1916 లో కలకత్తా కాంగ్రెసు సభలో భాషా ప్రయుక్త రాష్ట్ర విభజన సూత్ర మంగీకృతము కావటంతో ప్రత్యేకాంధ్ర రాష్ట్ర వాంఛకూడా బలపడినది. ఈ స్థితిలో తెలుగునాటక చరిత్రలోని ఐదవదశ ప్రారంభమైనది. సాంప్రదాయకమైన రచనలతో విసిగిపోయిన కొందరు ఈ దశలో కొత్తపోకడలతో రచనలు చేయసాగిరి. ఈ నూత్న ప్రయోగాలు ముప్విధాలుగా సాగినవి. మొదటిది భావ వైవిధ్యము, రెండవది రచనా వైవిధ్యము, మూడవది ప్రదర్శన సౌలభ్యము.

జాతీయోద్యమాన్ని పురస్కరించుకొని వెలువడిన దేశభక్తి నాటకాలలో దామరాజు పుండరీకాక్షుడుగారి గాంధీ విజయము, పాంచాల పరాభవము (1920—22) మొదలగునవి బహుళ ప్రచారము పొందిన రాజకీయ నాటకాలు. ఆంధ్రోద్యమానికి సంబంధించిన నాటకాలలో గ్రంధి సుబ్బారాయ గుప్తగారి ఆంధ్రమాత (1921), ద్రోణంరాజు సీతారామారావుగారి 'ఆంధ్రపతాకము' (1921) తొలి రచనలు. సంఘ సంస్కరణకు సంబంధించిన వాటిలో కాళ్లకూరి నారాయణరావుగారి చింతామణి (1921), వరవిక్రయము (1926) సుప్రసిద్ధాలు. భావకవిత్వోద్యమం చేత ప్రభావితులైన కొందరు రచయితలు నిర్మాణ శిల్పమున దృష్టి కేంద్రీకరించి సాహిత్య రూపకాలను రచించినారు. దువ్వూరి రామిరెడ్డిగారి 'కుంభరాణా'

(1924), విశ్వనాథ సత్యనారాయణగారి నర్తనశాల (1924) ఉత్తమ సాహిత్య రూపకాలేకాక ఉత్తమ విషాద రూపకాలుకూడా. చింతా దీక్షితులవారి 'శబరి' (1925) ఒక అపూర్వమైన రచన; ఇందులో వచనము గేయప్రాయంగా నడిచింది.

ఆంగ్ల సంస్కృతి సంపర్కంవల్ల ఇంచుమించుగా 1900 నుంచీ ప్రబలుతూ వచ్చిన మత—సాంఘిక సంప్రదాయాల తిరస్కరణ ఈ కాలంలో అధికమైంది. ఈ రచనలకు ఆద్యులు శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరి — వీరి రచనలు కురుక్షేత్ర సంగ్రామము (1911), శంబుకవధ (1920), ఖూని(1935). ముద్దుకృష్ణగారు 'అశోకం' (1930) లో 20 వ శతాబ్దం సెక్సుతత్త్వవేత్తల దృష్టితో సీతా—రామ రావణుల ప్రణయాలను చిత్రించినారు. ఆర్యమత సిద్ధాంతాలను, ఆ సాహిత్యాన్ని నిరసించటానికి, ఆ సాహిత్యం నుంచీ కొన్ని ఆధారాలను సేకరించి, వాటిని వ్యాఖ్యానించటానికి పూనుకొన్నారు వీరు. ఇంక గుడిపాటి వేంకటచలంగారు సమకాలిక జీవితాన్ని ఆధారంగా చేసుకొని, అందులోని అవకతవకలను అవహేళనచేసే రచనలను చేసినారు. వీరి నాటకాలన్నింటిలో 'పురూరవ' ఉత్తమ రచన అని చెప్పవచ్చు.

సాహిత్య గౌరవంతోపాటు ప్రదర్శన సౌలభ్యం కూడా దృష్టిలో పెట్టుకొని, రచనలు సాగించినవారు కొప్పరపు సుబ్బారావు (రోషనార-1921, తారాశశాంకము మొ, పింగళి నాగేంద్రరావు (వింధ్యరాణి—1928, నారాజు—1929), శ్రీ పాద సుబ్రహ్మణ్య శాస్త్రి (రాజరాజు, నిగళబంధనము), గుండిమెడ వేంకటసుబ్బారావు (రాణాప్రతాప్, దుర్గాదాసు) ప్రభృతులు (రామరాజు చరిత్ర, రోషనారా ప్రభృతి నాటకాలను ఆనాటి ప్రభుత్వము నిషేధించింది కూడా.) ఈ దశలోని రచయితలు కొందరు మోలియర్, మారిస్ మేతర్‌లింక్, ఇబ్సెన్ మొదలగు పాశ్చాత్య నాటకకర్తల ప్రభావానికిలోనై రచనలు చేయటం గమనించవచ్చు. మోలియర్ ప్రహసనాలను తెలుగులో సుప్రతిష్ఠితం చేయటమేకాక తెలుగులో పెక్కు స్వతంత్ర ప్రహసనాలను వ్రాసినవారు భమిడిపాటి కామేశ్వరరావుగారు. ప్రహసనానికి కళాత్మకస్థాయి చేకూర్చిన ఇంకొక రచయిత మల్లాది వేంకట విశ్వనాథశర్మ (విశ్వనాథ కవిరాజు)గారు (దొంగాటకం, సరాగం, రాజీ మొ॥). మేతర్‌లింకు ప్రభావం విశ్వనాథవారి 'అనార్కలి'లో నోరి నరసింహశాస్త్రిగారి 'తేనెపెట్టె'లో కనబడగలదు. ఇబ్సెన్‌భావ విప్లవంచేత ప్రభావితులై స్వతంత్ర రచనలు చేసిన వారిలో పాకాల వేంకటరాజమన్నారుగారు ప్రథములని చెప్పవచ్చు. వీరి 'తప్పెవరిది' (1930) తెలుగురూపక రచనలో నూతన యుగానికి నాంది పలికినది. నాటికను (ఇది ఏకాంకికమనికూడ పర్యాయ పదము) తెలుగులోను ప్రతిష్ఠిత మొనర్చిన ఖ్యాతి రాజమన్నారుగారిదే. తెలుగులో పద్యనాటికా రచనకు తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రిగారు (సహజయానపంథీ, పద్మావతీచరణ చారణ చక్రవర్తి మొ॥), గేయనాటికా రచనకు బాలాంత్రపు రజనీకాంతరావు (చండీదాసు మొ॥) ఆద్యులు. ఇంక తెలుగు శ్రవ్య (రేడియో) రూపకానికి ఆరంభము చేసినవారు ముద్దుకృష్ణగారు (అనార్కలి—1938) (రూపకము విధిగా ప్రేక్ష్యము లేదా దృశ్య ప్రధానము అనే సిద్ధాంతానికి శ్రవ్య రూపకము అపవాదని గ్రహించవలె). తెలుగులోని ఉత్తమ నాటికలలో తప్పక పేర్కొనదగినది అబ్బూరి రామకృష్ణారావుగారి 'నదీసుందరి' (1932) నాటకరంగ సమస్యలపై వచ్చిన తొలి రచన బి. టి. రాఘవాచార్యుల వారి 'సంగీత ఇంద్రసభ' (1921) పురాణం సూరిశాస్త్రి, పనుమర్తి యజ్ఞనారాయణ, శ్రీ పాద కామేశ్వరరావు ప్రభృతులు నాటక విమర్శపై గ్రంథాలు వెలువరించ సాగినారు.

1928 ప్రాంతాలనుంచి తెలుగు నాటకరంగంలో నిస్తబ్దత ఆవరించిందని చెప్పవచ్చు. వ్యాపార నాటక సమాజాలు అంతరించటంతో కాంట్రాక్టు నాటకయుగ మారంభమై నాటక ప్రదర్శన ప్రహసనప్రాయము కాసాగినది. కాని ఈ కాలంలో కొంతమంచికూడా ఉంది. 1929 లో వనారస గోవిందరావుగారి ప్రయత్నంవల్ల 'ఆంధ్ర నాటక కళాపరిషత్తు' ఏర్పడినది. ఆ ప్రాంతాలలోనే బళ్ళారి రాఘవాచార్యులవారు విదేశ పర్యటన విజయవంతంగా ముగించుకొనివచ్చి నాటక ప్రదర్శనలో సాత్త్వికాభినయానికి ప్రాముఖ్యం ఇవ్వటం మొదలుపెట్టినారు. 1934 లో 'నాట్యకళ' త్రైమాసపత్రిక ప్రచురణ మొదలైనది. హరీంద్రనాథ్ చటోపాధ్యాయ ప్రోత్సాహంతో 1938 లో బందరులో జరిగిన

వేలూరి చంద్రశేఖరంగారి 'కాంచనమాల' ప్రదర్శనము, తెలుగు నాటక ప్రదర్శనలో కొత్తదారి తొక్కినది.

1943—44 సంవత్సరం తెలుగు నాటక రంగ చరిత్రలో నవ్యయుగారంభానికి లేదా ఆరవదశకు చిహ్నమని చెప్పవచ్చు. ఒకపక్క కె. వి. గోపాలస్వామి గారి ఆధ్వర్యంలో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో కళాశాల విద్యార్థులను ప్రోత్సహించటానికై నాటికా—నాటకపు పోటీల నిర్వహణ ఆరంభమైనది. ఇంకోపక్క ఆంధ్ర నాటక కళాపరిషత్తువారు శ్రీ యమ్. ఆర్. అప్పారావుగారి ఆధ్వర్యంలో ఔత్సాహిక నాటక సమాజాలను ప్రోత్సహించటానికి నాటికా—నాటకపు పోటీలు ప్రారంభించినారు. మరోపక్క తెలుగుదేశపు పల్లెసీమలలో కూడా అపూర్వమైన సాంఘిక రాజకీయ చైతన్యాన్ని కలిగించిన 'ప్రజానాట్యమండలి' డా. జి. రాజారావు గారి ఆధ్వర్యంలో అవతరించింది. ఈ మూడు సంస్థల కృషి, మూడు విధాలుగా ఔత్సాహిక నాటకరంగాన్ని పునరుజ్జీవింపజేసినవి. కాగా తెలుగుదేశంలో కొత్త రచయితలు, కొత్త రచనలు, కొత్తనటులు, కొత్త రంగస్థలము అవతరించుట కవకాశములు లభించినవి.

రచనా స్వభావాలను వింగడించి, ఈ రచనలలో గోచరించే సామాన్య లక్షణాలను కింది విధంగా క్రోడీకరించవచ్చు. 1. పరిస్థితుల యథార్థ చిత్రణము; అనగా నాటకాంతంలో ఎట్టి పరిష్కారంకాని, సందేశం కాని లేకుండానే సంఘర్షణమాత్రం సూచించి తక్కిన దానిని ప్రేక్షకుల ఊహకు వదలి వేయటం; 2. సన్నివేశాలను,సంభాషణలను'మెలో—డ్రమెటిక్'గా మార్చటం (ఇందులో కొన్నింట సంఘాన్ని దూషించే ఉపన్యాసాలు, కొన్నింట హత్యల బెదరింపులు, మరికొన్నింట హత్యలు ప్రధానాలుగా ఉంటవి); 3. కేవల వచన నాటకాలనే రచించి రంజనార్థ మచ్చటచ్చట పాటలనుపయోగించటం; 4. స్త్రీ పాత్రలను తక్కువ చేయటం లేదా అసలు లేకుండా చేయటంతో ఔత్సాహిక సమాజాల ప్రదర్శనలకు ఇతోధికావకాశాలు కల్పించటం; 5. కేవలము సమకాలికాలైన—ముఖ్యంగా అసమానత్వ నిరూపకాలైన సమస్యలనే ఇతివృత్తంగా స్వీకరించటం; 6. సంప్రదాయాలపై, కట్టుబాట్లపై, నీతి నియమాలపై తిరుగుబాటు చేయటం.

రచనా విధానంలోకూడా కొన్ని కొత్త ప్రక్రియలు గోచరిస్తాయి. 1. ఫేడివ్ షేడౌట్‌లు వాడి అంక లేదా రంగ విభజన లేకుండా చేయటం; 2. నాటకంలో నాటకం చిత్రించటం; 3. నేపథ్య గానానికి ప్రాముఖ్యమిచ్చి, తన్మూలంగా పాత్రల మానసికావస్థలను ద్యోతకం చేయటం; 4. ప్రేక్షకులను నాటక ప్రదర్శనలో భాగస్వాములను చేయటం; 5. కేవలము మూక రంగాలను సృష్టించటం మొ॥.

పరిషత్తు పోటీలు ఆరంభమైన తొలిరోజుల కాపు కొండముది గోపాలరాయశర్మగారు. వీరి 'ఎదురీత' పరిషత్తు బహుమానం పొందింది. స్వభావ వాదులకు ప్రతినిధి అయిన వారు ఆచార్య ఆత్రేయ గారు. వీరి ఎన్. జి. వో. (గుమాస్తా) రచనా—ప్రదర్శనాలలో కొత్త పుంతలు తొక్కింది. స్వభావవాదాన్ని గ్రామీణ దృక్పథంతో చిత్రించిన వారిలో ప్రముఖులు సుంకర సత్యనారాయణ, వాసిరెడ్డి భాస్కరరావుగార్లు. వీరి ముందడుగు, మా భూమి నాటకాలను చేపట్టి ప్రజా నాట్యమండలి తెలుగు దేశంలో ఒక విప్లవం సృష్టించింది. గ్రామ జీవితంలోని అనుభూతులను, సమస్యలను చిత్రించే నాటికలు రచించినవారు శ్రీ నార్ల వేంకటేశ్వర రావుగారు (కొత్తగడ్డ). కేవలము రేడియోవల్లనే నాటికా రచన చేపట్టిన వారిలో దేవులపల్లి కృష్ణశాస్త్రి ప్రభృతులున్నారు.

తెలుగు నాటక చరిత్ర ఇంచుమించుగా వంద సంవత్సరాలనాటిదే అయినా ఈ భాషలో సుమారు రెండువేల నాటకాలు, సుమారు నాలుగువేలకు పైగా నాటికలు వెలసినవి; సుమారు వేయిమందివరకు రచయితలు కలరు. వీరిని అందరినిగూర్చి వివరించటం సాధ్యం కాదు. కావుననే ఆయా ప్రక్రియలకు దారితీసిన వారిని గూర్చి మాత్రమే పేర్కొనటం జరిగింది.

---

# స్వర్ణ భారతికి

## ప్రతాప్ ఆర్ట్ ప్రొడక్షన్స్ శుభాకాంక్షలు





"తాత-మనవడు"

నిర్మాత సృష్టించిన

మరొక

అపూర్వ సాంఘిక చిత్రం

# "సంసారం-సాగరం"

నిర్మాత : కె. రాఘవ

# హిందూ సంగీతము ప్రాచీనాధునాతన రీతులు

శ్రీ సరస్వతి రామకృష్ణయ్య

## 1. హిందూ సంగీతము:—

1. చతుష్షష్టి కళలలో శ్రేష్ఠమైన హిందూ సంగీతము సామవేదమునకు అనుబంధముగా చెప్పబడిన గాంధర్వ వేదమైన ఉపవేదము. తొలుత గంధర్వులు గాన విద్యను అభ్యసించి వృద్ధిచేసి వ్యాప్తికి కొని వచ్చినందున ఈ విద్యకు గాంధర్వమని పేరు వచ్చి యుండవచ్చును. త్యాగయ్యగారు సంగీతమును 'సామవేదసార' మని వర్ణించిరి. ఇట్లు వేద సంబంధమును గల హిందూ సంగీతము ఇతిహాస సందర్భములకు పూర్వమే అభ్యసింపబడియుండుటను జూడ అది ఎంతప్రాచీనమైన కళ అని వూహింప వచ్చును.

పూర్వాచార్యులైన రాణాయని, జైమిని, వారి శిష్య ప్రశిష్యులే సామ గానమున వినబడు స్వరనాదములను నేరిమిగ పరిశీలించి అవి సప్తస్వరములగునని గమనించి వాటికి ఆరోహణ క్రమముగా షడ్జ, ఋషభ, గాంధార, మధ్యమ, పంచమ, ధైవత, నిషాదము లని నామములను ఇచ్చిరి. ఆ నామముల అద్యక్షరములను క్రమముగా సప్తస్వరాక్షరములు "స, రి, గ, మ, ప, ధ, ని" లుగా వాడుటకు ఏర్పరచిరి.

సామగానమున వినబడు స్వరములు అయిదు. ఇవియే సద్యోజాతాది పంచ వక్త్రజలైన అయిదు స్వరములు. ఇవి సామగాన పాఠ్యమున అవరోహణ క్రమ ప్రయోగములుగా గ, రి, స, ని, ధ (లేక మధ్యమశ్రుతిలో ధ, ప, మ, గ, రి) అను వరుసగా వినబడును. వీటిలో మధ్యస్వరమైన "స" బహుత్వముగాను వాది (ఆధారశ్రుతివలె) స్వరము వలె వినిపించును; మరియు అన్ని ప్రయోగములలోను 'ధ' హ్రస్వముగాను, కడపటి స్వరముగాను వినబడును. పూర్వాచార్యులు ఈ అయిదు స్వరములకు పైగా 'మ' అను స్వరమును క్రింద 'ప' అను మరొక స్వరమును చేర్చి అట్లు లభించిన సప్త స్వరములను, వాదిస్వరమైన 'స' మొదలుగా, ఆరోహణక్రమముగా 'స, రి, గ, మ, ప, ధ, ని' అను సప్త స్వరములను స్థాపించిరి.

ఇట్లు సామవేదమున పుట్టిన స్వరసప్తకము పూర్వ ప్రసిద్ధ 18 మేళములలో రెండవ మేళమైన (గాన) 'సామవరాళి'కి (ఆధునిక పద్ధతిలో వెంకటమఖి సంప్రదాయములోని 72 మేళములలో మూడవదైన అదే (గాన) 'సామవరాళి', లేక ఇప్పటి వాడుకలో 'సంగ్రహ చూడామణి' గ్రంథములోని 72 మేళకర్తలలో మూడవ మేళకర్త ('గానమూర్తి')) సరిపోవునని శ్రీ సుబ్బరామదీక్షితులు (నా పరమ గురువైనవారికి నా వందనములు) తన "సంగీత సంప్రదాయ ప్రదర్శిని" అను గ్రంథములో భరత, మతంగ, శార్ఙ్గదేవ, రామామాత్యులు మొదలైన పూర్వ లాక్షణికుల గ్రంథములను ఆధారముగా చెప్పియున్నారు.

2. సంగీతము 'మార్గ' సంగీతము, 'దేశి' సంగీతము అని ద్వివిధములు:—

1. మార్గ సంగీతము— (Classical music)— శాస్త్ర సమ్మతమై పూర్వమున లాక్షణికులు అమర్చిన లక్షణ విధులను తప్పక వాటిని అనుసరించి అభ్యసించు రాగమును, గీతమును, రెండు లక్ష్యముల చేరిక మార్గ సంగీతమనబడును. (అనగా విద్వాంసులు, పండితులు వ్యాకరణ విధులను అనుసరించి వ్రాయునట్టిదియో, ప్రసంగము చేయునట్టిదియోనుండు భాషవలె నుండునది. (Classical language).

2. దేశి సంగీతము :— శాస్త్ర నియమములను లెక్కచేయక ఆయా ప్రాంత పామరులకుగూడ హృదయరంజకమైన గానము దేశి సంగీతము. (ఇది ఒకే భాషను అనేకులు వారి వారి ప్రాంతములలోని వాడుకనుబట్టి వేరు వేరు విధములుగా వాడు వ్యవహారిక భాష వలె వాడెదరు. (Ordinary colloquial or spoken language):

3. సంగీత లక్షణము:— వీణా వేణు వాదనలు గాత్ర గీత గానమును అనుసరించియు నాట్య నృత్యము ఆ వాద్య వాదనల ననుసరించియు యుండుటను బట్టి గీతమే సంగీతమునకు ముఖ్యమైన లక్ష్యము అగును. కనుకనే గాన విద్య "సంగీత"మను పేరు పొందినది. పౌరాణిక మతములో బ్రహ్మ సామగానలోలుడు, శివుడు నృత్య గీత ప్రియుడు, కృష్ణుడు

వేణుగాన లోలుడు, సరస్వతీ వీణాపాణి యనుట పెద్దల వాక్యము.

II. 1. భరత "నాట్యశాస్త్రము":—

తొలుతటిదియు తరువాతి లాక్షణికులకు మార్గదర్శి గాను, లక్షణ దర్పణముగాను చెప్పదగినది ఈ "నాట్యశాస్త్ర" మను గొప్ప లక్షణ గ్రంథము. ఈ ప్రాచీన గ్రంథమును పాణిని పేర్కొనిన నటసూత్రకర్తలైన శిలాలి— కృశాశ్వుల "నటన సూత్రము"ల సారమును అనుసరించి మొదటి కూర్పు "ద్వాదశ సహస్రి"గా వృద్ధ భరతుడను (ఆది భరతుడు) ఒక "భరతుడు" క్రీ. పూ. 400 లో? "నాట్య శాస్త్రము"ను గ్రంథమును రచించెను. పిదప ఇదే 'నాట్య శాస్త్రము'ను "భరతముని" అను మరొక భరతుడు క్రీ. పూ. 300 లో? ఆ మొదటి కూర్పును సంగ్రహించి "షట్సహస్రి"గా రెండవ కూర్పు "నాట్యశాస్త్రము"ను వ్రాసెను. ఈ రెండవ కూర్పే బహుశా అనేక మార్పులతో మన కిప్పుడు దొరికియున్న "నాట్య శాస్త్రము"ను గ్రంథము. (ఈ ఇద్దరు 'భరతు' లెవరో? వారి స్వనామములు ఏవో? "భరత:" అనునది ఆ కాలములో నాట్యశిఖామణులకు (Master నటుడు) ఇవ్వబడిన బిరుదు నామముగా నుండవచ్చును. భరత = నటుడు (అమరకోశము.)

ఈ Master నటుడైన భరతముని ఒక గొప్ప నాట్య రంగమును, దానిలో తనకుతోడుగా తన కడుగున 104 "భరతపుత్రు"లను యువ్వన నటులను, 24 "అప్సరస"లను (స్త్రీ) నటీమణులను నుంచుకొని నడిపించి యుండవలెనని నమ్మవలసినదిగా నున్నది.

2. శార్ఙ్గ దేవ "సంగీత రత్నాకరము":—

భరతనాట్య శాస్త్రము మొదలు తన కబ్బిన అన్ని ప్రాచీన లక్షణ గ్రంథములను నేరిమిగ పరిశీలించి వాటినన్నిటిని బాగుగా చిలికి తేర్చిన మీగడవలె వాటి సారమును గ్రహించి వ్రాయబడిన "సంగీత రత్నాకరము" (క్రీ. శ. 1230 ప్రాంత మున) అను గ్రంథము భరత ఖండమంతయు పొగడబడినది. దీనిని సంగీత లక్షణములకు మూలాధారగ్రంథమని తరువాతి లాక్షణికులందరును నేటివరకు భావించుచున్నారు. దీని కర్త "నిశ్శంకు"డను బిరుదు వహించిన శార్ఙ్గదేవుడు. ఇతడు కాశ్మీరమునుండి వచ్చిన భాస్కర పండితుని పౌత్రుడు., సోఢలదేవుని పుత్రుడు; యాదవ వంశస్థుడును, దౌలతాబాద్ అనెడి దేవగిరి నగరమున క్రీ. శ. 1210 మొదలు క్రీ. శ. 1247 వరకు రాచరికము చేసిన సిమ్హణరాజు ఆస్థాన పండితుడు. ఈ "సంగీత రత్నాకరము"లో గల విషయ వివరములను, ఈ కాలములో మన కబ్బక వ్యగ్యములై పోయినను, వేదవాక్కుగాను లక్షణ వివరములను సంగీతమునకు శాసనములుగాను సంగీతజ్ఞులు నమ్ముచున్నారు. ఈ గ్రంథము యొక్క ముఖ్యత్వమును గమనించి ఏడు వ్యాఖ్యానములు వ్రాయబడి యున్నవి. వాటిలో ముఖ్యముగా చెప్పబడునది "కళానిధి" అను సంస్కృత వ్యాఖ్య— కర్త చతురకల్లినాథుడు— తోడర కులస్థుడు— లక్ష్మణాచార్యుని పుత్రుడు— విజయనగరమేలిన ఇమ్మడి దేవ రాయల ఆస్థాన పండితుడు— ఈ వ్యాఖ్య క్రీ. శ. 1553 లో వ్రాయబడినది.

3. ప్రాచీన పద్ధతి ననుసరించి సంగీతకళను చతుష్షష్టి కళలతో సహా ఉన్నత అభివృద్ధిపొంది లెక్కకందని లాక్షణికులు, లక్ష్యజ్ఞులు అభ్యసించి సుప్రసిద్ధమై వెలసినది. మౌర్య సామ్రాజ్యము. (క్రీ. పూ. మూడు—నాలుగు శతాబ్దుల మొదలు) గుప్త సామ్రాజ్య (క్రీ. శ. మూడు—నాలుగు శతాబ్దముల వరకు) భరత వర్షములోన స్వర్ణయుగమునకు వెనుక భారత దేశ చరిత్ర సంభవములు దేశమును అంధకారమున మునుగ జేసి, చెప్పువారులేక, నేర్పువారు లేక, ఆనాటి రాజులు తమ అతి బలహీనమైన సంస్థానములలో కళలకును, పండితులకును ఆదరణ ఇవ్వలేక సంగీతమేగాక అన్ని విజ్ఞానములను కొంచెము కొంచెముగా క్షీణించి కాల గర్భములో మునిగి మరుగుబడి వ్యగ్యములైపోయినవి. ప్రాచీన గ్రంథములు మాత్రము కొన్ని కొన్ని చోట్లలో చెరబడి రహస్యముగా యుంచబడి యుండి నందున బ్రతికి చిక్కినవి. ఇట్లు పూర్వ సంప్రదాయములను అనుసరించిన సంగీత లక్ష్య మార్గము బొత్తిగా మరచిపోయినను దేశములో ప్రాంత ప్రాంతమున వేరుబడు దేశీ మార్గ లక్ష్యములు వాడుకలో నుండి తొలగినవి కావు.

భరత నాట్యశాస్త్రమునకు వెనుక దాని ననుసరించి వ్రాయబడిన గ్రంథములలో ముఖ్యముగా చెప్పతగినవి శార్ఙ్గ దేవుని "సంగీతరత్నాకరము"., సోమనాథుని "రాగవిబోధము" అహోబలుని "సంగీత పారిజాతము" మొదలగునవి.

4. "చతుర్దండి ప్రకాశిక":— భరతముని రచించిన "నాట్యశాస్త్ర"మునకు ఈడైన గ్రంథము "చతుర్దండి ప్రకాశిక" అను గ్రంథమే. దీనికర్త వెంకటమఖియను విప్రోత్తముడు. ఇతడే "ఆధునిక కర్ణాటక సంగీత" పద్ధతిని క్రొత్తగా స్థాపించిన మహనీయుడు— గోవింద దీక్షితుని పుత్రుడు—తంజపురి ఏలిన నలుగురు నాయక రాజులలో కడపటి రాజైన విజయ రాఘవనాయకుని (క్రీ. శ. 1633—1673) సంస్థానమును అలంకరించిన వారలలో ముఖ్యుడైన సంగీత లక్షణ లక్ష్యజ్ఞుడు.

ప్రాచీన పద్ధతిని దెలుపు "భరత నాట్య శాస్త్రము", ఆధునిక పద్ధతిని తెలుపు "చతుర్దండి ప్రకాశిక" అను ఈ

రెండు గ్రంథములలో గల పోలికలను, భేదములను పరిశీలించి మన మెరుగవలెను. ఇదిగాక పాశ్చాత్యుల భౌతికశాస్త్రము మూలముగ మనకు లభించు ముఖ్యమైన కొన్ని విషయము లను కూడ మన మెరుగవలెను.

5. నాదము—

1. ఆహతనాదమే సంగీతమునకు మూలాధారము. నాదము సంగీతాంశములైన శ్రుతులు, స్వరములు, రాగములు, చివరి లక్ష్యములైన గీత ప్రబంధములు వీటి కన్నిటికిని ఆధారమై వీనులద్వారా చిత్తమునకు రంజనము నిచ్చును.

నాదము హృదయమునందు (ఉరమునందు) నిలుచు నపుడు మంద్రమనియు, కంఠమునందున్నప్పుడు మధ్య మనియు, శిరస్సునందు తారమనియు చెప్పబడును. తారము మధ్యముకన్న ద్విగుణముగాను, మధ్యము మంద్రము కన్న ద్విగుణముగాను వినబడును. ఈ మంద్ర—మధ్య—తారములే త్రిసా యిలన బడును.

నాదము మూడు విధములుగా బుట్టుచున్నది—(1) శరీరసంభవము (శారీరము)., (2) అప్రాణి సంభవము—వీణాది వాద్యములనుండి పుట్టునది., (3) ఉభయసంభవము—వేణునాదము మొదలైనవి ప్రాణుల సహాయములచేత అప్రాణు లైన వేణువు మొదలైన వాద్యములందు పుట్టునది.

నాదమునకు ముఖ్యమైన అంశము దాని కాలప్రమా ణము—అనగా అది వినబడుకాలము. అవి (1) హ్రస్వము (లఘువు) (2) దీర్ఘము (గురు)., (3) ప్లుతము అని మూడు విధములు.

2. ఇట్లు పూర్వికులు నాదలక్షణములను వివరించిరి. దీనికి పైగా పాశ్చాత్యుల ఆధునిక భౌతిక శాస్త్రము మూలముగా మనమెరుగు నాదము యొక్క కొన్ని లక్షణములు:—

(1) నాదము (Musical sound) నకు కారణ మైన దాని వేపనములు (Vibrations) బలముగా నుండిన (Greater amplitude) బలమైన ధ్వని గలదిగాను, హీన ముగ నుండిన హీన ధ్వని (Low intensity) గాను విన బడును.

(2) వేపనముల త్వరితమును (Frequency) బట్టి నాదము యొక్క శ్రుతి (Pitch) తీవ్రముగానో (Acute లేదా Sharp), లేక కోమలముగానో (Bass లేదా Low లేదా Grave) వినబడును. మంద్రస్థాయి షడ్జము 128 వేపనముల సంఖ్య గలదిగాయెంచిన, మధ్యస్థాయి షడ్జము ($128 \times 2=$) 256 వేపనముల సంఖ్య గలదిగాను, తారస్థాయి షడ్జము ($256 \times 2=$) 512 వేపనములు గలదిగాను. అతి తారస్థాయి షడ్జము ($512 \times 2=$) 1024 వేపనములు గలదిగాను ఉండును. వాద్యములలో మట్టుకు వీటికన్న నాదము క్రింద మందము గాను, పైన తీవ్రముగాను వాడబడుట గలదు.

(3) నాదము యొక్క ముఖ్యమైన లక్షణము—

ఒక నాదము తన ఆధార (క్రింది) శ్రుతి త్వరితసంఖ్య (Fundamental frequency number) మట్టుకు గాక అనేక లెక్కకందని స్వయముగా బుట్టిన "స్వయం భువులు" అనగా స్వరపములు, వాటికి గల త్వరిత భావ ములతో చేరి మొత్తముగా ఒకే సమయమున ఒకే నాదముగా వినబడును. అట్లు వినబడు స్వరములను "భిన్నరవములు" (Partials) అని చెప్పుదురు. ఈ భిన్న రవములు క్రమముగా, ఆధార నాదముయొక్క త్వరితము (Frequency) 1 అనిన, రెండవ భిన్నరవము రెండిం తల—2 త్వరితముగను, మూడవ భిన్నరవము మూడిం తల—3 త్వరితమును, నాలుగవ భిన్నరవము నాలుగింతల 4 త్వరితమును ఇట్లు వరుసగా లెక్కకందని భిన్నరవములు వాటికి గల త్వరితములతో మొత్తముగా చేరి ఒకేనాదము గలదిగా మొదటి ఆధారనాదము వినబడును. ఈ భిన్న రవముల త్వరితములు వరుసక్రమముగా 1, 2, 3, 4, 5, 6, 7, 8 .... లుగా నుండును. వీటిని పాశ్చాత్యులు (Harmonics) అని అందురు. ఇట్లు కలుగు 6 భిన్న రవములకు పైగా స్వరములు (భిన్నములు) మనకు ముఖ్యములు కావు. అవి చాల బలహీనములై వీనులకు వినబడవని చెప్పవచ్చును.

(4) ఆధార భిన్నరవమును ఆధారనాదము—(First partial) ఆధార షడ్జమని యెంచిన పై భిన్న రవ ములలో (Upper partials లేదా Over tones) రెండవ భిన్న రవము రెట్టింత త్వరితము గలదిగా తారషడ్జముగా వినబడును (భిన్నరవత్వరిత పొంతనము—స: స=1:2)., మూడవ భిన్నరవము మూడింతల త్వరితముగలదిగా తారపంచమముగా విన బడును (పొంతనము— స: ప=1:3)., నాలుగవది ఇట్లే అతి తార షడ్జముగా వినబడును (స : స=1:4 ., ఐదవది అతితార గాంధారముగా (అంతర) వినబడును (స: గ = 1:5)., ఆరవది అతి తార పంచమముగా వినబడును (స: ప = 1:6).

ఇట్లు స్వరములుగా బుట్టి షడ్జ, తారషడ్జ, తార పంచమ, అతి తారషడ్జ, అతి తార అంతర గాంధార, అతి తార పంచమ (ఆరు) స్వరములు చేరి ఒకేనాదముగా,

# బంగారు 'భారతి' కి బంగారు భవిష్యత్తు

నేను పుట్టిన తరువాత యెన్నో పత్రికలు మనుషుల్లాగా పుట్టిపోతున్నాయి.

నాకంటె ముందు పుట్టిన పత్రిక యిదొక్కటే నేమోనని దీని వయస్సును ఈ 50 ఏడు పండుగనుబట్టి తెలుసుకున్నాను. భారతి లాగా మరికొన్ని పత్రికలు వెలయాలని, మన సంస్కృతి అవున్నత్యాన్ని కాపాడాలని కోరుతున్నాను.

నేను వున్నా లేక పోయినా, భారతి చిరకాలం ఉండాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను.

ఇట్లు

విూ

**రాజబాబు**

స్వరముగా, వినబడుటచే ఆస్వరము మన చెవికి ఇంపు కలిగించుట కాశ్చర్యమేమి! నాదమునకు ఈ స్వభావమే (timbre) చాలముఖ్యమైన లక్షణము.

(5) పైన వివరింపబడిన స్వరములను పూర్వ గ్రంథకర్తలలో అహోబల పండితుడు మాత్రము తన గ్రంథము "సంగీత పారిజాతము" లో కొంత వరకు సూచించి యున్నాడు. అతడు వీణా వాద్యములో సారణి తంత్రిని ధ్వనించి షడ్జము పలుకు ననియు, అదే తంత్రిని అది ధ్వనించు చున్నప్పుడే దాని కొలతలో మధ్యమున (సగమున) వేలుతో తాకిన తారషడ్జమును, మూడవ భాగమున తాకిన తార పంచమమును, పాతిక భాగమున తాకిన అతి తారషడ్జము పలుకునని చెప్పి, అంతకుపైన మిగిలిన భిన్న ప్రదేశములో అంతరగాంధారము పలుకగలదని చెప్పియున్నాడు.

(6) భిన్న రవములను (స్వరములను) వాటియొక్క త్వరిత సంఖ్యలను త్రివిధక్రమముగా వ్రాసిన అవి ఇట్లు తేలును——

A. 1, 2, 4, 8, 16, 32, ..... ఇవి అన్నియు (వాది) షడ్జముల— ఐక్యములు (Unisons);

B. 3, 6, 12, 24, 48, ....... ఇవి అన్నియు పైవాటికి సంవాదులైన పంచముల— ఐక్యములు.,

C. 5, 10, 20, 40, 80, .....ఇవి అన్నియు అంతర గాంధారములు (షడ్జ—పంచమములతో చేరి Harmony కలిగించు ఐక్యములు).

వీటిలో మొదటి ఆరింటిని మొదటి (మధ్య) స్థాయిలోని శ్రుత్యంతర ప్రదేశమునకు తెచ్చిన అవి ఈ విధముగా తేలి వినబడును—స, గ, ప, స., వాటి త్వరితములు ఈ లెక్క క్రమముగా నుండును—1:5/4 : 3/2 : 2. వీటిని గమనించిన పాశ్చాత్యుల Harmonic సంగీతమునకు ఇవియే ఆధారమని తెలియ వచ్చును.

(7) ఏవైన రెండు నాదములు (స్వరములు) ఒకటి A త్వరితముతోను, మరొకటి B త్వరితముతోను, ఒకే సమయములో చేరి ధ్వనించునపుడు రెండు Resultant notes) 'ఉప'లేదా 'తోడు' స్వరములు మన లోచెవిలో ఏ భౌతిక రూపమును లేక ఉదయించి వినబడును. వాటిలో (Addition note) ఒకటి (A+B) త్వరితము కలిగినదియు, రెండవది (Difference note) (A—B) త్వరితము కలిగినదియు అగును. వీటిలో మొదటిది చాల హీనమైనది, రెండవది కొంచెము బలముగలదిగా మొదటి రెండు నాదములను కొంచెము బాధించు శక్తి కలదియైనందున ముఖ్యమైనది. ఈ కారణమువల్లనే ఒకే స్వరము వేరువేరు సంచారములలో ధ్వనించునప్పుడు వాటిలోని ఇతర స్వరముల చేరికవల్ల గలిగిన స్వరవములు వేరువేరు విధములుగా బాధించుట బట్టి ఆ స్వరము వేరువేరువిధ భావముల గలదిగా వినబడును.

VI. శ్రుతులు—

1. షడ్జమునకును తారషడ్జమునకును మధ్యగల శ్రుత్యంతర ప్రదేశములో, అనగా ఒక స్థాయిలో, స్వరూప మాత్రశ్రవణము చేత గ్రహింపదగిన అనుకరణాత్మకమైన నాద విశేషములగు ద్వావింశతి (22) "శ్రుతులు" గలవని పూర్వమునుండి ఈనాటి వరకు లక్షణ లక్ష్యజ్ఞులచే నమ్మబడుచున్నది. భాషకు అక్షరముల వలె సంగీతమునకు శ్రుతులు. ఈ 22 శ్రుతులు ఒకే వరుస క్రమముగాను వాటి ఒక్కొక్కదాని రంగు రవలలో ఏమార్పును లేక మంద్ర (ఉరములో నిలుచునప్పుడు), మధ్య (కంఠములో నిలుచునప్పుడు), తార (శిరములో నిలుచునప్పుడు) స్థాయిలలో (Registers) ఒక్కొక్క స్థాయిలోను 22 శ్రుతులుగా వినబడి మూడు స్థాయిలలో ($22 \times 3 =$)66 శ్రుతులు సంగీతమున వాడబడునని యెంచవలెను.

2. అన్ని ప్రాచీన గ్రంథములలోను ఈ 22 శ్రుతులు ఎటువంటివని (ఏ త్వరిత సంఖ్యలు గలవని) స్పష్టముగా తెలియపరచక ఒకే విధముగా చెప్పియుండుట మన దురదృష్టమే. ఈ 22 శ్రుతులను గురించి ఆధునిక లాక్షణికులు వారివారి ధోరణి ప్రకారము వేరువేరు అభిప్రాయములను తెలుపు చున్నారు —

(1) కొందరు 22 శ్రుతులను సమ (త్వరిత) ప్రమాణములు గలవియనియు, స్థాయిశ్రుత్యంతర ప్రదేశమును 22 సమ భాగములుగా విభజించి లభించు ఒక్కొక్కటియు ఒక్కొక్క శ్రుతియనియు;

(2) మరి కొందరు అట్లు అవి సమశ్రుతులు కావనియు, వాటికి ఒక్కొక్కటికిని వేరువేరు ప్రత్యేక త్వరితవేపన సంఖ్య గలదనియు అభిప్రాయము దెలిపెదరు.

ఈ విషయమై సమీపకాలమున ఎన్నో చర్చలు చేయబడి ఒక్కొక్కసారియు చర్చసారము లేక ఏకాభిప్రాయ రహితమై ముగియుచుండినది తెలిసినదే.

3. ప్రాచీనగ్రంథములు కొన్నిటిలో ఈ 22 శ్రుతులకు ప్రత్యేకనామముల నిచ్చి వాటిని 5 జాతులుగా విభజించి చెప్పబడియున్నది—

A. 22 శ్రుతుల నామములు:—(1) తీవ్ర, (2)కుముద్వతి, (3) మంద, (4) ఛందోవతి, (5) దయావతి, (6) రంజని, (7)రతిక, (8) రౌద్రి, (9) క్రోధి, (10) వజ్రిక, (11) ప్రసారిణి, (12) ప్రీతి, (13) మార్జని, (14) క్షితి,

(15) రక్త, (16)సందీపిని, (17) ఆలాపిని, (18) మదంతి, (19) రోహిణి, (20) రమ్య, (21) ఉగ్ర, (22) క్రోధిణి.

B. 5 జాతులు:— (1) దీప్త భేదములు—తీవ్ర, రౌద్రి వజ్రిక, ఉగ్ర, (2) ఆయత భేదములు—కుముద్వతి, క్రోధి, ప్రసారిణి, సందీపిని, రోహిణి, (3) కరుణ భేదములు—దయావతి, ఆలాపిని, మదంతి, (4) మృదు భేదములు—మంద, రతిక, ప్రీతి, క్షితి, (5) మధ్య భేదములు—ఛందోవతి, రంజని, మార్జని, రక్త, రమ్య, క్షోభిణి.

C. (1) మధ్యజాతిలోని శుద్ధవికృత స్వరములు:— ప, మ. ధ, న, ధి, 2) కరుణజాతిలో: ప, 3) మృదుజాతిలో: రి, గు, 4) దీప్తజాతిలో: గి, రు, ని, ధు, 5) ఆయతజాతిలో: గ, రి,మి.

4. కొందరు లాక్షణికులు ఒక స్థాయిలో 24 సమ శ్రుతులు గలవని నూతనముగా చెప్పియున్నారు. వారిలో ముఖ్యముగా—

(1) అకళంకుడు (క్రీ.శ. 1750 ప్రాంతంలో—తంజపురిలో) తన "సంగీతస్వర సంగ్రహము" అను గ్రంథములో ఒక స్థాయిలో 24 సమశ్రుతులున్నవని వివరించి వాటిలో అతను క్రొత్తగా "కాంతా" అను శ్రుతి ఒక్కొటిని "ప్రీతి"కి వెనుకను, "ఉద్దీపిని" అను శ్రుతి "ఉగ్రము"నకు వెనుకను రెండు శ్రుతులను ఎక్కువగా చేర్చియున్నాడు. అర్వాచీనులైన కొందరు ఈ 24 శ్రుతులకు (త్వరిత) భిన్నములు కూడ వారికి తోచిన ప్రకారము చెప్పియున్నారు.

(2) తంజపురి ఆబ్రహామ్ పండితులు (ఈ శతాబ్ది ప్రారంభ ప్రాంతమువారు) తమ "కరుణామృత సాగరమ్" అను గ్రంథమున ప్రాచీన ద్రవిడులు ఇళంకోవడిగళ్ యొక్క "శిలప్పధికారమ్" అను గ్రంథమున వాడబడిన 12 రాసుల చక్రములో 12 సమ స్వరస్థానముల నమర్చియుండుటను ఆధారముగా దలచి ఒక స్థాయిలో 24 "పాతిక" స్వరములు(శ్రుతులు)ను, ఇవిగాక పైనగల 48, 96.... ఇట్లు భిన్నతర భిన్నతమముగా ఎక్కువ సంఖ్యల శ్రుతులును ఒకస్థాయిలో గలవని సాధించియున్నారు.

వీరిద్దరి కల్పనలవల్ల సంగీతమునకు ఎటువంటి ప్రయోజనము కలుగలేదు!

(5) పాశ్చాత్యుల సంగీతపద్ధతిలో 'Comma' 81/80 త్వరితభిన్నముగలదిగా, స్థాయిలోని శ్రుత్యంతరములలో అన్నిటికన్న చిన్నదిగా నుండుటనుబట్టి దీనిని ఈ నాటి లాక్షణికులు కొందరు "ప్రమాణ శ్రుతి" యగునని వర్ణించి యున్నారు. ఈ ప్రమాణశ్రుతికిని మన 22 శ్రుతులలో దేనికైన ఒకటికి గాని సంబంధము గలదాయని విచారించవలెను. ఈ Comma నిజముగా అంతరగాంధారమునకు గణించి అబ్బిన రెండు త్వరిత భిన్నముల యొక్క దోషభేదమే.

VIII. స్వరములు—

1. వినువారికి స్వయముగా రంజనము నీయగలనాదము గాన "స్వర" మని పేరు గలిగినది. ఒకస్థాయిలో 22 శ్రుతులలో సప్తస్వరములు షడ్జ, ఋషభ, గాంధార, మధ్యమ, పంచమ, ధైవత, నిషాద నామములుగలవానిగా వాటి ఆద్యక్షరములుగా స, రి, గ, మ, ప, ధ, ని అనుస్వరాక్షరములుగా లక్ష్య మార్గమున పాడబడుచున్నవి. ఈ సప్తస్వరములలో ఆధారస్వరమైన షడ్జము అన్నము బోలినది. తక్కిన ఆరు స్వరములును షడ్రసవ్యంజనములు బోలినవి. కనుక సప్తస్వరముల చేరిక షడ్రసోపేత తృప్తియైన భోజనము వంటిదని శ్రీ సుబ్బరామ దీక్షితులవారు సప్తస్వరములను వర్ణించిరి.

స్వరములు శుద్ధములు, వికృతములు అని రెండు విధములు.

2. శుద్ధ స్వరములు:— లేదా ప్రకృతి (Natural) స్వరములు :—

ఒకస్థాయిలోని 22 శ్రుతులలో వరుసగా (షడ్జగ్రామమునందు)—

నాలుగవ శ్రుతియందు స4, ఏడవ శ్రుతియందు, మూడు శ్రుతులు గలదిగా—రి3, తొమ్మిదవ శ్రుతియందు, రెండు శ్రుతులుగలదిగా—గ2, పదమూడవ శ్రుతియందు, నాలుగు శ్రుతులుగలదిగా—మ4, పదునేడవ శ్రుతియందు, నాలుగు శ్రుతులుగలదిగా—ప4, ఇరువదవశ్రుతియందు, మూడు శ్రుతులు గలదిగా—ధ3, ఇరువది రెండవశ్రుతియందు, రెండు శ్రుతులుగలదిగా— ని2, ఈ ఏడు స4, రి3, గ2, మ4, ప4, ధ3, ని2 స్వరములు శుద్ధ స్వరములనబడును.

3. వికృతి స్వరములు:—

సప్తస్వరములలో ఈ—స, ప తక్క తక్కిన రి, గ, మ, ధ, ని అను అయిదు స్వరములు ఎప్పుడును ఒకేవిధముగా శబ్దించక శ్రుతి భేదములవలన తమ నియత శ్రుతులను విడిచి వేరునాదములు గలవిగా శబ్దించును. అటు వికారమందు స్వరములే వికృతి స్వరము లనబడును.

(1) భరత మతము:— భరతముని వికృతిస్వరములను "సాధారణ" స్వరములని చెప్పిరి. ఇవి—

(a) శుద్ధగాంధార—మధ్యమ 4శ్రుతుల ప్రదేశముల గల సాధారణములు (వికృతులు):

(1) ''సాధారణ'' గాంధారము (10వ శ్రుతిలో—శుద్ధ గాంధారమునకు ఒక శ్రుతి ఎక్కువగా),

(2) ''అంతర'' గాంధారము (12వ శ్రుతిలో—శుద్ధ మధ్యమమునకు ఒక శ్రుతి దిగువగా),

(b) శుద్ధనిషాద—తారషడ్జ 4 శ్రుతుల ప్రదేశములో గల సాధారణములు (వికృతులు):

(1) ''కైశికి'' నిషాదము (1వ శ్రుతిలో—శుద్ధ నిషాద మునకు ఒక శ్రుతి ఎక్కువ),

(2) ''కాకలి'' నిషాదము (3వ శ్రుతిలో—తార షడ్జము నకు ఒక శ్రుతి తక్కువ.)

(c) ఇట్లు 4 ''సాధారణము''లు (వికృతులు) 2 గాంధారములు + 2 నిషాదములు (ఋషభ—ధైవత రెండు స్వరములకును వికృతులు లేవు), గాక అతడు కల్పించిన మధ్యమగ్రామమున వర్ణింపబడిన ''త్రిశ్రుతి'' పంచమము (16వ శ్రుతిలో —పంచమమున ఒక శ్రుతి తక్కువ)ను వికృతి పంచమముగా ఎంచి వచ్చిన 5 వికృతి స్వరములు + ఏడు శుద్ధ స్వరములతో చేరి 12 స్వరములు ఒక స్థాయిలో గలదనుట తేటకదా. ఈ 12 స్వరము లేస్థాయిలో వాడబడు ఆధునిక 12 స్వరస్థానములకు సరిపోవుట గమనింపవలెను.

(2) శార్ఙ్గదేవుని మతము:— ఒకస్థాయిలో 7 శుద్ధ స్వరములుగాక 12 వికృత స్వరములు గలవని చెప్పబడినవి. అవి— (1) 'అచ్యుత'—స (4వ శ్రుతిలో శుద్ధ—స నాదము గలదియే), (2) 'చతుశ్శ్రుతి'—రి (7వ శ్రుతిలో శుద్ధ—రి నాదము గలదియే), (3) 'సాధారణ'—గ (పదవశ్రుతిలో), *(4) 'అంతర'—గ (11 వ శ్రుతిలో—ఈ ఏర్పాటులో సాధా, అంత, గాంధారములు వివాదులు కానేరవు— అర్వాచీనులు భరత మతములోని 12 వ శ్రుతిలో చెప్పబడిన 'అంతర'—గ నే వాడుటకు ఏర్పరచిరి), (5) 'చ్యుత'—మ (12వ శ్రుతిలో—భరత మతములోని 'అంతర' —గ ఇదియే)*, (6) 'అచ్యుత'—మ (13వ శ్రుతిలో—శుద్ధ —మ నాదమే గలది), (7) 'త్రిశ్రుతి'—ప (16వ శ్రుతిలో— భరత మతములో మధ్యమ గ్రామములోని 'త్రిశ్రుతి'—ప నే, — దీనిని ఆధునికులు 'వరాళి' లేదా 'ప్రతి' — మ అని 'మ' కు వికృతిగా మార్చియున్నారు),* (8) 'కైశికి'—ప (17 వ శ్రుతిలో—శుద్ధ—ప నాదము గలదిగానే), (9) 'చతుశ్రుతి'—ధ (20 వ శ్రుతిలో శుద్ధ—ధ నాదము గలదిగానే) (10) 'కైశికి'—ని (1 వ శ్రుతిలో)* (11) 'కాకలి'—ని (2వ శ్రుతిలో—ఈ ఏర్పాటులో కైశికి—ని, కాకలి—ని లు వివాదులు కానేరవు—అర్వాచీనులు భరత మతములోని 3 వ శ్రుతిల చెప్పబడిన 'కాకలి'—ని నే వాడుటకు ఏర్పరచిరి), (12) 'చ్యుత' —స (3 వ శ్రుతిలో—భరతముని మతములోని 'కాకలి'—ని ఇదియే.)

(* ఈ మార్కు వేసిన 5 స్వరములే ప్రాచీన (భరత), ఆధునిక మతములలోను వికృతి స్వరములుగా నుండుట గమనింపవలెను.)

(3) సోమనాథులమతము :— 7 వికృతి స్వరములుగలవు —అవి— (''రాగ విబోధము'' క్రీ.శ.1608) (1) ''సాధారణ'' —గ (10వ శ్రుతిలో)* (2) ''అంతర''—గ (11వ శ్రుతిలో —శార్ఙ్గదేవుని మతమే), (3) ''మృదు''—ప (12 వ శ్రుతిలో —భరత మతపు 'అంతర'—గ—శార్ఙ్గదేవుని 'చ్యుత'—మ)*, (4) 'మృదు'—ప (16 వ శ్రుతిలో—భరతమతపు 'త్రిశ్రుతి' —ప—శార్ఙ్గదేవుని అదే 'త్రిశ్రుతి'—ప —ఈనాటి వరాళి లేదా 'ప్రతి'—మ)* (5) 'కైశికి'—ని (1 వ శ్రుతిలో)* (6) 'కాకలి'—ని (2 వ శ్రుతిలో—శార్ఙ్గదేవుని 'కాకలి'—ని), (7) 'మృదు'—స (3వ శ్రుతిలో—భరతమతపు 'కాకలి'—ని).*

(4) అహోబలుల మతము:— 22 వికృతి స్వరములు గలవు—అవి (''సంగీత పారిజాతము'' 16 వ శతాబ్ది) షడ్జ—పంచమ రెండు స్వరముల నియతశ్రుతులుతప్ప తక్కిన అన్నిశ్రుతులలోను వికృతిస్వరములను 8 ''కోమల'' స్వరములు ('పూర్వ' 4 + 'కోమల'4) + 14 'తీవ్ర'స్వరములు ('తీవ్రములు'5 'తీవ్రతరములు' 5 + 'తీవ్రతమములు'3 + 'అతితీవ్రతమము'1) అని చెప్పియున్నారు.

(5) వెంకటమఖిమతము:— (''చతుర్దండి ప్రకాశిక'' గ్రంథకర్త—క్రీ.శ.1637).

''ఆధునిక కర్నాటక సంగీతపద్ధతి''ని స్థాపించినది వెంకటమఖియే.

స్థాయిలోని 12 స్వరస్థానములలో 7 శుద్ధస్వరములతో 9 వికృతి స్వరములను చేర్చి (7+9=16) స్వరములను స్థాపించియున్నారు. ఆ వికృత స్వరములు—

(1) ''పంచశ్రుతి''—రి (9 వ శ్రుతిలో 'శుద్ధ'—గ యొక్క నియత శ్రుతిలోనే, దాని నాదముగానే)

(2) ''సాధారణ''—గ (10వ శ్రుతిలో), (3) ''షట్ శ్రుతి''—రి (10వ శ్రుతిలో*—'సాధారణ'—గ యొక్క నియత శ్రుతిలోనే, దానినాదముగానే, (4) ''అంతర''—గ (12వ శ్రుతిలో—భరతముని మతమువలెనే)*, (5) ''వరాళి''—మ (16వ శ్రుతిలో— ఈ వికృతిని భరతముని, శార్ఙ్గదేవుడు,

# అట్టడుగు ప్రాంతములకు మేము బ్యాంకింగ్ వసతులు తీసికొని వెళ్లితిమి

సాంప్రదాయంగా బ్యాంకింగు పట్టణవాసుల అవసరములకే పరిమితమై యుంటున్నవి. అయితే మేము యిందుకు భిన్నము. మేము ప్రారంభమునుండియే మా బ్యాంకింగు వసతులను గ్రామీణ ప్రాంతములకు విస్తృతం చేశాము. ఎందుకంటే, మన దేశము యొక్క వాస్తవమైన పురోభివృద్ధిని పొందుటకు అట్టడుగు ప్రాంతముల — గ్రామీణ ప్రాంతముల — అభివృద్ధి ద్వారానే సాధించగలమని నమ్మియుంటిమి.

నేటికిన్ని ఆంధ్రా బ్యాంకు, తమ బ్రాంచీల అభివృద్ధిని గ్రామ ప్రాంతముల ద్వారానే చేస్తూన్నది మన గ్రామములందు నివసించుచున్న 80% ప్రజల అసలైన అభివృద్ధిని సత్వరముగా తెచ్చుటకై

# ఆంధ్రా బ్యాంక్

సామాన్య మానవునికి బ్యాంకింగ్ సేవలు అందజేస్తున్నది

ఎం. వి. సుబ్బారావు
జనరల్ మేనేజరు

కే. కే. నారాయణ్
ఛైర్మెన్

సోమనాథుడు, మరియు అందరును పంచమమునకు వికృతిగా "వికృతిపంచమ" మని చెప్పి, 'ప' అను స్వరాక్షరముగానే వ్రాసి పాడిరి— అహోబలుడు ఈ వికృతిని "తీవ్రతమ"—మ అని మొదటిసారిగా 'మ' అను స్వరాక్షరముగా చెప్పెను. వారికాలము నుండి నేటివరకు దీనిని 'మ' స్వరాక్షరముగానే పాడుటవాడుకైనది), (6) "పంచశ్రుతి"—ధ (22వ శ్రుతిలో— 'శుద్ధ'—ని యొక్క నియతశ్రుతిలోనే, దానినాదముగానే), (7) "కైశికి") (1 వ శ్రుతిలో), 8) 'షట్శ్రుతి'—ధ (1 వ శ్రుతిలో— 'కైశికి'–ని యొక్క నియతి శ్రుతిలోనే, దాని నాదముగానే), (9) "కాకలి"—ని (3వ శ్రుతిలో—భరత మతమువలెనే).

వెంకటమఖి ఈ 7 శుద్ధస్వరములను, 9 వికృతి స్వరములను తేటగా తెలియుటకుగాను వాటి స్వరాక్షరములను ఇట్లు వ్రాసిరి—

{ స, ర, గ, గి, గు, మ, మి, ప, ధ, న, ని, మ
=రి, =రు =ది, = ధు }

{ 7— శుద్ధస్వరములు:—స, ర, గ, మ, ప, ధ, న
9—వికృతిస్వరములు:—రి, రు, గ, గు, మి, ధి, ధు,ని, ను }

(6) గోవిందాచార్యుల మతము:—"సంగ్రహచూడామణి" గ్రంథకర్త (క్రీ.శ. 1800 ప్రాంతము)— (వీరి మతము ప్రకారమే విద్వాంసులు ఈ కాలములో వాడుచున్నారు.)

'రి' మొదలు 'స' వరకుగల (వీణలో) 12 స్వరస్థానములలో ఒక్కొక్క స్థానమునకు రెండేసి శ్రుతులుగా, 'శుద్ధ'—రి మొదలు 'ప్రతి'—మ స్థానము ('వరాళి'—మ) వరకు గల ఆ స్థానములకు ($6 \times 2=$) 12 శ్రుతులు + 'శుద్ధ'ధమొదలు'కాకలి —ని వరకుగల 4 స్థానములకు ($4 \times 2=$) 8 శ్రుతులు + షడ్జ —పంచమముల రెంటికిని మాత్రము ఒక్కొక్క శ్రుతి వంతున ($1+1=$)2 శ్రుతులును, మొత్తము 22 సమశ్రుతులుగా,12 సమస్వర స్థానములుగాను లెక్కచేసి, ఈ లెక్కప్రకారము 'శుద్ధ' —గ స్థానమున 'చతుశ్శ్రుతి'—రి అనియు, 'శుద్ధ'—ని స్థానమున' 'చతుశ్శ్రుతి'—ధ అనియు అబద్ధపు మతముగా చెప్పియున్నాడు. ఇదిగాక ఈమతము ప్రకారము షడ్జము, పంచమము తప్పతక్కిన అన్ని స్వరములను పరస్పర వివాదులగును. ఇట్టివి వాదిస్వరముల పూరితమగు మతమును త్యాగయ్యగారు అనుసరించిరి అని నమ్ముట వింతయే! త్యాగయ్యగారి యొద్ద ఈ "సంగ్రహ చూడామణి" అను లక్షణ గ్రంథము దప్ప వేరు లక్షణగ్రంథము లేవిది తెలిసినదే!




(7) ప్రాచీన ద్రావిడుల మతము:— క్రీ. పూ. 100 ప్రాంతమున ఇళజ్ కోవడిగళ్ (రాజకుమారుడు = Prince) వ్రాసిన "శిలప్పదికార" మను గ్రంథమే ఈ మతమునకు ఆధారము. ఈ మతములో శ్రుతులు 22 అనియే చెప్పబడినను సప్తస్వరములకు వేరుద్రవిడనామములు ఇవ్వబడి వాటిని స్వరాక్షరములుగా చెప్పలేదు, వాడబడుటను లేదు. ఆ నామములు ఆరోహణ క్రమముగా—

(1) 'కురల్'—(స); (2) 'తుత్తరి'—(రి); (3) 'కైక్కిళై'—(గ), (4) 'ఉళై'—(మ), (5) 'ఇళి'—(ప) (6) 'విళరి'—(ధ), (7) 'తారమ్'—(ని)

ఒక స్థాయిలో 12 సమభావ స్వరస్థానములను (Equal temperament) మిక్కిలి చాతుర్యముగా, షడ్జ—పంచమ (స—ప సంవాదిత్వము) మూలముగా, ద్వాదశ రాసులచక్రమున్న వ్రాసి దానిలో తులారాశియందు షడ్జమును, దానికి ఐదవ ఋషభ రాశియందు పంచమమును ఉంచి, పిదప ఈ ఋషభరాశిలోని పంచమమును షడ్జముగానెంచి, దీనికి ఏడవరాశి ధనస్సులో రెండవపంచమమును వ్రాసి ఇట్లు వరుసగా 12 రాసులలో 12 స్వరములను (గ్రహభేదములవల్ల) కలుగజేసిరి. ఇదియే Cycle of Fifths మార్గమని చెప్పుదురు. ఈ విధముగనే Cycle of fourths (స—మ సంవాదిత్వము) మూలముగాను ఇదే 12 సమభావ స్వరస్థానములు లభించును. (దీని మూలముగా మొదట లభించునవి కోమలస్వరములు).

చైనా దేశమునందును ప్రాచీనపద్ధతిగా ఇదే విధముగా సమభావ 12స్వరస్థానములను కొని వాటిలో Cycle of fifths మూలముగా లభించు మొదటి తీవ్ర స్వరములు రి, గ, ధ లకు స, ప ల చేర్చి ఔడవితముగా మన మోహనరాగమునకు సరిపోవునదిగా వాడుదురు.

8. స్వరములు వాటి శ్రుతి ప్రయోగములనుబట్టి గలుగు పరస్పర స్వభావములు 4 విధములు—అవి (1) వాది, (2) సంవాది (3) వివాది, (4) అనువాది.

(1) వాది:— ఏ స్వరము రాగమునకు జీవభూతమై ప్రధానముగా నుండునో అది వాదిస్వరము. వాది స్వరము రాజునకు సదృశమైనది.

(2) సంవాది:— ఏ రెండు స్వరములకు మధ్య 9 లేదా 13 శ్రుత్యంతర ప్రదేశముండునో ఆ రెండు స్వరములును పరస్పర సంవాదులగును. ఆ సంవాది వాదియైన రాజునకు మంత్రి బోలినది. ఉదా :

శుద్ధస్వరములలో (స, మ), (స, ప), (రి,ధ), (గ ని,) సంవాదులు—భరతముని మధ్యమగ్రామములో (స,మ), (రి,ధ), (గ, ని), (ప, రి) సంవాదులు— వెంకటమఖి మతములో, అనగా ఆధునిక పద్ధతిలో, శుద్ధ—మ కు పైన 9వ శ్రుతిలో శుద్ధ—ని ఉన్నను ఆ రెండు స్వరములును సంవాదులు కానేరవు.

వికృతి స్వరములలో:— (సాధా—గ, కై—ని), (అంత—గ, కాక—ని), (శుద్ధ—రి, ప్ర,మ) పరస్పర సంవాదులు.

(3) వివాది:— ఏ రెండు స్వరముల మధ్య 20 శ్రుతులు (భరతముని మతము), లేదా 2 శ్రుతులు (ఇతరుల మతమున—రెండును ఒకటియే) ఆ రెండును పరస్పరము వివాది స్వరము లగును. ఈ వివాదులు పరస్పర శత్రువులకు సదృశమైనవి. ఉదా:

శుద్ధ స్వరములలో— (రి, గ), (ధ, ని), ఇవి పరస్పర వివాదులు.

వికృతి స్వరములలో:— (సాధా—గ లేదా షట్—రి, అంత—గ), కైశి—ని లేదా షట్—ధ, కాక—ని) పరస్పర వివాదులు (ఇది వెంకటమఖి మతము).

(4) అనువాది:— పై మూడుగాక తక్కిన స్వరములు అనువాదులు. అనువాది భృత్యుని వంటిది. ఉదా : షడ్జమునకు ర, గ, ధ, ని, ఋషభమునకు మ, ప, ని, గాంధారమునకు మ, ప, ద, మధ్యమమునకు ధ, ప, ని పంచమమునకు ధ,ని ధైవతమునకు స, రి, గ, నిషాదమునకు స, రి, గ అనువాది స్వరములు (భరత ముని మతము).

VII. గ్రామములు—

భరతముని రెండు గ్రామములను మాత్రమే (షడ్జ గ్రామము, మధ్యమగ్రామము) పేర్కొనిరి.

ఆర్వాచీనులు గాంధార గ్రామమును మరొకటిగా కల్పించి మూడు గ్రామములను వివరించిరి.

అనేక కుటుంబములు కలిసి ఒక గ్రామమగునట్లే మూర్ఛనా భేదములచే మేళములు సంభవించుట కుపయోగపడు స్వర సముదాయము కలిసి గ్రామమగును (భరతముని).

1. షడ్జగ్రామము - 4,3,2,4,4,3,2 శ్రుతులను వరుసక్రమముగా పొందిన శుద్ధస్వరములను గలది.
(స : ప : స = 2:3:3 త్వరిత సఖ్యలు గలది)

5 స్వరముల పూర్వాంగము (Lower Penta chord); (స్థాయి) 4 స్వరముల ఉత్తరాంగము (upper tetra chord)
13 శ్రుతుల ప్రదేశము — 9 శ్రుతుల ప్రదేశము.
స:ప = 2:3 (Major) సంవాదిత్వము. — ప.స = 3:4 (Minor) సంవాదిత్వము.
వాది — సంవాది — వాది
మధ్యషడ్జము స4 — $రి_3$ — $గ_2$ — $మ_4$ — పంచమము (13 వ శ్రుతి) $ప_4$ — $ధ_3$ — $ని_2$ — తారషడ్జము

ఈ గ్రామములో

షడ్జము వాదిగాను (రాజుగాను), పంచమము సంవాదిగాను (మంత్రిగాను) గల రాజ్యమున సంగీతము నడచుటను బట్టి దీనిని తంబూరాలో పంచమశ్రుతి చేర్చి పాడుటను అనుసరించి ఈ గ్రామమును మన పంచమశ్రుతికి సమానముగా ఎంచవచ్చును గదా! ఈ పంచమము స్థాయి శ్రుత్యంతర ప్రదేశమును రెండు అంగములుగా విభజించు వివరములను పథకములో సూచించి యున్నాను.

2. మధ్యమగ్రామము— పంచమము తన సొందీపిని యనెడి మూడవ శ్రుతి స్థానమును జెంది 4, 3, 2, 4, 3 4, 2 శ్రుతులను క్రమముగా పొందిన స4, రి3, గ2, మ4, ప3, ధ4, ని2 అను స్వరములు గలదియగును.

స:మ:స = (ప, స,ప =) 2:3:4 త్వంత సంఖ్యలు గలది.

(Lower tetra chord) స్థాయి
4 స్వరములు అపూర్వాంగము — 5 స్వరముల ఉత్తరాంగము (upper Penta chord)
9 శ్రుతుల ప్రదేశము. — 13 శ్రుతుల ప్రదేశము
స : మ = (ప : స =) 3 : 4 (minor సంవాదిత్వము) — మ: స = (స ప =) 3 : 4 (Major సంవాదిత్వము)
సంవాది — వాది — సంవాది
మధ్యషడ్జము స 4 — $రి_3$ — $గ_2$ — మధ్యమము మ 4 (9 వ శ్రుతి) — $ప_3$ — $ధ_4$ — $ని_2$ — తారషడ్జము స4
సంవాది. ప - - - ధ - - - - - - - ని - - - - - వాది, స - - - - - - రి - - - - - - - గ - - - - - - - - మ - - - - - సంవాది ప

ఈ గ్రామమునగల త్రిశ్రుతి పంచమమును వెంకటమఖి "వరాళి" (=ప్రతి) మధ్యమమని మొదటిసారిగా మధ్యమమునకు వికృతి స్వరముగా గాని, భరతమతములోని మధ్యమగ్రామమునకు అవశ్యములేదనియు, ఒక్క షడ్జగ్రామమే సంగీతమునకు చాలుననియు చెప్పిరి. ఇదియుగాక వెంకటమఖి (భరతమతమున లేని) ఋషభ—ధైవతములకు రెండేసి వికృతములను అధికముగ కల్పించినందువల్లను ఈ మధ్యమ గ్రామము అవశ్యములేకపోయినది. ఈ కారణములవల్ల ఆధునిక పద్ధతిలో మధ్యమగ్రామము వాడబడుటలేదు. ఈ గ్రామములో మధ్యమము వాదిగాను (రాజుగాను), చివరిలోని షడ్జములు సంవాదులు (మంత్రులు) గాను

I (Major) అంతర-గాంధార గ్రామము
(స : గ : ప = 4 5 6)

| 2 (Tones) స్వరముల ప్రదేశము | 1½ (Tones) స్వరముల ప్రదేశము |
| --- | --- |

ఈ గాంధారగ్రామమును రెండు క్రొత్త విధములుగా పరికించి చూడగలము— అవి గాంధారగ్రామము I— (తీవ్ర) అంతర గాంధారముతో— త్వరితసంఖ్యలుగల స4: గ5: ప6 మూడు స్వరములు చేరి ధ్వనించుట.

గాంధారగ్రామము II— (కోమల) సాధారణ గాంధారముతో—త్వరిత సంఖ్యలు గల స10 : bగ12 : ప15 మూడు స్వరములు చేరి ధ్వనించుట.

ఈ రెంటిని పై పథకముల మూలముగా వివరించి, యున్నాను.

ఈ గాంధారగ్రామము (ల)లో గాంధార స్వరము చాల ముఖ్యమై షడ్జ—పంచమములమధ్య నుండి వాటితో చేరి మిగుల ఇంపుగా ధ్వనించుటచేత ఒకే నాదముగా తారషడ్జముతోను చేర్చి స, గ, ప, స,లు ఇంపుగా ధ్వనించుటయే పాశ్చాత్యుల సంగీత పద్ధతికి ఆధారమైన Harmonv అనబడును. ఈ కారణము బట్టియే ఏమో ఈ గ్రామమును స్వర్గమున దేవతలకు (పాశ్చాత్యులకు!) అచ్చట వాడబడు టకుగాను మనదేశము నుండి తరిమివేసిరేమో!

IX. అలంకారములు—

1. స్థాయి, ఆరోహి, అవరోహి, సంచారి అను ఈ నాలుగు వర్ణములను (గాన క్రియలను) అనుసరించిన స్వరముల చేరికలు 'అలంకారము' లనబడును. సంగీతమునకు ఈ అలంకారములు హేమాభరణ భూషణములవలె ఒప్పును. భరతముని 'ప్రసన్నా'ది 34 అలంకారములను, వాటి లక్షణములతో సహా వివరించియున్నారు. అహోబలులు

స్వభావికముగ వినబడి ఆ మధ్యమము స్థాయిని రెండు అంగములుగా విభజించినది. ఈ గ్రామములో స:మ:స అనునది ధ:స:ప అను ధ్వని చేరికగా వినబడి ఈ కాలమున మనము 'మధ్యమ శ్రుతిని' గూర్చుకొన్నట్లు తేలును (అనగా 1½స్వర స్వరములు పై శ్రుతిగా) ఈ వివరములను పథకములో సూచించియున్నాను. షడ్జగ్రామములోని అంగములు తలక్రిందగా మారియుండుట గమనింపవలెను.

3. గాంధార గ్రామము:— ఈ గాంధార గ్రామములో షడ్జము మొదలు ధైవతము వరకుగల స, రి, గ, మ, ప, ధ అను స్వరములు మూడేసి శ్రుతులను నిషాదము మాత్రము 4 శ్రుతులు గలదియగును— స3, రి3, గ3, మ3, ప3, ధ3, ని4 అని చెప్పబడియున్నది.

II (Minor) సాధారణ – గాంధార గ్రామము
(స గ ప = 10 12 15)

| 1½ (Tones) స్వరముల ప్రదేశము | 2 (Tones) స్వరముల ప్రదేశము |
| --- | --- |

శార్ఙ్గదేవుని 63 అలంకారులు గాక 7 ప్రసిద్ధ ఆవర్త అలంకారములను జేర్చి చెప్పియున్నారు. ఈ ప్రసిద్ధ ఆవర్తాలంకారములతో స్వరావళి (సరళి) అనెడి ఝంపటా తాళముతో చేరిన అలంకారమును ఒకటిని చేర్చి వెంకటమఖి 8 అలంకారములను చెప్పియున్నారు. అవి—
(1=లఘువు 0=ద్రుతము ◡=అనుద్రుతము)

1) ఝంప టాలంకారము— ఝంపటా తాళముతో చేరినది. 1400—నాలుగు అక్షర కాలములు గల ఒక లఘువును రెండు ద్రుతములను గలది. ఈనాటి వాడుకలోనుండు సరళి, వరుసలు, జంట సరళి, జంట సరళి వరుసలు ఈ అలంకారముగానే యున్నవి. (దీనినే ఆదితాళమని చెప్పెదరు.)

2) ధ్రువతాళాలంకారము— ధ్రువ తాళముతో చేరినది. ఆరు అక్షర కాలములు గల ఒక లఘు శేఖరమును, నాలుగేసి అక్షర కాలములుగల రెండు లఘువులను గలది. అంతు 14 అక్షర కాలములు. రూపము:సరిగమగరి| సరిగరి| సరిగమ||

3) మఠ్యతాళాలంకారము— మఠ్య తాళముతో చేరినది. నాలుగు అక్షర కాలములు గల ఒక లఘువును, రెండు అక్షర కాలములుగల ఒక ద్రుతమును, నాలుగు అక్షర కాలములుగల మరొక లఘువును గలది. అంతు 10 అక్షర కాలములు. రూపము: సరిగరి| సరి| సరిగమ

4) రూపకతాళాలంకారము—రూపక తాళముతో చేరినది— రెండు అక్షర కాలములు గల ఒక ద్రుతమును, నాలుగు

అక్షర కాలములుగల ఒక లఘువును గలది. అంతు 6 అక్షర కాలములు. రూపము : సరి| సరిగమ||

5) ఝంపతాళాలంకారము— ఝంపతాళముతో చేరినది. ఇది రెండు విధములు.

(a) నాట్యఝంప = ఒక అక్షర కాలము గల ఒక అను ద్రుతమును, రెండు అక్షర కాలములుగల ఒక ద్రుతమును, ఏడు అక్షర కాలములుగల ఒక లఘు శేఖరమును గలది.

(b) వీణ (వాగ్గేయకార)ఝంప— పై అంగములనే గలదైనను లఘు శేఖరమునకు పిదప అనుద్రుత మును, ద్రుతమును గలది.

ఇవి రెంటికిని అంతు 10 అక్షర కాలములు—వీటి రూపములు: ' స| రిగ| సరిసరిగమా|| 11 సరిగసరి| గ మా||

6) త్రిపుట తాళాలంకారము— త్రిపుట తాళముతో చేరినది. మూడు అక్షర కాలములుగల ఒక లఘువును రెండేసి అక్షర కాలములుగల రెండు ద్రుతములును గలది. అంతు 7 అక్షర కాలములు. రూపము: సరిగ| సరి| గమ||

7) అట్ట తాళాలంకారము— అట్ట తాళముతో చేరినది. ఐదేసి అక్షర కాలములుగల రెండు లఘువులును, రెండేసి అక్షర కాలములుగల రెండు ద్రుతములును గలది. అంతు 14 అక్షర కాలములు. రూపము: సరిగా| సారిగా| మా| మా||

8) ఏకతాళాలంకారము— ఏకతాళముతో చేరినది. రెండు అక్షర కాలములుగల ఒక ద్రుతము గలది. ఈ ఏక తాళము రంజనము గలిగింపదని ఏకతాళస్థానమందు 'ఆది' తాళము నుంచబడియున్నది. ఆదితాళము నాలుగు అక్షర కాలములుగల ఒక లఘువు. రూపము: సరిగమ||

(a) పైన వివరించిన ఈ 8 'దేశీ' తాళములను, రగణ మఠ్య తాళమును దక్క తక్కిన తాళములను గీతములందు జేర్చ తగదని వెంకటమఖి మతము.

(b) ఈ తాళములను ఘాత క్రియలతో మాత్రము కొంచెము దురితముగా (అర్ధ అక్షర కాలపు లెక్కగా) వాడిన అవి ''చాపు'' తాళములని చెప్పబడును. వాటిలో మధ్యచాపు, త్రిపుటచాపు, ధ్రువచాపు, రూప చాపులు ముఖ్యములు.

2. మార్గ తాళములు— ప్రాచీన పద్ధతిలో భరతముని వివరిం చిన శివతాండవమున సద్యోజాతాది పంచ వక్త్రజలైన ఐదు తాళములు—

1) చచ్చత్పుటం—అంగములు: SS13— అక్షరకాలముల 40., 2) చాచపుటం— అంగములు S11S— అక్షర కాలములు 30., 3) షట్పితాపుత్రికం— అంగములు: 31SS13—అక్షరకాలములు 60, 4) సంపద్వేష్టాకం— అంగములు 3SS 3— అక్షర కాలములు 60., 5) ఉద్ఘట్టం— అంగములు SSS— అక్షర కాలములు 30.

(ప్రాచీన మార్గమున 5 లఘ్వక్షరములను ఉచ్చరించు కాలము ఒక మాత్ర యగును. కాబట్టి ఒక లఘువు 5 అక్షర కాలములు, గురు 10 అక్షర కాలములు, ప్లుతము 15 అక్షర కాలములు గలవిగా నుండినవి. ఇప్పటి కాలమున మాత్ర యొక్కటికి 4 అక్షర కాలములుగా వాడుచున్నారు.) ఈ 5 మార్గ తాళములతో అర్వాచీనులు వేరు 103 తాళములను చేర్చి 108 తాళములను పేర్కొనిన ప్రసిద్ధ పట్టిక గలదు. ఐతే ఈ మార్గ తాళములు వాడుకలోనుండి స్వర్గమునకు!—తొలగి పోయి ఆధునిక పద్ధతిలో వాడుటలేదు.

3. ఆధునికమతము— 175 తాళములు— గణిత ప్రస్తా రము మూలముగా లభించినవి. చతురశ్ర, త్ర్యశ్ర, మిశ్ర, ఖండ. సంకీర్ణ అను ఐదు జాతులుగా లఘువు నుండుటను బట్టి ఒక్కొక్క అక్షర కాలమును ఆదే ఐదు 'గతులు' గలవిగా నుండగలవని యెంచి, సప్త తాళ ములను ఈ కాలపు లయజ్ఞులు, సల్లవి విద్వాంసులు ఈ రెండు భేదములను గుణించి (7 తాళములు × 5 జాతుల లఘువులు × 5 అక్షరకాలపు గతులు =) 175 తాళములను కల్పించి, ఇవియుగాక వింత, విచిత్ర, వేడుకలైన అనేక క్రొత్త తాళములను చేర్చి, త్రిమూర్తుల వెనుకటి కాలమునుండి, అనగా సుమారు 150 సంవత్సరము లుగా వాడుచున్నారు. ఈ మతమున గణిత 'భ్రమ' మాత్రము ఉండగలదుగాని ''ఇంపు'' ఎద్ది?—సున్న).

X. మేళములు : రాగములు—

1. భరతముని ''మూర్ఛనలు''=వెంకటమఖి—''మేళములు''= సంగ్రహ చూడామణి— (ఈ కాలములో వాడబడునది) ''మేళకర్తలు'' ఇవి అన్నియు ఉత్త గణిత ప్రస్తారమూల ముగా లభించిన స్వర సప్తకములు (=Hepta scales) కాని ఒకప్పుడును రాగములు కానేరవు. ఈ సప్తకముల ఏ ఒక రాగ రస భావ ఇంపు స్వరూపములు లేక ఉత్త గీతలతో వ్రాసిన చిత్రములవలె నుండునవి.

2. రాగము— స్వరవర్ణములు చేరి వీనుల మూలముగా చిత్తమును రంజింపచేయునది.

1) రాగములు మూడు విధములు— (1) శుద్ధ (=ఉపాంగము)., (2) సాలగ (=ఛాయాలగ=భాషాంగము., (3) సంకీర్ణము (=మిశ్రరాగము).

2) మరియు రాగములు మూడు విధములు (1)ఉత్తమ., (2) మధ్యమ., (3) అధమ.

3) సంగీత పారిజాతములో రాగములు 5 విధములని చెప్పబడియున్నవి. (1) శుద్ధ., (2) భిన్న., (3) గౌడ., (4) వేసర, (5) సాధారణి. ఈ గ్రంథములో అనేకముగా హిందూస్తానీ పద్ధతి రాగములనే సంచారములతో సహా వివరింపబడియున్నవి.

4) మతంగ మతము— శ్రీరాగము మొదలు నట్ట నారాయణి వరకు 20 రాగముల పట్టిక యున్నది.

5) రాగ—రాగిణి మతము—పురుష రాగములు శ్రీరాగము మొదలు, స్త్రీ రాగములు మాలశ్రీ మొదలు 36 రాగములను చెప్పబడి, వీటికి పుత్ర రాగములు (జన్య రాగములు) చేర్చబడియున్నవి.

6) రాగములు దశ లక్షణములు గలవిగా వర్ణింపబడియున్నవి. అవి—గ్రహ, అంశ, మంద్ర, తార, న్యాస, అపన్యాస, అల్పత్వ, బహుత్వ, షాడవ, ఔడవ— ఈ పది లక్షణములను భరత మతములోను, ఆధునిక లక్షణ గ్రంథములలోను చెప్పబడినవే.

3. భరతముని మతము—

1) 14 మూర్ఛనలు (=పూర్ణములు=Heptas + 49 షాడవములు (=Hexas) + 25 ఔడవితములు (=Pentas) = మొత్తము 98.

(a) షడ్జగ్రామ మూర్ఛనలు = 7. సప్త స్వరములను వరుసగా స, ని, ధ, ప, మ, గ, రి (అవరోహణ క్రమ గ్రహ భేదముచేసి) ఆరంభ స్వరములు గల సప్తకములు—అవి.

(1) ఉత్తర మంద (స—మొదలు)., (2) రజని (ని—మొదలు)., (3) ఉత్తరాయత (గ—మొదలు)., (4) శుద్ధషడ్జ (ప—మొదలు)., (5) మత్సరీకృత (మ—మొదలు)., (6) అశ్వక్రాంత (గ—మొదలు), (7) అభిరుద్గత (రి—మొదలు)

(b) మధ్యమ గ్రామ మూర్ఛనలు = 7. సప్త స్వరములను వరుసగా మ, గ, రి, స, ని, ధ, ప (అవరోహణ క్రమ గ్రహ భేదము చేసి) ఆరంభ స్వరములు గల సప్తకములు—అవి:

(1) సౌవీర (మ—మొదలు)., (2) హరిణాశ్వ (గ—మొదలు)., (3) కలోపవత (రి—మొదలు)., (4) శుద్ధమధ్యమ (స—మొదలు)., (5) మార్గి లేదా మార్గవి (ని—మొదలు)., (6) పౌరవి (ధ—మొదలు)., (7) హృష్యక (ప—మొదలు)

(c) షాడవములు (Hexas) ఔడవితములు (Pentas) తానము (ప్రస్తరింపు) ఎక్కువగా లభించునవి—

i) షడ్జగ్రామమున స, రి, ప, ని ఈ నాలుగు స్వరములలో ఏదైన ఒక స్వరమును లోపింపజేసి లభించునవి. (7 మూర్ఛనలు × 4=) 28 + మధ్యమ గ్రామమున స, రి, గ ఈ మూడు స్వరములలో ఏదైన ఒక స్వరమును లోపింపజేసి లభించునవి. (7 మూర్ఛనలు × 3=) 21, షాడవములమొత్తము (28+21=) 49

ii) షడ్జగ్రామమున స, ప, గ, ని, రి, ప ఈ మూడింటిలో ఏదైన స్వరములు (2) లోపముగా గలవి (7 మూర్ఛనలు × 3=)21., మధ్యమ గ్రామమున రి, ధ, గ, ని ఈ రెంటిలో ఏదైన స్వరములు (2) లోపముగా గలవి (7 మూర్ఛనలు × 2=)14. ఔడవితముల మొత్తము (21+14=) 35.

ఈ మేళములు (=మూర్ఛనలు): పూర్ణములు 14+షాడవములు 49+ఔడవములు 35=98 ఇవి అన్నియు రాగములు కానేరవనుట ముఖ్యముగా గమనింపవలెను.

2) జాతులు (=18) మూర్ఛనల (=మేళములు వలెగాక ఈ జాతులనే భరతముని రాగ భావ రస రూపములు గలవిగా కల్పించిరి. (ఈ 18 జాతులే వెనుకటి లక్ష్యజ్ఞులచే చెప్పబడిన 18 పూర్వ ప్రసిద్ధ మేళములుగా నుండవచ్చునా!) ఈ జాతులు మూడు విధములు—(1) మధ్యమ., (2) పంచమీ., (3) షడ్జమధ్యమ.

(a) షడ్జగ్రామ జాతులు (=7): (1) షాడ్జీ., (2) ఆర్షభి., (3) నైషాది., (4) ధైవతి., (5) షడ్జోదీచ్యవతి., (6) షడ్జకైశికి., (7) షడ్జమధ్యమ.

(b) మధ్యమ గ్రామ జాతులు (=11) : (1) గాంధారి., (2) రక్త గాంధారి). (3) గాంధారోదీచ్యవ., (4) మధ్యమోదీచ్యవ (5) మధ్యమ., (6) పంచమ., (7) గాంధారపంచమీ., (8) ఆంధ్రి., (9) నందయంతి., (10) కార్మారవి., (11) కైశికి.

ఈ 18 జాతులను వేరు రెండు విధములుగా చెప్పబడును.

(1) శుద్ధ జాతులు: (4+3=)7: (రాగాంగములు?)

(i) షడ్జగ్రామమున 4—షాడ్జీ., ఆర్షభి., ధైవతి., నైషాది +

(ii) మధ్యమ గ్రామమున 3—గాంధారి., మధ్యమ., పంచమీ.

(2) శుద్ధ వికృత జాతులు: (3+8=) 11: (భాషాంగములు?)

(i) షడ్జగ్రామమున 3—షడ్జమధ్యమ, షడ్జోదీచ్యవా షడ్జకైశికీ +

(ii) మధ్యమ గ్రామమున 8—గాంధారోదీచ్యవ, మధ్యమోదీచ్యవ, రక్తగాంధారి, ఆంధ్రి, నందయంతి., గాంధార పంచమీ., కార్మారవి., కైశికి.

ఈ 18 జాతులలో పూర్ణములు 4 + షాడవములు 4 + ఔడవితములు 10—

(i) పూర్ణములు (1+3=) 4—షడ్జ గ్రామములో (1) షడ్జకైశికి + మధ్యమ గ్రామములో (3) మధ్యమోదీచ్యవా, కార్మారవి., గాంధార పంచమీ.,

(ii) షాడవములు (1+3=)4—షడ్జ గ్రామములో (1) షాడ్జి + మధ్యమ గ్రామములో (3) గాంధారోదీచ్యవా., నందయంతి., ఆంధ్రి.,

(iii) ఔడవములు (5+5=) 10—షడ్జ గ్రామములో (5) ఆర్షభి., ధైవతి., నైషాది., షడ్జమధ్యమ., షడ్జోదీచ్యవా + మధ్యమ గ్రామమున (5) రక్తగాంధారి., మధ్యమ., పంచమీ., కైశికీ., గాంధారి (షడ్జ గ్రామమున షాడ్జి షాడవముగాను, ఔడవముగాను రెండు విధములుగాను ఉండ గలది) (ఏ స్వరము లోపించినను లోపించవచ్చునుగాని మధ్యమ స్వరము మాత్రము ఏ జాతులలోను వర్జము కానేరదు.)

4. శార్ఙ్గదేవుల వాదము—

(1) భరతముని మతమువలెనే (షడ్జ గ్రామమున 7 + మధ్యమ గ్రామమున 11=) 18 మేళములు (=భరత ముని జాతులు) గలవు. అయితే రెండు గ్రామములలో ఇవ్వబడిన మేళముల (=జాతుల) పట్టిక వ్యత్యాసముగ నున్నది— ఐతే నామములలో వ్యత్యాసములు లేవు.

షడ్జ గ్రామమున మేళములు— 7—షాడ్జి, ఆర్షభి, గాంధారి, మధ్యమ, పంచమీ, ధైవతి. నైషాది సప్త స్వరములను ఆరోహణ క్రమముగా (గ్రహ స్వరములు) ఆరంభ స్వరము[illegible] గల[illegible].

మధ్యమ గ్రామమున మేళములు 11— ఇవి క్రమముగ—షడ్జకైశికీ, షడ్జోదీచ్యవా, షడ్జమధ్యమ, గాంధారోదీచ్యవ, రక్తగాంధారి, కైశికి, మధ్యమోదీచ్యవా, కార్మారవి, గాంధార పంచమీ, ఆంధ్రి, నందయంతి.

(2) రాగములు రెండు విధములు— (i) మార్గ రాగములు(1)గ్రామ రాగము (షడ్జ—మధ్యమ గ్రామ జాతుల నుండి జనించిన రాగములు), (2) ఉపరాగము, (3) రాగము, (4) భాష, (5) అంతరభాష (ఉపరాగము మొదలు 5 వ గ్రామ రాగములను అనుసరించిన వేర్వేరు భాగములు). (ii) దేశి రాగములు— (1) రాగాంగము, (2) భాషాంగము, (3) ఉపాంగము, (4) క్రియాంగము. శార్ఙ్గదేవుడు తన సంగీత రత్నాకరములో 264 రాగములు వాటి లక్షణములతో సహా చెప్పియున్నాడు. అవి అన్నియు వాడుకలోనుండి స్వరూపముల తెలియక తొలగిపోయినవి.

5. వెంకటమఖి మతము—వెంకటమఖియే ఆధునిక కర్ణాటక సంగీతమును స్థాపించిన మూల పురుషుడు.

(1) వెంకటమఖి స్థాయిలోని 12 స్వర స్థానములలో 16 (7=ప్రకృతి + 9 వికృతి) స్వరములను నిరూపించి వాటి మూలముగా భరతమునియొక్క మధ్యమ గ్రామమును ఆవశ్యములేక చేసినదియుగాక ఆ 16 స్వరములను తేటగా తెలియుటకుగాను మిక్కిలి చాతుర్యముగా వాటిని అ, ఇ, ఉ ల అంత్యముల స్వరాక్షరములుగా ఇట్లు వ్రాసిరి. స, ర, గ, గి, గు, మ, మి, ప, ధ, న, ని, ను. =రి, =రు, —ధి, —ధు

ఇట్లు వ్రాసిన స్వరాక్షరములను గొని సులభముగా గణిత ప్రస్తారింపు మూలముగా 72 మేళములను (=భరతముని మూర్ఛనలు = సంగ్రహ చూడామణి "మేళకర్తలు") కల్పించిరి. అది ఎట్లనిన—

(a) పూర్వాంగమునగల ఋషభ—గాంధార శుద్ధ—వికృతులగు ర, రి, రు; గ, గి, గు మూలముగా గణించిన ఆరు ప్రస్తారములకు (అనగా రగ, రగి, రగు, రిగి, రిగు, రుగు) శుద్ధ మధ్యమమును జేర్చి ఆ రెంటిని ఒక్కొక్కటియు ఒక్కొక్క చక్రముగా వెంచి ఆ ఆరు చక్రములతో ఉత్తరాంగములోని ధైవత—నిషాద శుద్ధ—వికృతులగు ధ, ధి, ధు; న, ని, ను యొక్క ఆరు ప్రస్తారములను (అనగా ధన, ధని, ధను, ధిని, ధిను, ధును) ఒక్కొక్క పూర్వాంగ చక్ర ప్రస్తారమునకు చేర్చి గుణించి (6 పూర్వాంగ ప్రస్తారములు × 6 ఉత్తరాంగ ప్రస్తారములు =) 36 మేళములను మిక్కిలి చాతుర్యముగా కల్పించి వీటిని పూర్వ (శుద్ధ మధ్యమ) మేళములనిరి.

(b) ఈ 36 పూర్వమేళములోని శుద్ధ మధ్యమమునకు బదులుగా వరాళిమధ్యమమును (—మి— ప్రతి మధ్యమము) చేర్చి మరొక (6 చక్రములు × 6=) 36 <u>ఉత్తర (2) మేళములను</u> కల్పించిరి.

ఇట్లు మొత్తము (36 శుద్ధమధ్యము— పూర్వమేళములు + 36 వరాళిమధ్యమ— ఉత్తర మేళములు=) 72 మేళములు (=మేళకర్తలు) వెంకటమఖిచే కల్పింపబడినవి. ఈ 72 మేళములనే సంగ్రహ చూడామణిలో "మేళకర్త" రాగములని చెప్పబడినవి— నేటికి కూడ నమ్మబడు చున్నవి.

(2) ఈ 72 మేళములను భరతముని మూర్ఛనలవలె గీతలతో మట్టుకు వ్రాయబడిన చిత్రములవలె ఉత్త స్వర సప్తకములనుటను (Hepta scales) అవి ప్రాచీన సంప్రదాయము ప్రకారము ఎన్నటికిని రాగములుగా భావింపదగనివిగా యుండుటను తెలిసిన వెంకటమఖి తన 72 మేళములకు నామములు ఇవ్వక వాటిని 12 చక్రములుగా విభజించి వాటికి మిక్కిలి చమత్కారముగా సంజ్ఞానామములు (అనగా వాటికిచ్చిన ఆ పేళ్లను బట్టి ఈ చక్రము కిన్నవ చక్రమని సులభముగా తెలియునట్లును., ఒక్కొక్క చక్రములోని 6 మేళములకును వాని సంఖ్య క్రమములను తేటపరచునట్లు వాటికి సంజ్ఞ (కటపయాది సూత్రపు) సంకేతాక్షరములు వ్రాసిరి—

(a) <u>చక్ర సంజ్ఞ నామములు—</u> 1. ఇందు చక్రము, 2. నేత్ర చక్రము, 3. అగ్ని చక్రము, 4. వేద చక్రము, 5. బాణ చక్రము, 6. ఋతు చక్రము, 7. ఋషిచక్రము, 8. వసు చక్రము, 9. బ్రహ్మ చక్రము, 10, దిశిచక్రము, 11. రుద్రచక్రము, 12. ఆదిత్య చక్రము.

(b) ఒక్కొక్క చక్రములోని 6 మేళములకు ఇవ్వబడిన 6 సంజ్ఞ సంకేతాక్షరములు— పా=1, శ్రీ=2, గో=3, భూ=4, మా=5, షా=6.

(3) <u>రాగాంగరాగములు— 72,</u> ("అరి, అంబరి—మంజరి" పద్ధతి) —

(i) తనచే కల్పింపబడిన 72 మేళములను పరిశీలించి వాటిని పొడిచూచి ఒక్కొక్కటికిని, వివాది దోషములుండిన వానివి హరించి, వినువారిని మోహింపజేయునట్టి <u>మూర్ఛనలను</u> (స్వరూపముల ఆరోహణావరోహణములు) కల్పించి వాటిని రాగ రస భావ పూరితములుగా, రంగులనిచ్చి పూర్తి చేసిన చిత్ర

WITH BEST COMPLIMENTS
FROM
SWASTIK AGENCY
165 GOVINDAPPA NAICK STREET
MADRAS-1
MANUFACTURERS OF
TWIN BRAND
REFINED CASTOR OIL

ఘ్ముల వలె జేసి, ఆ మూర్ఛనలను అనుసరించి పెంచగలిగిన క్రొత్త 72 రాగములకు రాగాంగరాగములని వెంకటమఖి పేరిడిరి. ఆ 72 రాగాంగ రాగములను జనకరాగములుగా భావించి వాటికి తగిన నామములను మిక్కిలి చాతుర్యముగా వ్రాసిరి— అనగా, ఆ నామములను చూచిన మాత్రమే ఈ రాగాంగరాగము పట్టికలో ఇన్నవ రాగాంగ రాగమని సులభముగా తెలియును. అదెట్లనిన ఆ నామములలోని మొదటి రెండు అక్షరములను 'కటపయాది' సూత్రపు గణితవిధిని అనుసరించి అమర్చి యుండుట వల్ల వాటినిబట్టి రాగాంగరాగముల క్రమ సంఖ్య వూహితమగును. కొన్ని నామములకు ముందు రెండు కటప యాది అక్షరములను చేర్చవలసి యుండినది.

(ii) వెంకటమఖి శుద్ధ స్వరములు మాత్రము గల మొదటి మేళమునకు మట్టుకు రెండు రాగాంగ రాగములను ఏర్పరచి వాటికి "ముఖారి" (ప్రాచీన ప్రసిద్ధ మేళములలో మొదటిది), "కనకాంబరి" అను రెండు నామములను ఇచ్చిరి, కడపటి తీవ్ర వికృతి స్వరములను గలిగిన 72 వ రాగాంగ రాగమునకు "రసమంజరి" అని పేరిడిరి. కనుక వీరి పద్ధతిని "అరి, అంబరి— మంజరి" రాగాంగరాగ పద్ధతి అనవచ్చును.

(iii) తన 72 రాగాంగ రాగములలో పూర్వ ప్రసిద్ధ 18 మేళములను చేర్చబడియే యుండెను.

(iv) ముఖ్యముగా వెంకటమఖి గమనించినది (భరత ముని మతము వలెనే) రాగాంగ రాగములు 72 ను సప్త స్వరము లను గలవిగా నుండవలెనను విధి (ఆరోహణావరోహణలలోచేరి). ఇట్లు అతను కల్పించిన 72 రాగాంగ రాగమూర్ఛనలు 4 విధ ములు —

(1) సంపూర్ణము, (2) షాడవ సంపూర్ణము, ఉదా: 5 వ మేళము, (3) ఔడవ సంపూర్ణము, ఉదా: 1 వ మేళము, 4) వక్ర సంపూర్ణము, ఉదా: 10 వ మేళము.

(4) జన్యరాగములు — 72 రాగాంగ రాగములు గాక తన గురువు తానప్పార్యుల వద్ద తానేర్చిన ఇతర పూర్వ ప్రసిద్ధ రాగములను, అప్పటి వాడుకలో నుండిన లెక్కకందని ప్రసిద్ధ దేశీ రక్తి రాగములను సూక్ష్మముగా పరిశీలించి వాటి కొక్కొక్క టికిని తగిన మూర్ఛనలను కల్పించి, రాగాంగ రాగములను జనక రాగములుగా భావించి, వాటికి జన్యరాగములుగా అమర్చిరి. ఒక్కొక్క జన్య రాగమును తన కివ్వబడిన మూర్ఛనవల్ల తనకవి ప్రత్యేక రాగ రస భావ రూపమును బొంది ప్రకాశము నొంది నది. ఈ జనక—జన్యరాగ పద్ధతిని వెంకటమఖియే ప్రథమముగా ఏర్పరచిరి.

ఈ జన్య రాగములు రెండు విధములు— (1) ఉపాంగ రాగము— ఇది తన జనక మేళమందు గల స్వరములనుమాత్రము గలది, (2) భాషాంగరాగము— పూర్వమునుండి [illegible] వాడబడిన ప్రకారము తన జనక మేళములో లేని ఒకటి లేక రెండు అన్య స్వరములను చేర్చి వాటి సహాయముచే తనంతట ప్రత్యేక రాగరస భావ రూపము గలిగి ప్రకాశించు నది.

6. (1) "సంగ్రహ చూడామణి" గ్రంథము— కర్త ఆంధ్ర వైష్ణవుడైన గోవిందాచార్యులు. వీరు తంజపురి ఏలిన కడపటి మహారాష్ట్ర రాజైన శరభోజ మహారాజుని ప్రియుడై సంస్థానపు విద్వాంసులలో ముఖ్యుడుగా నుండెను. ఈ గ్రంథము సుమారు 160 సంవత్సరములకు ముందుగా (19 వ శతాబ్దపు మొదటి దశాబ్దాల ప్రాంతమున), వ్రాయ బడినదని తెలియవచ్చు చున్నది.

వెంకటమఖికి వెనుక తంజపురి చరిత్ర సంభవముల కలవరములచే అంధకారమున మునిగి— విజయరాఘవనాయక భూపాలుడు యుద్ధములో (క్రీ. శ. 1673) పడిపోవుటకు రెండు మూడు సంవత్సరములు ముందునుండి అటువెనుక మహారాష్ట్ర యుగము ఉదయించిన (క్రీ. శ. 1676) వరకు నడుమగల కొన్ని సంవత్సరముల నుండియే, ఐదారేండ్లు, రాజ పరిపాలనము సరిగా లేక యుండిన కారణము వల్ల వెంకటమఖి తన పద్ధతిని వివరించి వ్రాసిన "చతుర్దండి ప్రకాశిక" గ్రంథపు వ్రాతప్రతిని దానితో వ్రాసిన అనుబంధములతో సహ అతని వంశపువారు వాటిని కాపాడదలచి రహస్యముగా దాచి పెట్ట వలసినదైనది. ఆ గ్రంథము ఎవరికిని దొరకక ఐతే దానిలోని కొన్ని విషయములు మాత్రము వూహామూలముగాను వినికిడి చేతను తేటగా తెలియకను వాడుకలో నుండినది. అట్టి విషయ ములు ఆధారముగా వ్రాయబడినదే "సంగ్రహ చూడామణి."

(2) ఈ గ్రంథములో పూర్వ సంప్రదాయమునకు విరుద్ధమైన అనేక అంశములు గలవు— ప్రాచీన మతమునకు నేరు విరుద్ధముగా, వెంకటమఖిచే కల్పింపబడిన 72 మేళము లనే "మేళకర్త"ని చెప్పి ఆ మేళకర్తలనే, ఉత్త సప్తక ఆరోహణావరోహణములు గలవాటిని, జనక రాగములుగా భావించి వాటికే కటపయాది సంఖ్యల దెలుపు అక్షరములు గలవిగా క్రొత్త నామములను అమర్చి "కంగి— ప్రియ" అను నామ పట్టికను చెప్పబడి యున్నది. ఈ పద్ధతి ప్రకారము 72 మేళ కర్తలును మూర్ఛన విహీనులై ఏ రాగరస భావ రూపమునులేక, వివాది దోషములు గల మేళకర్తలు అట్టి దోషపూరితములై శోభించక పోయినవి. ఇది గాక వీరి మతము ప్రకారము షడ్జ— పంచమ స్వరములు రెండు తప్ప తక్కినవన్ని స్వరములును

# పిల్లలకు నేర్పించవలసినవి ఎన్నోవున్నాయి




## కొన్ని కొన్ని వారే తెలుసుకుంటారు

ఏ మిఠాయిలు శ్రేష్ఠమైనవోలాగా....ఇది పిల్లలలో రూఢిగా జరిగే సంఘటన. బొంగరాలు, గోలీలు, క్యాండీలు నేర్పేదిదే. మధురపూరితమైన న్యూట్రిన్ మిఠాయిల శ్రేష్ఠత గురించి పిల్లలు చెప్పేటప్పుడు సరియైన కారణం వుందని మీరు ఒప్పుకోకతప్పదు.

స్వచ్ఛమైన పాలు, చక్కెర, తేనెల భరితమైన కాఫీ టాఫీలు, కోకోనట్ బాన్ బాన్‌లు, ఆరెంజ్ క్యాండీలు, ల్యాక్టో బాన్ బాన్‌లు—ఇవి కొన్ని రకాలు. పిల్లలు వీటిని వీడలేరు.




**న్యూట్రిన్** ఒక్కొక్క మిఠాయి యందు ఫలరస పూరిత విందు

న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్, పలమనేర్ రోడ్, చిత్తూరు (ఆం.ప్ర.)

NCM-43/73 TEL

పరస్పర వివాదులగును. ఇంకను ప్రాచీన పద్ధతిలోని పంచ శ్రుతి ఋషభ— ధైవతములు "చతుశ్రుతు" లైనవి. మరియు ఈ గ్రంథమునకు అనుబంధముగా 300 మేళకర్త— జన్య రాగములకు లక్షణ గీతములు రాగ రసము లెంత మాత్రము లేనివిగా అన్నియు ఒకే త్రిపుట తాళములోనే రచియింపబడి కనబడు చున్నవి. వీటిని రచియించినది బహుశా చంద్రగిరి రంగాచార్యులుగా నుండవలెనని వూహ.

ఈ చంద్రగిరి రంగాచార్యులు గోవిందాచార్యుల మతము ననుసరించి ఇంకను విచిత్ర వింతలైన ఉత్త గణిత ప్రస్తార రూపములు గలవిగా కొన్ని "జన్య రాగము"లను క్రొత్త నామములతో కల్పించి యున్నారు. అవి—

సంపూర్ణ షాడవములు = 27, + సంపూర్ణ ఔడవములు = 11, + షాడవ సంపూర్ణములు=28, + షాడవ షాడవములు = 54, + షాడవ— ఔడవములు = 18, + ఔడవ సంపూర్ణములు = 38, + ఔడవ— షాడవములు = 46, + ఔడవ ఔడవములు = 25.

అంతు 72 సంపూర్ణ—సంపూర్ణ మేళకర్తలతో= 319

ఇవిగాక ఇటీవల గ్రంథములలో సుమారు 2500 రాగముల పట్టిక, వాటి ఆరోహణావరోహణములతో సహా లభించియున్నది. ఇటువంటి వింత, విచిత్ర రాగములు లక్షల కొలది కల్పించ వచ్చుననియు ఐతే అవి గీత ప్రబంధములకు యోగ్యములు కావని వెంకటమఖి యొక్క వాక్కు.

ఇట్టి వెన్నో అబద్ధపు, సంప్రదాయమునకు విరుద్ధముగా, అంశములు గల ఈ పద్ధతిని త్యాగయ్యగారు వాడిరని ఇప్పటి లాక్షణికులు, విద్వాంసులు తప్ప భిప్రాయము గలవారుగా ఈ సంగ్రహ చూడామణి గ్రంథమే సంగీత లక్షణమునకు ఆధారముగా అనుసరించుచున్నారు. ఇది మన సంగీతకళకు. దురదృష్టమే. వేరొక లక్షణగ్రంథమును చూచి ఎరుగని త్యాగయ్యగారికి ఈ గ్రంథము మాత్రము లభించిన విధము ఒక వింత!

రాజా నిధి సంభావనను పంతైన లెక్క చేయక శ్రీరాముని సన్నిధి సుఖసాగరములో చక్కగ యీదుచు మైమరచి యుండిన త్యాగయ్యగారి వద్ద ఒక "నారదుడు" (నగరి నుండి రాజదూత) "స్వర్గమునుండి" (రాజ నగరి నుండి) "రజత గిరీశుడు నగజకు దెల్పిన 'స్వరార్ణము" (సంగ్రహ చూడామణి) ఒక ప్రతిని అందిచ్చి "అంతర్ధాన"మై (మరల కనబడక వెళ్లి) పోయెను!!

ఇటువంటి అబద్ధపు పద్ధతియగు చెరనుండి మనపునీతమైన ప్రాచీన సంగీత కళ ఎన్నటికి విడిపించబడి ఇప్పటి సంగీతపు వృద్ధక్షీణ దశను మాని మరల ప్రకాశము నొందునో ఆ "త్యాగరాజస్వామి" కే ఎరుక!

7. ద్రావిడుల మతము——

(1) భరతముని మతము వలెనే మిక్కిలి ప్రాచీనమైన ద్రావిడుల మతములలో 7 "వట్టప్పాలై"లు అను 7 మేళములు గలవు. (వట్టము=చక్రము., పాలై = మేళము —స్వరసప్తకము).




12 రాసుల చక్రమును వ్రాసి పైన కనిపించి యుండునట్లు దాని రాసులలో మొదటిదిగా ఈనాటి (హరి) కాంభోజి మేళ స్వరములను వ్రాసి పిదప అవరోహణ క్రమముగా ఆస్వరములను గ్రహభేదములు జేసి అమూలాలముగా అన్ని (రాసులు) 12 స్వరస్థానములను నింపి మొత్తము 7 మేళములు (=పాలైలు) లభించినవి. వాటికి ఇవ్వబడిన నామములను వాటికి సరిపోవు ఈనాటి మేళ కర్తలును ఇట్లుండును—

(1) సెంపాలై (=హరికాంభోజి)., (2) పడుమలైప్పాలై (=కల్యాణి)., (3) సెవ్వళి (,,) ప్పాలై(=తోడి), (4) అరుంపాలై (=ఖరహరప్రియ), (5) కోటిప్పాలై (=శంకరాభరణము) ,6) (విళరిప్పాలై (=?), మేర్చెంపాలై = నటభైరవి.)

వీరి మతము ప్రకారము ఖరహరప్రియ ("అరుంపాలై") మేళమే శుద్ధ స్వరమేళమని కొందరు విద్వాంసులు చెప్పుచున్నారు. 6వ "విళరిప్పాలై" చ్యుత పంచమము గల మేళమగుట గమనించవలెను.

(2) ఈ 7 మేళములను ("పాలై" లను) అనుసరించి 100 కి పైగా "పణ్"లు అను పేరన రాగములువాడుకలో యుండినవని చెప్పబడుచున్నది.

X I గానక్రియలు—సంగీతమునకు చాల ముఖ్యమైన అంశములు ఇవి—

1. స్వరకాకువులు — (కాకువు = Intonation) —అనగా సాహిత్యములోని అర్థ భావములనుచక్కగా తెలియునట్లు స్వరములను ఉచ్చరించుట.

(1) స్ఫురిత—ప్రత్యాఘాతములు—జంట స్వరములలో రెండవ స్వరమును కొట్టి (నొక్కి) పై స్వరమును గాని క్రింది స్వరమును గాని తేలికగా దానితో ధ్వనించునట్లు ఉచ్చరించివినిపించుట. ఇవి రెండును వీణలో వేరుగా నుండినను గాత్రమున ఒకటియే.

(2) తిరుపము—ఒక స్వరమును నొక్కి లేక అదిమి కొంచెము ఎక్కువ ధ్వనిని గలదిగా పలుకుట.

(3) ఆహతము—రెండు స్వరములను పాడునప్పుడు రెండవ స్వరమును మొదటి స్వరమును గాని రెంటికి మధ్యనుండు ఏదైన వేరొక స్వరమునుగాని సందర్భమునకు తగినట్లు తాకి పలికించుట.

(4) హుంపితము—స్వరమునకు గల ధ్వనిని పెంచుకొనియు, గుంభితము—స్వరము యొక్క ధ్వనిని కొంచెము కొంచెముగా తగ్గించుచు పాడుట.

(5) కురుళము—(—ఒరయిక—ఒరిక—వరిక)— అవరోహణక్రమముగా స్వరమును పలుకునప్పుడు అది తనపైన గల స్వరమును ఒరయుచు (రుద్దుచు) క్రింది స్వరమునకు దిగునట్లు పలుకుట.

(6) ముద్రితము—నోటిని మూసికొని పాడుటలో కలుగు స్వరముల కదలింపు.

(7) వణుకు (—Trillo లేదా Tremalo — శ్రుతి భేదము పొందక స్వరముల దురిత కదలింపు.

2. <u>గమకములు</u>—వినువారి చిత్తములకు ఇంపు గలుగునట్లు స్వరములను కదలించుటయే (గమకించుటయే) గమక మనబడును. భరతముని ఈ గమకములను "వర్ణము" లని వర్ణించి అవినాలుగు విధములని చెప్పియున్నారు. అవి—

(1) స్థాయి—ఏవిధమైన కదలింపు లేనిదై ఒక స్వరము తన స్వరస్థానమున తన కేర్పడిన లేపన త్వరితసంఖ్యను మార్చక ఒకే కొలత వాదముగా తన కాలప్రమాణము ముగియు (ఆవర్తము కడవరకు) వరకు నిలిచి ఆధారశ్రుతితో అనువాదిగా ఐక్యమై మిక్కిలి ఇంపుగా ధ్వనించుట—దీనిని స్వర"కార్య" అందురు.

(2) ఆరోహి—(—ఉల్లసితము—ఎక్కుజారు )—ఒక స్వరము తన నియత శ్రుతికన్న క్రింది ఏదైన శ్రుతిలో (స్వరములో) ధ్వనించుట కారంభించి ఒకే కొలతగా

భాషాసాహితికి "భారతి"యై, ఎనలేని సేవ చేస్తూ, స్వర్ణోత్సవం చేసుకొంటున్న "భారతి" కి ఈ "కళాభారతి" తన రెండవ జన్మదిన సందర్భమున సమర్పించు శుభాకాంక్షలు !



కళాభారతి
తెలుగు సాంస్కృతిక సమితి
22-ఎ, త్యాగరాయనగర్,
మదరాసు 600017

శ్రుతిని పెంచుకొని (Accelerate) తుదకు తన నియత శ్రుతి అంది దానితో ఐక్యమై నిలుచుటయే 'ఎక్కుజారు' అనబడును. అట్లు ఐక్యమగు సమయములో చిత్తమునకు చాల రంజన మిచ్చును. దీనిని "మీండ్"అని చెప్పుదురు.

(3) అవరోహి— (=ఉల్లసితము—దిగజారు) ఒక స్వరము తన నియత శ్రుతికన్న పైనిగల ఏదైన శ్రుతిలో (స్వరములో) ధ్వనించుట కారంభించి ఒకే కొలతగా శ్రుతిని తగ్గించుకొని (Decelarate) తన నియత శ్రుతితో ఐక్యమై నిలిచి రంజనము కలిగించుటయే దిగజారు అనబడును.

(4) సంచారి(=వళి.,⌒, ◡)— ఒక స్వరమును తన నాదమును ఆరోహణముగా పెంచి తరువాత అవరోహణముగ తన నియతశ్రుతికి దిగి ఐక్యమగుటయైనను, లేదా మొదట అవరోహణముగా తగ్గి పిదప ఆరోహణముగా పెంచి తన నియత శ్రుతిని అంటుటయైనను సంచారి గమక మనబడును.

3. కంపితములు (= Vibrato - ∿∿∿∿) ఒక స్వరము తన లయప్రమాణ భిన్నములకు తగునట్లు వానిననుసరించి పలుమారు ఒకే కొలతగా (శ్రుతిని) పెరుగుటయు తగ్గుటయు (In equal periods, in a sinusoidal manner) కలిగి కదలి యుంపుగలది. ఇది మూడు విధములు——

1) ∿∿∿∿⟶ ఆధార స్వరస్థానము — ఒక స్వరము తనకు క్రింది స్వర స్థానమును ఆధారముగా గొని దానికి మీాదుగా గల కొంచెము ఎక్కువ (పాతిక స్వర ప్రమాణమునకు మించక—$\frac{1}{4}$ tone) శ్రుతిని పలుమారు అంది ఒక్కొక్కసారియు ఆ స్వరస్థానముతో ఐక్యమగునట్లు గమనించి వినబడు కంపితము.

ఈ కంపితములు స్థాయిలో 5 స్వరస్థానములలో జరుగును— అవి:

(i) షడ్జస్వరస్థానమున శుద్ధ ఋషభ స్వరాక్షరముగా (ii) పంచశ్రుతి ఋషభ స్థానమున శుద్ధగాంధార స్వరాక్షరముగా., (iii) అంతర గాంధార స్థానమున శుద్ధ మధ్యమ స్వరాక్షరముగా., (iv) పంచమ స్వర స్థానమున శుద్ధ ధైవత స్వరాక్షరముగా., (v) పంచశ్రుతి ధైవత స్థానమున శుద్ధ నిషాద స్వరాక్షరముగా—పలుకును.

2) ∿∿∿∿⟶ ఆధార స్వరస్థానము — ఒక స్వరము తనకు పై స్వర స్థానమును ఆధారముగా గొని దానికి క్రిందగలకొంచెము తక్కువ (పాతిక స్వరప్రమాణమునకు మించక—$\frac{1}{4}$ tone) శ్రుతిని పలుమారు అంది ఒక్కొక్క సారియు ఆ పైస్వర స్థానముతో ఐక్యమగునట్లు గమకించి వినబడు కంపితము.

ఈ కంపితములు స్థాయిలో 2 స్వరస్థానములలో జరుగును అవి:

(i) వరాళిమధ్యము (ప్రతిమధ్యమ) స్వరస్థానమున తనకు పైనిగల పంచమ స్వరమును పలుమారు అంది ఐక్యమై వరాళి మధ్యమ స్వరాక్షరముగా., (ii) కాకలి నిషాద స్వర స్థానమున తనకు పైని గల తారషడ్జమ స్వరమును పలుమారు అంది ఐక్యమై కాకలి నిషాద స్వరాక్షరముగా పలుకును.

3) ⊓⊓⊓⟶ ఆధార స్వర స్థానము
క్రింది స్వర స్థానము

ఒక స్వరము దానికిపైనిగల ఒక స్వర స్థానమును ఆధారముగా గొని దానికి క్రింద ఒక స్వర శ్రుత్యంతరమునకును తక్కువగా ($1\frac{1}{4}$ స్వర ప్రమాణమును మించక—$1\frac{1}{4}$ tone) పలుమారు అంది ఒక్కొక్కసారియు ఆ పై స్వర స్థానముతో ఐక్యమగునట్లు గమనించి వినబడు కంపితము.

ఈ కంపితములు స్థాయిలో 3 స్వర స్థానములలో జరుగును— అవి:

(i) పంచశ్రుతి ఋషభ స్థానమున తనకు పైని గల మధ్యమ స్వరమును పలుమారు అంది ఐక్యమై సాధారణ గాంధార స్వరాక్షరముగా, (ii) అంతరగాంధార స్థానమున తనకూ పైని గల పంచమ స్వరమును పలుమారు అంది ఐక్యమై శుద్ధ మధ్యమ స్వరాక్షరముగా, (iii) పంచశ్రుతి ధైవత స్థానమున తనకు పైనగల తారషడ్జమును పలుమారు అంది ఐక్యమై కైశికి నిషాద స్వరాక్షరముగా— పలుకును.

$\frac{1}{4}$ tone కంపిత శుద్ధ స్వరములు 5— ర, గ, మ, ధ, న
$\frac{1}{4}$ tone కంపిత వికృత స్వరములు 2— మి, మ,
$1\frac{1}{4}$ tone కంపిత స్వరములు 3— గి, మ, ని,
అంతు 10 కంపిత స్వరములు.

ఇట్లు పై వర్ణింప బడిన పది విధ కంపిత స్వరములు 12 స్వర స్థానములకు సమాన ముఖ్యత్వము గలవై వాటితో చేరి (10+12=) 22 శ్రుతులుగా చెప్పదగునవి.

4. వెంకటమఖి గమకములను, స్వరకాకువులను, కంపితములను చేర్చి వాటిని 15 "గమకము"లుగా వివరించి యున్నారు. అందులో మిశ్రగమకము, అనగా రెండు మూడు విధముల గమకములను చేర్చి ఒక స్వరమును పాడుట యగును.

ఈ గానక్రియలు రాగముల రస భావములను ప్రకాశ పరచుటకును, వివాది దోషములుండిన వాటిని హరించుటకును మిక్కిలి అవశ్యము లగును.

## XII. లక్ష్య ప్రబంధములు:—

1. మార్గ సంగీత పద్ధతిలో ప్రాచీన కాలమునుండియు (భరతముని మతములో సహా) లక్ష్య ప్రబంధములలో "గీత" మే శ్రేష్ఠమైనదిగా చెప్పబడి వాడబడి వచ్చినది. అందువల్లనే వెంకటమఖి తన "చతుర్దండి"లో "గీత"మునే ముఖ్యముగా మొదటిదిగా చెప్పి, తనచే కల్పింపబడిన 72 రాగాంగరాగముల లక్షణములను తేటగా తెలియునట్లు మిక్కిలి

చాతుర్యముగా వాటి కన్నిటికిని "లక్షణ" గీతములను, జన్య రాగముల స్వరూపములు ప్రకాశము జెందినవిగా "లక్ష్య" గీతములను, మరికొన్ని యితర ప్రబంధములను రచియించిరి.

2. మౌర్య, గుప్త సామ్రాజ్య స్వర్ణయుగములకు అనేక శతాబ్దములకు వెనుక మరొక స్వర్ణ యుగముగా ఉదయించిన విజయనగర (విద్యానగర) సామ్రాజ్య, నాయక రాజుల కాలములో ఒక క్రొత్త సంగీత మార్గమునకు విత్తు నాటబడి వారి కాలమున సం గీతము నకు బదులు సం"కీర్తన"లు వ్యాప్తికి తేబడినవి. ఈ సం"కీర్తన"లను వాడిన వాగ్గేయ కారులలో ముఖ్యముగా చెప్పతగినవారు—

1. పాండురంగ విఠల భక్తుడైన "పురందర విఠల దాసు"లు (క్రీ. శ. 1494— 1564, స్వనామము "శ్రీనివాస") కన్నడములో వేలకొలది "పదగళు" రచించినారు.

2. తాళ్ల పాకము వారు (ముఖ్యముగా తాళ్లపాకము చిన్నయ్య)— వెంకటాచలపతి స్తుతిగా వేలకొలది సంకీర్తనలు రచియించినది గాక వెంకటరమణ విషయమై ఉత్సవ పద్ధతి భజన పద్ధతి రెంటిని ఏర్పరిచిరి.

3. "రామదాసు" అను గోపన్న భద్రాచల రాముని పై స్తుతిగా— అనేక కీర్తనలు రచించిరి.

4. "ధూర్తమువ్వ గోపాలుడ"ను కంచి వరదయ్య (క్రీ. శ. 1600—1660) "క్షేత్రయ్య" అని పిలువబడి శృంగార రస పదములను వేలకొలది రచియించి పద రచనకు వెనుకటి వాగ్గేయ కారులకు మార్గదర్శియై వెలసినది తెలిసినదే.

3. తంజపురి ఏలిన మహారాష్ట్ర రాజులలో తుక్కోజి (తులజ I క్రీ. శ. 1729—1735) "సంగీత సారామృత" మను గ్రంథకర్త), ప్రతాపసింహ మహారాజు (క్రీ. శ. 1741 — 1764)— కాలమున సంగీత చరిత్రలో మరొక హాటక యుగములో వెంకటమఖిచే స్థాపింపబడిన ఆధునిక కర్ణాటక సంగీత పద్ధతి కొన్ని ముఖ్యమైన మార్పులు చేయబడి ఉన్నత స్వర్ణదశకు వృద్ధి పొంద బడినది. గీతము తన ముఖ్యత్వమును బాసి వాడుకలో నుండి తొలగిపోయినది. గీతమునకు బదులు మార్గదర్శి శేషయ్యంగార్, మార్గదర్శి వీరభద్రయ్య మొదలగు ప్రసిద్ధ వాగ్గేయకారలచే కల్పింపబడిన కృతి మొదలైన నూతన లక్ష్యరూపములే ఇప్పటికి వాడుకలో ప్రసిద్ధముగా నున్నవి— అవి:

(విద్యార్థులకు ఉపయుక్తమైన) తాన వర్ణములు., (నాట్యమునకు ఉపయుక్తములైన) స్వరజతులు, జతి స్వరములు, చౌక వర్ణములు, పద వర్ణములు, తిల్లానలు మొదలగునవి. (గాయకులకు) కృతులు, రాగమాలికలు, పల్లవులు మొదలైనవి. ఈ మతము ననుసరించియే వెనుకటి వాగ్గేయ కారులు సంగీతమును నేటికిని అభ్యసించు చున్నారు. సంగీత త్రిమూర్తులలో శ్యామాశాస్త్రులు కూడ ఈ క్రొత్తమతము ప్రకారమే తన కృతులను రచించిరి. ముద్దుస్వామి దీక్షితులు మాత్రము తన తండ్రిగారైన రామస్వామి దీక్షితుల వద్ద వెంకటమఖి సంప్రదాయమును వివరముగా నేర్చి వెంకటమఖి ఏలెనే 72 రాగాంగరాగములను వాడి, వాటి కన్నిటికిని "లక్షణ" కృతులను రచించిరి. ఇంక త్యాగయ్యగారు క్రొత్తశైలిగా అమర్చిన కృతులపై నేటికిని గాయకులు మోహము కలిగి మిక్కిలిగా వాడు చున్నారు.

ఇప్పటి విద్వాంసులు, లాక్షణికులు అందరును త్యాగయ్య గారు సంగ్రహ చూడామణి గ్రంథములోని పద్ధతియే అనుసరించి "వేలకొలది, 24000, కృతులును, 72 మేళకర్తల రాగములలోను రచియించిరని అభిప్రాయ పడుచున్నారనుట తెలిసినదే. త్యాగయ్యగారు సంగ్రహ చూడామణి గ్రంథము తనకు దొరుకుటకు మునుపే వందల కొలది కృతులను రచియించి యుండిరి. త్యాగయ్యగారు కొన్ని మేళకర్తలను వాడిరనుట నిజమే. అట్లువాడని మిగిలిన లెక్కలేని మేళకర్తలలో ఇప్పటికిని వారు స్వర్గమున నుండియే ఇచ్చటి ఇప్పటి వాగ్గేయకారుల మూలముగా మనకు లభించునట్లు తలచుచుండుట, చూడ ఆశ్చర్యపడనక్కరలేదని తోచుచున్నది! శీఘ్రముగ 24000 కీర్తనలును మనకు లభించునా!

ఇట్లు మౌర్య గుప్త సామ్రాజ్య స్వర్ణయుగములలో మిక్కిలి ఉన్నత దశలో ప్రకాశించిన ప్రాచీన సం"గీత" పద్ధతి అటు పిదప చరిత్ర సంభవముల కారణముల వల్ల క్షీణించి, మరల విజయనగర (విద్యానగర) సామ్రాజ్యపు ఇంకొక కనక యుగములో సం"కీర్తన" పద్ధతిగా మారి, తంజపురి నాయక సామ్రాజ్యములో మరొక హాటక యుగమున "ఆధునిక కర్ణాటక సంగీత" పద్ధతిగా తోచి అటు వెనుక తంజపురి మహారాష్ట్ర రాజుల కాలమున ఆ పద్ధతి అందరికి దొరకక కొన్ని మార్పులు జెంది ఎక్కువ ప్రకాశమై సం"కృతి" పద్ధతియై క్రొత్త మెరుగిచ్చిన బంగరు వలె వృద్ధిపొంది నూతన మార్గమున కొంతకాలము వెలిగి సంగీత త్రిమూర్తులగు శ్యామాశాస్త్రులు, ముద్దుస్వామి దీక్షితులు, త్యాగయ్యగారలచే వాడబడి వారికి వెనుక ముఖ్యముగా ఇప్పటి శతాబ్ది మొదలుగా స్వర్ణదశనుండి బహుశా ఉత్తమెరుగురహితమైన రౌప్యదశకు దిగియున్నది.

శుద్ధమైనదియు, నిజమైనదియు అయిన వెంకటమఖి పద్ధతిని శ్రీ సుబ్బరామ దీక్షితులు వారు తమకు కుంభకోణం జగద్గురు స్వాములవారు బహుమానముగా ఇచ్చిన తొలి వెంకటమఖి యొక్క వ్రాత ప్రతిని తన సంగీత సంప్రదాయ ప్రదర్శినిలో అన్ని అంశములతో సహా ప్రదర్శించియుండుట తెలిసినదే. ఆ పద్ధతిని మనము ఇక మీదనైన తేటగా తెలిసికొని ఆ ప్రకారము సంగీతమును అభ్యసించి ఈ ఉత్త తక్కుబడిన రజత దశకు దిగియున్న సంగీతమును మరల దాని పూర్వ స్వర్ణప్రకాశము వెలయునట్లు విద్వాంసులు పాటుబడి మార్చి అభ్యసింపవలెనని నా కోరిక— ప్రార్థన.

ఈ వ్యాసములో అనేక అభిప్రాయ భేదములు, దోషములును ఉండవచ్చును. అట్టి అభిప్రాయములను నిర్దాక్షిణ్యముగా విమర్శించి దోషములను మన్నించి, సుంతైన గుణమున్నదానిని మట్టుకు గ్రహించి నన్ను కృతార్థునిగ జేయవలెనని పెద్దలకు, పండితులకు, విద్వాంసులకు నా ప్రార్థన— కృతజ్ఞుడను.

# సంప్రదాయ సాహిత్యం – భారతి

## "ఆంగీరస"

సంప్రదాయ సాహిత్యం అనే పేరు ఎవరు పెట్టారో కాని, కవితా రీతుల్లో ఒక విభాగానికి ఆ పేరు రూఢమై పోయింది. ఛందో వ్యాకరణ లక్షణాలకు అనుగుణంగా ఉండి, ఆలంకారికులు చెప్పిన కావ్య లక్షణాలను అనుసరించి, భారత, భాగవత, రామాయణాదులైన ఇతిహాస పురాణాదుల్లోని కథలు ఆధారంగా రచించబడే పద్య కవిత్వం సంప్రదాయ సాహితిగా ప్రసిద్ధి కెక్కింది. ఈ కవిత్వం నన్నయభట్టుతోనే ప్రారంభమయింది. క్రమంగా ఇతివృత్త స్వీకరణంలోనూ, ఛందోరీతులలోనూ మార్పులు వస్తూ వున్నా, ఛందో వ్యాకరణాది లక్షణాలను పాటించడంలో మాత్రం మార్పు రావడంలేదు. కొన్ని శతాబ్దాలు కడచేవరకూ వచన గ్రంథాలు లేని కారణం చేతనో యేమో, వచన వాఙ్మయం లక్షణానుసారి అయినా, దాని కీ పేరు వాడుకలో ఉన్నట్లు కానరాదు.

మొదట్లో ఈ వాఙ్మయం కథా ప్రధానంగా ఉన్నా, క్రమంగా కథా వస్తువునకు ప్రాధాన్యం తగ్గి వర్ణనలకు ప్రాముఖ్యం వచ్చినది. కావ్యానికి ప్రధానమైనది సదుపదేశమూ, కళాపోషణమూ కాని కథ ముఖ్యం కాదనే విషయాన్ని ఆదినుంచీ అందరూ తెలుపుతున్నారు. ప్రాచీనాలంకారికుడైన భామహుడు తన కావ్యాలంకారంలో

'ధర్మార్థ కామమోక్షేషు వైలక్షణ్యం కళాసుచ,
కరోతి కీర్తిం ప్రీతించ సాధుకావ్య నిషేవణమ్'

అని కావ్య ప్రయోజనాలను వివరించియున్నాడు.

వర్ణనకు ప్రాధాన్యం ఉండి, కథ స్వల్పంగా ఉండడం ప్రబంధాల సామాన్యలక్షణం. వీటిలోని కథా వస్తువు రాజులు, దేవతలు మొదలైన ఉత్తమ పాత్రలకు సంబంధించి ఉంటుంది. ఆ గ్రంథాలు కూడా మహారాజులు మున్నగువారికే కృతి యివ్వబడేవి. సామాన్యజనుల జీవితం వారికి ప్రతిబింబించడం అరుదు. ఇందువల్ల – ప్రబంధకవులు ధనాశతో ప్రభువులకే తమ గ్రంథాలను అంకితమిస్తూ, వారి జీవితాలనే వర్ణిస్తూ సామాన్యజనులను విస్మరించారనీ అతి శయోక్తులతో నిండిన వర్ణనలకే కాని, ప్రబంధాలలో వస్తుస్వభావ వర్ణనకు అవకాశంలేదనీ గత శతాబ్ది చివరి భాగంలోనే ఒక అభిప్రాయం ఏర్పడింది. కవితా పద్ధతిలోనూ మార్పు వచ్చింది. ఖండకావ్యాల ఆవిర్భావానికి ఇది దారితీసింది. ఈ శతాబ్ది ప్రారంభంలో ఖండకావ్యాలు ప్రారంభమై క్రమంగా వాటి రచన వృద్ధిపొందింది. కథా వస్తువులోనూ, వర్ణనలలోనూ మార్పువచ్చిన ఛందో వ్యాకరణాల అతిక్రమణం జరగలేదు. ఛందస్సులో కొన్ని కొత్తరీతులు ప్రవేశించినవి. పద్యాలకూ, గేయాలకూ సమన్వయ పద్ధతిలో ఛందస్సు రూపు కల్పించుకున్నది.

క్రమంగా కథావస్తువు శూన్యమై భావమే ముఖ్యంగాగల ఖండకావ్య రచన కొంతకాలం వ్యాప్తి పొందింది. ఇదే భావకవిత్వమని ప్రసిద్ధికెక్కింది. ఖండకావ్యరచనలో శ్రీ రాయప్రోలువారు అగ్రస్థానాన్ని వహించినట్లు భావకవిత్వంలో శ్రీ దేవులపల్లి—కృష్ణ శాస్త్రిగారు. 'హృదయేశ్వరి' మున్నగువాని మూలంగా శ్రీ తల్లావఝుల—శివశంకర శాస్త్రిగారు (ఇప్పుడు శ్రీ స్వామి శివశంకరస్వామి) ప్రఖ్యాతి వహించారు.

ఆ పద్ధతి కవిత్వానికి భావకవిత్వమనే పేరు కూడా విచిత్రంగానే కావవస్తుంది. భావం కవిత్వ సామాన్యానికి అవసరం. భావం లేని కవిత్వమే ఉండదు. అయినా కథాంశం లేకపోయినా భావమే కావ్యంలో ప్రధానమైనందువల్ల ఆ పేరు వచ్చింది. ఆ పద్ధతిలో వచ్చే భావశూన్య కవిత్వాలు కూడా భావ కవిత్వాలుగా చెలామణీ అయేవి.

విభిన్న కవిత్వాలకు వచ్చే పేర్లు స్థిరపడడం కొంత వింతగానే ఉంది. సంప్రదాయ కవిత్వం పేరునే తీసుకుందాం. అది ప్రాచీన ఛందో వ్యాకరణాలకు లొంగి సాహిత్యవేత్తల లక్షణానుసారిగా ఉంటుంది గదా ! ఆ విధంగానే భావ కవిత్వానికి కూడా ఒక సంప్ర

స్వర్ణ భారతికి

మా శుభాకాంక్షలు!



శ్రీ కె. నారాయణరావు

# జ్యోతి డిస్ట్రిబ్యూటర్స్

విజయవాడ :: మద్రాసు

దాయ మున్నది. కథ లేకుండా హృదయగతమైన భావానికి ప్రాధాన్యమిస్తూ ఛందో వ్యాకరణ నియమబద్ధమై గీతమాలికలలోనూ, క్రొత్త ఛందస్సులలోనూ ఉండడం దాని సంప్రదాయం. ఆ తర్వాత వచ్చిన అభ్యుదయ కవితకు అభ్యుదయ ప్రధాన లక్ష్యం. భావకవిత్వంలో ప్రణయం ప్రధానం, అభ్యుదయ కవుల రచనలలో గ్రాంథిక, వ్యావహారిక భేదం ఉండదు. నియమాలను తలదన్ని, పతితలను అభ్యుదయ మార్గంలో నడిపించాలని దాని సంకల్పం. పద్యాల ప్రాభవాన్ని అణచివేసి, వచన పద్యాల కవిత్వాన్ని ప్రచారం చెయ్యడం ఆ తర్వాత వచ్చిన— పాశ్చాత్య పద్ధతి ననుసరించిన Blank-verse కవిత్వపు ధ్యేయం. కష్టజీవుల శ్రమలను వర్ణిస్తూ, వారి రక్తాన్ని పీల్చి బలుస్తున్న ధనికవర్గంపై తిరుగుబాటును ప్రోత్సహించడం విప్లవ కవిత్వంయొక్క విశిష్ట లక్షణం. ఈ విధంగా ప్రతిదానికీ ఏదో ఒక సంప్రదాయం ఉండనే ఉంటుంది. అయినా నలుగురూ ఏ పేరు వాడితే అదే ప్రచారం పొంది రూఢమై పోతుంది. పయి కవితా రీతులకు ఆయా పేర్లు రావడానికి ఇదే కారణం!

కాలాన్ననుసరించి మార్పులు జరగడం అనివార్యమైనది. ఆ పరిణామం అన్నింటిలోనూ కానవస్తుంది. మార్పు సౌలభ్యాన్నీ, ఎక్కువ ప్రచార ప్రయోజనాలనీ కోరడం స్వభావం. కవిత్రయంవారి కాలానికి తరువాత జనసామాన్యానికి సులభంగా అర్థమయే పద్ధతిలో ద్విపదకవిత్వం బయలుదేరింది. మొదట్లో ద్విపదలు మతప్రచారానికి సాధనాలయినాయి. పాల్కురికి—సోమనాథకవి శైవమత ప్రచారంకోసం పూర్వకవి విలక్షణంగా ఎక్కువ జానుతెలుగు పదాలను ఉపయోగించి బసవపురాణ, పండితారాధ్య చరిత్రలను రచించాడు. ఇవి అప్పట్లో జనసామాన్యంలో ఎక్కువ ప్రచారం పొంది ఉండవచ్చు. తర్వాత మతంతో సంబంధంలేని రంగనాథ రామాయణం, హరిశ్చంద్ర ద్విపదమున్నగు ద్విపద కావ్యాలు వచ్చాయి. ద్విపద కావ్యాలలో రంగనాథ రామాయణం తెలుగుదేశంలోని పల్లెటూళ్లల్లో కూడా ప్రచారంపొంది పేరు తెచ్చుకున్నది. ఇవి కట్టుబాట్లకు లొంగియున్నవే! కాలపరిణామాన్నిబట్టీ ప్రసిద్ధ వ్యవహారాన్నిబట్టీ అప్పటి వ్యాకరణ నిబంధనలను దాటిన కొన్ని స్వతంత్ర ప్రయోగాలు వాటిలో ఉండవచ్చుమగాని లక్షణ ధిక్కరణ కానరాదు.

కావ్యానికి ప్రధానమైనది రసమే అనీ, కావ్యం విన్నప్పుడు ఆనందం కలగవలెననీ లాక్షణికుల నిర్ణయమయినా, కొందరు కవులు అసలు విషయాన్ని విడిచిపెట్టి, కావ్యంమూలంగా తమ పాండిత్యప్రకర్షను వెల్లడించడానికి పూనుకోవడం ప్రారంభంకాగా, ద్వ్యర్థికావ్యాలు, త్ర్యర్థికావ్యాలు, చిత్రకవిత్వం, శ్లేషకవిత్వం, బంధకవిత్వం ప్రచారానికి వచ్చాయి. అవి కేవలం విద్వాంసులు చదివి ఆనందించదగినవే. సామాన్యజ్ఞానం కలవారికి అవి అందుబాటులో ఉండవు. వసుచరిత్రాది ప్రౌఢ ప్రబంధాలూ, రాఘవ పాండవీయాది ద్వ్యర్థికావ్యాలూ ఈ తరగతికి చెందినవి. ఇట్టి గ్రంథాలను రచించే సామర్థ్యం ఉన్నవారున్నూ చాలా కొద్దిమందే! అయితే వీటివల్ల ఎక్కువ ప్రయోజనం లేకపోలేదు. వీటివల్ల ఎక్కువగా భాషా పరిజ్ఞానం కలుగుతుంది.

ఈ విధంగా కాలాన్నిబట్టి కవితా పద్ధతులలో మార్పులువస్తూ వచ్చాయి. కాని, ఆ మార్పులు కొంతకాలం మాత్రమే ఉండడమూ, తర్వాత కొత్త పద్ధతి తలయెత్తగా వెనుకటిపద్ధతి వెనుకంజ వెయ్యడమూ, సంభవిస్తూ ఉండినది. శ్లేషకవిత్వం, ద్వ్యర్థి త్ర్యర్థి కావ్యరచన, చిత్రకవిత్వం బంధ కవిత్వం అవిచ్ఛిన్నంగా కొనసాగుతునే ఉండినది.

పాశ్చాత్యభాషా, వాఙ్మయ సంపర్కంవల్ల తెలుగులో మొదట్లోలేని ఖండకావ్యాలు ఆ తర్వాత వెలువడినా, అవి ఛందోవ్యాకరణాలకు విరుద్ధంగా రచింపబడలేదు. భావకవులు కొందరు ప్రాచీనకవిత్వాన్ని నిరసించడంమూలాన వారికి వ్యతిరేకంగా ఉద్యమం బయలుదేరింది. 'కృష్ణపక్షా'నికి వ్యతిరేకంగా 'శుక్లపక్షం' వెలువడింది. కాలం మారినకొద్దీ భావకవితా ప్రచారం తగ్గిపోయింది. అభ్యుదయకవిత్వం తలెత్తడం కూడా దీనికి కొంత కారణంకావచ్చు. భావకవిత్వం

బహుళ ప్రచారంలోఉన్న కాలంలోనే వ్యావహారిక భాషలో గేయ కవిత్వం జనసమూహాన్ని ఆకర్షించేది. నండూరి– వెంకటసుబ్బారావుగారి 'ఎంకిపాటలు', బసవరాజు— అప్పారావుగారి 'కొల్లాయి కట్టితేనేమి' మొదలైన గేయాలు ఆ గేయ కవిత్వంలో అగ్రస్థానం ఆక్రమించాయి. అయినా, వాటి ప్రభ కొంతకాలంవరకూ మాత్రమే వెలిగింది. తర్వాత ప్రచారానికి వచ్చిన అభ్యుదయ కవిత్వంలో వచన పద్యాలు చోటు కల్పించుకున్నాయి. అరసంవారు — (అభ్యుదయ రచయితల సంఘంవారు) పత్రికను పెట్టి తమ రచనలను, ఆశయాలను ప్రచారం చేసుకున్నారు. కొన్ని మహాసభలు జరిపి, తమ ఉన్నతాశయాలను ప్రచారం చేశారు. మానవజీవితాన్ని సరిదిద్దడానికి హితప్రాప్తినీ, అహిత నివృత్తినీ కలిగించుట కావ్యప్రయోజనముగ ఉండాలని ప్రాచీనులంటే, నవ్యకవులు కళాపోషణ మాత్రమే ధ్యేయంగా ఉండాలిగాని, మరో ప్రయోజనం ఉండనక్కర్లేదని, ఆ విధంగానే ఖండకావ్యరచన సాగించారు. అభ్యుదయ కవిత్వం వచ్చేనాటికి ఆ అభిప్రాయం మారిపోయింది. జనసామాన్యాన్ని అభ్యుదయ మార్గంలో నడిపించి, అన్నిరంగాలలోనూ అభ్యున్నతిని తీసుకొని రావడం కవిత్వానికి ప్రయోజనమని అభ్యుదయ కవుల ఆశయం. వారి ఆశయం ఎంతవరకూ నెరవేరిందో చెప్పలేము. ఎప్పుడో ఒకప్పుడు సమావేశం కావడం తప్ప ఇప్పట్లో అది సాధించిన అభ్యున్నతి కానరాదు. అప్పటి అభ్యుదయ కవులలో చాలామంది యిప్పుడు విప్లవ కవులుగా మారిపోయారు. వచన పద్యాల రూపంగా ఉన్న కవిత్వం అభ్యుదయ మార్గంలోనే కాకుండా వ్యంగ్య పద్ధతిలోనూ, వర్ణనాత్మకంగానూ కూడా సాగింది. ఈ విధంగా వివిధ రీతుల్లో కవిత్వం కాలానుగుణంగా మార్పు చెందుతున్నా సంప్రదాయ కవిత్వం మాత్రం అవిచ్ఛిన్నంగా కొనసాగుతునే ఉన్నది. వచన పద్యకవి శ్రీ పఠాభి 'ఫిడేలు రాగాల డజన్'లో— వచన పద్యాలనే దుడ్డుకర్రలతో పద్యాల నడుములిర్ని విరగ్గొడతానని చెప్పినా, అలా చెప్పడం మాత్రమే జరిగింది పద్యాల నడుములిర్ని కొట్టబూని, ఆ ఉద్రేకంలో తూలిపోవడంచేతనో యేమో, ఆ దుడ్డుకర్ర గురి తప్పి నేలమీద పడిపోయింది.

ధనికవర్గాలు స్వప్రయోజనాలకోసం శ్రామికులను పీడిస్తూ, తాము బలుస్తూ, వారిని కృశింపజేస్తూ ఉన్నారనీ, లోకంలో అక్రమం, అన్యాయం, ద్రోహం, మోసం తాండవిస్తున్నాయనీ, ప్రజానీకం బాగుపడాలంటే విప్లవం బయలుదేరాలనీ విప్లవ కవుల అభిప్రాయం. 'విరసం' మూలంగా తమ ఆశయాలను వెల్లడిస్తూ, విప్లవాన్ని ప్రోత్సహించే పద్ధతిలోనే వీరు కవితలను అల్లుతున్నారు. నవ్యకవి కృతుల్లో విప్లవ కవిత్వమే ఎక్కువగా కానవస్తున్నది.

ఏ కవిత్వమైనా నలుగురి తలలవూ ఊపించాలంటే కవి సమర్థుడయి ఉండాలి. శృంఖలాలు తెంచుకుని స్వేచ్ఛావిహారం చేస్తూ, కలాన్ని దాని యిచ్ఛ వచ్చిన రీతిని పోనిచ్చినంతమాత్రాన సామర్థ్యం రాదు. దానికి ప్రాచీనాధునాతన కవిత్వాలతో ఎక్కువ పరిచయం ఉండాలి. లోకానుభవం ఉండాలి. ఆధునిక కవులలో అగ్రశ్రేణికి చెంది, మహాకవి అనిపించుకున్నవారు కూడా వెనుకటి సాహిత్యంలో సమగ్రకృషిచేసి, సంప్రదాయ కవితా పద్ధతులను అనుసరించి ఒకప్పుడు నియమాలతో చక్కని కవిత్వం చెప్పినవారే! ఉదాహరణకు— నవ్యకవులకు ఆదర్శ పురుషులైన శ్రీశ్రీ గారినే తీసుకోవచ్చును. విశాఖపట్నం కవితాసమితి స్థాపకులలో ముఖ్యులైన వీరు శ్రీ గంటి—సూర్యనారాయణ శాస్త్రిగారిచే సంపాదితమై 1930 లో ప్రకటితమైన 'శృంగార కంఠాభరణం'లో

"ఉతామసీ నిశ్శబ్దహృది మన
కిర్వురకు స్వాగతముగా
శ్వేతస్మితామృత శిశిర వీచీ
శీకరము లోలయింపగా
చేతస్సముద్ర తరంగ నాట్యము
లై తలంపులు తరలగా
ఆతంక మింతయు లేక నీకొఱ
కాలపించెద గీతముల్"

...................................

[హారతి—శృం. కం. పుట 94]

అనే కవితలోని భాగాన్ని చూడవచ్చు.

వచన పద్యాల్లో రచింపబడిన పుస్తకాలు ఇప్పుడు చాలా వెలువడుతున్నవి. అయినా సంప్రదాయ కవిత్వం నమసిపోలేదు. అందులోనూ చాలా కృతులు వెలువడుతున్నవి. వీటిలో కొన్ని సర్వసాధారణంగా ఉన్నా మంచి రచనలుకూడా రాకపోలేదు.

'భారతి' అవతరించి ఏభయియేళ్ళయింది. అప్పటికి సంప్రదాయ కవిత్వమే బహుళ వ్యాప్తిలో ఉన్నది. భావకవిత్వం అప్పుడప్పుడే ప్రారంభమవుతూ ఉండినది. వ్యావహారిక వాదులకూ, గ్రాంథిక భాషా వాదులకూ వాదవివాదాలు ఒకవంక చెలరేగుతునే ఉండినవి. భారతీ పత్రిక అన్ని పక్షములవారికీ సమ ప్రాధాన్యం ఇచ్చి తన నిష్పక్షపాత తను వెల డించేది. గ్రాంథిక వాదులూ, సంప్రదాయ కవులూ అయిన శ్రీపాదవారి కృష్ణభారతంలోని ఘట్టాలను ప్రకటించేది. పలలితంగానూ. సర్వజనాకర్షకంగానూ, పండితామోదకరంగానూ శ్రీ వేటూరివారు రచించిన 'విశ్వాసము, మూన్నాళ్లముచ్చట, కడుపుతీపు' మొదలైన పద్యకథలు ప్రకటింపబడేవి. భావకవిత్వంతోపాటు దానిపై విమర్శలు బయలుదేరిన అభ్యుదయ కవిత్వానికీ తర్వాతవచ్చిన వచనపద్య కవిత్వానికీకూడా 'భారతి' లో తగిన స్థానం లభిస్తూనే ఉండినది. కొత్త కొత్త రీతుల కవితలు ఆదరించబడుతున్నా సంప్రదాయ కవిత విస్మరింపబడలేదు.

ఇప్పటి కవులలోనేకాదు; పండితులలోకూడా కొందరికి నవ్యకవితా పద్ధతులపైనే ఎక్కువమోజు ఉన్నట్లు కానవస్తున్నది. ఆ కవితారీతులను గురించి, అవి అనుసరించిన ఛందోనియమాలను గురించీ ఏవేవో విశిష్టాభిప్రాయాలను వారు తెలియజేస్తారు. కొన్ని ప్రౌఢపదాలను కూడబెట్టుకుని, తరుచుగా వాటిని ఉపయోగిస్తారు తమ వాక్యరచనలో. వాటిని అర్థం చేసుకుని, వైశిష్ట్యాన్ని గ్రహించగలిగిన వాళ్లు ఎంత మంది ఉంటారో చెప్పడం కష్టం!

సంప్రదాయ కవితా పద్ధతులను అనుసరించిన కొందరి రచనలలో యథార్థమైన కవిత్వం లేక పోవచ్చు. అయినా, ఆ రచనలు అర్థమవుతాయి. కొందరి వచనపద్యాలలో పదాలు సులభమైనవే ఉన్నా, కని అభిప్రాయమేమిటో బోధపడదు. కవిత్వంలో కాల క్రమంగా మార్పులు వస్తూఉన్నా నూతన పద్ధతులు కలకాలం నిలిచిఉండక పోవడానికీ, సంప్రదాయకవిత నిలిచి ఉండడానికీ ఇదిఒక కారణం కావచ్చు.

కాలాన్నిబట్టీ, వివిధభాషా సంప్రదాయాల ప్రభావాన్నిబటీ, ఆయాతరాలవారి అభిరుచులనుబట్టీ తెలుగుకవిత్వం ఎన్నో పరిణామాలను పొందుతున్నది. కొన్ని పద్ధతులు కొంతకాలమే నిలవడమూ, కొత్త పద్ధతి రాగానే వెనకబడి పోవడమూ సాహిత్యవేత్తలు ఎరిగినదే! ఇట్టి స్థితిలో సంప్రదాయ సాహితి అని చెప్పబడే ప్రాచీన సంప్రదాయకవిత మాత్రం శతాబ్దాల తరబడి నిలిచియే ఉన్నది. నిలవగలదనే చెప్పవచ్చు. నవ్య కవితారీతులకు ప్రోత్సాహమిస్తున్నా, సంప్రదాయ సాహితిని విస్మరింపకుండా గౌరవిస్తున్న 'భారతి'ని అభినందింపవలసి ఉన్నది.

---



"స్వర్ణ భారతికి"
శుభాకాంక్షలు !

నిత్య జీవితంలో తారసిల్లే
పాత్రల రూపకల్పన సారమే
కామినేని ప్రసాద్ సమర్పించు
లక్ష్మీ రమణా కంబైన్స్ వారి

# "ఇంటింటి కథ"

దర్శకత్వం, కూర్పు : కె సత్యం
నిర్మాత : కె. కృష్ణ

తారాగణం :— కృష్ణ — చంద్రకళ
గుమ్మడి — అంజలీదేవి
సత్యనారాయణ — రమాప్రభ
పద్మనాభం — సుమ
రామమోహన్ — సునందిని
అల్లు రామలింగయ్య — ఛాయాదేవి

పంపిణీదారులు : జోతీ (ఆంధ్ర)
బ్రైట్ (నైజాం)

# విభిన్న శాస్త్రాలలో కొన్ని సాదృశ్యాలు

## —శ్రీ వసంతరావు వేంకటరావు—

మహాత్ములు, యోగులు, ఆధ్యాత్మిక చింతనాపరులు ఆత్మతత్వాన్ని విశదీకరించేరు. ఆ విశదీకరణ కాధారము అంతస్ఫూర్తి, స్వానుభవము. విజ్ఞాన శాస్త్రజ్ఞులు ప్రకృతి దృగ్విషయాలను వివరించేరు. ఆ వివరణ కాధారము యంత్రసామగ్రి, ప్రయోగము, పరిశీలన, గణితము. రెండు క్షేత్రాలకు తర్కం ప్రధాన విషయమే. తత్వవేత్తలు విజ్ఞాన శాస్త్రజ్ఞులుకూడా విశ్వానికి సంబంధించిన కొన్ని సత్యాలను ప్రకటించేరు. తాత్వికులా విషయాలను అధికారికంగా చెప్పినట్లు కనిపిస్తుంది; విజ్ఞాన శాస్త్రజ్ఞులట్లా కాకుండా ప్రయోగ పూర్వకంగా పరిశీలించి గణితంతో సాధించి వెల్లడించేరు. ఆధ్యాత్మిక క్షేత్రంలో భగవంతునిది అగ్రస్థానము. విజ్ఞానశాస్త్ర క్షేత్రంలో భగవంతుని అవసరం లేదు. ఏమంటే, ఇంద్రియాలకూ యంత్రాలకూ అందిన సహేతుక జ్ఞానమే విజ్ఞాన శాస్త్రమవుతుంది. అందనిది ఆ క్షేత్రంలో ప్రవేశించలేదు. ఇంత వ్యత్యాస మున్నప్పటికి వాటిలో సాదృశ్యాలు గోచరిస్తాయి. రెండింటిని పరిశీలిద్దాము.

మొదటిది సూర్యుని మహౌజ్జ్వల్యం గురించి. సూర్యునికి భగవంతునికి ఉన్నసంబంధానికి తాత్వికులాశ్చర్యపడితే, సూర్యునికి శతకోటి నక్షత్రాలకు ఉన్న సంబంధానికి విజ్ఞాన శాస్త్రవేత్త ఆశ్చర్య చకితుడౌతాడు.

'శివానందలహరి'లో శ్రీమచ్ఛంకర భగవత్పాదులంటారు :

''ఏకో వారిజ బాంధవః క్షితి నభో
వ్యాప్తం తమో మండలం
భిత్వా లోచన గోచరోపి భవతి, త్వం
కోటి సూర్య ప్రభః వేద్యః
కిం న భవ త్యహో!...పశుపతే!''

'ఓ పరమేశ్వరా! పద్మబాంధవుండైన సూర్యుడు ఒక్కడయ్యును భూమ్యంతరిక్షములనిండిన అంధకారాన్ని ఛేదించి కన్నుల కగపడుచున్నాడు. కోటి సూర్యుల వెలుగొందుచున్న నీవు ఏల ప్రత్యక్షము కావు?' అని ప్రశ్న. కోటి సూర్యుల దీప్తిని మించిన దీప్తిని దర్శించిన ఆత్మజ్ఞాను లా విధంగా ఆశ్చర్యపడటం సహజమే.

భౌతిక శాస్త్రజ్ఞుని ఆశ్చర్యానికి మరొక కారణముంది. బహువిధ యంత్రాలతో ఆకాశాన్ని శోధించి తెలిసికొన్న విషయాలను క్లుప్తంగా చెప్పుకొంటే వెలువడే విశ్వరూప చిత్ర మీ విధంగా ఉంటుంది.

ఆకాశంలో అసంఖ్యాకంగా నక్షత్రాలున్నాయి. సూర్యుడొక నక్షత్రమే. భూమికి సాపేక్షంగా అతిసమీపంగానున్న కారణంచేత దుర్నిరీక్ష్యమైన తేజస్సుతో భాసిస్తున్నాడు. నక్షత్రాలు కూటాలుగా ఉన్నాయి. వాటిని గేలక్సీ (Galaxy) లంటారు. అవికూడా కొన్ని కూటాలుగా ఉన్నాయి. ప్రతి గేలక్సీలో దాదాపు దశ సహస్రకోటి నక్షత్రాలున్నాయి. మన సూర్యుడున్న గేలక్సీని పాలపుంత (M lky way) అంటారు. అది సర్పిలాకారంలో దాదాపు ఇడ్లీవలె ఉంది. దాని అడ్డకొలత సుమారు 100,000 కాంతి వత్సరాలు (ఒక కాంతి వత్సరమంటే సుమారు 6 మిలియన్ మైళ్లు) దానిమందం సుమారు 10,000 కాంతి వత్సరాలు. దాని కేంద్రంనుంచి సుమారు 33,000 కాంతి సంవత్సరాల దూరంలో సౌరమండల ముంది. గేలక్సీ తన అక్షంపై భ్రమిస్తుంది. ఒక్క భ్రమణానికి పట్టేకాలం సుమారు 20 కోట్ల సంవత్సరాలు. తన గ్రహకూటంతో సహా సూర్యుడు గంటకు దాదాపు 600,000 మైళ్ల వేగంతో ఆకాశయానం చేస్తున్నాడు. ఆ వేగం భూమికీ ఉంది. భూమితోపాటు జీవులకూ ఉంది. అదొక అద్భుత విషయము.

# విభిన్న శాస్త్రాలలో కొన్ని సాదృశ్యాలు

కోట్లకొలది నక్షత్రాల సమూహమైన గేలక్సీలు. కోట్ల కొలదిగా నున్నాయి. అసంఖ్యాకంగానున్న నక్షత్రాలను వాటి ఉపరితల ఉష్ణోగ్రతలనుబట్టి వర్గీకరిస్తే, సుమారు 6000°C ఉష్ణోగ్రత ఉన్న సూర్యుడు ఒక అతి సాధారణమైన నక్షత్రమని విశదమైంది. నక్షత్రాల గరిష్ఠ ఉపరితల ఉష్ణోగ్రత 35,000°C వరకు ఉన్నట్లు తెలియవచ్చింది. ఔజ్జ్వల్యంలో కూడా సూర్యుని తలదన్నే నక్షత్రాలెన్నెన్నో ఉన్నాయి. అవన్నీ అనుక్షణం ప్రకాశిస్తూనే ఉన్నాయి. దీప్తిని నిరంతరం దశదిశలు విరజిమ్ముతూనే ఉన్నాయి.

పగలల్లా ఆకాశంలో సూర్యుడుతప్ప ఒక నక్షత్రమైనా కనిపించదు. సూర్యాస్తమయంకాగానే చీకట్లు అలముకొంటాయి. ఒక్కటొక్కటిగా నక్షత్రాలు గోచరిస్తాయి. అమావాస్యనాడైతే రాత్రి నిర్మలాకాశం ఎంతో ఉత్తేజకరంగా భాసిస్తుంది. సిరియస్ (Sirius) వంటి నక్షత్రమైతే వడివడిరంగులు మారుస్తూ మెరుస్తూ ఉంటుంది.

అన్ని నక్షత్రాలు మెరుస్తూన్నా రాత్రి చీకటిగానే ఉంటుంది. సూర్యుని ధిక్కరించే కోట్లకొలది నక్షత్రాల కాంతి ఏమైపోతూంది? చీకటి ఏ విధంగా ఆవరించ కలుగుతూంది? ఒక్కసూర్యుడు అంధకారాన్ని భేదించి పగలు కలిగించడమా? ఇదొక విరోధాభాసము. విజ్ఞానశాస్త్రం ఇంతవరకు పరిష్కరించలేని సమస్య.

ఈ వైజ్ఞానికాధారంతో విజ్ఞాన శాస్త్రవేత్త ఆశ్చర్యంతో అంటాడు:

'ఇదియేమి విపరీత
మెట్టి విపరీత మిది?

కోటి తారల వెలుగు కొల్లగొట్టుచు నున్న
ఏటికో నిశ చిమ్మ చీకటులు వేధించు?
ఒక్కొక్క నక్షత్ర మొక్కొక్క సూర్యుడై
చిమ్ము శక్తిని ఆకసమ్మేమి చేసింది?
చీకటికి మితిలేని ఆకలో, కాంతితో
నింపుగా తనపొట్ట నింపు కొంటున్నాది!
తన కాంతి నసహసించెడు కాంతిని వెలార్చు
ఘన తారకల పగల్ భానుడెటు కప్పునో?
ఒక్కతారక పట్టపగలు కావించుటా?
ముక్కోటి తమసమున బిక్కుమని మునుగటా?

ఇది యేమి విపరీత
మెట్టి విపరీత మిది?''

రెండవది 'శబ్దగుణమాకాశం.'

తాత్వికుల ప్రకారం పంచభూతాలతో సృష్టి జరిగింది. అది పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము. ఈ పంచభూతాల ధర్మాలను శబ్దస్పర్శ రూప రసగంధాలపరంగా విశదీకరించేరు. మొదటిది ఆకాశము. శబ్దగుణ మాకాశం. వైజ్ఞానిక దృష్టికి సృష్టిలోఉన్న ప్రధాన భాగాలు మూడు. అవి: ద్రవ్యము, శక్తి, ఆకాశము. ద్రవ్యము మూడు స్థితులలో ఉండగలదు. అవి ఘనము, ద్రవము, వాయువు; లేదా, పృథివి, అప్పు, వాయువు. శక్తియొక్క ఒక రూపం తేజస్సు. శక్తి ద్రవ్యాలు ఆకాశంలో నున్నాయి. కాబట్టి ఏ దృష్టితో చూచినా విశ్వనిర్మాణ ఘటకాలు పృథివ్యాపస్తేజో వాయురాకాశములనడం సమంజసమే. శక్తి ద్రవ్యాలు భిన్నంగా గోచరించినా తత్వతః ఒకటే అని నిరూపించడమయింది.

శబ్దం ఉత్పత్తి కావడానికి స్పందమో, కంపనమో, భ్రమణమో, చలనమో అవసరము. ఆ వర్తు భ్రమణ గమనము కంపన గమనానికి సమానమని చూపవచ్చు. కంపించే వస్తువు ఒక సెకనులోచేసే కంపనాల సంఖ్యను దాని పౌనఃపున్యము (Freqnency) అంటారు. మన శరీరంలో శబ్దాన్ని గ్రహించే యంత్రం చెవి. దాని గ్రహణ శక్తికి అవధులున్నాయి. సెకనుకు 20 నుంచి 20,000 వరకు జరిగే కంపనాలను మాత్రమే అది శబ్దంగా గుర్తించగలదు. 20,000 కంటె ఎక్కువ పౌనఃపున్యమున్న కంపనాలను మనం ఉత్పత్తి చేయగలము; అంతకెక్కువ పౌనఃపున్యం గలవి ప్రకృతిలో సహజంగా ఉన్నాయి. కాని వాటిని శబ్దంగా చెవి గుర్తించలేక పోవడంచేత వాటిని అతిశబ్దాలు (Ultrasonic) అన్నారు. కర్ణగోచరంగానివి అతిశబ్దాలుకాని శబ్దాలు కాకపోవు. అంటే కంపనంతోనో, భ్రమణంతోనో శబ్దం జనిస్తుందన్నది భౌతిక శాస్త్ర సూత్రాలలో ఒకటి.

ద్రవ్యం ఏ రూపంలోనున్నా అందున్న అణువులు కంపిస్తూ ఉంటాయి, భ్రమిస్తూ ఉంటాయి, గమిస్తూ ఉంటాయి—ఉష్ణోగ్రత అనుకూలించనప్పుడు. అణుగమనాన్ని ఉష్ణోగ్రత కొలవడానికి ఆధారం చేసికొన్నారు. అణువులశక్తి తగ్గిస్తూ ఉంటే పదార్థాన్ని చల్లారుస్తూ ఉంటే—దాని ఉష్ణోగ్రత తగ్గుతుంది. ఎంతవరకు తగ్గుతుందంటే పరమశూన్యాన్ని (Abolnte zero) చేరేవరకు అని శాస్త్రవేత్తలు నిర్ణయించేరు. పరమశూన్య ఉష్ణోగ్రతను చేరుతూన్న కొద్దీ ద్రవ్యధర్మాలలో మార్పు కలుగుతుంది. అంతకన్న తక్కువ ఉష్ణోగ్రత అసాధ్యము. పరమశూన్యం వద్ద అణుకంపన, భ్రమణ, గమనాలు ఆగిపోయి అణువులు స్తంభించేటట్లు భావించవచ్చును.

సృష్ట్యాదివిషయం ఏ శాస్త్రమూ ఇదమిత్థమని చెప్పలేదు. తైత్తిరీయారణ్యక ప్రథమ ప్రపాఠకమందలి త్రయోవింశోనువాకంలో సృష్టి విషయ మీ విధంగాఉంది: సృష్టికి పూర్వం మనకు కనిపిస్తూన్న ప్రపంచమంతా జలమయంగా ఉండేది. ఆ జలమధ్యంలో తామరాకుపై ప్రజాపతి ఒక్కడే ఉండెను. ప్రపంచాన్ని సృజించాలన్న ఇచ్ఛ ఆయనకు కలిగింది. ప్రజాపతి కొంతకాల మాలోచించిన పిమ్మట తన దేహమును కదలింపగా ఆయన దేహమందుండు మాంసమువల్ల అరుణులు, కేతులు, వాతరశనులు అను మూడు విధాలైన ఋషి సంఘము లుద్భవించినాయి. ప్రజాపతి గోళ్లవల్ల వైఖానసులని, వెంట్రుకలవల్ల వాలఖిల్యులని చెప్పబడు మునులుద్భవించేరు. ఆ విధంగా సృష్టి ప్రారంభమయింది.

విజ్ఞాన శాస్త్రజ్ఞుల కథనం మరో విధంగా ఉంది. విశ్వంలోనున్న ద్రవ్యమంతా ఆద్యపరమాణు (Primeval Vom) రూపంలో ఒకే ఒక ఖండంగా ఉండేది. ఎందుకో అది పేలిపోయింది. ఆ పేలుడులో భిన్నాభిన్నమైన శకలాలు, పేలుడు శక్తికి, చెదిరిపోవడం మొదలుపెట్టినాయి. ఒక్కొక్క శకలం ఒక్కొక్క గేలక్సీగా రూపొంది, గేలక్సీలు చెదిరి పోతున్నాయి. విశ్వం వ్యాకోచిస్తూంది. కొంతకాలం—అంటే వేలకోట్ల సంవత్సరాలు—గడచిన తరవాత వ్యాకోచం ఆగిపోయి, గాలక్సీలు సంకోచించడం ప్రారంభించవచ్చు. దాని పర్యవసానంగా ద్రవ్యమంతా ప్రోగుపడి ఆద్యపరమాణువు రూపొందవచ్చు. అది మళ్ళా పేలవచ్చు. ఈ ప్రక్రియలు డోలాయమానంగా జరగవచ్చు.

ఇంకోవాదం ప్రకారం, మూలవిద్యుత్కణాలు మాత్రమే నిశ్చలంగా సృష్ట్యాదిని ఉండేవి. వాటిలో చలనం, భ్రమణం ప్రారంభించగానే సృష్టి ప్రారంభము. భ్రమణంతో శబ్దం జనిస్తుందని గమనించేము. కాబట్టి సృష్టితో శబ్దం ప్రారంభమయింది. అది ఆకాశంలో వ్యాపించడంవల్ల శబ్దగుణ మాకాశమయింది. మన వ్యవహారంలోఉన్న శబ్దం ప్రసరించడానికి యానకం (Medium) అవసరము. ఘన ద్రవ వాయు పదార్థాలలో ఏదో ఒకటి ఉంటేతప్ప శబ్దం ప్రసరించదు. ఆకాశం దాదాపు శూన్యము. కాని అతిశబ్దానికి యానకమవసరం లేదు. సృష్టితో పుట్టిన శబ్దము ఆకాశ వ్యాప్తము.

శబ్దంతో కాలంకూడా ఆవిర్భవించింది. వస్తు కంపన, భ్రమణ, గమనాలు లేనిదే కాలభావం లేదు. ప్రళయస్థితిలో కాలమూహ కందదు. మనకాల భావం భూచంద్రుల భ్రమణ పరిభ్రమణాలమీద ఆధారపడి ఉంది. ఆ విషయంలో తాత్వికులకు విజ్ఞాన శాస్త్రజ్ఞులకు భేదాభిప్రాయం లేదు. ప్రపంచమంతటా ఒకే కాలెండర్ వినియోగపడుతూంది.

---

శుభాభినందనలతో



 తారకరామా ఫిలింస్,

విజయవాడ.

 శ్రీ తారకరామా పిలింస్,

సికింద్రాబాద్.

 నవభారత్ పిలింస్.

గుంతకల్లు.

# అష్టాధ్యాయి: ఆధునిక భాషాశాస్త్రం

డాక్టర్ పి. ఎస్. సుబ్రహ్మణ్యం

**0. ఉపోద్ఘాతం—**

పాణిని మహర్షి సంస్కృతభాషకి రచించిన “అష్టాధ్యాయి’ వంటి వ్యాకరణం ప్రాచీనకాలంలోగాని భాషాశాస్త్రం వృద్ధి పొందుతున్న ఈ కాలంలోగాని మరి ఏ భాషకీ ఎవరూ రచించలేదనే విషయం భాషాశాస్త్ర వేత్తలందరూ అంగీకరించినదే. యూరప్ ఖండవాసుల సంస్కృతికి గణితశాస్త్రం మూలకందమైనట్లు భారతీయుల సంస్కృతికి వ్యాకరణశాస్త్రం మూలకందమైనది. మన దేశంలో వ్యాకరణశాస్త్ర వృద్ధికి మూలకారణం వేదపరిరక్షణే అయినా, పాణినీ, తదనుయాయులైన వైయాకరణులూ వ్యాకరణాన్ని స్వతంత్రమూ, పరిపూర్ణమూ అయిన శాస్త్రంగా తీర్చిదిద్దారు. కాని యీ మహత్తర కృషిలో వారు అనుసరించిన సూత్రాలూ, అవలంబించిన పద్ధతులూ వారు సమగ్రంగా వివరించ లేదు. కాబట్టి అష్టాధ్యాయీ నిర్మాణానికి పాణినిమహర్షి ప్రాతిపదికగా తీసుకొన్న సిద్ధాంతాలని పరిశోధించి వివరించవలసిన బాధ్యత సంస్కృత వ్యాకరణమూ, ఆధునిక భాషాశాస్త్ర సిద్ధాంతాలూ తెలిసిన పండితులమీద ఉంది. భాషాశాస్త్ర పరిశోధన వృద్ధి పొందుతున్న కొద్దీ పాణినీయానికి ప్రాతిపదికలైన సిద్ధాంతాలకీ, ఆధునిక భాషా శాస్త్ర సిద్ధాంతాలకీ అత్యధిక సాన్నిహిత్యం ఉందనే విషయం స్పష్టమవుతోంది. ఈ సాన్నిహిత్యాన్ని గురించి చర్చించడమే ఈ వ్యాసం ఆశయం.

దీనికి ఈ క్రింద ఇచ్చిన కొందరు ప్రముఖ పండితుల అభిప్రాయాలు ఉదాహరణలు:

“This (i. e. Panini's) grammar, which dates from somewhere round 350 to 250 B. C., is one of the greatest monuments of human intelligence. It describes, with the minutest detail, every inflection, derivation and composition, and every syntactic usage of its author's speech. No other language, to this day, has been so perfetly described”

L. Bloomfield Language, p. 11.

“ This scientific condensation, which places every feature into its proper setting, is one of the two virtues which make Indian grammar a model for us. The other is completeness. Panini gives the formation of every inflected, compounded, or derived word, with an exact statement of the sound-variations (including accent) and of the meaning.”

L. Bloomfield, Lg, 5 (1929), p. 274.

“The Romans. .did not know how to derive the stem of the word from a comparison of the various inflectional forms, and the Greeks in this respect were no wiser. But the Indian grammarians were never capable of floundering in such confusion. They derived the stem correctly from inflectional forms. the root from the several groups of the related words; they ascertained the laws of derivation and composition and so forth.”

Holger Pedersen, The Discovery of Language, pp. 22—3.

“First of all, the importance of the great grammarian (ie. Panini; is considerable, due to the synchronic view which he gives of the language of hi time and due to the method which he uses in the description of this language. This method is in certain respects archaic, but often surprisingly modern, and always precise and rigorous. Furthermore, the technique of Panini (and his school) is of interest for those who are working toward an axiomatization of grammar in this respect Panini's grammar represents a model that has no equal in antiquity.”

.. L. Renou, Panini, Current Trends In Linguistics 5, p. 481.

“The Hindu achievements in morphological description were of a kind that we have only just begun ro rival in modern western descriptive Linguistics and that we have not yet bettered.”

...M. B. Emeneau, “India and Linguistics”, p 191 (Collected Papers, Annamalai University.)

## 1. వ్యాకరణ రచనలో లాఘవం (The Princeple Economy in Grammar

అష్టాధ్యాయిలో సూత్రాల సంఖ్య సుమారు నాలుగు వేలే అయినా అది లౌకికభాషకీ వైదిక భాషకీ కూడా పరిపూర్ణమైన వ్యాకరణం. ఇంత చిన్న గ్రంథంలో ఇటువంటి పరిపూర్ణత పాణిని మహర్షి సాధించగలగడానికి ఆయన అనుసరించిన సూత్ర పద్ధతే కారణం. సూత్రానికి నిర్వచనం—

"అల్పాక్షర మసందిగ్ధం
సారవ ద్విశ్వతోముఖం
అస్తోభ మనవద్యంచ
సూత్రం సూత్రవిదో విదుః"

(తక్కువ అక్షరాలు కలిగినదీ, సందేహానికి తావులేనిదీ, సారవంతమైనదీ, సర్వవ్యాప్తమైనదీ, వ్యర్థపదాలు లేనిదీ, దోషరహితమైనదీ సూత్రం అని సూత్ర వేత్తల అభిప్రాయం.) వ్యాకరణ శాస్త్రంలో ఆరు రకాల సూత్రాలు ఉన్నాయని ఈ క్రింది శ్లోకంవల్ల తెలుస్తుంది:

"సంజ్ఞాచ పరిభాషాచ
విధిర్నియమ ఏవచ
ప్రతిషే ధోఽధి కారశ్చ
షడ్విధం సూత్ర లక్షణం."

వీటిలో విధి సూత్రాలూ, నియమ సూత్రాలూ, ప్రతిషేధ సూత్రాలలోనే వ్యాకరణం ఇమిడి ఉంటుంది, మిగిలిన మూడు రకాల సూత్రాలూ, అంటే, సంజ్ఞాసూత్రాలూ, పరిభాషా సూత్రాలూ, అధికార సూత్రాలూ వ్యాకరణ సత్యాలని సంక్షేప రూపంలో వివరించడానికీ, కూర్చడానికీ ఏర్పడినవి. దీనివల్ల పాణినిమహర్షి సూత్ర నిర్మాణంలోనే కాక గ్రంథ నిర్మాణంలో కూడా లాఘవాన్ని పాటించినట్లు తెలుస్తుంది. "అర్ధమాత్రా లాఘవేన పుత్రోత్సవం మన్యన్తే వైయాకరణాః" అనే ఉక్తి వల్ల కూడా మన వైయాకరణులు లాఘవానికి ఎంత ప్రాముఖ్య మిచ్చారో మనకు విశదమవుతుంది.

పూర్వ కాలంలో మనదేశంలో వ్రాతలేకపోవడం వల్ల కంఠస్థం చేయడానికి అనువుగా సంగ్రహంగా ఉండడానికే ఈ లాఘవాన్ని మన పూర్వులు ఆశ్రయించారని చాలామంది పాశ్చాత్య పండితుల అభిప్రాయం. ఇది నిజమైనా కాకపోయినా భాషాతత్వాన్ని గ్రహించడంలో ఇది మన వైయాకరణులకి చాలా ఉపయోగించింది. దీనివల్లనే వారు భాషలో అన్ని అవస్థలలోనూ— అంటే, వర్ణ నిర్మాణం, (Phonological Structure) పద నిర్మాణం (Morphological Structure) వాక్య నిర్మాణం (Syntactic Structure) మొదలైన వాటి అన్నిటిలోనూ కొన్ని నిర్ణీత సూత్రాలూ, వ్యవస్థా ఉంటాయనీ, కొన్ని అంశాలకి తుల్యప్రవర్తన ఉంటుందనీ గ్రహించ గలిగేరు. ఉదాహరణకి 'ఇకోయణచి' (6.1.77) అనే సూత్రం తీసుకొందాం. దీనిఅర్థం 'అచ్చుపరమైనప్పుడు ఇ, ఉ, ఋ, ఌ ల స్థానంలో వరసగా య. వ. ర. ల. లు వస్తాయి.' అని . ఇందులో నాలుగు అచ్చులకు సంబంధించిన సంధికార్యాలు ఒకే సూత్రంగా చెప్పబడ్డాయి. ఇ, ఉ, ఋ, ఌ, లని ఒక సముదాయంగా గ్రహించి వాటికి ఇక్ అనే ప్రత్యాహార సంజ్ఞ చెయ్యడం, య, వ, ర, ల, లకు యణ్ అనే ప్రత్యాహార సంజ్ఞ చెయ్యడం కేవలం లాఘవం కోసమే కాదు., ఇటువంటి ప్రత్యాహారాలు వాటికి చెందిన వర్ణాలు భాషలో ఒకే విధంగా ప్రవర్తిస్తాయి అనే సత్యాన్ని స్పష్టం చేస్తాయి. పై సూత్రం ఈ నాలుగు అచ్చులూ (సవర్ణంకాని) అచ్చు ముందు అంతస్థలుగా మారతాయని సూచిస్తుంది. ఇదే విధంగా 'స్త్రీభ్యోఢక్' (4.1.120) 'స్త్రీ వాచక శబ్దాలకి అపత్యార్థంలో ఢక్ ప్రత్యయం వస్తుంది' అనే సూత్రంలో వినతా, గంగా మొదలైన స్త్రీ వాచకాల నన్నింటినీ సంగ్రహించకుండా స్త్రీ వాచక శబ్దాలు అని అనడం వల్ల వాటిలోని సాధారణ ధర్మాన్ని గ్రహించి వ్యాకరణంలో లాఘవం సాధించబడింది. దీనివల్ల వ్యాకరణం భాషా వ్యవహర్తల మానసాంతరాలలో ఉండే సాధారణీ కరణాలకి సన్నిహితమైనది.

ఇక వ్యాకరణ రచనలో లాఘవం సాధించిన సంజ్ఞా సూత్రాలూ, పరిభాషా సూత్రాలూ, అధికార సూత్రాలూ కూడా కేవలం లాఘవం కోసమే కాక భాషాతత్వాన్ని నిరూపించడానికే ముఖ్యంగా ఏర్పరచబడ్డాయని చెప్పవచ్చు. ఉదాహరణకి 'తరప్ తమ పౌఘః' (1.1.22) 'తరప్, తమప్ ప్రత్యయాలు రెండిటినీ 'ఘ' అనే సంజ్ఞ సూచిస్తుంది.'— ఈ సూత్రంలో భాషలో తర, తమ ప్రత్యయాలకి సంబంధించిన కార్యాలు తుల్యంగా ఉండడంవల్లనే ఆ రెండిటికీ 'ఘ' అని ఒకే సంజ్ఞ విధించ బడింది. ఇక 'సమర్థః పద విధిః' (2.1.1.) 'పదాలకు సంబంధించిన విధి సమర్థాశ్రితమై ఉంటుంది' మొదలైన పరిభాషా సూత్రాలు భాషాతత్వాన్ని స్పష్టీకరించేవే అనడంలో సందేహమే లేదు. ఈ సందర్భంలో 'పరిభాషా పునరేకదేశస్థాసతీ కృత్స్నం శాస్త్ర మభిజ్వలయతి ప్రదీపవత్. తద్యథా— ప్రదీపః సుప్రజ్వలిత ఏకదేశస్థః సర్వం వేశ్మాభి జ్వలయతి' అనే పతంజలి మహర్షి వాక్యాలు స్మరించదగినవి. అధికార సూత్రాలు సమాసాలూ, తద్ధితాలూ వంటి ఒక వ్యాకరణాంశానికి సంబంధించిన సూత్రాల మొదట ఉండి అనువృత్తి ద్వారా వాటి తరవాత వచ్చే (కొన్ని) సూత్రాలలోకి వ్యాపిస్తూ అవి యేవిభాగం క్రిందకి వస్తాయో సూచిస్తాయి.

ఉదాహరణకి 'ప్రాక్కడారాత్ సమాసః' (2.1.3) అనే అధికార సూత్రం దీని తరవాత 'కడారాః కర్మధారయే' (2.2.38) అనే సూత్రాలవరకూ ఉన్న సూత్రాలు సమాసాలకి సంబంధించినవి అని సూచిస్తుంది.

## 2. వర్ణం (Phoneme)—సవర్ణం (Allophone)—సంధి వర్ణం (Morphophoneme).

పాణినీయానికి ఆధారభూతాలైనవి పదునాలుగు మాహేశ్వర సూత్రాలనే విషయం అందరికీ తెలిసినదే. ఈ సూత్రాలలో అక్షర సమామ్నాయంలోని అక్షరాలు పదునాలుగు సముదాయాలుగా విభజించబడి ఒక్కొక్క సముదాయం చివర ప్రత్యాహారంకోసం ఇత్సంజ్ఞలు చేర్చబడ్డాయి. వీటిలో వర్ణాలు అక్షర సమామ్నాయంలో ఉన్న క్రమంలో కాక చాలాచోట్ల క్రమం మార్చి కూర్చబడ్డాయి. అక్షర సమామ్నాయంలో వర్ణాలు స్థాన ప్రయత్నభేదాన్ని అనుసరించి ధ్వనిశాస్త్రానుసారంగా 'క' వర్గ, 'చ' వర్గ మొదలైన వరసలో కూర్చబడ్డాయి. కాని పాణినిమహర్షి మాహేశ్వర సూత్రాలు అనబడే వాటిలో వర్ణాలని వ్యాకరణ రచనకి అనువైన రీతిగా క్రమం మార్చి ఇచ్చారు. ఉదాహరణకి 'హయవరట్, లణ్' అనే సూత్రాలలో వర్ణాలక్రమం గమనించవచ్చు. ఇంతేకాకుండా హకారం 'హయవరట్' సూత్రంలోనూ 'హల్' సూత్రంలోనూ రెండుసార్లు వచ్చింది. దీనికి కారణం హకారం సంధిలో కొన్నిచోట్ల కొన్ని వర్ణాలతోనూ, మరికొన్నిచోట్ల ఇతర వర్ణాలతోనూ తుల్యంగా ప్రవర్తించడమే. మహాభాష్యంలో పూర్వహకారం 'అట్', 'హశ్' ప్రత్యాహారాలకోసమూ, పరహకారం 'రల్', 'శల్', వల్', 'ఝల్' ప్రత్యాహారాల కోసమూ ఉపదేశించబడినట్టు చెప్పబడింది. మాహేశ్వర సూత్రాలు వ్యాకరణంలో సాధించవలసిన సంధులకోసం కూర్చబడినవి కాని సంస్కృత భాషలోని వర్ణాల పట్టిక ఇవ్వడానికి ఉద్దేశించబడినవి కావు. వాటిలోని అంశాలను 'వర్ణాలు' (Phonemes) అనడం కన్న 'సంధివర్ణాలు' (Morpho - Phonemes) అనడం సముచితం.

మాహేశ్వర సూత్రాలలో దీర్ఘాచ్చులు లేవు. సంధిలో చాలాచోట్ల హ్రస్వాచ్చులూ, దీర్ఘాచ్చులూ తుల్యంగా ప్రవర్తించడంవల్ల హ్రస్వ అకార, ఇకార, ఉకారాలు దీర్ఘాచ్చులకి కూడా గ్రాహకాలని 'అణుదిత్ సవర్ణస్య చాప్రత్యయః' (1.1.69) అనే సూత్రం చెప్తుంది. అవసరమైన చోట్ల తపరకరణం వల్ల దీర్ఘాచ్చులకీ హ్రస్వాచ్చులకీ భేదం కల్పించబడింది 'తపరస్తత్కాలస్య' (1.1.70). వీటిలో విసర్జనీయం, ఉపధ్మానీయం (:ప), జిహ్వామూలీయం (:క), అనుస్వారం కూడా చేర్చబడలేదు. ఈ ధ్వనులకి పాణినీయశిక్షలో 'పరాశ్రయాలు' (అనుస్వారో విసర్గశ్చ ౣకః ౣపౌ చాపి పరాశ్రయౌ) లేక 'అయోగవాహాలు' అని పేర్లు ఉన్నాయి. పతంజలి మహర్షి 'అయోగవాహాలు' అంటే 'ఉపదేశించక పోయినా భాషలో వినబడేవి' అని అర్థం చెప్పేరు. (యదయుక్తా వహం త్యనుపదిష్టాశ్చ శ్రూయంతే). వీరి మతంలో ఆనునాసిక్యానికీ యమహల్లులకీ (అంటే కొన్ని సందర్భాలలో పాక్షికంగా ద్విత్వంపొందే హల్లులు) కూడా ఈ సంజ్ఞ వర్తిస్తుంది. వాజసనేయి ప్రాతిశాఖ్య వ్యాఖ్యాత అయిన ఉవటుని మతంల 'అయోగవాహాలు' 'అంటే' 'అకారాది వర్ణాల యోగంతో ఉచ్చరించబడేవి, స్వయంగా ఉచ్చారణయోగ్యాలు కానివి' అని అర్థం. వీటిలో మొదటి మూడూ హకారానికీ, అనుస్వారం మకారానికీ రూపాంతరాలుగా కొన్ని సందర్భాలలో వస్తాయి. పాణినిమహర్షి యీ విషయం తమ వ్యాకరణంలో సూచించారు కాని వాటికి ప్రత్యేక ప్రతిపత్తి ఇవ్వలేదు. ఆధునిక భాషాశాస్త్రం ప్రకారం కూడా ఇటువంటి పరాశ్రయాలైన ధ్వనులకి వర్ణప్రతిపత్తి (Phonemic Status) ఉండదు. ఇటువంటి వాటిని ఒక వర్ణంలో అంతర్భాగాలైన 'సవర్ణాలు' (Allophones) అంటారు. 'సవర్ణం' అంటే పదంలో స్థానంవల గాని, సమీప ధ్వనుల సాహచర్యంవల్లగాని ఉచ్చారణ భేదం పొందిన వర్ణం యొక్క రూపాంతరం.

## 3. సంధి—

పాణిని మహర్షికి పూర్వం శిక్షా ప్రాతిశాఖ్యలలో ధ్వనుల ఉత్పత్తి, స్థానకరణ ప్రయత్నాలు మొదలైన విషయాలను వివరించే ధ్వనిశాస్త్రం (Phonetics) పరిపూర్ణంగా వృద్ధి పొందింది. ఆ కాలంలో ఐంద్ర వ్యాకరణ మనే పేరుగల వ్యాకరణం కూడా ఉన్నట్లు పతంజలి మహర్షి మహాభాష్యంలో చెప్పేరు. కాని యీ ఐంద్ర వ్యాకరణం సూత్రరూపంలోకాక భాషలోని ప్రతి శబ్దానికీ గల భిన్న రూపాలని పారాయణచేసే విధంగా ఉండేదనీ, అందువల్ల దానిని పూర్తిగా నేర్చుకోవడానికి ఇంద్రుడికి కూడా సాధ్యం కాలేదనీ వారి వాక్యాలవల్ల తెలుస్తుంది. కాబట్టి అది నిజమైన వ్యాకరణం కాదనే చెప్పాలి. సూత్రరూపమైన వ్యాకరణం పాణినిమహరికి కొంచెం ముందు కాలానికి చెంది వారిచే స్మరించబడిన గార్గ్యగాలవ శాకటాయన చాక్రవర్మణాదులచే ప్రారంభించబడి పాణినిమహర్షి చేతిలో శాస్త్రీయతని సంపూర్ణతని పొందినదని చెప్పవచ్చు.

తన కాలానికి ముందే ధ్వనిశాస్త్రం వృద్ధి పొందిఉండడం వల్లా, వ్యాకరణం ధ్వనిశాస్త్రం కన్న భిన్నమైనదవడం వలా పాణినిమహర్షి అష్టాధ్యాయిలో ధ్వనులని గురించి చర్చించలేదు. (అష్టాధ్యాయిలో 'ముఖనాసికావచనోఽనునాసికః' 1.1.8) అనే అనునాసిక సంజ్ఞని వివరించే సూత్ర మొక్కటే ధ్వనులకి

సంబంధించినదని అంటారు. కాని అష్టాధ్యాయిలో సంధి విధానానికి అవసరమైనచోట్ల ధ్వని శాస్త్ర సిద్ధాంతాలు ఉపయోగించబడ్డాయి. ఉదాహరణకి 'తుల్యాస్య ప్రయత్నం సవర్ణం' (1.1.9) 'సదృశమైన ఆస్యప్రయత్నంగల వర్ణాలు సవర్ణాలు', స్థానేఽన్తరతమః (1.1.50) 'స్థాని వర్ణానికి సదృశతమమైన వర్ణం ఆదేశంగా వస్తుంది.' మొదలైన సూత్రాలు తీసుకోవచ్చు. ఒక వర్ణానికి సవర్ణమైన వర్ణాలనీ, సదృశతమమైన వర్ణాలనీ నిర్ణయించడానికి మనకి ధ్వని శాస్త్రమే ఆధారం.

ఒక పదంలోని ధ్వనులు ఆ పదానికిగాని లేక వాక్యంలో దాని పక్కనున్న పదాలకిగాని చెందిన సమీప ధ్వనులవల్ల మార్పు చెందుతాయి అనేదే సంధి ప్రక్రియకి మూలసూత్రం. సంస్కృత వైయాకరణులు సంధిప్రక్రియని క్షుణ్ణంగా చిన్న చిన్న అంశాలతో సహా వివరించారు. కాని ప్రాచీన గ్రీక్, రోమన్ వైయాకరణుల గ్రంథాలలో దీనిని గురించిన చర్చే లేదు. సంధిలో పదమధ్య సంధి (Internal Sandhi) పదాంత సంధి (External Sandhi) అని రెండు రకాలు ఉన్నాయి. ఒక వర్ణమే పదమధ్యసంధిలో ఒకవిధంగానూ, పదాంతసంధిలో వేరొకవిధంగానూ ప్రవర్తిస్తుంది. ఉదాహరణకి సంస్కృతంలో పదాంతమైన మకారం హల్లుకి ముందు అనుస్వారంగా మారుతుంది.(మోఽనుస్వారః 8.3.23) హరింవందే. కాని పద మధ్యంలో మకారం అనుస్వారంగా మారదు: గమ్యతే.

సంధి ప్రక్రియలో కొన్ని సదృశవర్ణాలు తుల్యంగా ప్రవర్తిస్తాయి అనే విషయం కూడా సంస్కృతవైయాకరణులు గుర్తించారు. ఇటువంటి సదృశవర్ణాలకి లాఘవార్థం సంజ్ఞ ఏర్పరచడమే మాహేశ్వర సూత్రాల ప్రయోజనమని పైన చూశాం. కాబట్టి వీలైనంత వరకూ వారు ఒక్కొక్క వర్ణానికి వచ్చే మార్పుల్ని వర్ణ సముదాయాలకు వచ్చే తుల్యమైన మార్పులుగా వర్ణించారు. ఉదాహరణకి 'అకస్సవర్ణే దీర్ఘః' (6.1.101) అనే సవర్ణదీర్ఘసంధి సూత్రం తీసుకోవచ్చు. ఇందులో అ, ఇ, ఉ, ఋ, ఌ అనే అయిదు అచ్చులకీ సవర్ణం పరమైతే రెండింటికీ దీర్ఘం ఏకాదేశమవుతుందని చెప్పబడింది. పాణినిమహర్షి అయిదు అచ్చులకీ అయిదు సూత్రాలు వ్రాయకుండా వీటిలో గల సాధారణాంశాన్ని (Common Factor) ఒకే సూత్రంగా చెప్పడం భాషా శాస్త్రజ్ఞులు మెచ్చుకోవలసిన విషయం. ఇటువంటిదే ఙమో హ్రస్వాదచి ఙముణ్నిత్యం (8.3.32) 'పదాంతంలో హ్రస్వాచ్చు తరవాత ఉన్న ఙ, ణ, న, లు అచ్చుకి ముందు నిత్యంగా ద్విత్వం పొందుతాయి: సన్నచ్యుతః' ఇందులో ఙ, ణ, న అనే మూడు అనునాసికాలకీ సంబంధించిన సంధి ఒకటిగా వర్ణించబడింది. వర్ణా ంగా 'ఙ ఞ ణ నమ' అని ఉండవలసిన వరస ఈ సూత్రం కోసమే 'ఞమఙణనమ్' అనే మాహేశ్వర సూత్రంలో మార్చబడిందని గమనించాలి. ఇలా మార్చడం వల్లనే ఙ ణ న లు మూడింటికీ ఙమ్ అనే ప్రత్యాహారం చెయ్యడానికి వీలు అయింది. సాధారణీకరణం సాధ్యం కానప్పుడు మాత్రమే హోఢః (8.2.31) 'హకారానికి పదాంతంలోనూ ఝల్ పరమైనప్పుడూ ఢకారాదేశం అవుతుంది. సోఢా (సహ్+తా)' వంటి ప్రత్యేక సూత్రాలు రచించబడ్డాయి.

### 4. పదం (Morpheme)—
### సపదం Allomorph)

ఆధునిక భాషాశాస్త్రంలో Morpheme 'పదం',[1] Allomorph 'సపదం' అనే వాటికి చాలా ప్రాముఖ్యం ఉంది. అర్థవంతమై తనలో అర్థవంతమైన భాగాలులేని అంశాన్ని Morpheme 'పదం' అంటారు— 'కాయలలో' అనే మాటలో కాయ,లు (బహువచనం), అ (ఔపవిభక్తికం) లో (సప్తమీవిభక్తి) అనే నాలుగు 'పదాలు' ఉన్నాయి. 'పదానికి'సంధి వల్ల వచ్చే రూపాంతరాలే 'సపదాలు' (Allomorphs)— 'కాయ-లు', 'కాళ్-ళు', 'పెళ్లి-ళ్లు'లలో ఉన్న 'లు','ళు',ళ్లు, అనే'వి' బహువచనార్థకమైన పదానికి 'సపదాలు'."అష్టాధ్యాయిలో 'ధాతువు' (భూవాదయోధాతవః, 1.3.1 'భూ' 'వా' మొదలైనవి ధాతువులు. 'ప్రాతిపదిక' అర్థవ దధాతురప్రత్యయః ప్రాతిపదికమ్, 1.2.45 'అర్థవంతమైనదీ, ధాతువుకానిదీ, ప్రత్యయాంతంకానిదీ 'ప్రాతిపదిక', కృత్తద్ధితసమాసాశ్చ, 1.2.46 'కృదంతాలూ, తద్ధితాంతాలూ, సమాసాలూ కూడా ప్రాతిపదికలు అవుతాయి, 'ప్రత్యయం' ప్రత్యయః 3.1.1 'మూడు,నాలుగు అయిదు అధ్యాయాలలో అనుక్రమించబడేవి

---

1. కొందరు పండితులు Morpheme అనే మాటను 'పదాంశం' అని తెనిగించి వాడుతున్నారు. 'పదాంశం' అంటే పదంలో భాగం కాబట్టి 'ఇల్లు', 'కాయ', 'చెట్టు' వంటివి Morphemes కావేమో అనే భ్రమకు లోనయ్యే అవకాశం ఉంది. Word అనేదానికి మనకి 'శబ్దం', 'పదం', 'మాట' అనే మాటలు ఉండడంవల్ల వీటిలో 'పదం' అనేదానినే Morpheme కి సమానార్థకంగా వాడడం సముచితమని తోస్తుంది. పాణిని పరిభాషలో సుబంతంగాని తిఙంతంగాని అయినదే'పదం' అయినా (సుప్తిఙన్తం పదం, 1.4.14) ఆయన పదభాగాలకి కూడా కొన్నిచోట్ల పదత్వం కల్పించారు (చూ. 1.4.15—18) కాబట్టి Morpheme ని 'పదం' అనడం కొంతవరకూ పాణినీయ విరుద్ధమే అని చెప్పాలి. చిన్నయసూరి 'ఇయశబ్దం'మని వాడడం దీనికి పెద్ద బాధకంకాదు.

ప్రత్యయాలు' అనే సంజ్ఞలూ వాటి చర్చా ఉన్నాయి. ఈ మూడురకాల అంశాలనీ మనం Morphemes అని అనవచ్చు. నిజానికి Morpheme అనబడేది ఈ మూడింటిలో ఏదో ఒక దానికి చెంది ఉంటుంది. పాణిని మహర్షికి ఈ మూడింటినీకలిపి వ్యవహరించవలసిన అవసరం ఎక్కడా రాకపోవడంవల్ల కాబోలు ఆయన Morpheme కి తుల్యమైన సంజ్ఞ విధించలేదు. కాని అంతమాత్రంచేత ఆయనకి Morpheme అనే భావన (Concept) లేదని మనం అనుకోకూడదు. అష్టాధ్యాయిని పరిశీలించి చూస్తే సమానార్థకాలై పరిసరానుగుణంగా భిన్న రూపాలు కలిగినవాటిని ఆయన ఒకే అంశం (Unit)గా పరిగణించినట్లు మనకి తెలుస్తుంది. దీనివల్ల భాషాశాస్త్రజ్ఞులు Morpheme అని వ్యవహరించే భావనకి అతి సన్నిహితమూ తుల్యమూ అయిన భావన పాణిని మహర్షికి ఉంది అని మనకి తెలుస్తుంది. ఉదాహరణకి విభక్తి ప్రత్యయాలను తీసుకొందాం. స్వౌజస మౌట్ ఛష్టాభ్యాంభిస్ జేభ్యాంభ్యస్ ఙసిభ్యాంభ్యస్ఙసోసాం జ్యోస్సుప్ 4.1.2 అనే సూత్రంలో సు, ఔ, జస్ మొదలైన మూలవిభక్తి ప్రత్యయాలు ఇవ్వబడ్డాయి. కాని ప్రాతిపదిక స్వభావానుగుణంగా వీటికివచ్చే ఆదేశాలులేక సపదాల (Allomorphs) ఏడో అధ్యాయంలో ఇవ్వబడ్డాయి. భిస్ అనే తృతీయా బహువచన ప్రత్యయానికి హ్రస్వ అకారాంత ప్రాతిపదిక తరవాత 'ఐస్' ఆదేశం వస్తుంది. రామైః, దీనిని చెప్పేసూత్రం 'అతోభిస ఐస్' 7.1.9 అష్టాధ్యాయి చివరిభాగంలో ఉంది. పాణిని ఉద్దేశంలో భిస్, ఐస్ అనే— రెండూ ఒకే అర్థాన్ని సూచించే అంశంరూపాంతరాలు (Allomorphs) ఇదేవిధంగా ఆయన సమానార్థకాలై భిన్నకాలాలలో వచ్చే 'హన్', 'వధ' ధాతువులని ఒకే అంశంగా పరిగణించారు—హనో వధ లిఙి 2.4.42 'అర్ధధాతుకమైన లిఙ్ పరమైనప్పుడు హన్‌కి వధ ఆదేశం అవుతుంది. వధ్యాత్' ఇటువంటి ధ్వని సాదృశ్యంలేని సపదాలని 'ఆదేశ సపదాలు' (Replacive Allomorphs) అంటారు.

ఆధునిక భాషాశాస్త్ర పితామహుడైన లియొనార్డ్ బ్లూమ్‌ఫీల్డ్ (Language, 1933, pp 209; 215) పాణిని లోపవిధానాన్ని మెచ్చుకొని దీనిని Zero Allomorph 'లోప సపదం' రూపంలో భాషాశాస్త్రంలోకి తీసుకొన్న విషయం ప్రసిద్ధమే. [2]సంస్కృతంలో క్షత్రియ వాచియైన జనపద శబ్దానికి అపత్యార్థంలోనూ రాజుఅనే అర్థంలోనూ అఞ్ అనే ప్రత్యయం వస్తుంది. పాంచాలః కాని కంబోజ శబ్దానికి వచ్చే అఞ్ ప్రత్యయానికి లోపం(లుక్) వస్తుంది. కాబట్టి కంబోజ దేశపురాజు కంబోజః (కంబోజాల్లుక్ 4.1.175) అంటే ఆధునిక పరిభాషలో కంబోజశబ్దానికి తరవాత అఞ్ ప్రత్యయానికి తరవాత అఞ్ ప్రత్యయానికి 'సపదం' 'లోపం' (Zero) అన్న మాట. ప్లక్షాదివృక్షాల ఫలం అనే అర్థంలో అణ్ ప్రత్యయం వాటికి వస్తుంది. ప్లాక్షం, కాని కువలం, బదరం వంటి శబ్దాలలో లోపమే ప్రత్యయం (ఫలే లుక్ 4.3.163) సంస్కృతభాషలో చాలాచోట్ల ఒక ప్రత్యయం లోపించినా దానికి సంబంధించిన వ్యాకరణ కార్యం జరుగుతుంది. (ప్రత్యయలోపే ప్రత్యయలక్షణం 1.1.62), కాని ఆ లోపం లుక్, శ్లు, లుప్ అనే సంజ్ఞలచేత కలిగితే ఆ ప్రత్యయానికి సంబంధించిన వ్యాకరణ కార్యం జరగదు (నలుమతాంగస్య 1.1.63) ఉదాహరణకి అగ్నిచిత్, సోమసుత్ వంటి మాటలలో విభక్తి ప్రత్యయం లోపించినా అవి సుప్తిఙన్తం పదమ్, 1.4.14 అనే సూత్రంవల్ల పదసంజ్ఞ కలవే అవుతాయి. ఉచ్చైః, నీచైః, సాయం, చిరం మొదలైన అవ్యయాలు కూడా వాటి తరవాతవచ్చే స్త్రీ ప్రత్యయ, విభక్తి ప్రత్యయాలు లోపించినా పదసంజ్ఞగలవే అవుతాయి. దీనివల్ల లోపాన్ని కూడా పాణిని మహర్షి ఒక విధమైన ప్రత్యయరూపంగా తీసుకొన్నాడని తెలుస్తుంది. అదర్శనం లోపః 1.1.60 'కనపడకపోవడం అంటే' వర్ణవినాశమే (కాని ప్రత్యయవినాశంకాదు) లోపం' అనే మాత్రం కూడా ఈ ఉద్దేశాన్నే బలపరుస్తుంది. ప్రత్యయం కనపడకపోయినా దానికి సంబంధించిన వ్యాకరణకార్యాలు జరుగుతూ ఉండడమే పాణినిమహర్షి లోపవిధానాన్ని అవలంభించడానికి మార్గదర్శకమై ఉండవచ్చు.

## 5. ఆర్థిక సంవర్గాల (Semantic Categories) ప్రాధాన్యం

ఆధునిక భాషాశాస్త్రంలో అతినవీనమైనదీ పటిష్ఠమైనదీ అయినశాఖ పరివర్తక—(ఉత్పాదక) వ్యాకరణం (Transformational Generative Grammar) దానిలో వాక్యనిర్మాణానికీ (Syntactic Structure), అర్థనిర్మాణానికీ (Semantic Structure) మిగిలిన శాఖలలో కన్న ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వబడుతోంది. ఈ శాఖకు చెందిన భాషాశాస్త్రజ్ఞుల అభిప్రాయంలో

---

"A Single phonetic form in the manner of homonymy, represents two meanings which one usually distinguished by means of a linguistic form, as, singular and plural noun in the sheep (grazes) the sheep (graze). Here the Hindus hit upon the apparently artificial but in practice eminently serviceable device of speaking of a zero element: in sheep : sheep the plural-suffing is replaced by zero-that is, by nothing at all." (Ibid, p. 209.)

ఒక భాషకిఉన్న వ్యాకరణం (ఇక్కడ వ్యాకరణమంటే భాషా నిర్మాణాన్ని వివరించే శాస్త్రం అనేగాని ఏ ఒక గ్రంథంకాదు అని గమనించాలి) అంటే ఆ భాషానిర్మాణానికి ఆధారభూతమైన సిద్ధాంతం, వీరి దృష్టిలో ప్రతిభాషకీ మూలమై వక్తృమనోగతమైన అర్థ నిర్మాణమూ, వ్యవహారంలో ధ్వనిరూపంగాని లిపి రూపంగాని అయిన బహిరంగ నిర్మాణమూ (Surface Structure) ఉంటాయి. అర్థ నిర్మాణాన్ని ఆలంబనగా తీసుకొని దానితో ప్రారంభమై దానికి తగిన బహిరంగనిర్మాణాన్ని సాధించేది లేక ఉత్పత్తి చేసేదే వ్యాకరణమని వీరు నమ్ముతారు.

పరివర్తక వ్యాకరణవేత్తల దృష్టిలో వ్యాకరణానికీ అష్టాధ్యాయికి చాలా దగ్గిర పోలికలు ఉన్నాయనే మాట ఆశ్చర్యకరమైనా సత్యమే. అష్టాధ్యాయీ నిర్మాణం చూస్తే ఈ విషయం మనకి స్పష్టమవుతుంది. అష్టాధ్యాయి మొదటి అధ్యాయాలలో అర్థనిర్మాణాన్ని వివరించే సూత్రాలు ఉన్నాయి. అంటే ఆత్మనేపదం, పరస్మైపదాలు ఏ అర్థాలలో వాడతారు, ఒక్కొక్క విభక్తి ప్రత్యయం ఏయే అర్థాలలో వాడతారు, ఎటువంటి అర్థాలలో పదాలు ఒకదానితో ఒకటి సమసిస్తాయి మొదలైనవి. ఈ అర్థాలకు సంబంధించిన ప్రత్యయాలూ వాటి భిన్నరూపాంతరాలూ, ఉదాత్తానుదాత్తస్వరిత స్వరాలకి సంబంధించిన సూత్రాలూ సంధి సూత్రాలూ మొదలైన బహిరంగ నిర్మాణానికి సంబంధించిన విషయాలు అష్టాధ్యాయి చివరిభాగంలో ఇవ్వబడ్డాయి. ఇంతే కాకుండా ప్రత్యయాలని విధించేసూత్రాలు 'ఈ ప్రత్యాయానికి అర్థం ఇది' అనికాకుండా 'ఈ అర్థాన్ని వాచ్యంచెయ్యడానికి ఈ ప్రత్యయం వస్తుంది' అనేవిధంగా ఉంటాయి. ఉదా. 'బహుషు బహువచనం' 1.4.21 'బహుత్వాన్ని ద్యోత్యం చెయ్యడానికి బహువచన ప్రత్యయం వస్తుంది' 'వర్తమానే లట్' 3.2.123 'వర్తమానార్థాన్ని ద్యోత్యం చెయ్యడానికి లట్ ప్రత్యయం వస్తుంది. దీనివల్ల పాణినిమహర్షి వ్యాకరణాన్ని అర్థ నిర్మాణానికి తగిన బహిరంగ నిర్మాణాన్ని ఉత్పత్తిచేసే సాధనంగా పరిగణించారని మనం తెలుసుకోవచ్చు.

## 6. కారక సిద్ధాంతం (The Theory Deep Case Relationships)

అష్టాధ్యాయిలో రచనా పద్ధతి 'ఫలానా అర్థంలో ఫలానా ప్రత్యయం వస్తుంది' అనే విధంగా ఉంటుంది అని పైన చూశాం. (నామ) విభక్తి ప్రత్యయాలకు గల అర్థాలను వర్గీకరించడానికే కారకప్రక్రియ సృష్టించబడింది అని చెప్పవచ్చు. కారకం అంటే వాక్యంలో నామపదాలకీ క్రియకీ మధ్య గల పరస్పర సంబంధం అని స్థూలంగా చెప్పవచ్చు. దీనివల్ల రెండు నామాల మధ్యగల సంబంధాన్ని తెలిపే షష్ఠీ విభక్తి కారకంకాదని తెలుస్తుంది. పాణిని మహర్షిచేసిన కారక విభాగం సంస్కృతానికేకాక అన్ని భాషలకీ వర్తిస్తుంది. కాబట్టి ఇది విశ్వజనీన లక్షణం (Universal Feature) అని చెప్పవచ్చు. అష్టాధ్యాయిలో ఆరురకాల కారకాలు ఉన్నాయి. అవి పాణిని మహర్షి ఇచ్చినవరసలో— 1. అపాదానం (ధ్రువమపాయేఽపాదానం 1.4.24 'విశ్లేషం సంభవించినప్పుడు దేని నుంచి విశ్లేషం జరుగుతుందో (ధ్రువం) అది అపాదానం'., ఈ అర్థంలో సాధారణంగా పంచమీవిభక్తి వస్తుంది— పర్వతాత్ అవరోహతి. 2. సంప్రదానం (కర్మణా య మభిప్రైతి స సంప్రదానమ్ 1.4.32 'కర్మచేత కర్త ఎవరిని ఉద్దేశిస్తాడో ఆ కారకం సంప్రదానం'., ఈ అర్థంలో సాధారణంగా చతుర్థీ విభక్తి వస్తుంది— విప్రాయ గాం దదాతి. 3. కరణం (సాధకతమం కరణమ్ 1.4.42 'క్రియాసిద్ధిలో ప్రకృష్టోపకారకంగా వివక్షించబడినది కరణం'., ఈ అర్థంలో సాధారణంగా తృతీయా విభక్తి వస్తుంది— పరశునాచ్ఛినత్తి.) 4. అధికరణం (ఆధారోధికరణమ్ 1.4.45 'కర్తకిగాని కర్మకిగాని ఆధారమయినది అధికరణం'., ఈ అర్థంలో సాధారణంగా సప్తమీ విభక్తి వస్తుంది—కటేశేతే, స్థాల్యాంపచతి. 5. కర్మ (కర్తురీప్సిత తమం కర్మ 1.4.49 'కర్తకి పొందడానికి ఇష్టతమమైనది కర్మ'., తథాయుక్తం చానీప్సితమ్ 1.4.50 'కర్తకి ఇష్టతమమైన దానికీ క్రియకీ గల సంబంధం వంటి సంబంధం గల అనిష్టమైనది కూడా కర్మ అవుతుంది, అకథితంచ 1.4.51 'అపాదినాది కారకాలచే చెప్పబడనిది కూడా కర్మ అవుతుంది'., ఈ అర్థంలో సాధారణంగా ద్వితీయా విభక్తి వస్తుంది— కటం కరోతి, విషం భక్షయతి, గాం దోగ్ధిపయః). 6. కర్త (స్వతంత్రః కర్తా 1.4.54 'క్రియాసిద్ధిలో స్వాతంత్ర్యం ఉన్నదిగా వివక్షించబడినది కర్త'. తత్ప్రయోజకో హేతుశ్చ 1.4.55 'కర్తకి ప్రయోజకమైనది కర్తా, హేతువూ అవుతుంది'., ఈ అర్థంలో సాధారణంగా తృతీయా విభక్తి వస్తుంది— దేవదత్తేన కృతమ్, దేవదత్తేన యజ్ఞదత్తేన కారితమ్.)

కారకాలకి పైన ఇచ్చిన అర్థాలు సాధారణమైనవి అని గమనించాలి. కొన్ని సందర్భాలలో యీ కారకాలకి ప్రత్యేకార్థాలు కూడా ఉన్నాయి. ఉదాహరణకి స్పృహధాతువు ఉన్న వాక్యంలో కర్తకి ఈప్సితమైనది సంప్రదాన మవుతుంది— స్పృహేరీప్సితః 1.4.36, పుష్పేభ్యః స్పృహయతి. కారకాలకీ విభక్తులకీ స్థిర సంబంధం లేదు. వాక్య నిర్మాణానుసారంగా ఒకే కారకం భిన్న విభక్తుల వల్ల వ్యక్తీకరించబడుతుంది. అనభిహితే 2.1.1. సూత్రంవల్ల తిఙ్ కృత్తద్ధిత సమాసాల వల్ల కర్మాదులు చెప్పబడకపోతే ద్వితీయాది విభక్తులు వస్తాయని, చెప్పబడితే ప్రథమా విభక్తే వస్తుందనీ తెలుస్తుంది.



'భారతి'కి
జెమిని
శుభాకాంక్షలు



తమ రాబోవు తెలుగు చిత్రము

'కన్నవారి కలలు'

(ఈస్ట్‌మన్ కలర్)

ఉదా. క్రియతే కటః, ఇక్కడ క్రియా విభక్తి (తిఙ్) వల్ల కర్మ చెప్పబడింది కాబట్టి కర్మార్థంలో ప్రథమే వచ్చింది., కాని కటం కరోతి అనేచోట క్రియా విభక్తివల్ల కర్మ చెప్ప బడలేదు కాబట్టి కర్మార్థంలో ద్వితీయ వచ్చింది. ఇంతేకాకుండా పతంజలిమహర్షి 'వివక్షాతః కారకాణి భవన్తి' అని చెప్పినట్లు వక్త్ర వివక్షని అనుసరించి కారకాలు వస్తాయి. 'దేవదత్తః స్థాల్యాంపచతి'— ఇందులో స్థాలి అధికరణంగా వివక్షించ బడింది కాబట్టి దానికి సప్తమీ విభక్తి వచ్చింది. కాని స్థాలినే కర్తగా వివక్షించి 'స్థాలీ పచతి' అని కూడా అనవచ్చు, తెలుగులో 'ఈ గిన్నె శేరుబియ్యం ఉడుకు తుంది', 'నీ పెన్ను బాగా రాస్తోంది' అన్నట్టు. మహాభాష్యకర్త మంత్రులు రాజు ఉన్నప్పుడు అస్వతంత్రులై ఆయన లేనప్పుడు స్వతంత్రులైనట్టు అసలు కర్త ఉన్నప్పుడు మిగిలిన కారకాలు అస్వతంత్రాలై అది లేనప్పుడు స్వతంత్రాలై ప్రథమా విభక్తిని పొందుతాయి అని చెప్పేరు. (ఏవంతర్హి ప్రధానేన సమవాయే స్థాలీ పరతంత్రా, వ్యవాయే స్వతంత్రా' తద్యథా— అమాత్యానాం రాజ్ఞాసహ సమవాయే పారతంత్ర్యం, వ్యవాయే స్వాతంత్ర్యం') రామేణ బాణే నహతో వాలీ, రామోబాణేన వాలినమ్ అహనత్— ఈ రెండు వాక్యాలలో రామ వాలి శబ్దాలు భిన్న విభక్తులలో ఉన్నా ఈ వాక్యాల అర్థం ఒకటే. ఈ సత్యాన్ని నిరూపించ డానికే కారకప్రక్రియ ఉపయోగిస్తుంది— రెండింటిలోనూ రామశబ్దం కర్తృకారకంలోనూ వాలిశబ్దం కర్మకారకంలోనూ మార్పు లేకుండా ఉన్నాయి. పై చర్చవల్ల కారకాలు స్థిరమైన వనీ అవి అర్థనిర్మాణానికి చెందినవనీ వాటిని వ్యక్తీకరించే భిన్న విభక్తులు బహిరంగ నిర్మాణానికి చెందినవనీ పాణిని మహర్షి తలచినట్లు తేలుతుంది. ఆధునిక భాషాశాస్త్ర వేత్తల అభిప్రాయం కూడా ఇదే.

## 7. వాక్య నిర్మాణ పరిశోధన (The Study of Syntax)

సంస్కృత వ్యాకరణంలో వాక్య నిర్మాణాన్ని గూర్చి చర్చలేదని ఇటీవలి కాలం దాకా పాశ్చాత్య పండితులు అంటూ ఉండేవారు. వారి ఈ అభిప్రాయం తప్పు అనీ వారి భ్రమకి కారణం సంస్కృత భాషలో వాక్యంలో పదక్రమం ఇంగ్లీషులోకి మల్లే స్థిరమైనది కాకపోవడమేననీ ఇప్పటి పండితులకి తెలిసింది. భాషాశాస్త్రంలో కూడా వాక్య నిర్మాణాన్ని గురించిన పరిశోధన ఇటీవల పదిపదిహేను ఏళ్లలోనే వృద్ధి చెందింది. వాక్య నిర్మాణతత్వం తెలిసిన తరవాతనే పండితులకి అష్టాధ్యాయిలో కూడా వాక్య నిర్మాణ చర్చ ఉంది అని తెలిసింది. అష్టాధ్యాయిలో అవసరమైనచోట్ల పద క్రమాన్ని గురించిన చర్చ కూడా ఉంది. ఉదాహరణకి ఉపసర్గలు లౌకిక భాషలో ధాతువుకి ముందు వస్తాయి., వైదిక భాషలో అవి ధాతువుకి ముందు కాని వెనకకాని రావచ్చు, వాటి మధ్య ఇతర పదాల వ్యవధానం కూడా ఉండవచ్చు. ఈ విషయమే ఈ సూత్రాలలో చెప్పబడింది— ప్రాదయః 1.4.58, ఉపసర్గాః క్రియాయోగే 1.4.59, తేప్రాగ్ధాతోః 1.4.80, ఛందసిపరేఽపి 1.4.81, వ్యవహితాశ్చ 1.4.82. కాబట్టి పూర్వ పాశ్చాత్య పండితుల అభిప్రాయం నిర్మూలమనే చెప్పాలి.

సంస్కృతంలో పద నిర్మాణం క్లిష్టమైనది. ఇతర భాషలలో రెండు మూడు మాటలలో చెప్పవలసిన భావం సంస్కృతంలో ఒకేమాటలో చెప్పవచ్చు. ఉదా. వైయాకరణః 'వ్యాకరణం చదివే వాడు లేక తెలిసినవాడు' 'పితరౌ 'తల్లి దండ్రులు', పుత్రీయతి 'పుత్రుడు కావాలి అను కోరుతున్నాడు లేక ఇంకొకణ్ణి పుత్రుడులా చూసుకొంటున్నాడు.' పద నిర్మాణానికి ఆధారభూతమైన వాక్య నిర్మాణాన్ని పరిశీలించకుండా పద నిర్మాణ వర్ణన సాధ్యం కాదు. పాణిని మహర్షి సర్వత్రా వాక్యనిర్మాణాన్ని ఆధారంగా తీసుకొని దానికి తుల్యమైన పద నిర్మాణాన్ని దాని నించి సూత్రాల ద్వారా సాధించారు. ఈ సందర్భంలో మనం సంస్కృత వ్యాకరణంలో 'వృత్తి', 'విగ్రహం' అనే భావనలని గమనించాలి. 'వృత్తి' అంటే వాక్యార్థాన్ని చెప్పగలిగిన ఏకపదం (పరార్థాభిధానం వృత్తిః) 'విగ్రహం' అంటే వృత్తికి గల అర్థాన్ని వివరించే వాక్యం (వృత్త్యర్థావబోధకం వాక్యం విగ్రహః). పాణినిమహర్షి విగ్రహ వాక్యాన్నే ప్రాథమికంగా తీసుకొని దానికి సమమైన వృత్తిని సాధించారు. దీనినిబట్టి వారు విగ్రహ వాక్యాన్ని అంతరంగ నిర్మాణం (Deep or Underlying Structure) గానూ వృత్తిని బహిరంగ నిర్మాణం (Surface Structure) గానూ పరిగణించినట్లు గ్రహించవచ్చు. బహిరంగ నిర్మాణంలో అనేకారత (Ambiguity) ఉండవచ్చు కాని అంతరంగ నిర్మాణంలో అనేకార్థత ఉండడానికి వీలులేదు. అదే విధంగా వృత్తిలో అనేకార్థత ఉండవచ్చు కాని విగ్రహంలో అనేకార్థత ఉండదు. సంస్కృత భాషలో అయిదు రకాల వృత్తులు ఉన్నాయి. అవి. 1. కృత్తులు, 2. తద్ధితాలు, 3. సమాసాలు, 4. ఏకశేషం, 5. సనాద్యంత ధాతు రూపాలు. వీటిని గురించి సమగ్రంగా వివరించడం ఇక్కడ సాధ్యం కాదు. కాని ఈ రూపాలని సాధించడానికి వాటికి సంబంధించిన సంపూర్ణ విగ్రహ వాక్యాలని పాణినిమహర్షి ఆధారంగా తీసుకొన్నారు అనడానికి కొన్ని ఉదాహరణలని ఈ క్రింద చూద్దాం.

1. కృత్తులు: ధాతువులకి చేర్చబడే తిఙ్‌లు తప్ప మిగిలిన ప్రత్యయాలు కృత్తులు (కృదతిఙ్ 3.1.93). ఇవి

అష్టాధ్యాయి మూడో అధ్యాయం 1, 2, 3 పాదాలలో ఇవ్వబడ్డాయి. చాలాకృత్ ప్రత్యయాలు భావార్థంలోగాని కర్త్రర్థంలో గాని వస్తాయి. కర్తృకరణార్థాలలో వచ్చేవి కూడా కొన్ని ఉన్నాయి. వీటిలో కృత్య లనబడేవి (కృత్యాః ప్రాఙ్ణ్వులు 3.1.95.) క్త, ఖల్ ప్రత్యాయాలూ భావ కర్మార్థాల లోనే వస్తాయి. (తయోరేవ కృత్యక్త ఖలర్థాః 3.4.70). కర్తవ్యః కృతః / ఈషత్కరః కటోభవతా (కర్మ), ఆసి తవ్యం భవతా (భావం). ఒక ధాతువుకి వచ్చే కృత్ ప్రత్యయం (i) ఆ ధాతువు మీదగాని దానిలో గల వర్ణాల మీదగాని (ఇగుపధజ్ఞాప్రీకిరః కః 3.1.135— బుధః, ప్రియః), (ii) దాని ముందు వచ్చే ఉపపదం మీదగాని (కర్మణ్యణ్ 3.2.1. కుంభకారః, ప్రియ వశే వదః ఖచ్ 3.2.38. ప్రియం వదః, వశంవదః) (iii) ఉత్పన్నమయ్యే నామానికీ ధాతు వ్యాపారానికీ గల కారక సంబంధం మీదగాని (అర్తిలూధూసూఖన సహచర ఇత్రః 3.2.184 అరిత్రం (కరణార్థం) ఆధారపడి ఉంటుంది.

2. తద్ధితాలు: నాలుగో అధ్యాయం ప్రథమపాదంలో మొదట కొన్ని సూత్రాలూ, అయిదో అధ్యాయం చతుర్థపాదం చివర కొన్ని సూత్రాలూ తప్ప ఈ రెండు అధ్యాయాలలో మిగిలిన సూత్రాలన్నీ తద్ధిత ప్రత్యయాలకి సంబంధించినవే. తద్ధిత ప్రత్యయాలు అపత్యం' (తస్యాపత్యమ్ 4.1.92), 'సమూహం' (తస్యసమూహః 4.2.37, 'అది గల దేశం' (తదస్మిన్ అస్తీతి దేశే తన్నామ్ని 4.2.67) మొదలైన అనే కార్థాలలో వస్తాయి. 'సమర్థానాం ప్రథమాత్వా' (4.1.82) అనే సూత్రంవల్ల సన్నిహిత సంబంధులైన పదాలలో సూత్రంలో మొదట నిర్దేశించబడిన పదానికి గాని తత్తుల్యమైన దానికి గాని విభాషగా తద్ధిత ప్రత్యయం వస్తుందని తెలుస్తుంది. ఉదాహరణకి— దక్షస్య అపత్యం అనే వాక్యంలో 'దక్ష' అనే దానికి అపత్యార్థంలో 'తస్యాపత్యమ్' 4.1.92, 'అతఇఞ్' 4.1.95 అనే సూత్రాల వల్ల ఇఞ్ ప్రత్యయం వచ్చి దాక్షిః అనే తద్ధిత రూపం వస్తుంది. దీని వలన పాణిని మహర్షి విగ్రహ వాక్యాన్ని మూలంగా తీసుకొని దాని నుంచి తత్తుల్యమైన తద్ధిత రూపాన్ని సాధించినట్లు తెలుసుకోవచ్చు. ఒకే అర్థంలో వచ్చే తద్ధిత ప్రత్యాయాలని అన్నింటినీ ఉత్సర్గాప వాద రూపంలో పాణినిమహర్షి ఒకే చోట ఇచ్చారు: 'దృష్టంసామ' 4.2.7. అనే అర్థంలో ఉత్సర్గ ప్రత్యయం 'అణ్'— వసిష్ఠేనదృష్టంసామవాసిష్ఠం., దీని తరవాత కవేర్ఢక్ 4.2.8. అనే అపవాదసూత్రం వల కవినా దృష్టం సామకాలేయం అని ఢక్ ప్రత్యయం. 'దృష్టంసామ' అనే అర్థంలో వస్తుంది. పాణినిమహర్షి దృష్టిలో అణ్, ఢక్ ప్రత్యయాలకి రూపభేదం ఉన్నా అవి రెండూ ఒకే సముదాయాని చెందినవని దీనివల్ల స్పష్టం. ఆధునిక పరిభాషల్లో ఈ రెండింటినీ ఒకే పదం సపదాలు (Allomorphs of one and the same morpheme) అంటారు.

3. సమాసాలు: రెండు సమర్థమైనవి పదాలు (బహువ్రీహిలో మాత్రం రెండు కన్న ఎక్కువ పదాలు) ఏ సందర్భాలలో సమసిస్తాయో వివరించే సూత్రాలు అష్టాధ్యాయి రెండో అధ్యాయం మొదటి రెండు పాదాలలో ఉన్నాయి. సమాసాలని విధించే సూత్రాలు 'ఫలానాపదం ఫలానా పదంతో సమసిస్తుంది' అనే విధంగా ఉంటాయి: పంచమీభయేన 2.1.37, విశేషణం విశేష్యేణ బహులమ్ 2.1.57. సూత్రంలో ప్రథమా విభక్తిచేత నిర్దేశించబడిన పదమే సమాసంలో మొదట వస్తుంది. సమాసంలో పదాలకి ఉన్న విభక్తులు లోపిస్తాయి, (సుపో ధాతు ప్రాదిపదికయోః 2.4.71). ఈ సూత్రంవల్లనే సమాసాలకి వాటి విగ్రహవాక్యాలు ప్రాతిపదికలుగా తీసుకోబడ్డాయని తెలుస్తుంది. దీనికి ఇంకా దృష్టాంతం కావాలంటే ఉపమితం వ్యాఘ్రాదిభిః సామాన్యాప్రయోగే 2.1.56 'ఉపమితం వ్యాఘ్రాది శబ్దాలతో సామాన్య ధర్మం ప్రయోగించబడనప్పుడు సమసిస్తుంది' అనే సూత్రం తీసుకోవచ్చు. దీనివల్ల పురుషః వ్యాఘ్రః ఇవ—పురుషవ్యాఘ్రః అవుతుంది, కాని పురుషః వ్యాఘ్రః ఇవశూరః అనే దాంట్లో సామాన్య ధర్మం (శూరః) ఉంది కాబట్టి దీని నుంచి సమాసం నిష్పన్నం కాదు.

4. ఏకశేషం: సంస్కృతంలో ఒకే మాట దాని అర్థాన్నీ దానితో కూడిన మరొక మాట అర్థాన్నీ కూడా సహితంగా కొన్ని సందర్భాలలో సూచిస్తుంది: పితరౌ = మాతాపితరౌ ) పితామాత్రా 1.2.70, భ్రాతరౌ = భ్రాతాచ స్వసాచ, పుత్రౌ — పుత్రశ్చ దుహితాచ (భ్రాతృ పుత్రౌ స్వసృ దుహితృభ్యామ్ 1.2.68). ఇటువంటివి సాధించడానికి పాణినిమహర్షి పైన సూచించినట్లు— పితా మాత్రా 1.2.70 మాతృశబ్దంతో కూడినప్పుడు పితృశబ్దమొక్కటే విభాషగా మిగులుతుంది.— ఇలా రెండు శబ్దాలూ గల నిర్మాణం నించి దానికి తుల్యమైన అర్థంగల ఒక శబ్దాన్ని ఏకశేషం (రెండింటిలో ఒకటి మిగలడం) ద్వారా సాధించారు. భ్రాతరౌ అనే వృత్తిలో గల అనేకార్థత దీనికి మూలమైన విగ్రహవాక్యాల (భ్రాతాచభ్రాతాచ—భ్రాతాచస్వసాచ) లో లేదు.

5. సనాద్యంత రూపాలు: సనాది ప్రత్యయాలు 3.1.5—30 సూత్రాలలో ఇవ్వబడ్డాయి. ఇవి నామపదాలకి గాని ధాతువులకిగాని 'ఇచ్ఛ' 'ఆచారం' మొదలైన అర్థాలలో చేరి క్రియా ప్రత్యయాలని పొందడానికి తగినవి అవుతాయి. వీటిని సాధించడానికి కూడా పాణిని మహర్షి అర్థానికి సన్నిహితమైన పూర్ణ వ్యాక్యాన్నే మూలంగా గ్రహించారు. ధాతోః కర్మణః సమాన కర్తృకాత్ ఇచ్ఛాయాంవా 3.1.7. 'ఇష్ ధాతువుకి కర్మయై దానితో సమాన కర్తృకమైన ధాతువుకి ఇచ్ఛార్థంలో విభాషగా సన్ ప్రత్యయం వస్తుంది'— కర్తుమ్ ఇచ్ఛతి—చికీర్షతి; ఉపమానా దాచారే 3.1.10. 'కర్మఅయి

---

3. సమర్థః పద విధిః 2.1.1. 'పదవిధి సమర్థాశ్రితమై ఉంటుంది. 'సమర్థమైన పదాలు' అంటే మూలవాక్యంలో సన్నిహిత సంబంధులు (Immediate Constituents) అని భాషాశాస్త్రం ప్రకారం అర్థం చెప్పడం సమంజసమని తోస్తుంది.

ఉపమానమైన సుబంతానికి ఆచారార్థంలో విభాషగా క్యచ్ ప్రత్యయం వస్తుంది'— పుత్రమివాచరతి చ్ఛాత్రమ్ – పుత్రీయతిచ్ఛాత్రమ్.

## 8. సూత్రాల క్రమం (The Ordering of Rules)

ఆధునిక భాషా శాస్త్రంలో సంధిప్రక్రియకి సంబంధించిన సూత్రాలూ, పరివర్తక సూత్రాలూ (Transformational rules) ఒక నిర్దిష్ట క్రమంలో ప్రవర్తించేటట్లు చేస్తే అది వ్యాకరణంలో శాస్త్రీయతనీ లాఘవాన్నీ సాధిస్తుందని చెప్తారు. పాణినిమహర్షి అష్టాధ్యాయిలో కూడా సూత్రాల క్రమానికి ప్రాధాన్యం ఉంది. విప్రతిషేధేపరం కార్యమ్ 1.4.2. 'తుల్య బల విరోధం గల రెండు సూత్రాలు ఒక చోట ప్రవర్తించడానికి అవకాశం ఉంటే వాటిలో పరమైనదే ప్రవర్తిస్తుంది' అనే పరిభాష అష్టాధ్యాయి అంతటికీ వర్తిస్తుంది. వృక్షేభ్య: అనే పదం సాధించడంలో 'వృక్ష' అనే దాని చివర 'సుపిచ' 7.3.102 అనేదానివల అకారానికి దీర్ఘమూ బహువచనే ఝుల్యేత్ 7.3.103 అనేదానివల్ల దానికి ఏకారమూ ప్రాప్తించడానికి అవకాశం ఉండగా ఈ రెండిటిలో పరమైన 'బహువచనే ఝుల్యేత్' సూత్రమే ప్రవర్తిస్తుంది.

ఇంతేకాకుండా అష్టాధ్యాయి ఎనిమిదో అధ్యాయంలో 2, 3, 4 పాదాలను త్రిపాది అంటారు. పూర్వత్రాసిద్ధమ్ 8.2.1. అనేసూత్రం సపాద సప్తాధ్యాయీ సూత్రాలు ప్రవర్తించడానికి త్రిపాది అసిద్ధమనీ (అంటే త్రిపాదిలో ఒక సూత్రం ప్రవర్తించినతరవాత అవకాశమున్నా సపాద సప్తాధ్యాయీ సూత్రాలు ప్రవర్తించవు) త్రిపాదిలో కూడ పూర్వ సూత్రం ప్రవర్తించడానికి పరసూత్రం అసిద్ధమనీ చెప్తుంది. అసౌ + ఆదిత్య: = అసావాదిత్య: (ఏచోఽయవాయావ: 6.1.78) అసా ఆదిత్య: (లోప: శాకల్యస్య 8.3.19.) ఇక్కడ అకస్సవర్ణే దీర్ఘ: (6.1.101) ప్రవర్తించడానికి వీలున్నా వకార లోపానికి కారణమైన సూత్రం త్రిపాదిలోది కాబట్టి దాని తరవాత ఇది వర్తించదు. అదేవిధంగా రాజన్ + భి: = రాజభి: (నలోప: ప్రాతిపదికాన్తస్య 8.2.7.). ఇప్పుడు అతో భిస ఐస్ 7.1.9. 'హ్రస్వ అకారం తరవాత భిస్‌కి ఐస్ వస్తుంది' అనే సూత్రం ప్రవర్తించడానికి అవకాశం ఉన్నా నలోపానికి కారణమైన సూత్రం త్రిపాదిలోది కాబట్టి దాని తరవాత ఇది ప్రవర్తించదు. త్రిపాదిలో సూత్రాలన్నీ క్రమబద్ధమైనవీ పదాంత, పద మధ్య సంధులకి సంబంధించినవీ. సపాద సప్తాధ్యాయీ, త్రిపాదీ విభజనవల్ల పాణినిమహర్షి సంధి ప్రక్రియా వర్ణనలో శాస్త్రీయతని సాధించడం "పాణిని మహర్షి పద్ధతి తరచు ఆశ్చర్యకరంగా నవీనంగా ఉంటుంది" అన్న ప్రొఫెసర్ రెనూ వర్ణనకు ఒక మంచి ఉదాహరణ.





శాలోఫెన్

బాధానివారిణి మాత్రలు

అమృతాంజన్ లిమిటెడ్ వారి తయారింపు

శాలోఫెన్ తలనొప్పి, ఫ్లూ, పంటినొప్పి, ఒళ్లు నొప్పులకు అతి నిశ్చయంగా, శీఘ్రంగా ఉపశమనం కలిగిస్తుంది. ఇది నిరపాయకరమైనది. శాలోఫెన్ డాక్టర్లు సిఫారసుచేసే పటువైన ప్రక్రియ కలిగియుంది.



# చిరంజీవి లక్ష్యం

డా॥ సి. నారాయణరెడ్డి

ఒక మబ్బు ఏడుస్తూ చెప్పింది
విహారదశ కొన్నాళ్లేనని.
ఒక పువ్వు నిట్టూరుస్తూ చెప్పింది
వికాసదశ ఒకే రోజని
ఒక హిమబిందువు నవ్వుతూ చెప్పింది
ఉత్సాహదశ ఒకే గడియని.
ఒక తారాజువ్వ ఎగురుతూ చెప్పింది
ఉల్లాసదశ ఒకే నిమిషమని.

ఒక మెరుపుతీగ ఉరుకుతూ చెప్పింది
ఉజ్జ్వలదశ ఒకే క్షణమని.
అడుగు తప్పని ఒక గుండె
పిడికిలెత్తి చెప్పింది
ఆత్మశక్తి నడిపే ఆయుష్షు
అనంతమని.

---





శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు

జననం 15-5-1867 శివసాయుజ్యం 19-4-1938

మన ఆంధ్రుల చరిత్ర కొన్ని శతాబ్దుల మహోజ్వల చరిత్ర.అందు యాభై ఏళ్ల పరిధి ఒకానొక యువకుని చుట్టూ అల్లుకొని వున్నది. అది అపూర్వమైంది. అసామాన్యమైంది. నిద్రాణంలో ఉండిన ఆంధ్ర జాతికి కళ్లు తెరిపించి మేల్కొల్పింది.




# దేవ పురుషుడు

శ్రీ ముద్దా విశ్వనాథం

ఆ యువకుడు ఏకలవ్యుడయితే, ద్రోణుడివంటి గురువు ఉండాల్సిందే కద. ఈ ఇద్దరి గాథలతో పెనవేసుకొని ఉన్నదే ఆ యాభై ఏళ్ల ఆంధ్రచరిత్ర. కనుక రెండు గాథలనూ పక్కపక్కనే నడిపి, అవి ఎక్కడ ఏ విధంగా కలుస్తాయో చూదాం.

*　　*　　*

'అబ్బాయికి సంస్కృతమే నేర్పిద్దాం. పూర్వాచారం పోనివ్వకూడదు. అది సంప్రదాయం కాదు' అని బుచ్చివార్లు అయ్యంవార్లంగారు.

'అహ—బాబుకి ఇంగిలీషే చెప్పించాలి. వాడు పెద్ద ఇంగిలీషు చదువు చదివి గొప్ప ఉద్యోగం చేస్తూ వుంటే, నే కళ్ల వేడుకగా చూడొద్దూ?' అంటూ, సంస్కార హృదయంగల తల్లి శ్యామలాంబ.

సుపుత్రుడైన నాగలింగం చదువు గురించి ఇలా వాదులాడుకున్నారు, ఆ పుణ్య దంపతులు. నాగలింగానికి అక్షరాభ్యాసమేమో నాగరలిపిలోనే జరిగింది. కాని తరువాతి కథ అంతా తల్లి మాటమీదనే నడిచింది.

వారిది కృష్ణామండలం, గుడివాడ తాలూకా, ఎలకుర్రు అగ్రహారం, నాగలింగం జననం: 1867 మే 15.

తల్లి ఇష్టానుసారం, ఇంగ్లీషు చదువుకుగాను నాగలింగం బందరు హైస్కూల్లో ప్రవేశించి, స్కూల్‌ఫైనల్ పాసయినాడు. పిల్లవాడు స్వతహా మితభాషి, కాని, చదువులో అతిచురుకు.

ఇంతలో—తండ్రి పోవడంతో అండలేకపోయింది. స్వయంకృషివల్లా మిత్రుల తోడ్పాటుతోనూ గుంటూరు ఎ. ఇ. ఎల్. ఎమ్. కాలేజిలోచేరి, ఇంటర్‌లో ఉత్తీర్ణుడైనాడు. తరవాత చెన్నపట్నం చేరుకుని క్రిస్టియన్ కళాశాలలో చదువు సాగించాడు.

చెన్నపట్నంలో ఉండగా కొంతమంది విద్యార్థులతో పాటు నాగలింగం తంబుశెట్టివీధి ఏడో నంబరు ఎర్ర భవనంలో బసచేసి చదువుకునేవాడు.

లాడ్జిలో ఉంటున్న ఈ విద్యార్థి బృందాన్ని ఒకవ్యక్తి తరుచువచ్చి గమనిస్తూ ఉండేవాడు. ఆయనే అఖండ ప్రతిభావంతుడు, విఖ్యాత పురుషుడు—రెంటాల వెంకట సుబ్బారావు! ఆయన చరిత్ర అతి విచిత్రమయినది.

'లా' చదివాడు, ప్రాక్టీసు పెట్టాడు. బాగానే రాణించింది. కాని ఈవృత్తి ఆయన మనస్తత్వానికి సరిపడలేదు. సుబ్బారావు అద్భుత మేధావి. ఆయన కల్పనాశక్తి అనన్యసామాన్యమైంది. ఆంధ్రంలో ఆంగ్లంలో పద్యకావ్యాలు, అభిమాన శాఖఅయిన ఫిలాసఫీలో కథలూ వ్యాసాలూ, చెప్పతగిన రచన 'కమలలేఖలు' ఇదిఒక హిందూ వితంతువు ఘోష. ప్రచార సౌకర్యమనేదే లేని ఆ రోజుల్లో ఈ చిన్ని పుస్తకం 25000 ప్రతులు కర్చుయినవంటే ఎంత ఆశ్చర్యం!

వాణిజ్యమంటే సుబ్బారావుకు మంచి అభిరుచి. ఆ కీలకాలు బాగా తెలుసు. ఈ ఊతతోనే 'విక్టోరియా డిపో' నెలకొల్పారు. ఈ సంస్థలో అందరకూ అర్థమయే ఆకర్షణీయమయిన పుస్తకాలు ఎన్నో దొరుకుతాయి. అంతేకాదు. సమస్త వ్యాధులకూ ఉపకరించే రకరకాల మందుల విక్రయమూ జరుగుతుంది. పుస్తకాలన్నీ సొంత ప్రచురణలే. మందులన్నీ సొంత తయారీయే.

విదేశంనించి ఏ కొత్త వింత వచ్చినా దానికి మక్కికిమక్కి తయారుచేశారన్నమాటే మన సుబ్బారావు. మొట్టమొదటగా మద్రాసుకు ఫోనోగ్రాఫ్ తెచ్చిందెవరు? ఆయనే. తెలుగు వాళ్లకు గిల్టునగలు తెలియజేసిందెవరు? రెంటాలవారే!

ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా వస్తుసామగ్రి రవాణా జరగటాన్ని 'మెయిల్ ఆర్డర్ బిజినెస్' అంటారు. ఇటువంటి పద్ధతికి తెనుగునాటి వరవడి పెట్టిన మార్గదర్శకుడు రెంటాల. దీనికి అగత్యమైన హంగులన్నీ ఆయనకు కొట్టినపిండి.

మనోహరమయిన చక్కటి బొమ్మలతో సహా చక్కటి కేటలాగ్ తయారుచెయ్యడం, ఎక్కడెక్కడి మారుమూలల ఉద్యోగస్థుల చిరునామాలనూ వెతికి పట్టి సేకరించడం, వారందరికీ ఈ అందాలు చిందే కేటలాగ్ పోస్టుచెయ్యడం ఇదే సుబ్బారావుగారి నిరంతర కృషి. కేటలాగ్ అందుకున్న ఉద్యోగులందరూ 'ఈ విక్టోరియా డిపోవారికి మనపేరు ఎట్లా తెలిసిందా' అని ఆశ్చర్యపోయే వారు. మందులకో పుస్తకాలకో తప్పక వెంటనే ఆర్డరిచ్చేవారు. ఇలా వచ్చిపడే ఆర్డర్లు చూడటానికే టయిము చాలేదికాదు సుబ్బారావుగారికి. రోజూ వందలూ వేలూ వీ. పీ. మనియార్డర్లు అందుకోవడంతో విక్టోరియాడిపో భవనం కనకవర్షం కురుస్తూ కలకల్లాడుతూ వుండేది.

* * *

క్రిస్టియన్ కాలేజిలో బి. ఏ. చదువుతున్న మన నాగలింగం సుబ్బారావుగారికి వ్యాపార విషయాల్లో కుడిభుజంగా ఉండి సాయపడుతూ వచ్చారు. పిల్లవాడి తెలివితేటలు, బుద్ధి కుశలత, వాణిజ్యాభిలాష ప్రత్యేకించి గుర్తించారు సుబ్బారావు. చూచి ముచ్చటపడి, తన మేనకోడలు రామయమ్మనిచ్చి 1893 వసంతంలో మద్రాసులోనే వివాహం చేశారు.

ఇప్పుడు సుబ్బారావుగా రొక గురువు, నాగలింగం ప్రియశిష్యుడు, ఆయన ద్రోణుడు, ఈతడు ఏకలవ్యుడు. అప్పుడైన నాగలింగం సుబ్బారావుకు ఆత్మీయుడైనాడు. నాగలింగం నాగేశ్వరరావు అయ్యాడు.

ఇదే సమయంలో నాగేశ్వరరావు ఒక గ్రంథం రచించాడు—'కేరళ, సాముద్రిక, స్వర, జ్యోతిషశాస్త్రం' దీన్ని ప్రకటించి వ్యాప్తి చెయ్యాలనే కుతూహలంతో కలకత్తా వెళ్లాడు. గ్రంథమయితే అచ్చుపడి వెలుగు చూచింది కాని, ప్రచారం?—ఇందుకు తగిన స్తోమతు కనిపించలేదు.

* * *

ఆంధ్ర చరిత్రకు కారకుడయిన నాగేశ్వరరావుకు చరిత్రలోనే మార్కులు తక్కువొచ్చాయి. బి. ఏ. పరీక్ష డింకీ కొట్టేసింది. ఆలోచనలో పడింది వ్యవహారం! పోనీ అంటే మునుపటిలా ఇప్పుడు ఒంటరివాడు కాదు. గృహస్థు. ఎన్నాళ్లని భార్యను పుట్టింట అట్టే పెట్టడం? ఏం తోచలే, అయోమయమనిపించింది.

ప్రభుత్వోద్యోగమంటే మనసు మొగ్గలేదు. స్వతంత్ర జీవనంపైనే మోజు. ఈ మద్రాసులో ఉండి చేసేపనీ కనబడలేదు. పిట్టకయినా చెప్పకుండా ఒక రోజున బయల్దేరి కలకత్తా చేరుకున్నాడు, పంతులు.

అక్కడ బౌమన్ అనే తెల్లదొర ఆయుర్వేద ఔషధాలు తయారు చేస్తున్నాడు. దొరతో దోస్తీ కుదిరింది పంతులుకి. ఫలితంగా, ఆయన ప్రోత్సాహంతో కొంత సొంత ఆర్జనకూడా కలిగింది. అయితే ఆరోగ్యం—చెడడం, మళ్లా ఎలకుర్రుకి మళ్లడం తప్పలేదు.

ఎలానో ఇంటిపట్టున రెండేళ్లపాటు వెళ్లబుచ్చాడు. కాని, ముందు కథను గురించి మనస్సులో రగుల్తూనే వుంది. ఎక్కడికయినా ఉడాయించాలనే వేగిరపాటు ఒకవంక! ఈసారి పంతులు దృష్టి బొంబాయివేపు తిరిగింది.

* * *

బొంబాయిలో ఎగుమతి దిగుమతి వ్యాపారంచేసే మహారాష్ట్ర వర్తకుడు గణపతివద్ద కొలువుకి కుదురుకున్నాడు పంతులు.

కలకల్లాడే మోము, గుబురుమీసం, పైగా అచ్చం దొరలాగా సూటూ బూటూ—ఇదీ ఇప్పుడు పంతులు వేషం. తన యజమానికి ఖాతాదారులు చాలామంది తెల్లదొరలే కనుక వాళ్ల కిష్టమయిన ఈ వేషం అవసరమని యజమానే ప్రోత్సహించాడు. బొంబాయినించి మద్రాసుకి సెకండ్‌క్లాసులో ప్రయాణం! ఆ రోజుల్లో ఇదెంతో గొప్ప! ఘరానా!

ఇలా రెండేళ్లు సాగింది. తరవాత మరాటీ వర్తకుడు గణపతి వ్యాపారమే ఎత్తేశాడు. సరి, పోనీ 'భార్య మేనమామ స్వతంత్ర జీవనంచేసి రెండుచేతులా సంపాదించలేదా? నేను మట్టుకు ఆ మార్గం ఏందుకు

ఏభై యేండ్లుగా

తెలుగు సాహిత్య సేవ చేయుచున్న

'భారతి' కి

స్వర్ణోత్సవ శుభాభినందనలు !



శోభన్ బాబు, శారద

నటించే

# శ్రీ లక్ష్మి ప్రొడక్షన్స్ వారి

# క్రొత్త చిత్రం

నిర్మాత : ఎ. పూర్ణచంద్రరావు

దర్శకుడు : తాతినేని రామారావు

అవలంబించకూడదు?' అని ఒక ధీమా కలిగింది పంతులుకు.

అందరకూ పనికి వస్తాయనుకున్న కొన్నిమందులు తయారుచేశాడు. సంస్థకు విలియంఅండ్ కంపెనీ అని పేరుపెట్టి విక్రయం ప్రారంభించాడు.

ఆ రోజుల్లో డాక్టర్లు అరుదు. ముఖ్యంగా పల్లెలలో వైద్యసహాయం అలభ్యం. కనుక పోస్టు ద్వారా మందులు తెప్పించుకుని చికిత్స చేసుకోవడం జనానికి సౌకర్యమనిపించేది. కేటలాగ్ కంటబడితే చాలు, ఆర్డర్లు కుప్పలు తిప్పలుగా కురిసేవి. ఈపద్ధతిలో విలియంఅండ్ కంపెనీ చూస్తూండగా మంచి అభివృద్ధిలోకి వచ్చేసింది. వ్యాపారం అభివృద్ధి అయినకొద్దీ, అనుభవంమీద పంతులుకు ఒక చక్కటి ఐడియా తట్టింది. ఇన్నిమందు లెందుకు, మంచి మందు ఏదో ఒక్క దానిపైన దృష్టి నిలిపితే మేలు కదా అని. తల్చుకోవడమెంత, అమలు చేయడమెంత? వెంటనే ఫలితం—కన్ను తెరచినా మూసినా మనకు అగపడే అద్భుత నొప్పుల నివారిణి 'అమృతాంజనం!'

1894 లో అమృతాంజనం పుట్టడమేమిటి, పంతులు అదృష్టరేఖ బయల్పడడమేమిటి! — ఆయన కోటికి పడగలెత్తడానికి మూలకందం ఈ అమృతాంజనమే! అమృతాంజనం అవతరణతో పంతులుకు దశ ఎత్తుకోవడమేకాదు, ఆంధ్ర లక్ష్మి కడుపు ఫలించిందన్నమాట.

ఇప్పుడాయన బొంబాయికి సతీసమేతంగా వెళ్లాడు. ఈ నూతన దంపతులు తరుచు స్వగ్రామం ఎలకుర్రుకీ, మద్రాసుకీ బంధుదర్శనం కోసరం వెడుతూ ఉండేవారు. వెళ్లినప్పుడెల్లా ఎలకుర్రు గ్రామస్థులు వీరినెంతో ఆప్యాయంతో ఆదరించేవారు, ఊరి పిల్లలందరూ గుంపు గుంపులుగా వచ్చి వారిని వింతగా పరికించేవారు. వీరి భాగ్యానికి అబ్బురపడి పెద్దలు పలువిధాల అభినందించేవారు.

* * *

పది పద్నాలుగేళ్లదాకా పంతులుదృష్టి అమృతాంజనం మీదనే. ఆయేటి కాయేడు నికార్సయిన లాభాలు, మంచినిలవలు కనిపించాయి. 1908 నాటికి వ్యాపారం వేళ్లు దన్నింది, పంతులు జీవితం స్థిమితపడింది.

''నే పుట్టి పెరిగిన తెలుగుదేశానికి ఏ విధంగా ఉపకరించగలను?''—ఇదే ఇప్పుడు పంతులుకు పట్టుకున్న కోరిక. పంతులు సంకల్ప సిద్ధుడు. తత్క్షణమే ఈ కోరిక. చిగిర్చి, పుష్పించి ఫలించింది. అదే బొంబాయి చికల్వాడీలో తొలుతగా వెలసిన 'ఆంధ్ర వారపత్రిక!'

ఆ నాటి ముద్రణ విధానం అంతా అదో చిత్రం! పూర్తి హంగులు లేకపోయినా, పెద్దప్రెస్సు నిర్వహించే ఒక మహత్కార్యాన్ని సాధించగలగటం, అదే మన పంతులు ప్రజ్ఞ, మహామేధావి అయిన నాగేశ్వరరావు చతురత.

లెక్కకు కొద్దిమంది కంపోజిటర్లు, వాళ్ళు కూర్చి సిద్ధంచేసిన ఫారాలు. ట్రస్టయిక్ కావడం 'తత్వవివేచక' ప్రెస్సులో, బొంబాయినుంచి వెలువడే ఈ తెనుగు పత్రిక చూడగానే ఆంధ్రావని కంతటికీ కనుపండువయింది. ఈ రూపంగా తన దివ్య సందేశాలను అందిస్తున్న ఆ శెట్టి ఎవడా అని తెలుగువాళ్లంతా ఆశ్చర్య చకితులైనారు.'

* * *

ఇంతలో వచ్చిపడింది ప్రపంచ మహాసంగ్రామం. సంపాదకుడుగా పంతులు బాధ్యత హెచ్చింది, తరుచు మద్రాసుకు వచ్చిపోతూఉండే అగత్యం ఎక్కువయింది. ఇది పని కాదు, మద్రాసులో మన బ్రాంచీ స్థాపించే తీరాలి, అప్పుడే ఆంధ్ర సోదరులకు తన సేవ ఇంకా అందుబాటులో వుంటుంది అని నిశ్చయించాడు.

ఏ భవనమందు పంతులు, మద్రాసులో తన విద్యార్థి దశను గడిపాడో, ఆ తంబుశెట్టివీధిలో ఏడో నంబరు ఎర్రరంగు భవనాన్నే రు. 46,000 కు క్రయించి, మరొక రు. 30,000 లు వెచ్చించి భవనాన్ని తీర్చి దిద్దారు! అదే ఈనాటి 'ఆంధ్రపత్రికా' ఆఫీసు!!'

ఏడో నంబరు పంతులుకు లకీనంబరు. ఆయనకు అచ్చి వచ్చిన సంఖ్య. కనుకనే 'భారతి' ప్రచురణ ఏడవతేదీగా పెట్టుకున్నారని మనం నమ్మాలి.

ఈ విధంగా వెంటనే మద్రాసులో బ్రాంచీ స్థాపన, పత్రికను బొంబాయినుంచి మద్రాసుకు తరలించడం, పత్రిక ముద్రణకుగాను అచ్చాఫీసు నెలకొల్పడం—జరిగింది. ఇదే సమయంలో ఆంధ్ర వార పత్రిక దైనిక పత్రికగా మారింది!

పంతులు మాతృభాషాభిమానం సాటి లేనిది. అందుకనే తెలుగున పత్రిక నిర్వహించడం, అయితే, ఇంగ్లీషులో నడిపితే ఇంకా జనామోదకరంగా వుంటుందని ఒక ఉద్దేశం. అందుకని వేరే ఇంగ్లీషులో పత్రిక పెట్టకుండా, ఉభయతారకమైన చిన్న యుక్తి చేశాడు పంతులు — మామూలుగా వెలువడుతున్న తెలుగు పత్రికకే ఒక చిన్న ఇంగ్లీషు అనుబంధం చేర్చడం, కానయితే, కొద్దికాలంలోనే ఈ 'సప్లిమెంటు' నిలుపు చేయబడింది.

అటు అమృతాంజనం, విలియమ్స్ కంపెనీ, ఇటు ఆంధ్రపత్రిక విరాజమానమై, తెనుగునాడంతటా దివ్యకాంతులను వెదజల్ల సాగినాయి. ఆనాడు ఆంధ్ర పత్రిక దర్శన మివ్వని గ్రామమే లేదంటే అతిశయోక్తి కాదు.

* * *

తంబుశెట్టివీధి ఏడో నంబరు, ఆ ఎర్రరంగు భవనంలో ఎంతోమంది ఎన్నో రకాల పనులు చేస్తూ వుంటారు. మందుల తయారీ, పత్రికా ముద్రణ, గ్రంథ విక్రయం, ఒక్కొక్కరుగా జట్టు జట్టుగా ఎడతెరిపి లేకుండా అలా విజిటరు వస్తూనే వుంటారు, వెళుతూనే వుంటారు.

ఆ మందుల డిపోకి, ఆ పత్రికా కార్యస్థానానికి, ఆ పుస్తకాల షాపుకి అధిపతి అయిన ఆ దివ్య మంగళమూర్తిని దర్శించటానికి వచ్చారా?—అయితే 'పంతులు గారున్నారా?' అని ఫారావాణ్ణి అడిగి తెలుసుకోండి. ఉన్నారని అంటే తిన్నగా మేడమీదికి వెళితే సరి—

నిరాడంబరమైన తెల్లటి ఖద్దరు దుస్తులతోను, కళ్లజోడుతో చిన్నగదిలో కూర్చునివున్న ఆ నిరుపమాన తేజస్వి కనిపిస్తారు. ఎంత పని రద్దీలో ఉండనీ, వాత్సల్య పూరితంగా మందహాసం చేస్తూ, వచ్చిన ప్రతివారినీ ఆదరిస్తారు. చెప్పేదంతా సావధానంగా ఆలకిస్తారు. సందర్శన ఫలం వెంటనే సంతరింపజేస్తారు.

ఆ మహాశయుడే దేశోద్ధారక విశ్వదాత—కళాప్రపూర్ణ శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు!

నిద్రావస్థలో ఉన్న ఆంధ్రజాతిని మేల్కొలిపి, సర్వతోముఖమైన చైతన్యాన్ని రేకెత్తించిన నవయుగ పురుషుడే మన దేశోద్ధారకుడు.

వ్యక్తులకూ సంస్థలకూ, కుడి ఎడమ అనక లక్షలకు లక్షలు విరజిమ్మిన దానకరుడే మన విశ్వదాత.

కోట్లకు పడగలెత్తిన శ్రీమంతులే సాహసింపలేనినాడు పత్రికా నిర్వహణకు సమకట్టి ఆచంద్ర తారార్కమయిన ఆంధ్రపత్రికనూ, భారతీ పీఠాన్నీ స్థాపించినది మన కళాప్రపూర్ణుడే.

ఆంధ్ర సారస్వతానికి కొత్త శక్తినీ రూపాన్నీ ఇచ్చి, ఆంధ్ర విజ్ఞాన సర్వస్వమూ ఆంధ్ర గ్రంథమాలనూ నిర్వహించిన మేటి మన ఆంధ్రభోజుడే! నాగేశ్వరరావు పంతులు కష్టజీవి, సాహసోపేతుడు, త్యాగి, భోగి, సంస్కర్త, అకలంక దేశభక్తుడు, కళాపిపాసి, నాట్యకళాభిమాని, ఆంధ్ర జాతీయ నిర్మాత!

* * *

పంతులు జీవిత చరిత్రను మూడు ముక్కల్లో చెప్పవచ్చు. ఎముకలేని చెయ్యి, కరకులేని నాలుక, ఎవలేని హృదయం—ఇవే ఆ మహానుభావుడి ప్రసాద గుణాలు.

ఇంతకూ—ఆయన యశశ్చంద్రికలను వెదజల్లినది దేశసేవకాదు, కళాభిమానం కాదు, ఆంధ్రపత్రిక కాదు, భారతీ కాదు. ఇంట్లో, ఆఫీసులో, జెయిల్లో, దారి ప్రయాణంలో, సభలో, సమావేశాల్లో—ఎవరెక్కడ ఏది అర్థించినా లేదనక ఇచ్చే జీవితవ్రతం. ఇదే పంతులు కీర్తికి మూలకందం.

ఇంకా చెప్పాలంటే—జాతి, పక్ష, రాష్ట్ర విభేదాలకు ఎంతమాత్రమూ తావులేని ఆయన విశాల హృదయం.

వివరలిస్తే—పంతులుగారి సాహసం— ఔదార్యం,

వితరణ వదాన్యత, వీటిని ప్రదర్శించే ఇతిహాసాలు వందలూ వేలున్నూ.

*    *    *

కృత్తివెన్ను, గరికెపూడి, మాట్లంగ్రామాల్లో కాశీనాథునివారి భూము లున్నాయి. ఇవన్నీ కలిపి 'కృత్తివెన్ను జమీందారీ' అంటారు. ఒకసారి ఆంధ్ర పత్రికా ఆఫీసులో రైతు సేవకుల సమావేశం జరిగింది. పంతులే అధ్యక్షులు. మూలని కూర్చున్న యువకులు గుసగుస లాడారు; 'జమీందారీల రద్దు తీర్మానమా? మన అధ్యక్షులూ జమీందారేనే!' అని. ఈ మాట చెవిని బడగానే పంతులు నవ్వుతూ—'నే నెదురీదుతానా? నా జమీందారీ భేషుగ్గా వప్పజెప్పేస్తా దేశానికి...' అన్నారు.

.    .    .

1930 సత్యాగ్రహం, పంతులుకి జుల్మానా పడింది. చెల్లించ లే దాయన. ప్రభుత్వం కార్ అటాచ్ చేసి, పుదుచ్చేరిలో కొన్ని వందలకు హీన క్రయానికి విడుదల చేసింది. డ్రయివరు కందసామి కంట తడి పెట్టాడు. అతన్ని ఓదారుస్తూ పంతులు సవాల్ చేశారు: 'ఎందుకోయ్ వెర్రివాడా విచారిస్తావ్? రేపు మళ్లా ఒక కొత్తకారు కొనుక్కుంరా. ఈ గవర్నమెంటు ఇలా ఎన్ని కార్లు తీసుకుంటుందో, నేనూ చూస్తా. రోజుకో కారు కొంటా, చూస్కో!

.    *    *

ఒక విద్యార్థి వచ్చి, జీతం కట్టడానికి సొమ్మ లేదన్నాడు. వెంటనే జేబులో చేయి పెట్టితీసి, ఆ నోటు అతని చేతిలో ఉంచారు పంతులు. విద్యార్థి బిత్తర పడి 'అయ్యా, మీరు నా కిచ్చింది నూరు రూపాయల నోటండి!' అన్నాడు. 'అది నీ అదృష్టం!' అని చెప్పి పంపాడు పంతులు.

.    .

పని మీద ఒకాయన సికింద్రాబాదునించి బొంబాయి వెళ్లారు. తిరుగుదలలో పూనా వచ్చేప్పటికి పెట్టే సామానూ దొంగల పాలయింది. ఈ నిస్సహాయ స్థితిలో ఆయన సెకండ్‌క్లాసు పెట్టెలో కూర్చున్న ఒక వ్యక్తితో తన గోడు వల పోసుకున్నాడు. ఆ కూర్చున్నాయన లేచి బుకింగాఫీసుకి వెళ్లి, సికింద్రాబాద్‌కి టికెట్టు కొనితెచ్చి ఇచ్చి వెళ్లిపోయా రు. ఇలా చేసిన ఆ దేవపురుషుడు నాగేశ్వరావు పంతులేనని తరువాత తెలియవచ్చింది!

*    *    *

పంతులు మొగమాటి. మనసు మెత్తన. ఒక్కొక్కప్పుడు కోపంలోనే దానం చేసేవారు.

రేపే ఉగాది. సంతకాలు పెట్టాల్సిన చెక్కుల దొంతర మేటుగా వుంది టేబిల్ పైన. అంతలో వచ్చారు—హిందూ యువతీ శరణాలయం నిర్వహిస్తున్న దేశసేవిక యామినీపూర్ణ తిలకమ్మ.

'వచ్చిన పనేమిటో చెప్పెయ్యండి' అన్నారు పంతులు. 'పిల్లలకి రేపు పండగ. చూసి వెళదామని... 'అన్నదామె. 'ఈ ఆరున్నర లక్షల పట్టణంలో నే నొక్కణ్ణే కనబడుతున్నానా? నాలుగు చోట్లకూ వెళ్లాలి, నలుగురి వద్దా వసూలు చేసుకోవాలిగాని...' అని పంతులు చీకాకు పడ్డారు. మౌనంగా ఉన్నది తిలకమ్మ.

అయిదు నిమిషాలయ్యాక 'ఆయితే పండక్కి ఎంత కావాలి?' అనడిగారు పంతులు. 'పదిహేను రూపాయిలైతే సరిపోతుం'దన్నది తిలకమ్మ. పాతిక రూపాయ లిచ్చారు పంతులు. నమస్కరించి వెళిపోయిందామె.

వెంటనే బంట్రోతు వెళ్లి ఆమెను వెనక్కు పిలుచుకువచ్చాడు. పంతులుగారన్నారు: 'ఏమిటమ్మా, మీరూ అనలేదు, నేనూ మరిచా. రేపు సంవత్సరాది కదూ. ఆశ్రమంలో పిల్లలకి బట్టలు ఏర్పాటు చెయ్యొద్దూ?' అంటూ క్షణం యోచించి, 'ఇదుగో, ఈ యాభై పట్టుకెళ్లి, ఖాదీ స్టోర్సులో పిల్లలకు బట్టలు కొనుక్కెళ్లండి!' అన్నారు. ఆయనలో ఈ క్షణిక మార్పుకి ఆఫీసులో అందరూ ఆశ్చర్యపోయారు.

*    .    *

పంతులు దేశభక్తి, త్యాగనిరతి సాటిలేనివి. ఉప్పు సత్యాగ్రహం, 1932 శాసనోల్లంఘనం సమయాలో ఆయన శ్రీ కృష్ణ జన్మస్థానం అలంకరించారు. 1934 లో, కాంగ్రెసు పార్లమెంటరీబోర్డు శాసన

సభా ప్రవేశానికి అంగీకరించినప్పుడు ఒక స్థానానికి పంతులు నిలిచారు. 25,000 వోట్లు తేడాతో ప్రత్యర్థిని పల్టీకొట్టించారు! ఈ తేడా ఇండియా మొత్తానికే రికార్డు చేయాల్సిన సంఖ్య అని వ్యక్త మయింది!

* * *

పంతులు మాతృభక్తి గణనీయమైనది. ఎల కుర్రులో ఉచిత మాధ్యమిక పాఠశాలను స్థాపించి తల్లి రుణం తీర్చుకొన్నాడు. హరిజనోద్ధరణ ఆయనకు ప్రాణం. అందుకే ఈ పాఠశాలలో పంచమ బాలురకు ప్రవేశముంది.

అభిప్రాయాలలో సనాతనమంటే పంతులుకు తృణీకార భావంలేదు, కాని అధునాతనమంటే మోజు. అంతశ్శాఖా వివాహాలకు ఆయన ఎంతో ప్రోత్సాహమిచ్చారు. సంస్కరణాభిలాషకు ఈ నిదర్శనం చాలదా?

ఇంకో సంగతి—ఒక్కగా నొక్క కుమార్తె. రజస్వలానంతర వివాహం చేయాలని సంకల్పం. ఆ నాటి ఛాందసులు ఎదురు తిరిగారు. కరపత్రాలు పంచిపెట్టి ప్రచారం చేశారు. ఈ ఆర్భాటానికి జంకలేదు పంతులు, లెక్క చెయ్యలేదు. అత్యంత వైభవంగా కార్యం జరి పించి, ఉన్నతమైన తన ఆదర్శాన్ని దీక్షతో నెరవేర్చాడు.

* * *

గృహ విషయంలోనే కాదు, సాహిత్య శాఖలోనూ సంస్కారానికి ముందడుగు పంతులుదే, అటువంటి రచనలకు ఆయన ప్రోత్సాహం, పూర్తి అవలంబన లభించేది. 'భారతి'లో 'ఎంకిపాటలు' ప్రచురణకు హుషారిచ్చింది పంతులుగారే. ఆ రచన ఎంత గాలి దుమారాన్ని రేపింది !

ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో పీఠికాపురాస్థాన (రామకృష్ణ) కవుల చిన్ని పద్యరచన—'పూర్వ కవుల పాడి కవిత్వం' ప్రకటితమయింది. ఆ వ్యాసం తెనుగు నాడునే కదిలించి వేసింది. ఇటువంటి సంఘటనలు పంతులుకు సరదా. పంతులు నిర్వహించే పత్రికా


మీ బిడ్డ సంతోషంగా ఉండాలంటే




అమృతాంజన్
గ్రైప్ మిక్స్చర్ ఇవ్వండి

బిడ్డ ఆపకుండా ఏడుస్తూఉంటే జీర్ణశక్తి బాగాలేదేమో! పాపకి అమృతాంజన్ లిమిటెడ్‌వారి గ్రైపమిక్స్చర్ ఇవ్వండి. సులినొప్పి, వాయువు, అజీర్ణం పళ్లువచ్చే కాలంలో ఇబ్బందులు త్వరగా తగ్గిపోతాయి. బిడ్డ ఇంకా సంతోషంగా ఉంటుంది.

అమృతాంజన్ లిమిటెడ్

OBM.2610-G

సంచయం ఎంతరెందరో పండితులకు, విద్వాంసులకు, చిత్రకారులకు అండ అయి నిలిచింది.

* * *

పంతులుకు సంగీతంలోనూ చిత్రలేఖనలోను ప్రవేశమే కాదు, ప్రావీణ్యత ఉన్నది. ధీశాలి, త్యాగ మూర్తి అయిన పంతులు కృషి అద్వితీయం. ఆయనది అమృత హృదయం.

సకల కళాసంశోభితమయిన విజయవాడ—దుర్గా కళామందిరం పంతులు నిర్మించినదే. దాని కదే సాటి.

ఆయన నివసించే 'శ్రీబాగ్' భవనం ఆంధ్ర రాజకీయాల శుభ వాతావరణాని కొక శాశ్వత చిహ్నం. రోజూ ఉదయంపూట ఈ శ్రీబాగ్‌లోనే పనసచెట్టు కింద కూర్చోవడం పంతులకు అలవాటు.

* * *

పలువిధాల ఆంధ్రను ఉద్ధరించిన ఈ యుగ పురుషుడు, యోగిపుంగవుడు, ధన్యజీవి 1938 ఏప్రిల్ 19—న ఆంధ్రావనిని అంధకారంలో ముంచి, 71 ఏళ్ల వయస్సులో మనల విడనాడి వెళ్లిపోయినాడు!

**కామధేనువు దివి కేగింది,**
**దేశం బావురుమన్నది!**

'ఈ సొత్తు, సంపద నా ఆంధ్ర సోదరులది, నేను ట్రస్టీని' అనే భావంతో జీవితం గడిపిన మహా పురుషుడు నాగేశ్వరావు పంతులు. ఈ విషాదవార్త చెవిని బడగానే మహాత్ముడు—'ఈ దానకర్ణుడి స్థానం ఆక్రమించటానికి ఎవరున్నారు?' అని ప్రశ్నించాడు. నిజానికిది జవాబులేని ప్రశ్న.

పంతులుగారు దివంగతులైన వార్త తెలియగానే తుది దర్శనంకోసం లక్షలాది దుఃఖితులువచ్చి విలపించారు.

పట్టణ ప్రజకు ఈ దర్శన భాగ్యం లభించింది. కాని, యావదాంధ్రలో జనం పంతులుగారి భౌతిక దేహాన్ని ఎలా చూడగలరు? ఈ అవకాశాన్ని కల్పించిన మహామహుడు శ్రీ గూడవల్లి రామబ్రహ్మం. ఆయన అధ్వర్యాన సారథీ పిలిమ్సువారు 'పంతులుగారి కడపటి యాత్ర' అనే టాపికల్ టాకీ చిత్రాన్నితీసి ఆంధ్ర లోకానికి సమర్పించారు.

అంతేకాదు, పంతులుగారికి అత్యంత ప్రియ మయిన సంస్కరణ హరిజనోద్ధరణ కాబట్టి, సారథీ వారి మొట్టమొదటి చిత్రం 'మాలపిల్ల'కూడా నాగేశ్వరావుగారికి అంకితం చేశారు.

రామబ్రహ్మంగారికి పంతులుపట్లగల గౌరవమూ గాఢాభిమానమూ ఆయన తన 'ప్రజామిత్ర' ప్రత్యేక సంచికలలో విపులంగా వెల్లడించారు. విశ్వదాతను గురించి ఎందరో మహామహుల సందేశాలను సంతరించి ఆ సంచికలలో ప్రకటించారు.

* * *

ఆధునికాంధ్ర నిర్మాత విశ్వదాత. ఆయన మనల బాసిపోవడం మన దురదృష్టం. వర్ధమానంగా ఉంటున్న మన జాతి వాటినించి నిర్జీవమై పోయిం దన్నమాట నిజం.

రాష్ట్ర రాష్ట్రేతర వ్యత్యాసం లేని విశ్వదాత మన కొక అండ, ఒక భరోసా. గొప్ప ధైర్యం. మన విశ్వదాత ఉన్నాడు కదా అనే ఆ ధైర్యమే ఆంధ్ర జీవితాన్ని పునరుద్ధరించింది.

విచిత్ర పురుషుడు విశ్వదాత. ఆయన జీవితం ఆదర్శనీయం, మార్గదర్శకం. అటువంటి మహావ్యక్తి మళ్లా మన ఆంధ్రమాత కడుపున పుడతాడా!

---

# ఆత్మమూర్తి

డా॥ మాదిరాజు రంగారావు

ఎక్కడో వెతక నక్కరలేదు
ఇక్కడే ఉన్నాను.
వెళ్ళు మనసులోకి ఏకాంతంగా
ఆధారం కోరకుండా, అనుభవం వీడకుండా.
నినాదం కాదు శాసనం కాదు
శాస్త్రం కాదు పురాణం కాదు,
అన్నిటినీ అధిగమించిన వాస్తవం
ఎన్నిటినీ విలీన పరచుకున్న రూపం.
అనుభవానికీ, ఆలోచనకూ
లోతులో దొరికేనూ
ఎత్తులో అందేనూ.

అణువు నుండి అణువులోకి ప్రసరిస్తూ
క్షణం నుండి క్షణంలోకి పయనిస్తూ
బంధన నుండి స్వేచ్ఛామతినై
ఎడారిలో పచ్చని నిజమై
ఇక్కడే ఉన్నాను.
క్షణాలనుండి హాయనాలు
పరచుకొని బ్రతుకులో,
హృదయంలో స్పందించే
ప్రాణానికి పరిమాణమై
హృదయంనుండి నిర్గమించే
శబ్దానికి సంగీతమై,
నిన్నటి గ్రీష్మానికి దగ్ధమైన
అడవి నుండి ఊహా చకితంగా
నేటి వర్షానికి అంకురం వలె
ఉద్గమిస్తూ ప్రతి మనస్సులో,
ప్రతి క్షణమూ భవిష్యత్తు బారచాచి
అను క్షణమూ చావు ఎరువైన చోట,
కొసలు సాగే ఊపిరి తీవెలతో
కాలాన్ని కొలుస్తూ, ఆయుస్సు పెంచుతూ,
నేను వెళ్ళగలను శైశవంలోకి
నేను ఎగుర గలను భవిష్యత్తులోకి,
ఉండలేను అమాయకంగా
నిల్వలేను అవ్యవస్థలో.

# భా ర తి

భూమీ ఆకాశమూ
ప్రాణులూ కామనలూ
ప్రేలుతున్నాయి తలలో
ఆడుతున్నాయి ఎదలో.

ప్రపంచం మేల్కొని వున్న మనస్సుకు
ఏ క్షణాని కా క్షణమే ఒక సమస్య.
నేను కాదు బాలుణ్ణీ, చంద్రుణ్ణీ
నేను కాదు దేవతనూ, భక్తుణ్ణీ.

కాలంలో ఒక భాగంగా
పరచుకొని ఉన్న నేను,
జ్ఞానంలో ఒక అంశగా
ఆవహించి ఉన్న నేను,
అహం నుండి నిర్గమించి
క్రమించే ఆనందాన్ని.

ఉచ్ఛ్వాస నిశ్వాసాల
లయతో సాగే కాలం,
ఉదయ సాయం సంధ్యలు
రాగంతో మారే కాలం,
నా కంటి వెలుగులోని
వాస్తవికతకు దర్పణం!
దర్పణంలో బింబించే సమస్యలు
ఫణిమాలలు! మాలా ఫణులు!

ఇక్కడే ఉన్నాను నేను
స్వర్ణసత్యంలో వజ్ర సుందరంగా
ఇక్కడే ఉన్నాను నేను
బ్రతుకు నేలపై కృషి ఫలంగా,

అంతరంగ మూర్తి మస్తకం
హిమాలయం నుండి
వివేక లహరీ పదం
కన్యాకుమారి వరకు
విరిసిన కిర్మీర రూపమై
కదలే జన సందోహంలో,
ఎక్కడో వెతక నక్కరలేదు
ఇక్కడే ఉన్నాను, ఆత్మమూర్తిని!

పలుకుతూ అందరిలో
ఒకే రాగమూర్తినై,
మెదలుతూ అందరిలో
ఒకే శిల్ప రేఖనై.

# ఎంగిడు–ఋష్యశృంగ

## శ్రీ తిరుమల రామచంద్ర

ఇటీవల మెసపొటేమియా, సుమేరియా, అస్సీరియాల ప్రాచీన చరిత్రలను చదువుతున్నప్పుడు, వాటి కొన్ని కథలకు, మన భారత రామాయణాల కథలకు ఉన్న యాదృచ్ఛిక సామ్యాలనుబట్టి, మన రామాయణ భారతాలు అనేక కాలాల, అనేక జాతుల, అనేక ప్రాంతాల ప్రాగైతిహాసిక స్వరూప కథనాల సమాహారాలని నాకు ఉన్న భావం దృఢపడింది.

ప్రతి ప్రాచీన సాహిత్యమూ మొదటి గేయ రూపంలో ఉండి, తర్వాత పాఠ్యరూప మయినదన్నది వాఙ్మయ మర్మజ్ఞుల అభిప్రాయం. ప్రతి ప్రాచీన సాహిత్యమూ, కొన్ని వర్గాలతోనో, ఒక వర్గ పరంపరతోనో నీయమానమవుతూ, ఒక దశలో స్థిరపడిపోతుందని సాహిత్య తత్త్వజ్ఞుల నిర్ణయం. హోమర్ మహాకవి పేరనున్న ఇలియడ్, ఒడిస్సే అనే ఇతిహాసాల రచయిత ఒకరు కాదని, హోమర్‌దాయాలు అనబడేవారు పరంపరగా పాడేవారని, అంటే, హోమర్ వంశమువారో, హోమర్ శిష్య పరంపరవారో పాడేవారని, హోమర్ కథలోని ఒకానొక వీరుడైన నెస్టర్ వంశంవాడూ, ఏథెన్స్ పాలకుడూ అయిన పీసిస్ట్రాటోస్ కాలంలో— అంటే క్రీస్తుకు పూర్వం 8 వ శతాబ్దంలో ఆహోమర్దాయాలతోనే గ్రంథస్థం చేయబడిందని జార్జ్ థామ్సన్ అనే విమర్శకుడు తన మార్క్సిజం అండ్ పొయిట్రీ (Marxisom and Poetry) అనే గ్రంథంలో వివరించాడు. ఇలియడ్ మన అనుష్టుప్ ఛందస్సువంటి హెక్సామీటర్ అనే ఛందస్సులో గానం చేయబడింది. మొదట గేయంగా ఉన్న ఈ ఇలియడ్ గ్రంథస్థం కాగానే పాఠ్యమయింది.

ఈ సూత్రం రామాయణ విషయంలోనూ వర్తిస్తుంది; బాలకాండ చతుర్థ సర్గ చూస్తే:—

'పౌలస్త్య వధ మిత్యేవం
చకార చరిత వ్రతః
పాఠ్యే గేయే చ మధురమ్
ప్రమాణై స్త్రిభి రన్వితమ్.
జాతిభి స్సప్తభి ర్యుక్తం
తంత్రీ లయ సమన్వితమ్
రసైః శృంగార కరుణ
హాస్య రౌద్ర భయానకైః,
వీరాదిభీ రసై ర్యుక్తం
కావ్యమేత దగాయతామ్.
తౌతు గాంధర్వ తత్త్వజ్ఞౌ
స్థానమూర్ఛన కోవిదౌ

* * *

తౌ కదాచిత్ సమేతానాం
సాధూనాంచ సమాగమే
మధ్యే సభం సమీపస్థౌ
ఇదం కావ్య మగాయతామ్.

(సర్గ 4—శ్లో 7–15)

ఇది రామాయణావతరణగాథ. దీనిని వాల్మీకి శిష్యులు, పుత్రప్రాయులు అయిన కుశీలవకుశలవులు గానం చేశారని స్పష్టం. వాల్మీకి మహర్షి దీనిని పాఠ్యమనికూడ అన్నాడు గనుక, పాటగావినే వోపిక లేని మేధావుల గోష్ఠులలో ఇది పాఠ్యమయిన్నీ ఉండి ఉంటుంది; ఇప్పుడు కేవలం పాఠ్యమే అయింది. రామాయణ వస్తువుకూడ తక్కిన ప్రాచీనజాతుల ఆది కావ్యాలలాగే అతి ప్రాచీనవస్తువు; ఇది అనాదిగా జనం నోళ్లలో నలిగివస్తూ, వాల్మీకివంటి మహాకవి చేతులలో కమనీయతమరూపం పొందిందని అనుకున్నా తప్పులేదు. వాల్మీకికూడ 22 వ వ్యాసుడనే కదా మన సంప్రదాయం. కనుక వాల్మీకి సనాతనగేయ రూపంలోఉన్న రామాయణం గాథను విస్తరిం చేసి ఉండవచ్చు.

వాల్మీకి రామాయణాన్ని గాయత్రీ సంపుటీకరణం చేశాడనే వాదమూ ఉంది. ప్రపంచసాహిత్యంలో మొట్టమొదట మల్లెపూవని నేను నమ్మే ఋగ్వేదం మధుచ్ఛందుని గాయత్రీచ్ఛందస్సుతో ప్రారంభమవుతుంది—

''అగ్నిమీళే పురోహితమ్
యజ్ఞస్య దేవ మృత్విజమ్
హోతారం రత్నధాతమమ్

అని. పిదప మాధుచ్ఛంది ఋక్కుతో సమాప్తమవుతుంది. గాయనాను గుణమైంది గనుక ఈ ఛందస్సుకు గాయత్రి అని పేరు వచ్చిందేమో! ''చతుర్వింశత్యక్షరా త్రిపదా, షట్కుక్షిః'' అని గాయత్రీ లక్షణం. కాని అదేమి విచిత్రమో, మనం విశేషంగా ప్రశంసించే గాయత్రీ మంత్రం ఋక్సంహితలో కానరాదు; గోపథ బ్రాహ్మణంలోఉన్నదే నేడు ప్రచారమయింది క్రింద పేర్కొన్న రీతిగా.

''తత్సవితు ర్వరేణీయం
భర్గో దేవస్య ధీమహి
ధియో యోనః ప్రచోదయాత్''

ఈ గాయత్రి మూడు పాదాలకూ మరొక పాదం చేర్చి గానం చేసిన అనుష్టుప్ ఛందస్సు కూడ ఋక్ సంహితలో ఉంది. కాని, ఈ అనుష్టుప్ ఛందస్సుకు ఒక్కొక్క పాదంలో ఒక అక్షరం ఊనం కావడంవల్ల దాన్ని స్వరంతో పూరించుకొని పఠించడం సంప్రదాయమయింది. ఈ అక్షరోనమయిన అనుష్టుప్ ఛందస్సును వాల్మీకి ప్రమాణీకరించి, ధారాళంగా వాడుకచేసి ఉంటాడు. తన రామాయణానికి వేదసమ్మితత్వం కల్పించడానికి 24 వేల శ్లోకాలు మంత్రాక్షరాను గుణంగా చేసి, సంపుటీకరించి ఉంటాడు.

మన రామాయణంలాగే సుమేరియన్ గాథలలో గిల్గమేష్ పురాణం అద్భుతమైంది. గిల్గమేష్ క్రీస్తుకు మూడువేల సంవత్సరాల ముందున్నవాడు. ఈ గిల్గమేష్ పురాణం ఉత్పన్నమైంది పోగా మిగిలింది అస్సీరియాలో కొంత లబ్ధమయిందని విద్వాంసులు అంటున్నారు. క్రీస్తుకు పూర్వం ఆరవ శతాబ్దిలో, అంటే, బుద్ధ భగవానుని సమకాలంలో అస్సీరియాను ఏలిన అసుర్బానిపాల్ మృణ్మయఫలక గ్రంథాలయానికి చెందిన 12 మృణ్మయఫలకాల ముక్కలు లండన్ లోని బ్రిటిష్ మ్యూజియంలో ఉన్నాయి. వాటిలోని ఒక కథ రామాయణ బాలకాండ ప్రారంభంలోని ఋష్యశృంగ మహర్షి కథను పోలి ఉంది. దానిని విల్‌డ్యూరాంట్ వ్రాసిన అవర్ ఓరియంటల్ హెరిటేజ్ అనే గ్రంథం నుంచి గ్రహించింది ఉదాహరిస్తాను.

గిల్గమేష్ చక్రవర్తి దైవాంశ సంభూతుడు. ఇతనిని పరాశక్తి అయిన ఇష్టార్ ప్రేమిస్తుంది. కాని, గిల్గమేష్ సంయమంతో ఉంటాడు. గిల్గమేష్ ఇలు వేల్పు అరురు. అరురు దేశప్రజలతో పెద్ద పెద్ద పనులు చేయిస్తూ, స్త్రీ పురుషులు కలవడానికే అవకాశం ఇవ్వడు. దానితో జనాభా తగ్గిపోతుంది. పంటలు పండించేవారు లేకపోతారు. క్షామం ఏర్పడుతుంది. ఇష్టార్ అరురుతో దేశపరిస్థితి వివరించి ''గిల్గమేష్‌తో సరితూగేవాడిని పుట్టించు. వాళ్లిద్దరూ పోరాడుకుంటుంటారు. అప్పుడు ప్రజలు సంతానాభిలాషు లవుతారు. ఉత్పత్తి పెరుగుతుంది'' అంటుంది. అరురు బంకమట్టి ముద్దచేసి, ఊది, ఒక వీరుణ్ని సృష్టిస్తుంది. అతని పేరు ఎంగిడు. ఎంగిడు వరాహంవలె బలవంతుడు; సింహంవలె సదా గంభీరుడు. పక్షివలె వేగవంతుడు. అతడు అడవిలో ఉత్పాతం కలిగిస్తాడు. అతనిని బలంతో ఎదిరించడంకన్నా, సామదానాలతో పట్టుకోవాలని గిల్గమేష్ ప్రయత్నిస్తాడు. ఒక అందగత్తె అయిన ప్రీస్టెసును—దేవాలయార్చకురాలిని— పంపుతాడు. ఆమె ఎంగిడును వశపరచుకొని పిలుచుకొని రావడానికి అడవికి పోతుంది. ఆమె పోయి—అతనిని విలాసాలతో ఆకర్షించి, మభ్యపెట్టి పిలుచుకొని వస్తుంది.

"Then the priestess loosend her buckle
Unveiled her delight
For him to take his fill of her
She hung not back she took up his lust
She opened her robe that he rest up
on her

She aroused in him rapture the work
of woman
His bosum pressed aganist her
Engidu forget where he was born."
(PP. 250—252.)

ఎంగిడి నగరానికి వచ్చిన తర్వాత గిల్గిమేష్‌తో యుద్ధం చేస్తాడు. ఇద్దరూ సమబలులు గనుక మిత్రులవుతారు.

ఈ కథ రామాయణంలోని ఋష్యశృంగుని కథను తలపిస్తుందనడం నిజం. ఋష్యశృంగుడు స్త్రీ పురుషభేదం ఎరుగక ఆశ్రమంలోనే పెరిగిన వాడు. దశరథుడు అతనిని దుర్భిక్షం తొలగించడానికి పిలిపిస్తాడు. అతనిని పిలుచుకొని రావడానికి వెళ్లిన వేశ్యలు, తామూ ఋషులమేనని చెప్పుకుంటారు. ఎన్నో ప్రలోభాలతో అతనిని పిలుచుకొని వస్తారు. ఆ ఘట్టం లోని కొన్ని శ్లోకాలను ఉదాహరిస్తాను.

"ఋష్యశృంగో వనచరః
తపస్స్వాధ్యాయ సంయుతః
అనభిజ్ఞస్తు నారీణామ్
పురుషాణాం సుఖస్యచ

*　　*　　*

గణికాస్తత్ర గచ్ఛంతు
రూపవత్యః స్వలంకృతాః
ప్రలోభ్య వివిధోపాయై:
ఆనేష్యంతీ హ సత్కృతాః

*　　*　　*

తాశ్చిత్రవేషాః ప్రమదాః
గాయంత్యో మధురస్వరాః
ఋషిపుత్ర ముపాగమ్య
సర్వావచన మబ్రువన్

*　　*

అస్మాకమపి ముఖ్యాని
ఫలానీమాని మే ద్విజ
గృహాణ విప్ర భద్రంతే
భక్షయస్వచ మా చిరమ్

తతస్తాః తం సమాలింగ్య
సర్వా హర్ష సమన్వితాః
మోదకాన్ ప్రదదుః తస్మై
భక్ష్యాంశ్చ వివిధాన్ తథా

*　　*　　*

ఏహ్యాశ్రమ పదం సౌమ్య
అస్మాక మితి చాబ్రువన్
శ్రుత్వాహి వచనం తాసాం
సర్వాసాం హృదయం గమమ్,
గమనాయ మతిం చక్రే
తంచ నిన్యుః తథాస్త్రియః
(బాల. స 10. శ్లో 3-27)

ఈరెండు కథలలోనేకాక పేరిద్దరిపేర్లు - ఎంగిడు, ఋష్యశృంగ పదాలలోని పోలికనుకూడ చూడడం అవసరం. ఎంగిడు, శృంగిపదాల పోలికను, కథలోని పోలికలనుబట్టి, ఈ రెండింటికి ఆకరం ఒకటయినా కావాలి లేక, ఒక ప్రాంతంనుంచి మరొక ప్రాంతానికన్నా వ్యాపించి ఉండాలి.

రామాయణంలోని మరొక గాథకు ఈ నీడ్ లోని ఒక గాథకు పోలికలున్నాయి. వర్జిల్ ఈనీడ్‌లో చెప్పిన నేమి కథకు రామాయణం యుద్ధకాండలోని విశల్య కరణి ఆనయన గాథకు కొంత పోలికలుండడం చూస్తే మనకు సుమేరియన్ సంస్కృతికిగల సంబంధం తెలుస్తుంది.

ఇటలీలోని అరిషియా అడవులలో దియానా అనే ఒక వనం ఉంది. దానిని ఆనుకొని ఒక సరస్సు ఉంది. దియానా ఒక వనదేవత. ఈ సరస్సుపేరు నేమి సరస్సు. ఈసరస్సు సమీపాన ఒక సంజీవి వృక్షం ఉంది. ఆ వృక్షం చుట్టూ రేయింబవళ్లు విచ్చుకత్తితో కాపలాకాస్తూ తిరుగుతూంటాడు ఒక వ్యక్తి. అతని పేరు వనరాజా, నేమి మహర్షి— Priest of Nemi. అతడు ఎవరో వచ్చి తన మీద పడుతారేమో నన్నట్టు దిక్కులుచూస్తూ తిరుగుతూ ఉంటాడు. ఎవరైనా ఆ గంతుకులు వస్తే ద్వంద్వ

స్వర్ణ భారతికి శుభాకాంక్షలు!

వీనస్ కంబైన్స్
## మంచివాడు (కలర్)
నాగేశ్వరరావు, వాణిశ్రీ, కాంచన, రమాప్రభ,
సత్యనారాయణ, రాజ్‌బాబు, పద్మనాభం.
దర్శకత్వం : వి. మధుసూధనరావు
నిర్మాత : జి. గోవిందరాజన్
సంగీతం : కె. వి. మహదేవన్

అన్నపూర్ణా పిక్చర్స్
## బంగారు కలలు (కలర్)
నాగేశ్వరరావు, వహీదా రహిమాన్, లక్ష్మి,
యస్. వి. రంగారావు, కాంతారావు, రాజ్‌బాబు.
సత్యనారాయణ, అల్లు రామలింగయ్య.
దర్శకత్వం : ఆదుర్తి సుబ్బారావు
నిర్మాత : డి. మధుసూధనరావు
సంగీతం : యస్. రాజేశ్వరరావు

సురేష్ మూవీస్
## చక్రవాకం (కలర్)
శోభన్‌బాబు, వాణిశ్రీ, చంద్రకళ,
యస్. వి. రంగారావు, నాగభూషణం,
దర్శకత్వం : వి. మధుసూధనరావు
నిర్మాత : డి. రామానాయుడు
సంగీతం : కె. వి. మహదేవన్

వీనస్ మహిజా పిక్చర్స్
## యశోద కృష్ణ (కలర్)
జమున, యస్. వి. రంగారావు, గుమ్మడి, నాగయ్య,
మిక్కిలినేని, ప్రభాకరరెడ్డి, చంద్రమోహన్, మంజుల,
కృష్ణకుమారి, యస్. వరలక్ష్మి, హేమలత, శ్రీదేవి.
దర్శకత్వం : సి. యస్. రావు
నిర్మాత : సి.హెచ్. ప్రకాశరావు
సంగీతం : యస్. రాజేశ్వరరావు

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్
## ప్రొడక్షన్ నెం. 14
దర్శకత్వం : కె. పి. ఆత్మ
నిర్మాత : ఎ. వి. సుబ్బారావు

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్
## ప్రొడక్షన్ నెం. 15
దర్శకత్వం : టి. రామారావు
నిర్మాత : ఎ. వి. సుబ్బారావు

చిత్రాలయ పిక్చర్స్
## ప్రొడక్షన్ నెం. 15
చంద్రకళ, విష్ణువర్ధన్, రాజ్‌బాబు, రమాప్రభ.
దర్శకత్వం: శ్రీధర్ సంగీతం: విశ్వనాధన్

శ్రీ సారధీ స్టూడియోస్
తదుపరి చిత్రం
? ? ? ?

విజయవంతముగా ప్రదర్శింపబడుచున్న జెమిని వారి
## "కన్నవారి కలలు" (కలర్)
శోభన్‌బాబు, వాణిశ్రీ, లత, గుమ్మడి, ప్రభాకరరెడ్డి, రామకృష్ణ, గీతాంజలి.
సంగీతం: వి. కుమార్ ఛాయ : కె. హెచ్. కపాడియా నిర్మాత, దర్శకుడు : ఎస్. ఎస్. బాలన్

# నవయుగ ఫిలింస్, విజయవాడ – గుంతకల్ – సికిందరాబాద్

యుద్ధంలో ఇరిని నేమి మహర్షిని— చంపి, తానే నేమి ఋషి అవుతాడు. ఆ వన సంప్రదాయం అది. మరల ఎవరైనా వచ్చి ఆ వనరాజును చంపితే వాడే వనరాజు; ఆ చెట్టు చుట్టూ తిరగవలసిందే. ఆ విధంగా ఎవరో వచ్చి చంపేవరకు ఉన్నవాని అధికారం నిలిచి ఉంటుంది. అతడు కంటికి రెప్పలాగ కాపాడే చెట్టు బంగారుచెట్టు. ఒక్క బంగారు రెమ్మను ఎవరైనా వంచారా, వనరాజు అతనితో తలపడుతాడు. విరిచిన వాడు చస్తే, బంగారురెమ్మ అక్కడే ఉండిపోతుంది. వాడు గెలిస్తే తానే రాజైపోతాడు; చెట్టునుంచి కదలడానికి వీలులేదు. ఏరీతిగా చూచినా మృత సంజీవని అయిన బంగారుచెట్టుగాని, కొమ్మగాని, రెమ్మ గాని అక్కడినుంచి కదిలే అవకాశం లేదు; ఏ దశ లోను. ఈ కథలోని కార్యకారణభావం మనకు వద్దు. అనాదిగా వస్తున్న కథ ఇది. ఈ నీడ్‌లో ఉంది.

లక్ష్మణుడు యుద్ధంలో మూర్ఛితుడై నప్పుడు, హనుమంతుడు సంజీవని తేవడానికి పోతాడు. అక్కడ కావలా ఉన్న గంధర్వులతో యుద్ధం చేస్తాడు. ఆ చెట్టును తాకకుండా పర్వతాన్నే పెకలించుకొని వస్తాడు. అంతకుముందు మారీచ పుత్రుడైన కాలనేమి హనుమంతుని మాయచేసి, దారి తప్పింప జూస్తాడు. ఈ విశల్యకరణి ప్రస్తావనలోనే కాలనేమి ప్రసక్తి రావడంవల్ల ఈ నీడ్‌లోని Priest of Nemi-నేమి మహర్షికి, ఈ కాలనేమి వృత్తాంతానికి ఏదో సంబంధం ఉన్నట్టు తోస్తుంది. ఈ కాలనేమి వృత్తాంతం రామాయణం దక్షిణాపథ పాఠాలలో ఉంది.

కాలనేమి అసురుడు. అసురభాషలో—అస్సీరీలో కాల్ పదానికి నాయకుడు అని అర్థం. లు—గాల్= మహా నాయకుడు. మన పురాణాలలో కాలకేయ కాలయవనాది పేరా లున్నాయి. కాల్ అంటే నల్లని వాడు కాదు. యవనుల నాయకుడు కాలయవనుడు అయిఉంటాడు. నూ—బండై—గాల్=అంతఃపుర రక్షక నాయకుడు. గాల్—ఉక్కిన్=ఒక శ్రేణి నాయకుడు. గాల్—నాగర్=తక్షకశ్రేణి నాయకుడు—శ్రేష్ఠి. గాల్—శిముగ్=లోహ కార్మిక నాయకుడు. లు-గాల్—అండా= అండ మహానాయకుడు—మహారాజు. తమిళ భాషలో లాగ పాత అస్సీరీలోను వర్గానికంతా ఒకే అక్షరం గనుక కాల్, గాల్ రెండూ పర్యాయాలే. ఈ విషయాలు అస్సీరీ విద్వాంసులైన పురాతత్త్వవేత్తలు చెప్పగా విన్నాము.

పెక్కు మహాసంస్కృతులకు పుట్టినిల్లయిన ఆసియా పశ్చిమ ప్రాంతంలో పుట్టిన ఈ సుమేరియన్ గాథ అటు వర్జిల్‌కు, ఇటు వాల్మీకి మహర్షికీ పాకి ఉంటుందా? ఇటునుంచి అటు కూడ వెళ్లి ఉండ వచ్చు. ఋగ్వేదంలోని పణిసరమా సంవాదం ఇలియడ్‌కు ఆధారం కావచ్చునని మాక్స్‌ముల్లర్ ఋగ్వేదం పీఠికలో సూచించారు.

డాక్టర్ ఎస్. ఆర్. రావ్ మహెంజోదారో లిపులకు సుమేరియన్ సంస్కృతితో పొత్తు కలపడంతో, సుమేరియన్ సంస్కృతి ఎడల జిజ్ఞాస ఇప్పుడు తీవ్రంగా వ్యాపిస్తున్నది. దీనివల్ల మన సంస్కృతిలోని ఎన్నో 'వ్యాస ఘట్టాలు' చిక్కు విడిపోతాయని ఆశించవచ్చు; విశ్వసించవచ్చు.



పత్రికను, భారతిని, అమృతాంజనాన్నీ స్థాపకులు ఏ ఉద్దేశంతో నెలకొల్పారో ఆ లక్ష్యాలను దృష్టిలో పెట్టుకొని పెంపుచేయడం, వాటికి ఇంకా విస్తృతినీ, పెరుగుదలనూ సాధించడం, అది కూడా కొన్ని దశాబ్దాల పాటు మధ్య ఎటువంటి అంతరాయం లేకుండా నిర్వహించి వాటిని శాశ్వత సంస్థలుగా రూపొందించడం, రెండవది కవులనూ రచయితలనూ ప్రోత్సహించి వారిని ఇతర ఆకర్షణలకు లోను కావద్దని చెప్పి వారిలో వున్న ప్రజ్ఞా ప్రాభవాలకు ఉత్తేజం, ఉద్దీపనం కలిగించి, ఇదిగో ఇది మీరు పోవలసినదారి, యదార్థంగా విశిష్టమైన సాహిత్య నిర్మాణానికి పాటుపడండి, ప్రలోభాలకు గురియై నటించడం మానుకోండి, ఏమాత్రమైనా ప్రగతి సాధిస్తే అది తెలుగుజాతికి కలికితురాయి అని ప్రబోధించడం, ప్రతిభ ఉన్నవారిని పైకితేవడం, వారిని వేలాది పాఠకులకు పరిచయం చేయడం, సాహిత్యంలో జాతి కులమత విభేదాలకు తావులేదు. రాజకీయాలకు అంతకన్నా ప్రమేయం పనికిరాదు, రచయితలు రచయితలే మరొకరు కాకూడదని నిష్కర్షగా చెప్పడం, వారిని అలా మలచడంలో కొంతవరకు కృతకృత్యులు కావడం, అటు రాజకీయ రంగంతో కూడా కొంత సంబంధం కలవారు కాబట్టి (దేశ స్వాతంత్ర్యోద్యమంలో ఆంధ్రరాష్ట్ర, ఆంధ్రప్రదేశ్ నిర్మాణంలో ఆంధ్రపత్రిక ప్రముఖపాత్రవహించి జాతీయోద్యమాలకు అండగా నిలిచింది గనుక) రాజకీయ నాయకులు వచ్చి సమస్యలను చర్చిస్తే నిర్భయంగా నిశ్చలంగా తమ అభిప్రాయాలను చెప్పడం, దేశం ఎటు పోతోంది, ఏమిటీ అయోమయం అని అడిగే భావుకులకు మేధావులకు చల్లగా ప్రశాంతంగా నిదానంగా పరిస్థితులను విశదీకరించి మనకున్న మార్గాంతరాలు ఇవే అని తర్కబద్ధంగా విశదీకరించడం, అన్నిటికన్న ఇదిగో ఈవ్యక్తి దగ్గిరకు వెళ్లి మాట్లాడితే మేలు, కొంత ప్రయోజనముంటుంది, కొంత వెలుగును ప్రసరింప జేస్తారు. మనకు నచ్చినా నచ్చకపోయినా ఆయన చెప్పేవాటిలో కొంత అర్థం వుంటుంది. కమ్ముకున్న అయోమయత్వాన్ని పటాపంచలుచేసి అరణ్యంలోంచి బయటికి తెచ్చి మార్గం చూచుకోండని చెప్పి ఒక వెలుగుబాట చూపిస్తారు అన్న విశ్వాసం సాంఘిక, రాజకీయ, సాహిత్య రంగాలలో కృషిచేసే వారికి కలిగించి చైతన్యులను గావించడం శంభుప్రసాద్‌గారి వ్యక్తిత్వంలో గల విశేషాలలో ఎన్నదగినది.

ఏదైనా వ్యవహారం వచ్చినప్పుడు ఎంత నిష్కర్షగా, కటువుగా, కుండ బద్దలు కొట్టినట్లుగా మాట్లాడేవారో, మనిషిలో అంత సాధారణత్వం సహజ సిద్ధంగానే వుండేది. అచ్చం ఆంధ్ర ఆసామి, ఈ నెలలో పుట్టిన మనిషి, రైతుకుటుంబానికి చెందిన వ్యక్తిలా మనస్సు, మాటతీరువుండేవి. రైతుబిడ్డలంటే చాలా ఇష్టపడేవారు. పల్లెలనుంచి వచ్చిన పామరులతో ఎలా మాట్లాడటం ఏమి మాట్లాడటం, ఏరీతిలో వాళ్లకు చెప్పడం అనేవి శంభుప్రసాద్‌గారికి తెలిసినంతగా చాలా తక్కువమందికి తెలుసునేమో అని నాకు అనిపించేది. ఇప్పుడు అటువంటి వ్యక్తి, సలహాదారు, సరస సంభాషణా చతురుడు, మేధావి ఏడీ ? చిమ్మ చీకటిని చీల్చివేయగల మార్గదర్శి ఏడీ ? ఆయన కూర్చునే ఆ గదిలో ఆ దర్బారులేవీ ? చుట్టూ ప్రపంచం నుంచి వచ్చిన సుప్రసిద్ధ పత్రికలతో, పుస్తకాలతో మోయడం కష్టమైన ఎన్‌సైక్లో పేడియాలతో, డిక్షనరీలతో వాద్య విశేషాలతో మనిషి ఒక్కడుగా వున్నా ఏదో సాధనలో వున్నట్లు, కదలకపోయినా ఏమో చేస్తూ వున్న కార్యదీక్షాపరుడుగా వుండేవాడు. ఇక కవులతో రచయితలతో ఆయన జరిపే గోష్ఠులు, సంగీత జ్ఞానం గలవారితో చేసేచర్చలు, మధ్యమధ్య వచ్చే కేంద్ర రాష్ట్ర మంత్రులతో రాజకీయ నాయకులతో వారు పక్కకురండని సూచిస్తే వెళ్లి మాట్లాడి 'ఇలా చేస్తే బాగుంటుందని నా అభిప్రాయం' అని చెప్పేసి, మళ్లీ తనకు ఆప్తులైన సాహితీపరులతో సంభాషణలు కొనసాగించడం, ఆరోగ్యం బాగా

# భారతి రజతోత్సవము (శ్రీబాగ్)

## [1949, జనవరి 8]



"భారతి రజతోత్సవ" సభలో భారతి సంపాదకులు శ్రీ శివలెంక శంభుప్రసాద్‌గారు శుభసందేశములు చదువుతున్న దృశ్యం. అధ్యక్షపీఠం అలంకరించినవారు—శ్రీ వేలూరి శివరామశాస్త్రి, ఉత్సవాలను తిలకిస్తూ కుర్చీలో ఆసీనులైనవారు 'మహర్షి'—బులుసు సాంబమూర్తి పంతులుగారు, శ్రీ శంభుప్రసాద్ గారి ప్రక్కన నున్నవారు—భారతి సంపాదక వర్గంలోని శ్రీ తిరుమల వేంకట రంగాచార్యులు.

లేకున్నా ఈ దినచర్యను పాటించడం ఆయనకే సరిపోయింది. కొన్ని సందర్భాలలో నేను గమనించిందేమిటంటే ఆరోగ్యం మరీ బాగాలేక పడకవేసి ఏదో ద్రవపదార్థంతో ఆకలి తీర్చుకున్న రోజుల్లోనే మాధ్యాహ్నికం... శులం వెళ్లి కూర్చుంటే శారీరకమైన ఆ బాధ మరచిపోయి తిరిగి తమ పూర్వపు అంటారే, ఆస్థితికి వచ్చి ఉత్సాహంగా ఎన్నో కొత్త విషయాలు మాట్లాడేవారు. ఒక్కొక్కప్పుడు తీవ్రమైన చర్చలోకిదిగి పరిస్థితి ఇది అన్నట్లు చివరకు ఒకమాట చెప్పి, ఎదుటి వ్యక్తినే ఆలోచించుకోండన్నట్లు మౌనంగా వుండి మరొక వ్యాపకంలోకి మారేవారు. చుట్టూ వివిధరంగాలకు చెందిన వ్యక్తులు—ఫిలిం దర్శకులు బి. ఎన్. రెడ్డి, రచయితలు చక్రపాణి, నరసరాజు, సంగీత విద్వాంసులు సంధ్యావందనం శ్రీనివాసరావు, వారి పత్రికల మేనేజరు, ఉపసంపాదకులు, వచ్చేపోయే రాజకీయ నాయకులు, డాక్టర్లు, లాయర్లు, వణిక్ప్రముఖులు, ఎవరు కాఫీ త్రాగుతారో, ఎవరికి సిగరెట్టు కావాలో కనిపెట్టి అందరినీ ఆదరించడం, ఎవరు వెళ్లినా ఆయన ఎటువంటి ఆరోగ్యంతో వున్నా, అన్ని విషయాలు మాట్లాడి వారు సంతృప్తితో వెళ్లిపోయేట్టు చూడటం—ఇటువంటి ప్రతిభా సంపన్నుడైన వ్యక్తి ఆంధ్రులకు మద్రాసు నగ

స్వర్ణ భారతికి
డి. రామానాయుడు
శుభాకాంక్షలు.



సురేష్ మూవీస్ వారి

# 'చక్రవాకం'

[ఈస్ట్‌మన్ కలర్ చిత్రం]

తారాగణం : శోభన్‌బాబు, వాణిశ్రీ, చంద్రకళ.

నిర్మాత: డి. రామానాయుడు

దర్శకత్వం : వి. మధుసూదనరావు

# ఆధునిక చిత్రకళ

## శ్రీ పిలకా లక్ష్మీనరసింహమూర్తి

ఏంత సాం ిక రాజకీయ భావాలను, మూర్తి చిత్ర కళను, ప్రకృతి సౌందర్యము, మొదలయిన చిత్రకళ ఉపాంగాల్ని దాటిన ఒకానొక కొత్తమార్గము నేటి ల్ప చిత్రకళలకు ఏర్పడింది.

అంతో ఇంతో పురాణ శ్రవణము చేసిన భార తీయ ప్రజల దృష్టి వేరు. ఆధునిక చిత్రకారుల దృక్పథం వేరు వేష భాషల్లోను కనపడుతుందీ తే ా ఇద్దరిమధ్యను. కాని సద్భావాలు ఏ తరానికి చెందినా ఏదో ఒక విధంగా ప్రజలకు వంటపట్టడము ముఖ్యము. అవ్వైనా పదికాలాలపాటు జీవిత నౌకని నడపాలి. సుర క్షితంగా నౌకను ఒడ్డుకు చేర్చగలిగే ధన్యత సుకృతము లలిత కళలకు పట్టాలి. ప్రజలుచూచి ఆనందించే బొమ్మలు ధ్రువతారలా శాశ్వతంగా ప్రజ్వరిల్లాలి.

స్థూలంగాచూస్తే చిత్రకళలో మూడు తర గతుల వాళ్లున్నారు. వాళ్లు పూర్వులు ఆధునికులు. మళ్లీ ఆధునికుల్లో అతివాద మితవాదులున్నారు. ఈ మూడు తరగతుల వాళ్లకు శిల్ప చిత్రకళల పట్ల ఎంతైనా బాధ్యత ఉంది. అది సార్వకాలికమని ఒక తరం గతించకుండా ఇంకో తరం స్వీకరించాల్సిన గురుతర బాధ్యత అని వనీనుబ గ్రహించాలి. అప్పుడే ప్రగాఢ గురుశిష్య సంబంధము ఏర్పడి రచనా పద్ధ తులు సమసిపోవు.

అది అలా ఉండగా లలితకళల అభ్యున్నతిని కోరేవాళ్లు మడికట్టుకు కూర్చోవడం తగదని ఆధు నికులు అంటారు. మార్పు లేకుండా మార్పును నిరో ధిస్తూండడము సంస్కృతీ సంబంధమైన ప్రవాస మని వాళ్ల అభిప్రాయము. అంటే సంస్కృతీపరంగా వివిధ దేశాలమధ్య నూతన భావాల్ని ఇచ్చిపుచ్చుకోవడం అవసరమని వారి ఉద్బోధం. బాగుంది. ఆ విషయాల పట్ల ప్రపంచ చిత్రకారులెవరు విముఖత చూపనక్కర లేదు. కాని చిత్రములు శిల్పములు తయారు చేసేపుడే ఎటొచ్చి దేశకాల భేదాలనుబట్టి మార్పులు వస్తూం టాయి. ఆ మార్పులు సంప్రదాయాల్ని తోసి రాజన కుండా ఉంటే అంత బాధలేదు. పూర్తిగా విడగొట్టు కున్న మార్పులు ప్రజా బాహుళ్యానికి అర్థం కావు. ఆ విధంగా ఆధునిక శిల్పచిత్రకళల్లో గట్టిచిక్కు వచ్చిపడింది. అర్థంకాని బొమ్మలు ఆరంభమైనాయి. అలాంటి వాళ్లలో యుగకర్త అనిపించుకున్న ఘనుడికే తాను ధనికవర్గం వినోదంకోసం బొమ్మలువేస్తూ కాలం వెళ్లబుచ్చాననే తపన పట్టుకుంది. ఆ బాధమ ఆయన లోకానికి వెళ్లబుచ్చాడు. అందుకు ప్రపంచ చిత్రకారులు ఆశ్చర్యపడ్డారు. అయినా లోకము గుడ్డిదే అనిపించుకుంది. అయినప్పటికి ప్రజలు గుడికివెళ్లే వేట పోతులని విద్యాధికులు అనుకుంటే మాత్రం పొరబాటు పడ్డవాళ్లు అవుతారు.

మనదేశంలో అధ్యయనం చేసిన వాళ్లకు భగీ రథ తపస్సువల్ల గంగావతరణంచేసి భారతీయ చిత్ర కళలో భస్మరాసుల్ని తడిపిన మహాపురుషు డెవరని జిజ్ఞాస కలుగుతుంది. భారతీయుల్లో ఇప్పటి వాళ్లలో పోని హిమవత్పర్వత శిఖర సందర్శనంచేసిన చిత్రకారు లెందరు. ఆ మాటకువస్తే గౌరీశంకర శిఖర సంద ర్శనం చేయని భారతీయుడు భారతీయుడేకాడు.

నేటి చిత్రకళ జాతీయమో అంతర్జాతీయమో ఆయాదేశ చిత్రకళా వీధుల్లోకి తొంగిచూచినపుడు చిత్రవిచిత్రమయిన భావశబలతలు ద్రష్ట మనః ఫలకంమీద ప్రతిఫలిస్తాయి. అనేక జ్ఞాపకాలు వస్తాయి. చిత్రకారుల తపన అర్థం చేసుకో గలిగిన వాళ్లకు కళ్లు చెమ్మగిలుతాయి. శిల్ప చిత్ర కళల్లో భావాంబర వీధికేసిచూస్తే మంచి చెడు ఉంది. ఏ భావాన్నయినా కావ్యవస్తువుగా తీసుకుని చిత్రించవచ్చుననుకుంటే ఆయా భావాలకు ఉదాత్తత తీసుకురాగలగాలి. అప్పుడే ఆ శిల్పి రసాత్మకమైన అపరబ్రహ్మ అనిపించు కుంటాడు. కాని ఇప్పటి శిల్పాలు చిత్రాలు అశ్లీలము

అమంగళకరము జుగుప్స కలిగిస్తున్నాయి. దానికి కారణము లలితకళలు జీవితానికి దూరం కావడము ఒకటి. రెండవది బంగారానికి గీటురాయి ఎలాంటిదో లలిత కళలకు నిత్యజీవితము గీటురాయివంటిది కావడము విస్పష్టము.

ఏ కాలంలోను గొప్ప శిల్పాలు చిత్రాలు పురావస్తు ప్రదర్శన శాలలకోసము గాలరీలకోసము ఎవరు తయారు చెయ్యరు. చిత్రకారులు గతించాకనో వాళ్ల గౌరవార్థంగానో కొన్నిటిని గాలరీల్లో భద్రపరిచారన్నది వేరే విషయము. పూర్వయుగంలో శిల్పచిత్ర కళల్ని ప్రభువులు ప్రజలు గౌరవించారు. వాటిని వారి ఇళ్లలో పదిలంగా దాచుకున్నారు. చిరకాలం పూజించుకున్నారు. ఆయా రకమైన కళాసంపద యావత్తు ఆయాదేశ ప్రజలకు తరతరాలుగా వంశపారం పర్యంగా సంక్రమించిన ఆస్తి వంటిదైంది.

ఇపుడు మనం ఉన్నది ప్రజాయుగము. నవీన యుగంలో ప్రతిదేశంలోను ఆర్టు గాలరీలకే ప్రాముఖ్యం ఉంది. కాని ఆ గేలరీలుకూడా ఇంకోరకం జ్యూలల్లే తయారై పోకూడదు. అలాంటి ప్రమాదం అర్థంకాని చిత్రకళతో సంభవించవచ్చు.

మరో ముఖ్యవిషయం ఏమిటంటే వివిధదేశాలు పాపం అంతర్జాతీయతకోసం ఎంత ఎగబాకినా విదేశీయుల కోసమని ఏ చిత్రకారుడు బొమ్మలు వేయడు. అలా వెయ్యడం అసహజము కూడాను. కనుక వివిధ దేశాల్లో ఘనులు పేరు ప్రతిష్ఠలు సంపాదిస్తే ఆ వివరాలు తెలుసుకోడం మంచిదే. ఎందువల్లనంటే అచ్చుయంత్రము, త్వరిత గమనమువల్ల, దేశదేశాల ప్రజలు సన్నిహితౌతున్నారు. అయినప్పటికి హృద్గతం కాని వాటిని సమారాధన చేయలేని భావాల్ని, ఎవరి నెత్తిని ఎవరు రుద్దడానికి ప్రయత్నించకూడదు. బలాత్కారంవల్ల ఆయా భావాలు ఆస్వాదయోగ్యం కావు సరికదా వాటిని కాలక్రమేణ ప్రజలు పరిహరించడం జరుగుతుంది. కనుకనే లలిత కళల్లో సుస్థిరమైన జాతీయతపై నిలబడి అంతర్జాతీయతకు ఆశించాలి.


తెలుగుజాతి సాహిత్యజ్యోతి "భారతి"
అర్థశత సంవత్సరోత్సవ సందర్భంగా
హార్దికమైన అభినందనలు !!



నవోదయ పబ్లిషర్స్

ఈ నాటి రూపరహిత చిత్రకళయందలి గుణ గణాలను పరిశీలించడం అవసరము. ఈ చిత్రకళలో పుష్కలంగా రంగులగారడి ఉంది. ఆ రంగుల వెనుక కొంచెవేగము శక్తి ఉన్నాయి. భావము శూన్యము. శూన్యమంటే—

ఇదమిద్ధమని నిర్ణయించ లేనిదేదో ఉంది. ఈ రకమైన చిత్రకళను శూన్య చిత్రకళ అని, లేక విచిత్ర చిత్రకళఅని, కొంత శక్తి వేగము ఉన్నాయి కనుక మైరావణి చిత్రకళఅని, నామకరణం చెయ్యవచ్చును. పై పేర్లు వాడుకకోసం అనుకుంటున్నాం కనుక వాటిని ఎవరు అపార్థం చేసుకోకూడదు.

మత సాంఘిక చారిత్రక భావములు తద్గత రూపములుకాక ఏదో విచిత్ర స్ఫురణ మాత్రమే కలిగిన శిల్ప చిత్రములే నేడు ప్రపంచం అంతటా తాండవిస్తున్నాయి. విదేశాల్లో వాటి ఎడల ఆ దేశాల ప్రజలు గౌరవాదరాలు చూపిస్తున్నట్లు కనిపిస్తుంది. కాని మనదేశంలోనే వీటి విషయమై ప్రజలకు బాగా విముఖత ఉంది. ప్రజలువచ్చి చిత్రకళా ప్రదర్శనాలు చూడరు. ఈ పరిస్థితిని సరిదిద్దడానికి పత్రికలు బాగా తోడ్పడాలి. నిజానికి ఉజ్వలమైన మనదేశ చరిత్ర, మహాత్ముడు స్వతంత్రంకోసం జరిపిన శాంతియుత పోరాటం మొదలైన భావాల్ని మన చిత్రకారులు ముమ్మరంగా చిత్రించలేదు. ప్రజలు నిత్యం కోరుకునే రూపచిత్రణ లేదు. సాంఘిక భావాలు పూర్తిగా సమసిపోయాయి. దేశంలోని వనరామణీయకత్వము ప్రకృతి సౌందర్యము బొమ్మల్లో ఎక్కడ కనిపించదు. ఇది ఇప్పటి శిల్పకళల అయోమయ స్థితి అనంటె అతిశయోక్తికాదు.

మా చిన్నతనంలో పిల్లల్ని పెద్దలు కోతి వెధవలని మందలించేవారు. అలాంటి అల్లరి పిల్లలే పెరిగి పెద్దవాళ్లయి శిల్పచిత్ర కళలు చేపట్టి నాలుగైదు దశాబ్దులు పనిచేసి ఘనులనిపించుకున్న వాళ్లు మన దేశంలోను ఉన్నారు. వివిధ దేశాల చరిత్ర తిరగేస్తే ఆ దేశాల్లోను తగుల్తారు. స్థూలంగా నేటి చిత్రకళారంగం చూస్తే కొందరు పాషాణపాక ప్రభువులు చిట్టం కట్టిన బొమ్మలు వేస్తారు. వాళ్లు రాళ్లు తిని జీర్ణం చేసుకుని అలాంటి బొమ్మలు వేస్తున్నారా అని బొమ్మల్ని తరిచిన కొద్ది భయం వేస్తుంది. తిరుగుబాటు వాళ్ల బొమ్మల్లో పుష్కలంగా ఉంది. పోనీ ఆ బొమ్మలు ప్రజల నైతిక పారమార్థిక దృష్టికి ఏమైనా తోడ్పడుతున్నాయో అంటె అలాంటిదేమి కనపడదు. సుస్థిర మానసిక శాంతికి తోడ్పడుతున్నాయా అంటే జవాబు లేదు. శుద్ధ భౌతిక వాదం తప్ప ఏం లేదు.

మనవాళ్లు దాదాపు పాతిక ముప్పై ఏళ్ల క్రితము వైదికమంత్రాల మహిమ పోలేదని బొమ్మల ద్వారా లోకానికి చాటారు. భారతి పాతప్రతులు తిరగేస్తే ఆ నాటి చక్కని చిత్రాలు కొన్ని కనిపిస్తాయి. ఆ విధంగా భారతి చిత్రకళకు చేసిన సేవ చిరస్మరణీయము.

ఇప్పటి యువకుల్లో పేరున్నవారిని మీా రెవరు బాబూ అని ప్రశ్నిస్తే తాను చిత్రకళలో శూన్యవాదిని, ధనికుల ఎత్తుబిడ్డనని, అంటే అనవచ్చు. నమ్మికకోసం అతను కరువుకాటకం బొమ్మల్లో వేసి చూపవచ్చు. ఏది లేకుండా బొమ్మల్లో గారడి చేసి అన్ని ఉన్నాయనవచ్చు. అస్థిపంజరాలచేత నృత్యం చేయించవచ్చు. ఎటు చూచినా ఆధునిక చిత్రకళ మంచిచెడ్డలతో మిళితమై అగమ్యగోచరంగా ఉంది. ద్రష్టకు దూరదూరాంచలాల మసులుతోంది. ప్రజలకు సమీాపవర్తిని కాదు.

చిత్రకళా సంస్థలు విదేశాల్లో ఎక్కువ. మన దేశంలో చాలా తక్కువ. చిత్రకారులు ముఠాలు ముఠాలుగా తిరుగుతూ జయమో అపజయమో పొందుతూ గిల్లికజ్జాలు పెట్టుకుని సంస్థలు లేవదీస్తూ వాళ్లల్లో వాళ్లు కీచులాడుకుంటూ ఉంటారు. ఇవన్ని చూస్తుంటే కోతులు మధువనాలు జ్ఞాపకానికి వస్తాయి. కల్పవృక్ష ఛాయలు కామధేనువును పిదికిన సర్వసంపదలు కలిగినప్పుడు భారతీయ చిత్రకళ మళ్లి సువర్ణయుగ స్థాపన చేస్తుందని ఆశాభావం అంకురిస్తుంది.

కొన్ని సంవత్సరాల క్రితము మద్రాసులో దూరప్రాచ్యదేశ ఆధునిక చిత్రకళా ప్రదర్శనం చూడ్డం జరిగింది. అదంతా పూర్తిగా ఎబ్స్ట్రాక్టు చిత్రకళ. ఆ చిత్రలో దూరప్రాచ్యదేశ సంప్రదాయాలు ఏమీా

లేవు. జాతీయత అనలే లేదు. విశేషించి పోనీ ఆదేశం ప్రజల ఇప్పటి అభిరుచులైనా ఉన్నాయా అని పరిశీలించాను. ఏమీ లేదు. ఆశ్చర్యచకితుడనైనాను, ఆ బొమ్మల్ని ఏ పాశ్చాత్య దేశానికో చెందినవని ఎందుకు అనకూడదు. అందరికి బోధపడాలనడం దౌర్జన్యం అనిపించుకుంటుంది. నిజమే. కాని వెయ్యి మందిలో ఎందరికి నచ్చాయి ఆ బొమ్మలు. వెయ్యి సంఖ్య లోంచి సున్నల్ని మినహాయిస్తే ఒకటి మిగిలినట్లు ఎవరికో ఒకరిద్దరికే మాత్రం బోధపడుతుందంటే అది మాత్రం దౌర్జన్యం కాదా.

ఎబ్స్ట్రాక్టు బొమ్మల్లో కొన్నిటిని ఏరి విదేశాల్లో పిచ్చి ఆసుపత్రులలో ప్రదర్శిస్తే మానసికంగా పిచ్చివాళ్లకు కొంత మనస్వాస్థ్యం కలిగిందని ఆ మధ్య చదివాను. బొత్తిగా అర్థం కాకపోవడంకంటే అది మంచిదే అనిపించింది. ఆ బొమ్మలు కూడా ఒక ప్రయోజనాన్ని సాధించిన విషయం రూఢి అయింది. ఆ విధంగా మన పిచ్చిఆసుపత్రుల్లో కూడా మన వాళ్ల బొమ్మలు కొనిపెట్టడం చాలా అవసరము.

వీధి గుమ్మంలో కళ్లాపు చల్లి సుందరతరమైన రంగవల్లులు ముగ్గులు పెట్టడం ఇప్పటికి మన సంప్రదాయంలో ఉంది. పిచ్చిముగ్గులు వెయ్యవద్దని చిన్నపిల్లల్ని తల్లులు కూకలేస్తూ ఉంటారు. అల్లాగే చిత్రకారుల్ని పిచ్చిపిచ్చి బొమ్మలు వెయ్యకండర్రా అని మా చిన్నతనంలో గురువులు అంటూ ఉండేవారు. వాళ్ల మాట కాదని ముందుకు వెళ్లిన వాళ్లెంత ముందుకు వెళ్లారో ప్రజలు తెలుసుకుందుకు ప్రయత్నించాలి. ఎటు చూచినా ఇప్పటి చిత్రకళ ఇంద్రజాలంలా కనిపిస్తోంది. గారడీలు, సర్కాసులు, కత్తిసాములు, మొగ్గలు, పాముల్ని మింగి సజీవంగా వాటిని బైటికి తేవడంవంటి అద్భుత చర్యలు వీళ్ల చిత్రరచనా పద్ధతుల్లో స్పష్టంగా కనిపిస్తాయి. పోని ఇటు ప్రజల్ని చూద్దాం అంటే ఏ దేశ మత సాంఘిక రాజకీయ వ్యవస్థలు ఆదేశానికి ఉన్నాయి. అలాగే పునాదులువేసి కట్టుదిట్టంగా కట్టిన మత వ్యవహారాలు, వాటి ప్రచారాలు ఉన్నాయి, పైగా వీటికి తోడు యంత్రయుగ పదఘట్టనలు విజ్ఞాన పరిధులు నానాటికి పెరిగిపోతున్నాయి. ఆ విధంగా విదేశాల్లో శిల్పచిత్రకళలు గబగబా మారాయి. ఆ మార్పుల్ని అర్థం చేసుకునో, చేసుకోకనో మన దేశంలోని ఇప్పటి చిత్రకళ పెరగాలంటే మరి మన ప్రజలు వెనకపడిపోయారు. లలితకళలకు వాళ్లు కూడా ముఖ్యమయిన భాగస్వాములు. కనుక బొమ్మలు అర్థంకాక బాధపడతారు. ప్రపంచ చిత్రకళారంగం పరిశీలిస్తే ఒక్కొక్క యుగంలో ప్రజలు ముందు లలితకళలు వెనుక. లేక లలితకళలు ముందు ప్రజలు వెనుకలాంటి ముందువెనుకలు కనిపిస్తాయి. ఆ విధంగా ప్రజలకు లలితకళలకు అవినాభావ సంబంధం ఉందని ఇప్పటి చిత్రకారులు గ్రహించి పనిచేయాలి.

మరో ముఖ్యవిషయం ఏమిటంటే విదేశాల్లో అబ్స్ట్రాక్టు యుగంలో ప్రవేశించడానికి ముందు శిల్పచిత్రకళల ఉపాంగాల్లో ఆదేశాల చిత్రకారులు ఘనమైన కృషి చేశారు. మన దేశంలో, అల్లా జరగలేదు. రవివర్మయుగం దాటి వంగీయులు వేసిన దేశీయ రచనా మార్గాల్లో కొంత మంచి కృషి జరిగింది. అంతే. మిగతా ఉపాంగాల్లో సరియైన కృషి చేయకుండానే గభీలున అబ్స్ట్రాక్టు యుగంలోకి ఇప్పటి మన దేశ చిత్రకారులు దూకారు. ఈ పరిస్థితి చూస్తే మన వేళ్లతోనే మన కళ్లు పొడుచుకుంటున్నామేమో అని చిత్రకారులు నిదానంగా ఆలోచించాలి. అంతేకాకుండా మన వాళ్లు ఒకే పరుగు. పరుగుతప్ప మార్పుపేరిట బొమ్మల్లో ఏమీ కనిపించదు.

ఉపయోగకరమైన సరికొత్త గ్రంథములు

వ్యవసాయము— పిషరీ— కోళ్ల పెంపకము— అడవులు— తోటపని— యింజనీరింగ్ —వైద్యము— వివిధ సాంకేతిక విషయములపై గ్రంథములు గలవు. కేటలాగు ఉచితము. ఇంగ్లీషులో వ్రాయండి.

N. K. PAUL & SONS,
P. B. No. 12202, Calcutta—5.

ఎబ్స్ట్రాక్టు చిత్రకళలో మనిషికి రెండు కాళ్ళు రెండు చేతులు ఉండవు. కళ్లు ముక్కు చెవులు ఉండవలసిన చోట ఉండవు. శరీరంమీద రాతితలఉన్న మనుష్యులవుపడతారు. ఇప్పటి మానవ జీవితంలో మనిషి ఇలా ఉంటాడు అని ఆ—బొమ్మల సూచన ఉద్బోధ అయి ఉండాలి. రావణాసురుణ్ణి అర్థం చేసుకున్న భారతీయ ప్రజలకు ఈవింత మనుష్యులెవరో తెలియడం లేదు. గిరగిర తిరుగుతున్న లలితకళా చక్రం ప్రస్తుతము తలక్రిందైతే మళ్లి క్రిందుమీదవుతుందని ఓపికపట్టాలి.

మళ్లి కొత్తదనం రావాలంటే లలితకళా రాధకులు ప్రకృతి మాతనే ఉపాసించాలి. కొత్త రుచులు కొత్తవెలుగులు చూడాలంటే ఆ జగజ్జనని పాదాల ముందు ఇప్పటి వాళ్లు మోకరిల్లాలి. మనం ఉన్నది ప్రజాయుగం గనుక, ప్రజల ధనాన్ని దుర్వినియోగం చేయకుండా, అటు ప్రజాదరణను పుష్కలంగా చిత్రకారులకు సంపాదిస్తూ, ఇటు ప్రజారంజకమైన శిల్ప చిత్రకళలు వర్ధిల్లడానికి చిత్రకారులు నడుంకట్టి పని చేయడానికి లలితకళా అకాడమీలు పనిచేయాలి.

ఏ యుగంలో చూచినా శిల్ప చిత్ర కళలకు స్త్రీ మూర్తి సర్వాంగ సుందరమైన అధిష్ఠాన దేవత. ఆ విధంగా స్త్రీ ప్రతియుగంలోను లలితకళకు పుష్టిని అమిత గౌరవాన్ని చేకూర్చింది. అందుచేత శృంగారమును, చతుర్విధ పురుషార్థాల్లో తృతీయ పురుషార్థాన్ని చిత్రకారులు అనుచితంగా బొమ్మల్లో చిత్రించకూడదు.

పద్నాలుగో శతాబ్దికి చెందిన దక్షిణదేశ కుడ్య చిత్రాల్లో శృంగారాన్ని ఆనాటి చిత్రకారులు పచ్చి పచ్చిగా చిత్రించారు. వేస్తేవేశారు కాని ఎప్పుడో దేవాలయాలు సందర్శిస్తేనే కాని కనపడని మిథున శిల్పాలు చిత్రాలు నిత్య సందర్శనానికి ఏర్పడినవి కావు. వ్యాపార సరళికి దిగకుండా లలితకళల్లో శృంగారమును ఉచిత రీతినే ప్రదర్శించాలి. హద్దుమీరి ఇప్పటివాళ్లు దాన్ని రసాభాసం చేయకూడదు.

ఎబ్స్ట్రాక్టు చిత్రకారులు ఆకారాన్నే తీసుకోనప్పుడు శృంగార రసాన్ని ఎలా చిత్రిస్తారు. రూపం ఉంటేనే సభారంజకత్వం ఉండాలి అన్న మాట శిలాక్షరం అయింది.

మళ్లి లలితకళలు వేరు. హస్తకళలు వేరు. శిల్ప చిత్రకళల్లో పనిచేస్తున్న నవీనులు వాటిలో సాధించలేని పరిణతిని హస్తకళను జీవనాధారంగా చేసుకుని ఏమి సాధిస్తారు. నేటి చిత్రకారులు పై వివరాలు తెలుసుకుని మరి హస్తకళల్లోకి దిగాలి.

ఏది ఎలా ఉన్నా ప్రజలు ప్రజలే. ప్రజల్ని ఎవరు ఎంతోకాలం కళ్లు కప్పలేరు. వాళ్లకు కావలసిందేదో వాళ్లు జాగర్త పెట్టుకుంటూపోతారు. వాళ్ల చేతుల్లోనే లలితకళలు పచ్చగా పెరిగి అభ్యున్నతికి వస్తాయి. మిగతావి మఖకు పుట్టి పుబ్బకు రాలిపోతాయని వాళ్లెరుగుదురు. దేశ కాలాల్ని పరిశీలిస్తూ శిల్పులు చిత్రకారులే జాగర్తగా పని చేయాలి.

(ఈ వ్యాసంలోని అభిప్రాయాలు రచయిత యొక్క వే—సం.)

# స్వర్ణోత్సవ 'భారతి'కి మా శుభాకాంక్షలు




# కమర్షియల్ గూడ్స్ ట్రాన్స్‌పోర్ట్సు

**హెడ్ ఆఫీసు :**

కొత్తపేట పోస్టు బాక్సు నెం. 89

గుంటూరు, 522001

ఫోన్ : 20560

**అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసు :**

107, తంబుచెట్టి వీధి,

పి. బి. నెం. 1254. మద్రాసు 600001

ఫోన్సు : 24485 — 25748



## —: మా బ్రాంచీలు :—

ఆదోని
అమలాపురం
అనకాపల్లి
బెంగుళూరు —73785
భీమవరం
బొంబాయి —338837
చీరాల
చిత్తూర్
చిత్తూర్ (టావ్‌కో సి & ఎఫ్)
కడప
ఏలూరు
గుడివాడ
గుంటూరు
గుంటూరు-ట్రాన్‌షిప్‌మెంట్ యార్డ్
గుంటూరు ( హెచ్. ఒ.)
హైదరాబాదు —41904
కాకినాడ
కరీంనగర్
కావలి
కర్నూల్
మద్రాస్ (మెయిన్ ఆఫీస్)
మద్రాస్ ( బుకింగ్ )
మద్రాస్ ( డెలివరీ )
మద్రాస్ ట్రాన్‌షిప్‌మెంట్ యార్డ్
మద్రాస్ (మవుంట్ రోడ్ )
మద్రాస్ (వాల్‌టాక్స్ రోడ్ ).
మద్రాస్ (అంబత్తూర్ )
మచిలీపట్నం
నంద్యాల
నెల్లూరు
నిజామాబాద్
ఒంగోలు
పాలకొల్లు
ప్రొద్దుటూరు
రాజమండ్రి — 526
సేలం
సికిందరాబాదు —73591
సూర్యాపేట
శ్రీకాకుళం
తాడేపల్లిగూడెం
తణుకు
తెనాలి
థాన ( బాంబే )
తిరుపతి
తుని
విజయవాడ—1—75179
విజయవాడ—2—77250 (గవర్నర్‌పేట)
విజయవాడ—3 (ఇండస్ట్రియల్ ఏరియా)
విశాఖపట్టణం —3269
విజయనగరం —366
వరంగల్

# సంజ్ఞా తర్కము

## డా॥ విశ్వనాథ అరుణాచలం

### సంజ్ఞాతర్కము— పుట్టుపూర్వోత్తరాలు

'గణితము పరస్పర సంగతములైన స్వీకృతాలనుంచి తప్పనిసరిగా ఉత్పన్నమయ్యే ఫలితాల సమగ్ర చర్చ' అని బెర్ట్రాండ్ రస్సెల్ (1872—1970) చక్కగా నిర్వచించినాడు. సాధారణంగా ఏ గణిత శాఖలోనైనా కొన్ని స్వీకృతాలతో ప్రారంభించి తార్కికంగా సిద్ధాంతాలను అన్వేషించడం మనం తరచూ చూస్తుంటాము. ఇట్లా ఉత్పన్నమయిన స్వీకృతాలను సిద్ధాంతాలను సమ్మిళితం చేసి ఫలానా గణితశాస్త్ర విభాగమని సార్థక నామకరణం చేస్తాము.

గణితశాస్త్ర వికాసానికి ముఖ్యంగా కావలసిన పరికరాలలో తర్కం ఒకటి. 'గణితం శాస్త్రభాష' అని విజ్ఞులు అన్నారు. శాస్త్రభాష ఖచ్చితమైన అర్థాలను ప్రతిపాదించవలె. కాబట్టి తద్రూపమైన గణితంలో సంశయాలకు ఆస్పదమైన వాక్య నిర్మాణములుండకూడదు. అందువల్లనే గణితంలో మనం ఏకైక అర్థాన్ని ప్రతిపాదించే సంజ్ఞలను కోకొల్లలుగా వాడి సంశయాస్పద గుణమును తొలగిస్తాము. గణిత వికాసానికి సహకరించే తర్కం కూడా అందువల్లే సంజ్ఞాత్మకంగా విలసిల్లుతూ ఉంది.

గణిత శాస్త్రాచార్యులలో ప్రఖ్యాతికొన్న లైబ్నిజ్ (1646—1716) విశ్వజనీనమైన ఒక శాస్త్ర భాష స్థిరపడవలెనన్న ఎంతో కృషిచేసి క్రీ. శ. 1666 లో De arte Combinatoria అనే గ్రంథాన్ని ప్రచురించినాడు. గణిత సిద్ధాంతాలను నిరూపించటంలో అనవసరము, సంశ్లిష్టమూ అయిన వాక్య నిర్మాణాలను నిషేధించి, క్లుప్తంగా కావలసిన సంజ్ఞలను ప్రవేశపెట్టి చక్కని చిక్కని ఉపపత్తుల కోసం విసుగు విరామం లేకుండా శ్రమించినాడు లైబ్నిజ్. ఇతని కృషిలో సంజ్ఞాత్మక తర్కానికి అంకురార్పణ జరిగిందని నిస్సంశయంగా చెప్పవచ్చు. తరవాత దాదాపు రెండు వందల సంవత్సరాలు, తర్కశాస్త్రాన్ని గణితం దృష్ట్యా ప్రాముఖ్యంలోకి తేవలెననే ప్రయత్నాలు జరిగినట్లుగా మనకు తెలియడం లేదు. గణిత పరిశోధనా ప్రపంచంలో, జార్జి బూల్ (George Boole, 1815—1864) అడుగు పెట్టిననాడు మళ్లీ, శుష్కించిపోయిన సంజ్ఞాత్మక తర్కం వికసించడం ప్రారంభించింది. మౌలికమైన వ్యాసాలు వ్రాసి శాస్త్ర ప్రపంచ దృష్టిని సంజ్ఞాతర్కంవైపు త్రిప్పినాడు బూల్. బూల్‌కు సంపూర్ణ సహకారాన్నిచ్చి, ఈ కృషిలో పాల్గొన్న ఇంకొక మహనీయుడు, అగస్టన్ డీ మార్గన్ (Augustus De' Morgan, 1806—1871) వీరి తరవాత అమెరికాలో, జర్మనీలో, ఇటలీలో కొందరు గణితజ్ఞులు, తాత్త్వికులు, తర్కశాస్త్రాన్ని గణితాత్మకంగా పెంపొందించినారు.

సంజ్ఞాతర్కాన్ని, అభినవ దృక్పథంలో బాగా వికసింప చేసిన ఖ్యాతి, జర్మనీ దేశస్థుడైన గట్లాబ్ ఫ్రేగే (Gottlob Fre'ge, 1848—1925) కు సంక్రమిస్తుంది. గణితశాస్త్రంలో అక్కడక్కడా దొసగులు ఉన్నాయని గుర్తించి, వాటిని పోగొట్టి గణిత శాస్త్రాన్ని గట్టి పునాదుల మీద నిల్పవలెననే మహదాశయంతో ఫ్రేగే కృషి చేసినాడు. బూల్, డీమార్గన్‌ల కృషులు ఏ విధంగా పరస్పర సహకారంతో వర్ధిల్లినాయో, అట్లాగే ఫ్రేగే, గైసెప్పె పీనో (Giuseppe Peano, 1858—1932) కృషులు పరస్పర సహకారంతో వర్ధిల్లి ఆధునికతను పుంజుకొన్నాయి.

అట్లాగే బెర్ట్రాండ్ రస్సెల్, ఆచార్య వైట్ హెడ్ (Prof A. N. Whitehead 1861–1947)లు కలిసి తర్కశాస్త్రానికి విశిష్ట స్థానాన్ని కల్పించినారు. గణితశాస్త్రం, తర్కంలో ఒక భాగమే అని ఉద్ఘాటించినారు. 1910—13 ల మధ్య Principia Mathematica అనే మూడు భాగాల తార్కిక బృహద్గ్రంథాన్ని రచించినారు. నేడు అది విశ్వవిఖ్యాతి పొందిఉన్న సంగతి గణితజ్ఞులందరూ ఎరిగినదే. 1934—39 మధ్యకాలంలో మళ్లీ ఇంకో జంట రచయితలు బయలుదేరినారు. వీరు: డేవిడ్ హిల్‌బర్ట్ (David Hilbert, 1862–1943), పాల్‌బార్నేస్ (Paul Bernays) లు ఒక్కొక్క బట్టు ఒక్కొక్క విశిష్ట దృక్పథంతో తర్కశాస్త్రాన్ని పెంపొందించినప్పటికీ ప్రపంచం మొత్తంమీద స్థూలంగా అందరూ రస్సెల్, వైట్‌హెడ్ల పంథానే అనుసరిస్తున్నారు. ఈ ఈ సంజ్ఞా తర్కాన్ని రేఖామాత్రంగా ఈ వ్యాసంలో చర్చిస్తాము.

## ప్రాథమిక నిర్వచనాలు

ప్రతిపాదన : నిజా నిజాలను సూటిగా తెల్పే అర్థవంతమైన పదబంధము. ప్రతిపాదనకు ఉదాహరణలు :

| | | |
|---|---|---|
| (1) | హిమాలయాలు పర్వతములు | (నిజము) |
| (2) | 10 సరిసంఖ్య | (నిజము) |
| (3) | 21 వర్గ సంఖ్య | (అనిజము) |
| (4) | అరవిందుడు తత్త్వవేత్త | (నిజము) |
| (5) | తిక్కన హిందీకవి | (అనిజము) |

సాధారణంగా ప్రతిపాదనలను p, q, r.. సంజ్ఞలతో సూచిస్తాము. ఒకటికంటే ఎక్కువైన ప్రతిపాదనలను కలిపి కొత్త ప్రతిపాదనలను ఉత్పన్నం చేస్తాము. పై ఉదాహరణలలో ప్రతిపాదనలు (1), (2) లను కలిపితే

(i) 'హిమాలయాలు పర్వతములు, 10 సరి సంఖ్య' అనే కొత్త ప్రకటన లభిస్తుంది.

ఇంకో విధంగా కలిపి

(ii) 'హిమాలయాలు పర్వతాలు లేదా 10 సరిసంఖ్య' అని వ్రాయవచ్చు.

ఇంకా, (iii) 'హిమాలయాలు పర్వతాలైతే, అప్పుడు 10 సరి సంఖ్య'.

(iv) 'హిమాలయాలు పర్వతాలయి, అయినప్పుడే 10 సరి సంఖ్య' ఇవే గాకుండా

(v) 'హిమాలయాలు పర్వతాలు కావు.'

(vi) '10 సరి సంఖ్య కాదు.'

అనే ప్రతిపాదనలు కూడా ఉత్పన్న మవుతాయి.

ఈ కొత్త ప్రతిపాదనలు (i) నుంచి vi) లలో సముచ్చయ చిహ్నము '.' లేదా, అయితే—అప్పుడు, ఐ ఐనప్పుడే, కావు కాదు, అనే కూర్పు పదాల ద్వారా ఉత్పన్న మయినవని తెలుస్తుంది. ఈ కూర్పు పదాల స్థానే కింద సూచించిన సంజ్ఞలను తీసుకొంటాము.

p, q లు ఏవో రెండు ప్రతిపాదనలు అనుకొందాము.

1) p మరియు q (ఉదాహరణము i)) అనే ప్రతిపాదనను $p \wedge q$ అని సూచిస్తాము.

p, q లు రెండూ నిజములైనప్పుడే $p \wedge q$ నిజమవుతుంది. ఇట్లాంటి మిశ్ర ప్రతిపాదనను సంయోజనము (Conjunction) అని వ్యవహరిస్తాము.

(2) p లేదా q (ఉదాహరణము (ii) అనే ప్రతిపాదనను $p \vee q$ అని సూచిస్తాము. p, q లు రెండిటిలో ఏదో ఒక్కటి నిజమైనప్పుడు $p \vee p$ నిజమని చెబుతాము. ఇట్లాంటి మిశ్ర ప్రతిపాదనను వియోజనము (Disjunction) అని అంటాము.

(3) $p \rightarrow q$ అనటంలో p నిజమయితే అప్పుడు q నిజవుతుందనే భావాన్ని ప్రకటిస్తాము. p నిజమై q అనిజమైనప్పుడు మాత్రమే $p \rightarrow q$ అనే మిశ్రప్రతిపాదన అనిజము. ఇట్లాంటి ప్రతిపాదనను అంతర్భావనము (Implication) అంటాము

(4) $p \leftrightarrow q$ అనటంలో p నిజమైనప్పుడు q నిజము, q నిజమైనప్పుడు p నిజము అన్నభావం

ప్రకటితం కావలె. ఉభయత్రా నిజం భాసిల్లవలె. రెండూ అనిజములైనప్పుడుకూడా p <—> q ప్రతిపాదన అర్థవంతంగానే ఉంటుంది. గనక నిజంగానే పరిగణించవచ్చు. ఇట్లాంటి ప్రతిపాదనలను తుల్యత (Equivalence) అంటాము.

(5) p' అనటంలో p కానిది అనే అర్థాన్ని ఆపాదిస్తున్నాము.

p ప్రతిపాదనకు విరుద్ధమైన అభిప్రాయాన్ని p' సూచిస్తుంది.

p' నిజము కావాలంటే p అనిజముగా ఉండవలె.

p అనిజము కావాలంటే p నిజముకావలె.

కొందరు p' స్థాన p అనికూడా వ్రాస్తారు.

కనక ∧, ∨, —>, <—> ' అనే ఐదు సంజ్ఞలలో మొదటి నాలుగు ప్రతిపాదనలమీద యుగ్మ ప్రక్రియలను సూచిస్తాయి. చివరిది ఒకే ప్రతిపాదన మీది ప్రక్రియను సూచించేందుకు అని మనకు విశదమౌతుంది.

## భాషా సాంప్రదాయాలు— తార్కిక సాంప్రదాయాలు

మామూలు సంభాషణలలో సముచ్చయాన్ని (,) ఉపయోగించి రెండు ప్రతిపాదనలను కలిపేటప్పుడు రెండు ప్రతిపాదనలు పూర్వపర సంబంధాన్ని కలిగిఉంటాయి సాధారణంగా.

ఉదాహరణకు : నన్నయ భారతాన్ని రచించినాడు.

నన్నయ రాజరాజనరేంద్రునికి తన గ్రంథాన్ని అంకిత మిచ్చినాడు. వీటిని సముచ్చయంతో సంయోజించి ఒక మిశ్ర ప్రతిపాదన చేస్తాము. సంజ్ఞా తర్కంలో పూర్వాపర సంబంధం లేని ప్రతిపాదనలను కూడా తీసుకొని సముచ్చయించవచ్చు.

గులాబి ఒక పువ్వు

36 ఒక వర్గ సంఖ్య.

వీటినుంచి 'గులాబి ఒక పువ్వు, 36 ఒక వర్గ సంఖ్య' అనే కొత్త ప్రతిపాదన ఉత్పన్నమౌతుంది. ఇది అర్థభరితమూ, నిజమున్నూ.

అట్లాగే మామూలు వ్యవహారంలో 'లేదా' అనే కూర్పు పదాన్ని రెండు విధాలుగా వాడవచ్చు. p లేదా q అన్నప్పుడు 'p యో, లేదా q యో—రెండూ కావు' అనే భావనతో ఒకసారి,

p యో, లేదా q యో, లేదా రెండూ అనో ఇంకొకసారి. భావిస్తూ ఉంటాము. గణిత తర్కంలో ఈ రెండవ భావనను సూచించేటట్లుగానే '∨' (లేదా) సంజ్ఞను వాడతాము.

ఉదాహరణకు మనం మిత్రుల ఇంటికి అతిథులుగా వెళ్ళినప్పుడు వాళ్ళు 'పానీయాలున్నాయి. మీరు ఏది అభిలషిస్తారు?' అనే ప్రశ్నకు సమాధానంగా 'బోర్నవిటా లేదా ఓవల్టిన్' అంటాము.

మామూలుగా, గేస్తు, రెంటిలో ఏదో ఒకటి పట్టుకొస్తాడు.

తార్కిక బుద్ధితో మనం అతణ్ణి ఆక్షేపించి, రెండూ తెమ్మని నిర్బంధించి తెప్పించి త్రాగవచ్చు కూడా! దాన్ని శాస్త్రం సమ్మతిస్తుంది!!

అట్లాగే 'అయితే—అప్పుడు' కూర్పును కూడా పూర్వాపర సంబంధం గల ప్రతిపాదనలతోనే చేస్తామని ఇదివరకే ప్రస్తావించినాము. కానీ గణిత తర్కంలో ఈ నిబంధనను పాటించము. కాబట్టి ఈ విభాగానికి చెందిన తార్కిక ప్రతిపాదనలు ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి మొదట్లో.

ఉదా॥ (1) హైదరాబాదు ఆంధ్రప్రదేశ్‌కు ముఖ్యపట్టణం అయితే—అప్పుడు కాశీ గంగానదీ తీరంలో ఉన్నది.

(2) ఈరోజు సోమవారం అయితే, అప్పుడు రాముడు దశరథుని కుమారుడు.

(3) పోతన్న భారత గ్రంథకర్త అయితే అప్పుడు గాంధీజీ భారత జాతిపిత.

(4) శ్రీ కృష్ణుడు యశోదకొడుకు అయితే విక్సన్ అమెరికా అధ్యక్షుడు.

పై ఉదాహరణలలో ప్రతి ప్రతిపాదనలో రెండు భాగాలున్నాయి. మొదటి భాగాన్ని p అని, రెండవ భాగాన్ని q అని సూచిస్తే

(1) లో p నిజము, q నిజము, p—> q నిజము.

(2) లో p నిజము, q నిజము, p—> b నిజము.

(3) లో p అనిజము, q నిజము, p—> q నిజము.

(4) లో p నిజము, q అనిజము, p—> q అనిజము.

గనక 'p—> q' ప్రతిపాదన నిజం కావాలంటే, p నిజమైనా, అనిజమైనా q మాత్రం తప్పనిసరిగా నిజం కావలె.

ఇక 'అయి, అయినప్పుడు' కూర్పును తీసుకొందాము. తర్కంలో p <—> q చర్చించేటప్పుడు, p, q లు ఒకే అర్థాన్ని ప్రతిపాదించ నక్కరలేదు. p <—> నిజమయ్యేందుకు p, q లు ఉమ్మడిగా నిజాలు కావలె లేదా అనిజాలు కావలె.

'21 వర్గ సంఖ్య' : p అనుకొందాము.

'4 ప్రధాన సంఖ్య' : q అనుకొందాము.

21 వర్గసంఖ్య అయితే 4 ప్రధాన సంఖ్య—I.

4 ప్రధాన సంఖ్య అయితే 21 వర్గసంఖ్య—II.

I, II ప్రకటనలు ఉమ్మడిగా లభించేటట్లు.

'21 వర్గసంఖ్యఅయి, అయినప్పుడే 4 ప్రధాన సంఖ్య' అని క్లుప్తంగా వ్రాస్తాము. ఈ ప్రతిపాదన నిర్వచనం ప్రకారం నిజము, ఈ నిజమైన ప్రతిపాదన నిజంగా ఆశ్చర్యాన్ని కలిగిస్తూ ఉంది కదూ!

## నిజానిజాలు తెలిపే పట్టీలు

సంయోజన, వియోజన, అంతర్భావన, తుల్యత, నిషేధములను చక్కగా, క్లుప్తంగా వివరించేందుకు పట్టీలను తయారు చేసుకొందాము. పట్టీలలో ఒక ప్రతిపాదన నిజమైతే దాన్ని T తోనూ, అనిజమైతే దాన్ని F తోనూ సూచిస్తాము.

(1) సంయోజన—పట్టీ

| p | q | p∧q |
|---|---|---|
| T | T | T |
| T | F | F |
| F | T | F |
| F | F | F |

ఈ పట్టీని సంయోజన నిర్వచనాన్నుంచి నిర్మించుకొన్నాము.

(i) ప్రతిపాదన r నిజము, ప్రతిపాదన q నిజము, p∧q ప్రతిపాదన నిజము.

(ii) p, q లలో, ఏ ఒక్కటి నిజంకాకపోయినా, p∧q నిజంకాదు. ఈ అంశాలనే పై పట్టీ సంజ్ఞాత్మకంగా వివరిస్తుంది.

(2) వియోజన—పట్టీ

| p | q | p∨q |
|---|---|---|
| T | T | T |
| T | F | T |
| F | T | T |
| F | F | F |

(3) అంతర్భావన–పట్టీ

| p | q | p → q |
|---|---|---|
| T | T | T |
| T | F | F |
| F | T | T |
| F | F | T |

(4) తుల్యత–పట్టీ

| p | q | p ↔ q |
|---|---|---|
| T | T | T |
| T | F | F |
| F | T | F |
| F | F | T |

(5) నిషేధ–పట్టీ

| p | p' |
|---|---|
| T | F |
| F | T |

(6) వీటినన్నిటినీ కలిపి ఒకే పట్టీగా తయారు చేయవచ్చు.

| p | q | p ∧ q | p ∨ q | p → q | p ↔ q | p' |
|---|---|---|---|---|---|---|
| T | T | T | T | T | T | F |
| T | F | F | T | F | F | F |
| F | T | F | T | T | F | T |
| F | F | F | F | T | T | T |

నిజానిజాల పట్టీని ఇట్లా తయారుచేయటం వల్ల, ఇంకా కొత్త కొత్త మిశ్ర ప్రతిపాదనల సమ్మేళనాన్ని చర్చించవచ్చు.

ఉదాహరణకు :

p, q లు రెండు ప్రతిపాదనలు.

p ⟶ q ఇంకో ప్రతిపాదన.

p, (p ⟶ q) ల నుంచి

p ∧ (p ⟶ q) ను,

[p ∧ (p ⟶ q)] ⟶ q ను చర్చించవచ్చు.

ఇప్పుడు p ∧ (p ⟶ q) కు [p ∧ (p ⟶ q)] ⟶ q కు నిజానిజాలు పట్టీలు వ్రాస్తాము.

| p | q | p → q | p ∧ (p → q) | (p ∧ (p → q)) → q |
|---|---|---|---|---|
| T | T | T | T | T |
| T | F | F | F | T |
| F | T | T | F | T |
| F | F | T | F | T |

గమనిక : p, q ల నిజానిజాలు ఏలా ఉండినా, ఈ కొత్త ప్రతిపాదన $[p \wedge p \rightarrow q] \rightarrow q$, ఎప్పుడూ నిజంగా ఉంటుందని తెలుస్తూ ఉంది· ఇట్లాంటి ప్రతిపాదనలను తర్కశాస్త్ర సూత్రాలని లేదా టాటాలజీ (Tautology) అని అంటాము.

టాటాజీలకు ఉదాహరణలు.

(1) $P \vee P'$ అనే న్యాయము.

| p | p' | p V p' |
|---|---|---|
| T | F | T |
| F | T | T |

దీనిని మధ్యమ నిషేధ న్యాయము (Law of Excluded middle) అంటాము.

(2) $(P \wedge P')$ అనే న్యాయము.

| p | p' | p ∧ p' | (p ∧ p')' |
|---|---|---|---|
| T | F | F | T |
| F | T | F | T |

దీనిని వ్యాఘాత న్యాయము (Law of Contradiction) అంటాము.

(3) $[(p \rightarrow q) \wedge (q \rightarrow r)] \rightarrow (p \rightarrow r)$ ఒక టాటాలజీ దీనిని న్యాయ ప్రయోగ సూత్రము (Law of Syllogism) అంటాము.

(4) $p \leftrightarrow (p')'$

| p | p' | (p')' | p ↔ (p')' |
|---|---|---|---|
| T | F | T | T |
| F | T | F | T |

ఈ టాటాలజీని ఉభయ నిషేధ న్యాయము (Law of double negation) అంటాము.

(5) $(p \rightarrow q) \leftrightarrow (q' \rightarrow p')$

| p | q | p' | q' | p → q | q' → p' | (p → q) ↔ (q' → p') |
|---|---|---|---|---|---|---|
| T | T | F | F | T | T | T |
| T | F | F | T | F | F | T |
| F | T | T | F | T | T | T |
| F | F | T | T | T | T | T |

ఈ టాటాలజీని ప్రతివర్తిత స్థితి న్యాయము (Law of Contraposition) అంటాము.

## తార్కికంగా తుల్యములైన ప్రతిపాదనలు

పైన పేర్కొన్న టాటాలజీ ఉదాహరణ(5)లో $p \rightarrow q$) ప్రతిపాదనకు $(q' \rightarrow p')$ ప్రతిపాదనకు నిజానిజాల పట్టీలు తుల్యములు. కాబట్టి ఈ రెండు ప్రతిపాదనలు తార్కికంగా తుల్యతను ఆపాదించుకొన్నాయి.

ఉదాహరణ : q : అతడు భారతీయుడు.

p : అతడు ఆంధ్రుడు.

q' : అతడు భారతీయుడు కాడు.

p' : అతడు ఆంధ్రుడు కాడు.

'అతడు ఆంధ్రుడయితే అప్పుడు అతడు భారతీయుడు' అనే వాక్యము.

'భారతీయుడు కాకుంటే అతడు ఆంధ్రుడు కాడు' అన్న వాక్యానికి సర్వవిధాలా సమానము.

ఇటాగా తుల్యతను సాధిస్తూ ఉండటం తార్కికులకు సరదా. దీనివల్ల తర్క ప్రక్రియలైన సంయోజన, వియోజన, అంతర్భావన, తుల్యతా నిషేధములు కొంతవరకు పరస్పరాధారములుగా నిర్వహింపవచ్చునని తెలుస్తూ ఉన్నది. కాబట్టి తర్క శాస్త్ర అధ్యయనానికి ఐదు ప్రక్రియలలో అన్నీ అవసరమైనవి కావని తెలుస్తూ ఉన్నది.

ఉదా॥ $(p \vee q)$ ప్రతిపాదన $(p' \wedge q')'$ కు తుల్యము

| $p$ | $q$ | $p'$ | $q'$ | $p \vee q$ | $p' \wedge q'$ | $(p' \wedge q')'$ |
|---|---|---|---|---|---|---|
| T | T | F | F | T | F | T |
| T | F | F | T | T | F | T |
| F | T | T | F | T | F | T |
| F | F | T | T | F | T | F |

ఇట్లాగే పట్టీలు కట్టి
$(p \rightarrow q)$, $(p \wedge q')'$ తుల్యము అని,
$(p \wedge q)$ $(p' \vee q')'$ తుల్యము అని
$p \leftrightarrow q)$ $[(p \rightarrow q)(q \rightarrow p)]$
తుల్యములని నిరూపించవచ్చు.

సంపూర్ణ ఆరోగ్యంలో ప్రముఖ స్థానాన్ని వహించే
సుఖనిద్ర (Sound Sleep) పొందాలంటే...
విశ్రాంతి పొందుటకు ...... ఎల్లప్పుడు
టి.ఎ.సి.టి. బ్రాండ్ నవారు నే
వాడండి.



సప్లయిచేయువారు
ది అసోసియేటెడ్ కాటన్ టేప్ ఇండస్ట్రీస్ మార్కెటింగ్ కంపెనీ
P.B. No. 15 పాలకొల్లు (A.P.)

# డా॥ నేలటూరి వెంకటరమణయ్యగారి భాషాసేవ

శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రి



డా॥ నేలటూరి వెంకటరమణయ్య

ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో మహాకవులు, సంస్కృతాంధ్రోభయ భాషాకోవిదులు బహుభాషా పండితులు, వ్యాఖ్యాతలు, నాటక కర్తలు, నిఘంటు నిర్మాతలు, వచన రచయితలు విమర్శకులు, ఆలంకారికులు, యక్షగాన రచయితలు, వాగ్గేయకారులును ఎందరో వెలసిరి గాని ఆధునిక యుగ ప్రారంభము వరకు చరిత్రకారులు లేరు. ప్రాచీన గ్రంథములను లిఖిత గ్రంథ పరిశోధన పూర్వకముగా పఠించి, శాసనములను లిపి జ్ఞానముతో పాఠ నిర్ణయాదిపరిక్లేశముతో పరిశీలించి విషయ మెఱిగి, ఆ యా శకాబ్దములు పంచాంగాదికముల పరిజ్ఞానముతో కాల నిర్ణయ మొనర్చి, ఏ యే చారిత్రక కాలములకు మూలాధారములేవో ఆలోచించి సంపాదించి, పుక్కిడి పురాణ మహాత్మ్యాదికములనుండి వాస్తవమైన చరిత్రను, అత్యంత కృషిచేత వెలికిదీసి అమోఘాశ్చర్యకరములైన యథార్థములను మనకు ప్రసాదించిన విమర్శక ప్రకాండులు మన కాలమున ఏర్పడినారు. అట్టి వారిలో నొకరై, ఇంకను వార్ధక్యమున కూడ భాషా పరిశ్రమ చేయుచున్న వారిలో శ్రీ నేలటూరి వెంకట రమణయ్యగారు మనకు ప్రత్యక్ష నిదర్శనము.

పెద్దల జీవిత చరిత్రల పఠనము యువకులకు ఉత్తేజకరములు, మార్గదర్శకములు బహుళార్థ బోధకములు. చరిత్ర రచనయు జీవిత చరిత్ర రచనయు నూతన సాహిత్య విద్యల, పాశ్చాత్యులు మన దేశముతో సంబంధము పెట్టుకొన్నది మొదలు నూతన ప్రక్రియ లేర్పడినవి. విశ్వ విద్యాలయములు, ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారములు, పురాతత్త్వ పరిశోధనాలయములు—ఇత్యాదులతో నూతన విమర్శకదృష్టియు కుదిరి పరిశోధనాసక్తి అంకురించి నవనవోన్మేషమై వాఙ్మయ చరిత్రలును దేశ చరిత్రలును వెలువడినవి. ఈ విషయములలో పాశ్చాత్యులు మనకు మార్గదర్శకులై అమోఘమైన దేశసేవ చేసిరి. అట్టి నూతన విమర్శక వాఙ్మయ ప్రక్రియలను అందుకొని మన పండితులు శ్రీ కావలి వెంకట బొఱ్ఱయ్య కాలమునుండియు, మెకంజీ దొర చరిత్రకు పునాదులు వేసినది మొదలు పలువురు పరిశోధక మహనీయులు వెలసిరి. శ్రీ చిలుకూరి వీరభద్రరావు, కొమఱ్ఱాజు లక్ష్మణరావు, మల్లంపల్లి సోమశేఖరశర్మ, నేలటూరి వెంకట రమణయ్య మున్నగు పెద్దలు నేటి చారిత్రకాగ్రేసరులలో ప్రధానులు. ఇందులో శ్రీ నేలటూరి వారును మల్లంపల్లి వారును జంట కవులవలె కాకపోయినను, ఒక జట్టుగానుండి కలసి మెలసి పరిశోధక వ్యాసంగము చేసినవారు. మల్లంపల్లివారు గతించి పదియేండ్లకు మించినది. శ్రీ నేలటూరివారు ఇంకను భాషాసేవ సేయగతి యుండుట ఆంధ్రుల మహద్భాగ్యము.

భారతి పత్రికకు 1974 తో ఏబది యేండ్లు నిండుచున్నవి. దాదాపు మొదటి నాలుగేండ్లు లేదేమోగాని, అటు తర్వాతినుండి నేటిదనుక అవిచ్ఛిన్నముగ శ్రీ రమణయ్యగారి వ్యాసములు భారతిలో ప్రకటింపబడు చున్నవి. రజతోత్సవములో పాల్గొని మరల స్వర్ణోత్సవములో వీరు పాల్గొనుట అదృష్టము. వీరి చరిత్రయు 'భారతి' చరిత్రలో అంతర్భాగమగుటచే శ్రీ రాధాకృష్ణ నాగేశ్వర రాయ సోదరులు వీరి చరిత్రకు ఇందు ప్రధానముగా ప్రకటింపగోరుట ఎంతో సమంజసము. శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారికి శ్రీ రమణయ్యగారియందు ఎంతో గౌరవము. శ్రీ శంభుప్రసాదుగారు అంతకు మించి స్నేహ గౌరవములు చూపి 1951 లో వీరికి వీరి భారతీ సేవకు వీరికి రు. 1116 బహూకరించినారు. పెద్దల యనుబంధమును శ్రీ శివలెంక సోదరులు పోగొట్టక నిర్వహించుట వారి సంస్థకు శోభ, ఆంధ్రవాణికి పూజ, విద్వజ్జనులకు ఉత్సవము.

శ్రీ నేలటూరు వెంకట రమణయ్య గారు శ్రమజీవి. శ్రమయు పరిశ్రమయు మిళితములై వారి జీవితములో ఆ పరిశ్రమయే ఆనంద రసానుభూతి ప్రదమై, ప్రతిక్షణ తపస్సుగాను సద్యోవర ప్రసాదముగాను అనుకూలించి వాగ్దేవతా సమారాధన రూపమును దాల్చి అలరారినవి. ఒక సావ

నిర్ధన విద్యార్థి మహా పండితుడై, అపరిమిత పాండిత్యమును పరిమిత ధనమును సంపాదించిన కథ, మార్గమెరుగని బాటసారి మార్గాన్వేషణము చేయుచు స్వపరిశ్రమచే గమ్యస్థానము చేరిన చరిత్ర, అనుక్షణ సంశయ భయాకులిత దుర్గమ సాహిత్య చారిత్రక సాంద్రారణ్యమున గవేషణ తత్పరుడై, ఒక్కొక్క మెట్టును ఆనంద జనకమును, పురోగమనోత్తేజకరమును అగుచుండ, మరల మరల అనుమానములు తాకుచుండిన వెనుదిరుగని పట్టుదలతో బాట నిర్మించుకొని తత్త్వము కనుగొన్న చారిత్రక తాత్వికుని మహద్విజయము— వీరి చరిత్ర.

నేలటూరు గ్రామము నెల్లూరుజిల్లాలో నెల్లూరి నగరమునకు తూర్పున సుప్రసిద్ధ ముత్తుకూరు కృష్ణపట్టణములకు సమీపమున నేడొక సామాన్య గ్రామము. ఇది విజయ నగర రాజుల కాలమున పుదూరు ద్రావిడ బ్రాహ్మణుల కీయబడిన యగ్రహారము. అట్టివే చుట్టుపట్ల మామిడిపూడి, అనంతపురము మున్నగునవి. నెల్లూరు, గుంటూరు, చిత్తూరు ఉత్తరపు ఆర్కాడు జిల్లాలు పుదూరు ద్రావిడులకు దాదాపు వేయేండ్లనుండియు నివాసభూమి. తమ వైదిక విద్యలకు మెచ్చి ఆ యా కాలపు రాజులు వీరలకిచ్చిన యగ్రహారములు వీనిలో కలవు. కృష్ణానదీ కాంచీ నగరముల నడుమనుండిన వీరికి పుదూరు ద్రావిడులను పేరు తర్వాత యేర్పడినదిగాని ప్రాచీన కాలమున తమిళము మాతృభాషగా గలిగిన ద్రావిడులు వీరు. అందును విశేషముగా శంకర భాష్యమేగాక, రామానుజ భాష్యమును గూడ బోధించుచు అందులకు అగ్రహారములు సంపాదించిన శాసనములు గలవు. శ్రీ వైష్ణవాచార్యులైన నాదముని, ఆళవందారు ( యామునాచార్యులు ) రామానుజాచార్యాదులందఱును చారిత్రకముగా చూచిన నేటి పుదూరు ద్రావిడుల మూల పురుషులుగా కనబడుచున్నారు. కొందరు విభూతి చందనధారులై యుండ కొందఱు నామధారణము చేయుచు, స్వయమాచార్య పురుషులై, ఏ మఠమువారికిని శిష్యులుగాక, స్వతంత్రులై, విద్యా వ్యాసంగములు చేయుచుండిరి. అట్టివారిలో నేలటూరిని సంపాదించినవారు భారద్వాజ గోత్రులు, ఆపస్తంబసూత్రులు, యజుశ్శాఖాధ్యాయులు. ఈ ఇంటిపేరు తర్వాతనే ఏర్పడియుండవలెను.

వెంకట రమణయ్యగారి తండ్రిగారు సుబ్బయ్యగారు. తాతగారు లక్ష్మినారాయణగారు. ముత్తాత వెంకటాచలం ఉరఫ్ 'తాతాచార్లు'గారు. అందరును ఆచార్లనియే చెప్పబడుచుండిరి. వెంకట రమణయ్యగారిని బాల్యమిత్రులందఱును వెంకట రమణాచార్లని యెరుగుదురు. ఈ నేలటూరివారి శాఖకు చెందిన పద్మనాభాచార్యులనువారు రెండు మూడు శతాబ్దముల క్రింద గంగవరము అగ్రహారమును సంపాదించి గంగవరపు వైష్ణవశాఖకు మూలపురుషులైరి. ఈ శాఖకు చెందినవారే సుప్రసిద్ధ పండితులు శ్రీమాన్ నేలటూరు రామదాసయ్యంగారు ( నెల్లూరు. ) అగ్రహారీకులై యుండియు ఏవేవో కారణాంతరముల వలన అది పోగా కుటుంబము పేదవడినది.

శ్రీ వెంకట రమణయ్యగారి జననము 1893 లో. నేలటూరు గ్రామమందే. సమీపమందు మునునూరివారిపాలెమను గ్రామములో మునుకూరు సుబ్బారెడ్డిగారను సంపన్నులు తమ కొమాళ్ళు చంద్రారెడ్డి, శేషురెడ్డి, అబ్బిరెడ్డి మున్నగువారికొఱకు వారి వాకిట ఒక బడి ప్రారంభించిరి. అచ్చట మామిడిపూడి వెంకటాచార్యులనువారు (వీరును పుదూరివారే) పాతకాలపు మెట్రిక్యులేషన్ తప్పిపోయినవారు, సంస్కృతాంధ్రములు చక్కగా చదివినవారు ఉపాధ్యాయులు. చుట్టుపట్లవారు చాలమంది ఈ బడిలో చదువుకొనుచుండగా వెంకట రమణయ్యగారును వారి సోదరులు రాఘవయ్యగారును ఈ బడిలో ఇంగ్లీషుతోకూడ ప్రాథమిక విద్యయేగాక పెద్ద నగర పాఠశాలలో చేరుటకు తగినంత నేర్చుకొనిరి. 1906 లో నెల్లూరి మూలపేటకుపోవుదారిలో వతేఖాను పేటలో మిషన్ స్కూలులో చేరిరి. అచ్చట జాన్ కొళందవేలు అనువారు హెడ్మాస్టరు. బంధువుల రామచంద్రశాస్త్రిగారు ఆంధ్ర పండితులు. అల్లాడి సీతారామశాస్త్రిగారు సంస్కృత పండితులు. నేలటూరు శ్రీనివాసాచార్యులు ఇంగ్లీషు తదితర విషయములు బోధించువారు. పరీక్షించి 1 ఫారములో చేర్చుకొనిరట. గాడేపల్లి శేషయ్యగారు స్కూలుకు గుమాస్తా. ఆ కాలమున వత్సరాంత పరీక్షలు డిసంబరులో. ఆలస్యముగా బడిలో చేరినందువలన డి. ఇ. వో. గారి అనుమతి కావలసివచ్చినది. అది వచ్చుట ఆలస్యమైనది. క్రొత్తగా వచ్చిన వెంకట రమణయ్యగారికి విద్యార్థుల నడుమ కొత్తయ్య యని పేరు పెట్టిరి. విద్యార్థులలో నలుబది యేడవ స్థానమునుండి 11 వ స్థానమునకును, రెండవ స్థానమునకు చాల త్వరగా వచ్చిరట. వీరి సహాధ్యాయి, తర్వాత నెల్లూరిలో సుప్రసిద్ధ డాక్టరుగా వెలసిన శ్రీ అల్లాడి మహాదేవయ్యగారు (ఆచార్య మామిడిపూడి వెంకట రంగయ్యగారి అల్లుడు. బావమరది) ఎప్పుడును మొదటి స్థానము నాక్రమించియుండువారట. అట్లే ఇంటర్మీడియేటు వరకు ఇరువురును సహాధ్యాయులుగానే యుండిరి.

బీద కుటుంబము. శ్రమ జీవనము. సుప్రసిద్ధ న్యాయవాదులు పరోపకార పారీణులు శ్రీ తూములూరి శివరామయ్యగారు నెల్లూరిలో తమ వృత్తి ప్రారంభించిన కాలమున వారు బీద బ్రాహ్మణ విద్యార్థుల కెంతో ఉపకరించి వార భోజనాదుల కేర్పాటు చేయింపగా, తమ్ముడు రాఘవయ్యగారు అచ్చట భుజించెడివారు. శివరామయ్యగారి భాండాగారమందలి పుస్తకములను వదలక చదువుకొనుచుండువారు. ఇరువురును ఒక చోటికి పోవుట యేల యని వెంకట రమణయ్యగారు మధుకర వృత్తి నవలంబించిరి. ఎవరైనను కసరినను నోర్చుకొనుచు, స్థలముచాలని యొక యింట నివసించుచు కాలక్షేపము చేసిరి. 1913 సం. S S L C పరీక్షయై, మదరాసుకువచ్చి, మణలి హాస్టలులో చేరి, 1915—16 లో ఇంటర్మీడియేటును, 1918—19 లో B. A. Hons ఉత్తీ

ర్నులైరి. ఆ నర్సు చదువు నుద్దేశము మొదటలేదు. B A . లో ఖాళీలు లేకపోయినందున ప్రిన్సిపాలుగానుండిన స్కిన్నరుగారును, ఆచార్య కార్లీగారును వీరియందు ఆదరము వహించి ఆనర్సులో చేర్చుకొనిరి. తర్వాత కొద్దికాలము బెంగుళూరు వెస్లీ కమిషన్ కాలీజియేట్ హైస్కూలులో కొంతకాలము అధ్యాపకులుగా నుండి 1920—21 లో మరల మదరాసుకు వచ్చిరి. క్రైస్తవ కళాశాలలో చారిత్రకాధ్యాపకోద్యోగ మేదియు ఖాళీగా లేనందున ప్రొఫెసరు కార్లీగారు సిఫారసుమీద కొన్ని నెలలు కళాశాలలోను, ఉన్నత పాఠశాలలో ఆంధ్రోపాధ్యాయులుగా పనిచేసి Best Telugu Pandit అని పేరు సంపాదించి 1922 లో కళాశాలలో చారిత్రకాధ్యాపకులైరి. అది మొదలు 1931 వఱకు క్రైస్తవ కళాశాలలో నుండిరి.

ఇప్పటికి వీరికి జీవితములో విద్యార్థి దశ దాటి, ఉద్యోగ దశలో మొదటి ఘట్టము. ఈ కాలములోనే జీవితములో గొప్ప మార్పును భావి చారిత్రక పరిశోధనలకు పునాదులును కుదిరినవి. మొదటి పునాది నెల్లూరిలోనుండునప్పుడే విద్యార్థి దశయందే పడినది. బాల్యమునుండి చదువులమీద శ్రద్ధ యుండినందున 1910—11 సంవత్సరముల ప్రాంతమందే మా తాతగారు వేదము వేంకటరాయశాస్త్రిగారితోను, 'వారి సోదరులు వేంకటాచలముగారితోను పరిచయము కలిగినది. ఒకమారు నెల్లూరి ఆంధ్ర భాషాభిమాని సమాజమువారి ప్రతాపరుద్రీయ నాటకప్రదర్శనమును 'చూచి దానిపై పత్రికలలో వెంకట రమణయ్యగారు (విద్యార్థిగా నుండునపుడు) సమీక్ష వ్రాయగా సమాజమువారు చదివి, తాతగారికి తెలుపగా, వారు ఆ సమీక్ష చదివి, తమ బంధువర్గమువాడు గానే యుండునని వూహించి పిలిపించి, సంతోషించి, అది మొదలు తమ కడకు రాకపోకలకు ప్రోత్సాహ మిచ్చిరట. మిషన్ హైస్కూలులో నటేశయ్యర్ అను ఉపాధ్యాయులు చరిత్ర బోధించుచు, వేంకటాచలముగారిని గురించి చెప్పి వారికడకు పొమ్మని సలహా ఇచ్చిరట. ఎంత గొప్పవారిని దగ్గరకు రానీయని వేంకటాచలముగారు నటేశయ్యరుగారి విద్యార్థి యనగానే ఆదరించి, విద్యార్థులకు పాఠశాలలలో బోధింపబడు చరిత్రయంతయు తప్పనియు మంచి పరిశోధన జరుగవలెనని బోధించెడివారట.

మదరాసుకువచ్చి ఉద్యోగము కుదిరిన ప్రారంభకాలమందే శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారి స్నేహము లభించెను. వీరి తమ్ముడు రాఘవయ్యగారు ప్రెసిడెన్సీ కాలేజిలో ఉన్నత విద్య నభ్యసించి Chemistry ఉపాధ్యాయుడుగా American Baptist High School 1921 లో కొంతకాలముండి, త్వరలోనే 1921 లోనే రాయపురము Medical School లో అధ్యాపకులైరి. ఈ కాలమున వీరి కుటుంబము Mint Street లో శ్రీ రామకృష్ణ కవిగారి యింటికి సమీపముగాన ఎక్కువగా వారిని కలసికొనుచుండెడివారు.

ఇంటిలో కూడ పాండిత్యపు వాతావరణము బాల్యము నుండియు లేకపోలేదు. చక్కని కవి, పెక్కు యక్ష గానములు రచించినవారు, విజయాశ్వ చరిత్ర కావ్యకర్తలు శ్రీ పురాణము పిచ్చయ్యశాస్త్రిగారు వీరికి మేనమామగారు. వీరికి 1909 లో కుమార్తె నిచ్చి పెండ్లి చేసినవారు శ్రీ సరస్వతుల సూర్య నారాయణశాస్త్రిగారు, సంస్కృతాంధ్ర పండితులేగాక వెంకటగిరి సంస్థానమున పండితులును, వైణిక విద్వాంసులునుగా ప్రసిద్ధి వహించి యుండిన సరస్వతుల శేషశాస్త్రిగారి కుమారులు. ఈ యిరువురు పండితులు మదరాసులో కొన్ని పాఠశాలలలో ఆంధ్రోపాధ్యాయులుగా నుండి భాషాసేవ చేసినవారే. ఇంటఱును కలసియే యుండెడివారు.

మా తాతగారి ఆముక్తమాల్యదా వ్యాఖ్యాన రచనా కాలమున ముద్రణ వ్యయమునకు తాతగారికి సాయపడినవారిలో ఈ నేలటూరుసోదరులు కలరు. తమకు వరుంబడి ఎక్కువ లేకపోయినను వచ్చుచుండిన జీతములో ఇరువురును కలసి ఎట్లో సమకూర్చి కొంత ద్రవ్య మిచ్చినారు. ఈ విషయము తాతగారు పేర్కొనియున్నారు. తత్పూర్వము వ్యాఖ్యకు తాతగారు పీఠిక వ్రాయుకాలమున పెక్కు శబ్దములకు ఉదాహరణములు సంపాదించుటకు తాతగారు నిర్దేశించిన గ్రంథములను చదివి వెంకటరమణయ్య చాల ఉదాహరణములను సేకరించి ఒసంగిరట. ఇవెల్ల పీఠికానుబంధమున తాతగారు చేర్చియున్నారు. దీనివల్ల తమకు తెలుగు కావ్య పఠనాసక్తి అభివృద్ధి యైనదని వెంకటరమణయ్యగారు తెలిపియున్నారు.

ఆంధ్ర కావ్యములలో అంతర్గూతమై ఎంతో చారిత్రక విషయము కలదని వీరు గుర్తింప గలిగిరి. కావ్యావతారికలలోని కవులయొక్కయు, రాజులయొక్కయు చరిత్రలే కాక వర్ణనాంశములలో ఉపమానములలో, ఉత్ప్రేక్షలలో, చమత్కార కల్పనలలో తమ సమకాలిక వాతావరణము కన్నులకు కట్టినట్లు మన కవులు వర్ణించిన విషయమును వీరు గుర్తించి తమ రచనలలో వివరించి యున్నారు.

ఈ విధముగా సంస్కృతాంధ్ర భాషల పరిచయమును చారిత్రకాధ్యాపకోద్యోగమును దొరకిన కాలమున జీవితమందు పెద్ద మార్పుకు కారణమైన యొక సంభవము జరిగినది. అది సోదర వియోగము. రాఘవయ్యగారు రసాయనశాస్త్రము చదివినను బాల్యమందే మహా మేధావియై వేదాంతశాస్త్రము (Philosophy) ఆంగ్ల సాహిత్యము మున్నగు వానియందు ఎంతో ప్రవేశించి పెద్దలతో ప్రసంగములు చేయుచు పెక్కు వ్యాసములు రచించుచు నుండినవారు అకస్మాత్తుగా తమ ముప్పదవయేట 1927 లో మరణించిరి. ఇది వెంకట రమణయ్యగారికి పెద్ద దెబ్బ. జీవితమున మరువరాని విషాదము. అంతవరకు తాము చేయుచుండిన చారిత్రక పరిశోధనలను తమ్మునితో చర్చించుచుండెడివారట. కళాశాలలో కార్లీగారు వీరికి ప్రవచన కాలమును తగ్గించి, చారి

"స్వర్ణ" భారతికి



# 'పల్లెపడుచు'

శుభాకాంక్షలు

నిర్మాత: వాశిరాజు ప్రకాశం

త్రక పరిశోధన అవకాశమిచ్చి, ఆనర్సు విద్యార్థులకు విజయ నగర చరిత్రను బోధించుటకు నియోగించియుండిరి. ఒక్క విజయ నగరమేగాక, ఆంధ్రుల చరిత్రనూ, పల్లవ, చాళుక్య, చోళరాజుల చరిత్రలను పరిశోధించుటకు ప్రారంభించి, మూలాధారములను వీరు పఠింప నారంభించియుండిరి. క్రైస్తవ కళాశాల మాస పత్రికలో పల్లవులను గూర్చి వ్యాసములు ప్రకటించు చుండిరి. బాల్యమునుండియు తోడునీడగా పెక్కు విధముల ప్రోత్సాహకుడుగా నుండిన మేధావియైన సోదర వియోగము దుర్భరమై ఆ కాలమున దానిని మరచుటకుమరింత చదువులలో మునిగి బాహ్య ప్రపంచమును మరచిపోవుటకు చేసిన ప్రయత్నమే అత్యధిక చారిత్రక పరిశోధన రూపమును దాల్చినది. అంతవరకు సోదరుని ప్రోత్సాహమున చేసియుండిన 'థీసిసు' Oregin of the outh Indian Temples అను దానికి డాక్టరేటు బిరుదు దొరకినది.

సోదరుడు పోయిన కొరతనుతీర్చు సోదర తుల్యుడుగా వీరికి ఈ కాలమున దొరికినవారు సుప్రసిద్ధ పరిశోధకులు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు. శ్రీ శర్మగారి వ్యాసమును ఖండించుచు వెంకటరమణయ్యగారు 1928 లో భారతిలో 'చాళుక్యుల చరిత్రలో కొన్ని సంశయములు' అని ప్రచురించిన వ్యాసమే భారతికి వారి తొలి వ్యాసము. ఈ వ్యాస ప్రచురణానంతరము శర్మగారితో పరిచయమేర్పడి, శర్మగారు వీరి యాక్షేపముల నొప్పుకొని అదిమొదలు శ్రీ శర్మగారు గతించువరకు వారిమైత్రి గాఢముగా పెరిగినది. ఈ యిరువురి భాషాసేవను గూర్చి జీవిత చరితాంశములను గూర్చి వ్రాయనారంభించిన యెడల మహాభారతమంతయగును గాన ఇందు శ్రీ వేంకటరమణయ్యగారి చారిత్రక పరిశోధనను గురించియే ప్రధానీకరించి సంగ్రహముగా వ్రాయదలంచితిని.

1928 లో డాక్టరు పట్టము పొందిన వెనుక 1930—31 వరకు క్రైస్తవ కళాశాలలో అధ్యాపకులుగా నుండి, ఆ సంవత్సరము మదరాసు విశ్వవిద్యాలయమున హిస్టరీ డిపార్టుమెంటులో 'రీడరు'గా నియమితులైరి. అంతకుముందే వెలువడిన వీరి రచనలు త్రిలోచన పల్లవ—కరికాలచోళులను ఆంగ్ల గ్రంథము, కంపిలి—విజయనగరము అను (ఆంగ్ల) వ్యాస సంచయమును 1929—1931 నడుమను తర్వాతను కూడ ఆంధ్రదేశమందు వీరును శర్మగారును కలసి పలుతావులకు పోయి శాసనములను సంపాదించి భారతిలో ప్రకటించుటకు ప్రారంభించియుండిరి. 1931 లో వీరితో ఈ పదవికి పోటీచేసినవారు ప్రొఫెసర్ సి. ఎస్. శ్రీనివాసాచారి, వి. రంగాచార్య, వి. ఆర్. రామచంద్రదీక్షితర్ మున్నగువారు. అప్పుడు విశ్వవిద్యాలయమువారు ఏర్పరచిన పదవీ నియామక సంఘము (Selection Committee) లో నుండిన సభ్యులు, జదునాద్ సర్కార్, ఫాదర్‌హీరాస్ ఇంకనెవరో. ప్రొఫెసర్ కార్లీగారు చేర్మెను. అందఱును ఏకగ్రీవముగా వెంకటరమణయ్యగారిని సిఫారసు చేసిరి. తర్వాత సత్యమూర్తిగారు మున్నగు కాంగ్రెసు దేశభక్తులు వీరిని రాకుండ చేయుటకు ఎన్ని కుయుక్తులు పన్నినను శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావుగారి హెచ్చరిక వలన జాగ్రత్తపడి శ్రీ వెంకటరమణయ్యగారు ఈ పదవిని పొందిరి.

1931 సంవత్సరము నుండియు వీరి రచనలు మదరాసు విశ్వవిద్యాలయము వారిచే పెక్కు ప్రచురింపబడినవి. క్రైస్తవ కళాశాల యందుండినప్పుడే విజయనగర చరిత్రను ఆనర్సు విద్యార్థులకు పాఠము చెప్పియుండినందున ఆ విషయమందే పరిశోధన ప్రారంభించిరి. 'కంపిలి—విజయనగరము'లో విజయనగర స్థాపకులు ఆంధ్రులు, ఓరుగంటివారు, హరిహరబుక్కరాయంద్రని వ్రాసినందులకు కొందరు కర్ణాటకులు ఆయాసపడి ఖండనములు వ్రాసియుండిరి. వారికి జవాబుగాను ఇంకను తమ పరిశోధనల ఫలితముగాను—

(1) The Origin of the City and the Empire of Vijayanagara అను గ్రంథమును (ఆంగ్లమున) ప్రకటించిరి. ఇందులో విజయనగర సామ్రాజ్యమును, రాజధానిని స్థాపించిన హరిహరబుక్కరాయలును వారి సోదరులును, సంగమవంశమువారు, మాధవ విద్యారణ్యుల సాయమును పొందియుండిరని సోపపత్తికముగా శ్రీ వెంకటరమణయ్యగారు నిరూపించిరి. ఈ గ్రంథము దేశమందు చాల సంచలనము కలిగించినది. (1933)

(2) అటు తర్వాత Third Dynasty of Vijayanagara అను గ్రంథమును, శ్రీ కృష్ణదేవరాయల తమ్ముడైన అచ్యుత రాయల చరిత్రమును, నాటి విజయనగర ఆచారాది విషయములను పెద్ద గ్రంథముగా ప్రకటించిరి. ఈ గ్రంథము మదరాసు యూనివెర్సిటీ వారిచే వీరిచే రచితమైన ద్వితీయగ్రంథముగ ప్రకటింపబడినను నది వీరు క్రైస్తవ కళాశాలలోనుద్యోగము చేయుచున్నప్పుడే రచింపబడియుండెను. (1935)

ఈ కాలమందే, ఓరుగంటి పతనానంతరము మరల హిందూధర్మమును నెలకొల్ప బృహత్ప్రయత్నము చేసి పోరాడిన కాపయనాయకుని గుఱించి వ్రాసిరి. దీనినే చక్కగా పరిశ్రమచేసి పెంపొందించి శ్రీ సోమశేఖరశర్మగారు తర్వాత వ్రాసిరి.

(3) వెలుగోటి వారి వంశము చరిత్ర ఎం.ఒ.ఎస్. లైబ్రరీలో తప్పులతో నుండిన దానిని, తిరుపతికిపోయి శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారి సలహా పొంది, పాఠములు సంస్కరించి, తమ యమూల్య చారిత్రక విషయములతోడి ఆంగ్లోపోద్ఘాతముతో ప్రకటించిరి. (1939)

(4) ఇంతవరకు సంస్కృతాంధ్ర కర్ణాటక భాషల పరిచయముతో పరిశోధన సాగినది. ఆంధ్ర చోళ పల్లవ చాళుక్యుల శాసనములను పరిశీలించుటచే ప్రాచీన లిపి జ్ఞానము కుదిరినది. కాని విజయనగర చరిత్రకు ముఖ్యమైన యాధారములు సహస్ర

దీయుల పార్సీ భాషలో రచితములై యున్నవి. అందులకై వయ్యద్ యూషా యనువారి సాయమున పర్షియను పాఠము చెప్పించుకొని చదివి పుతూహాస్ సలాతిన్ అను గ్రంథమును చదివి, ఇంకను ఫెరిస్తా మున్నగువారి రచనలను ఆ భాషలలో మూలగ్రంథములలో చదివి, హిందూ శాసనాద్యాధారములతో పోల్చి Early Muslim Expansion అను గ్రంథమును ప్రకటించిరి. మహమ్మదీయులు మొదటమొదట దండయాత్రలువచ్చి దేవగిరిని, ఓరుగంటిని, కంపిలిని, ద్వారసముద్రమును జయించిన చరిత్రములను విశదీకరించినారు. హిందూరాజ్యములు మహమ్మదీయుల కెట్లు వశమైనవో, ఎంతబాధపడి మాధవవిద్యారణ్యాది మహానుభావులు మరల హిందూధర్మమును నెలకొల్పుటకు విజయనగరమునకు పునాదులు వేసిరో ఇందు విపులముగా చర్చించి మహమ్మదీయ చరిత్రకారుల వ్రాతల సత్యాసత్యములను తేల్చినారు. ఇంత దూరము వీరు ఎందులకు వ్రాయవలసి వచ్చినదనగా అంతకుముందు మద్రాసు యూనివెర్సిటీలో హిస్టరీ ప్రొఫెసరుగా నుండిన శ్రీ డాక్టరు యస్. కృష్ణస్వామయ్యంగారు వ్రాసిన South India and Her Muhammadan Invaders అను గ్రంథములో నేవిషయములు చక్కగా తెలుపబడలేదు. వెంకటరమణయ్య గారి ఈ గ్రంథమును జదునాథ్‌సర్కారుగారు చాల కొనియాడిరి.

(5) మొహెంజొదరోలో కనబడిన శైవమతాదిచిహ్నముల మీద దేశమున పెక్కు వాదోపవాదములు జరుగుచుండ Rudra Siva అను నుపన్యాసములను (Dr G. Subramanya Iyer's Endowment) ఇచ్చి హారప్ప మొహెంజొదారోలో దొరికిన పురాతన వస్తుశకలములను, వాస్తు నిర్మాణావశిష్టములను ఆర్యులవనిగాని, ద్రావిడులవనిగాని నిర్ణయించుటకు తగినయాధారములు కావని తేల్చినారు.

(6) అన్నిటికంటెను విశేషమైనది Further Sources of Vijayanagara History అనునది. ఇదివరలో శ్రీ సి.కృష్ణస్వామయ్యంగారు Sources of Vijayanagara History ని ప్రకటించిరి. అదికొంతయే. దానికి చేర్పదగినది ఎంతో వెంకటరమణయ్యగారు సేకరించిరి. ఆచార్య నీలకంఠశాస్త్రిగారు ఈ కృషికి ఆశ్చర్య సంతోషములపాలై తాము అందు భాగస్వాములు కాగోరి, డచ్ మున్నగువారి రచనలనుండి కొద్దిగా చేర్చి (చాల కొద్దియే) ఆ ప్రతిష్ఠలో కొంతపంచుకొనిరి. ఈ గ్రంథము ఇరువురిపేరిటను వెలువడినది. దీనికి గొప్ప చారిత్రాత్మకమైన పీఠికను శ్రీ వెంకటరమణయ్యగారొక్కరే రచించిరి.

(7) ఇది సమగ్ర విజయనగర చరిత్రకాక, ఆయా ఆధారములకు విశదీకరణమగుటచేత, సమగ్ర విజయనగర చరిత్ర వ్రాయనారంభించి కొంతవఱకు వ్రాసి ఇంతలో 1946 లో మదరాసు విశ్వవిద్యాలయమునుండి విరామమును పొందిరి. ఈ గ్రంథము ఇంకను అసమగ్రము, అముద్రితము.

(8) విశ్వవిద్యాలయమును వదలిన తర్వాత మదరాసు Record Office లో Regional Research Officer గా కొంతకాలము పనిచేసి Freedom Movement చరిత్ర రచనకు వలసిన విషయమును సేకరించిరి. అటువెనుక 1961 లో హైదరాబాదుకు పోయి District Gazetteers Office లో Asst-Editor గా నుండి కడప, కర్నూలు, అనంతపురము, గుంటూరు, నెల్లూరు జిల్లాల గెజటీరులకు కావలసిన చారిత్రకభాగములను వ్రాసియిచ్చిరి.

(9) 1951 లో తూర్పు, వేంగిచాళుక్యుల చరిత్రమును వ్రాసి ప్రకటించిరి (వేదము వారి ప్రచురణ) (ఆంగ్లము)

(10) వేములవాడ చాళుక్యుల చరిత్రను వ్రాసి (ఆంగ్ల) శాసన ప్రతిబింబములతో హైదరాబాదు పురాతత్త్వశాఖ వారి ప్రచురణగా వెలువరించిరి.

ఇట్లు ఆంగ్లమున ఇన్ని చారిత్రక పరిశోధక గ్రంథములు వెలువరించుచు ఆంగ్లమున పత్రికలలో వ్యాసములను, శాసనములను ప్రాచీనుల నుండి రెడ్డిరాజులకాలము వరకును అనేక విషయముల మీద ప్రకటించిరి. తెనుగులో భారతి పత్రికారాజమున నాడు 1928 ప్రాంతమున వ్యాసములు ప్రచురించుటకు ప్రారంభించినవారు ఇంకను వదలక ఆ పనిని కొనసాగించుచునేయున్నారు. శ్రీ కృష్ణదేవరాయల చరిత్రను సమగ్రముగా భారతిలో ప్రకటించి కీ. శే. శ్రీ శివలెంక శంభుప్రసాదుగారిచేత వేయిన్ని నూటపదునారు రూప్యములు పారితోషికముగా పొందిరి. ఇదిగాక రామరాజన బఖైరు (కన్నడము నుంచి ఆంధ్రీకరణము) వేములవాడ చాళుక్యుల చరిత్ర మఱియు పెక్కు తూర్పు చాళుక్య విజయనగర చరిత్రాంశములపై వ్యాసముల భారతియందే ప్రకటించిరి. ఖాసా సుబ్బారావుగారి స్వతంత్రలో విజయనగర సామ్రాజ్య చరిత్రను తెలుగున ప్రకటించిరి. మధుర తంజావూరు నాయక రాజుల చరిత్రమును ప్రత్యేక పుస్తకముగా సుబ్బారావుగారి సహాయమున వెలువరించిరి. తెలుగుభాషా సమితివారి సంపుటములకు చాల వ్యాసములు వ్రాసిరి. కాని మూడవ సంపుటము సంపాదకులలో వీరొకరు.

వీరు చేసిన చారిత్రక సిద్ధాంతమును గూర్చియే యొక గ్రంథము వ్రాయదగును. ముఖ్యముగా విజయనగరసామ్రాజ్య స్థాపకులు ఆంధ్రులనుటయేగాక కర్ణాటక శబ్దము కూడ ప్రాచీనాంధ్రశాతకర్ణులవలన వచ్చినదనియు, శాతకర్ణులు పాలించిన రాజ్యమునకును, వారికిని మూలస్థానము కర్నూలు జిలాలోని కన్నినాడని, అదియే తొలుత కర్ణినాడు (శాతకర్ణి

నాడు) గా నుండి మారినదనియు, నేటి సాతానికోటకును సాతానివారికిని సంబంధములేదనియు, అది 'సాతవాహనికోట', 'సాతవాహవిహార'గా నుండి మారినపేరనియు, క్రమముగా ఈ పేరు చాళుక్యులు మున్నగువారు, ఇచ్చటినుండియే వ్యాపింపగా, వారివలన, ఎటెట్లో మారి తుదకు కర్ణాటక దేశమునకు పేరయ్యెననియు విశదీకరించి యున్నారు.

ఆంధ్రవాఙ్మయ చరిత్రను వీరే రచించిన చాల బాగుండును. ఎందరో కవులను గురించి కాలనిర్ణయకావ్య విమర్శలు వ్రాసియున్నారు.

కాని వీరు పట్టి చరిత్రకారులు మాత్రముకారు. ఆంధ్రమున చక్కని కృషిచేసి భాషా వాఙ్మయచారిత్రక విషయముల మీద చాల వ్యాసములు వ్రాసినారు. వీనినెల్ల ఒక సంపుటముగా హైదరాబాదు ఆంధ్ర సారస్వత పరిషత్తువారు ప్రకటించి యున్నారు. దీనికే ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు రు. 1116 లు పారితోషిక మిచ్చిరి.

పాల్కురికి సోమనాథుడెప్పటివాడు అను వావిళ్లవారి ప్రచురణలో (1955) నితఁడు ప్రతాపరుద్రుని (1296—1323) కాలమువాడని నిర్ణయించిరి.

మదరాసు ఓ. ఎమ్. ఎస్. లైబ్రరీవారికి హైదరు చరిత్ర కుమారరామునిచరిత్ర విష్ణుమాయావిలాసము మున్నగు పెక్కు గ్రంథములకు సంపాదకులగుటయేగాక యక్షగానముల మీద చక్కని పరిశ్రమ చేసిరి. తెనుగు ప్రబంధ పఠనాసక్తి వీరికి మెండు. నన్నిచోడుని కుమారసంభవమునకు సగము వఱకు వ్యాఖ్య రచించియున్నారు. అందలి పెక్కు పదములను గూర్చి అర్థనిర్ణయ వ్యాసములు భారతిలో ప్రకటితములు.

వీరు చక్కని కథకులు, చారిత్రకేతి వృత్తములను గ్రహించి తెలుగులోను ఇంగ్లీషులోను చాలకథలు కల్పనాశిల్పముమీద వ్రాసి యున్నారు.

మొన్నటివఱకు హైదరాబాదు రాజ్యాంగము వారి పురాతత్త్వశాఖ లో శాసనపరిశోధకులుగా నుండి వూళ్లు తిరిగి అమూల్యములైన శాసనములు సంపాదించినారు. అందు ముఖ్యము పంపకవి తమ్ముడు జినవల్లభుని గంగాధరశాసనము. పంపకవియు ఆతని సోదరుడును ఆంధ్రులని చక్కగా నిరూపించిరి. ఇటీవల మదరాసు విశ్వవిద్యాలయమువారి యాజమాన్యమున సర్ విల్లియం మైయర్స్ ఉపన్యాసములను విష్ణుకుండినులమీద ఇచ్చి పల్లవులాంధ్రులనియు, విష్ణుకుండినుల శిల్పమునేవారు పెంపొందించిరనియు, ఆంధ్రదేశమునుండియే కాళింగులు ఆలయనిర్మాణపు రీతులను గ్రహించిరనియు గట్టిగా ప్రతిపాదించిరి.

వీరు వ్రాయవలసినవి వ్రాసి ప్రకటింపవలసినవియు పెక్కులు గలవు. అచ్చటచ్చట చేసిన యుపన్యాసములును పత్రికలలో వ్రాసిన వ్యాసములును కొన్ని వందలుండునేమో. ఇదిసమగ్ర జీవితచరిత్రకాదు. భాషకు వారొసర్చిన సేవకు ఒక పాటిసంగ్రహ విషయ సూచిక.

విజయనగరచరిత్ర (మొదటిభాగము), కృష్ణదేవ రాయలు (అను పూర్వ స్వతంత్ర, భారతీ రచనలు) రెండు యిటీవల ఆంధ్రప్రదేశ పురావస్తు పరిశోధకశాఖ వారిచే పునర్కరూపమున ప్రచురింపబడినవి. తెనుగు విష్ణుకుండిన చరిత్ర ప్రచురణకు సిద్ధముగానున్నది. ఆంగ్లమున కృష్ణదేవరాయల చరిత్రను వ్రాయుచున్నారు.

శ్రీ వేంకటరమణయ్యగారు ఎనుబదిరెండ్ల వృద్ధులైనను ఎంతో ఓపికతో ఇంకను పరిశోధన చేయుచున్నారు. వీరికింకను దేశసేవ చేయించును గాక.



# చక్రపాణితో గోష్ఠి

1. ప్రశ్న : తెలుగు సినిమాల ద్వారా ఒక రకం 'వాడుక భాష' బాగా ప్రచారంలోకి వచ్చింది అని ఎందరో అనుకుంటున్నారు. నిజమా? 'మాండలికాలు' ఏవయినా తెలుగు సినిమాలలో ఉపయోగించడం జరిగిందా? ముందు ముందు ఉపయోగించడం జరుగుతుందా?

జవాబు : సినిమాలద్వారా ప్రచారంలోకి వచ్చిన 'వాడుకభాష' అంటూ ఏదీలేదు. దిన, వార పత్రికలు అలవాటు చేసిన వ్యావహారిక భాషనే సినీ రచయితలూ ఉపయోగిస్తున్నారు. మొట్టమొదటి తెలుగు దినపత్రిక అయిన 'ఆంధ్రపత్రిక' మొదట్లో—ఒక్క సంపాదకీయంలో తప్ప—వార్తా ప్రచురణ అంతా గ్రాంథికంలోనే సాగించేది. విలేఖరులు గ్రాంథికంలోనే వ్రాసేవారు. తరువాత తరువాత జనవాణి, ఆంధ్రప్రభ పూర్తిగా వ్యావహారికం ప్రచారంలోకి తెచ్చాయి. అన్ని ప్రాంతాలకూ ఆమోదయోగ్యమైన ఒక రకం వ్యావహారికం పత్రికలద్వారా ప్రచారంలోకి వచ్చింది. ఆ భాషనే రచయితలు తమ రచనలలో వాడడం మొదలు పెట్టారు. సినిమా సంభాషణలకు కూడా అదే భాషను రచయితలు నేటివరకూ ఉపయోగిస్తున్నారు—పౌరాణిక చిత్రాలలో తప్ప. రాను రాను పౌరాణిక చిత్రాలలో సంభాషణలుకూడా పత్రికల వ్యావహారికానికి దగ్గరగాఉండే భాషలోనే వ్రాయడం జరుగుతోంది. అంచేత సినిమాలు ప్రత్యేకంగా ప్రచారంలోకి తెచ్చిన వ్యావహారికం ఏదీలేదు. అయితే పత్రికల వ్యావహారికాన్ని సినిమాలు ప్రజలకు బాగా అలవాటు చేశాయి. పత్రికలు తండ్రి వంటివైతే సినిమాలు తల్లివంటివి. అందువల్ల పత్రికల వ్యావహారికం సామాన్య ప్రజకు 'మాతృభాష' అయింది.

ఇక మాండలికాల విషయం.

రచయిత పుట్టి పెరిగిన ప్రాంతాన్నిబట్టి, అతనువ్రాసే సంభాషణలలో ఎక్కడయినా ఆ ప్రాంతపు మాండలిక ప్రయోగాలు దొర్లి ఉండవచ్చు. కాని మాండలిక భాష విరివిగా సినిమాలలో వాడడం జరగలేదు. పాత్రోచితమైన భాష పేరుతో అప్పుడప్పుడు కొన్ని హాస్య పాత్రలకు మాండలిక భాష వాడడం జరిగింది. అయితే వ్రాసిన వారూ అవి పలికేవారూ ఆ 'యాస'ను పూర్తిగా ఒకే రకంగా పట్టుకోలేక పోవడంవల్ల, అది గడ్డను పుట్టిన భాషగా గాక కృతకంగా ధ్వనించడం జరిగింది, ఎన్నో చోట్ల. ఒక చిత్రంలో మన ప్రముఖ హాస్యనటుడు రేలంగి పోషించిన పాత్రను రచయిత తూర్పుభాష ఉపయోగించాడు. ఆ చిత్రం శతదినోత్సవ సందర్భంలో రేలంగి వివిధ కేంద్రాలు పర్యటించినప్పుడు—ఆ మాండలికం తెలియని జిల్లాలలో అసలా భాష హాస్యమే పుట్టించలేదనీ—తెలిసిన విశాఖపట్నంలో విద్యార్థులు తమ భాషను అపహాస్యం చేశాడని ఆ నటుణ్ణి దుయ్యబట్టారనీ—అతడే అన్నాడు. మాండలిక భాష ముందు ముంద

['సినిమా' ముఖ్యమయిన కళాసాధనాలలో ఒకటి, అంటే అతిశయోక్తి కానేరదు. తెలుగు చలన చిత్రాలు నేటి తెలుగు సమాజంమీద ఎన్నో విధాలుగా తమ ప్రభావాన్ని చూపిస్తున్నాయంటేకూడా అతిశయోక్తేమీ కానేరదు. చలనచిత్ర పరిశ్రమకి ఆంధ్రదేశంలో చెప్పుకోతగిన స్థానం ఉంది.

జానపద సాహిత్యం, నాటకాలని గురించి జరిగిన పరిశీలనలు చిన్నవంతుకూడా సినిమా గురించి జరిగినట్లు కనిపించదు. తెలుగు సినిమాలకి రాసే వారిలో ఎందరో రచయితలుగా పేరుపొందిన వారు ఉన్నారు, కనుక ఈ లోటు కొంత ఆశ్చర్యం కలిగిస్తూనే ఉంటుంది. రచయితగా, సంపాదకుడుగా చలన చిత్ర నిర్మాతగా పేరుపొందిన చక్రపాణిగారు కొన్ని ప్రశ్నలకి ఇచ్చిన సమాధానాలు ఎన్నో కొత్త ఆలోచనలు కలుగటానికి వీలు కలిగించ వచ్చు.

సంపాదకుడు]

యినా విరివిగా సినిమాలలో ఉపయోగించడం జరగదని పిస్తుంది.

2. ప్రశ్న : తెలుగు సినిమాలకు పేరు పొందిన బెంగాలీ కథలు ఎక్కువగానూ, తెలుగు రచయితల కథలు తక్కువగానూ ఉపయోగపడ్డట్లు ఒక ప్రవాదం ఉంది. ఇది ఎంత వరకు నిజం?

జవాబు : బెంగాలీ మూల కథలు ఆధారంగా నిర్మించిన తెలుగు చిత్రాలు బహుకొద్ది—దేవదాసు, స్వయంసిద్ధవంటివి వేళ్లమీద లెక్కపెట్టవచ్చు. అవి కూడా బెంగాలీలోనూ హిందీలోనూ విజయవంతమైన చిత్రాలుగా రూపొందిన తరువాతనే తెలుగులో తీయడం జరిగింది. అంచేత బెంగాలీ కథలు ఎక్కువగా తెలుగు చిత్రాలకు వినియోగపడ్డాయనడం నిజంకాదు. మొదటి దశలోకూడా ఆ మాత్రం స్వతంత్ర రచనలు తెలుగు చిత్రాలుగా రూపొందక పోలేదు. ఈ మధ్య కాలంలో ఎన్నో తెలుగు నవలలు చిత్రీకరించడం జరిగింది. 1972-73 సంవత్సరాలలో చిత్రకథలకు నవలల గిరాకీ ఎంతగానో పెరిగింది. పది పదిహేను తెలుగు నవలలు చిత్రాలుగా రాబోతున్నాయి. నిజానికి బెంగాలీ కథలకన్న తమిళ కథలు ఎక్కువగా తెలుగు చిత్రాలుగా రూపొందాయి. తమిళంలో విజయవంతమైన చిత్రాలుకొని తెలుగులో నిర్మాతలు నిర్మించారు. అలాగే మంచి తెలుగు చిత్రకథలుకొని తమిళులు తీశారు. ఈ రకమైన వినిమయం తెలుగు తమిళ కన్నడ మళయాళ భాషలమధ్య ఎక్కువ. కొద్ది బెంగాలీ కథలు, మరాఠీ కథలుకూడా తెలుగు చిత్రాలుగా వచ్చాయిగాని, అటువంటివి తక్కువ.

3. ప్రశ్న:—నేటి రచయితల భావనా శక్తి, చైతన్యం మీద సినిమాల ప్రభావం చాలా ఉందని కొందరి నమ్మకం. మీరే మంటారు?

జవాబు : ముప్పై నలభై ఏళ్ల క్రితం రచయితలమీద సినిమా ప్రభావం ఏమీ లేదు. టాకీలకు కొత్తరోజులవి. చదువుకున్నవారి సంఖ్య తక్కువ. వారిలోనూ సాహిత్యాభి రుచిగల మేధావులు ఏ కొద్ది మందో ఉండేవారు. ఆ రోజుల్లో రచయితలు ఆ మేధావులకోసమే వ్రాసేవారు. ప్రపంచ సాహిత్యరీతుల ప్రభావం వారిమీద ఎక్కువగా ఉండేది. క్రమంగా సినిమా దేశంలో ఏకైక వినోద సాధనంగానూ వ్యాపారంగానూ స్థిరపడి పోయింది. అక్షరాస్యతకూడా కొంత పెరిగింది. క్రమంగా రచయితలు సామాన్య ప్రజను రంజింపజేసే కథలు వ్రాయడం మొదలుపెటారు. ఈ నాడు ఎందరో రచయితలు తమ రచన సినీమాకు ఉపయోగపడాలనే దృష్టితోనే వ్రాస్తున్నారు. పుస్తకాలు ప్రచురించిన దానికన్న సినీమాకు కథ ఎన్నిక అయితే ఎక్కువ డబ్బు వస్తుంది. అందువల్ల సినిమా ప్రభావం నేటి రచయితలమీద ఎక్కువగా ఉంది. ఈ నాడు పత్రికలలో ధారావాహికంగా వెలువడుతున్న నవలలు ంచుమించు అన్నీ స్త్రీలకు కుతూహలం కలిగించి, వారి మనస్సును కరిగించే సంఘటనలతో నిండి ఉంటున్నాయి. సినిమాలకు కావలసిందికూడా అదే గనక, ఆ కథలు సినిమా నిర్మాతలు కొని చిత్రాలు తీస్తున్నారు. అందువల్ల రచయితల భావనాశక్తి వారి చైతన్యంమీద సినిమా ప్రభావం ఎంతో ఉంది.

4. ప్రశ్న:—ప్రయోగాత్మక చిత్రాలు తెలుగులో రాకపోవడానికి కారణం ఏమిటి?

జవాబు : సినిమా పెద్దపెట్టుబడితో జరిగే వ్యాపారం. సాధారణంగా చిత్ర నిర్మాత తనకు ప్రతిఫలం ఎక్కువ రావాలని ఆశించి చిత్రాలు తీస్తాడు. ప్రయోగ చిత్రాలుతీసి, అవి ప్రజామోదం పొందక పోతే అతను పూర్తిగా చితికి పోతాడు. అంచేత ఏ చిత్ర నిర్మాతా ప్రయోగ చిత్రాల జోలికి పోడు. ఆ మాటకొస్తే కొత్త రచనా ప్రయోగాలను పత్రికలే ప్రచురించడం లేదు. వ్యాపార దృష్ట్యా బాగా స్థిరపడ్డ వారపత్రికలలోకూడా మేధావులకు రుచించే రచన ఒకటి కూడా కనబడదు. ప్రచురించే అన్ని కథలలో ఏ ఒక్క కథో మేధావులకు నచ్చేది వేసినా పత్రిక వ్యాపారరీత్యా దెబ్బతినదు. అయినా పత్రికలు ఈ సాహసం చెయ్యడం లేదు. ఇంక సినిమా నిర్మాతలు ఎలా సాహసించగలరు? ప్రజల అభిరుచి పెరిగి, విద్యా సంస్కారాలు విస్తృ

ఆంధ్ర సాహిత్యానికి
అనుపమాన సేవచేసిన



స్వర్ణ భారతికి

ఇవే...
నా
హృదయఃపూర్వక
నివాళులు

ఎమ్మెస్ రెడ్డి
కౌముదీ పిక్చర్సు
10, డా. నాయఃర్ రోడ్డు,
మద్రాసు - 600017.

తమై కొత్త రకం చిత్రాలుచూసి ఆనందించే హృదయ వైశాల్యం ప్రజలకు అలవడినప్పుడు, ప్రయోగాత్మక చిత్రాలు తప్పక వస్తాయి. కాని తెలుగుదేశంలో అటువంటి అవకాశం కనుచూపు మేరలో ఉన్నట్టు కనబడదు.

5. ప్రశ్న:—సినిమాలమీద రచయితల ప్రభావం ఏమన్నా ఉందా?

జవాబు : ఏమీ లేదు. ప్రముఖ రచయితల చేత సినిమాలకు వ్రాయించాలని కొందరు నిర్మాతలు ప్రయత్నించారు. హాలీవుడ్ మొదలుకొని హిందీ, తెలుగు చలనచిత్ర రంగాలవరకు. ప్రముఖ ఆంగ్ల రచయిత వోడ్‌హౌస్ హాలీవుడ్‌లో చాలా కాలం ఉన్నాడు. ప్రేమ్‌చంద్, సుదర్శన్, ఉగ్రవంటి ప్రముఖ హిందీ రచయితలను కూడా హిందీ చిత్ర నిర్మాతలు ఆహ్వానించారు. కాని ఇంచుమించు అందరూ విఫలులయారు. ఆ రచయితలు చలనచిత్ర నిర్మాణాన్ని తమ ప్రతిభకు అనుగుణంగా మలుచుకోలేక పోయారు. సినిమా ప్రభావానికి లొంగిపోయిన రచయితలే, ఈ రంగంలో స్థిరపడ గలిగారు. తెలుగు సినీ రంగంలోనూ అదే జరిగింది.

6. ప్రశ్న:—తెలుగు సినిమాలకు వ్రాసేవారిలో పద్యకవితలు వ్రాసిన కవులే ఎక్కువమంది ఉన్నారన్నది నిజమేనా?

జవాబు : కాదు. పద్య కవితలు వ్రాసే వారెవరూ కథా రచయితలుగా, సంభాషణా రచయితలుగా సినీ రంగంలోకి రాలేదు. శ్రీ శ్రీ, అనిసెట్టివంటి కవులు డబ్బింగు చిత్రాలకు ఎక్కువ వ్రాశారేగాని, స్వతంత్రంగా సంభాషణలు వ్రాసినది బహు అరుదు. సినీరంగంలో స్థిరపడ్డ రచయితలలో ఎక్కువమంది నాటకకర్తలుగా పేరుపొందినవారు ఆత్రేయ, నరసరాజు, పినిసెట్టి, నంది, దాసరి నారాయణరావు అందరూ నాటకకర్తలే. కొందరు కథలువ్రాసే వారు కూడా ఉన్నారు. పద్మరాజు వంటివారు.

7. ప్రశ్న:—తెలుగులో చిత్ర నిర్మాణం మొదలయిన నాటినించి నేటివరకు స్థూలంగా వచ్చిన మార్పు లేమిటి?

జవాబు : తెలుగులో చిత్ర నిర్మాణం 1934—35 లో ప్రారంభమైంది. మొదటి అయిదారు సంవత్సరాలపాటు తీసిన చిత్రాలలో ఎక్కువ భాగం పౌరాణిక గాథలు. కొన్ని జానపద చిత్రాలుకూడా ఆ రోజుల్లో వెలువడ్డాయి. 1937—38 లో వాహిని—సారథి సంస్థలు రంగంలో ప్రవేశించి సాంఘిక చిత్రాలు తియ్యడం మొదలు పెట్టాయి. యుద్ధానంతరం వచ్చిన చిత్రాలలో సాంఘికాలే ఎక్కువ. 1952 నాటికి ఇంచుమించు జానపద చిత్రాలు ఆగిపోయాయి. తిరిగి 1960 తరువాత భట్టివిక్రమార్కతో ప్రారంభమై జానపద చిత్రాలు విరివిగా రావడం మొదలుపెట్టాయి. విఠలాచారి, భావనారాయణ ఎన్నో విజయవంతమైన జానపద చిత్రాలు తీశారు. అయిదారు సంవత్సరాలక్రితంవరకు వాటి దశ వెలిగింది. ఆ తరవాత ఇంచుమించు ఆగిపోయాయి. క్రిందటి దశాబ్దంలో గూఢచారి చిత్రాలు విరివిగా వచ్చాయి. ఈ మధ్య అవికూడా తగ్గాయి. ఆ నాటినుంచి నేటివరకూ సాంసారిక జీవితాన్ని ప్రతిబింబించే సాంఘిక చిత్రాలు వస్తూనే ఉన్నాయి, ప్రజాదరణ పొందుతూనే ఉన్నాయి. సాంకేతికంగా చిత్ర నిర్మాణంలో అభివృద్ధి ఆ యేటి కాయేడు ఎంతగానో కనిపిస్తోంది. కథ చెప్పే విధానంలో—యుగధర్మాన్నిబట్టి వేగం బాగా పెరిగింది. ముందు ముందు ఇంకా ఎన్నో మార్పులు రాబోతాయి. కొంతవరకు పట్నవాస ప్రజలు ముఖ్యంగా యువతరం కొంతమారారు. అయితే సామాన్య ప్రజల అభిమానాలు అభిరుచులు ఎక్కువగా మారలేదు. పల్లెప్రాంతాల ప్రజలు వెనకటిలాగే ఉన్నారు. అంచేత పాత సెంటిమెంట్సుకు ప్రాధాన్యమిచ్చే సాంఘిక చిత్రాలు ప్రజాదరణ పొందుతూనే ఉంటాయి.

8. ప్రశ్న:— ముందు ముందు తెలుగు సినీ రంగంలో ఎటువంటి మార్పులు రానున్నాయి?

జవాబు : తెలుగు సినిమా కొత్త పుంతలు తొక్కలేదు. ఇతర భాషలలో వెలువడ్డ కొత్త రకం ప్రయోగాత్మక చిత్రాలు—విజయవంతమైనవి, తెలుగు నిర్మాతలు కొని తీయడం జరిగింది. ఈ చిత్రాలు విజయవంతం కావడం చూసి, కొందరు నిర్మాతలు అనుకరిస్తున్నారు. కొందరు విజయం సాధించగలుగు

తున్నారు. కొందరు దెబ్బతింటున్నారు. ముందు ముందు ఎటువంటి మార్పులు రానున్నాయో ఊహించడం కష్టం. ఒకటిమాత్రం చెప్పవచ్చు. ఇప్పుడు కొంత చదువూ సంస్కారం ఉన్న యువకులు నిర్మాతలుగా దర్శకులుగా సినీరంగంలో ప్రవేశిస్తున్నారు. వారినుంచి కొత్తతరహా చిత్రాలు వస్తాయని ఆశించవచ్చు. భాషకు సంబంధించినంతవరకు, కొంత వరకు మాటలలోనూ, అంతకన్న ఎక్కువగా పాటల లోనూ సాహిత్యపు విలువలలో పులోగతి కనిపిస్తోంది. ఎక్కడో క్లబ్బు డాన్సులవంటివాటిలో తప్ప అశ్లీలత అంతగా కనిపించడంలేదు. ఈ ఇష్టాగోష్ఠిని ముగిస్తూ ఒక్కమాట.

ముసలి తరంవారు తమ తరువాతి తరంవారు దిగజారిపోతున్నారని వాపోడం మనం చూస్తుంటాం. అది పొరబాటు. మా తాతలకన్నా మా తరం వారం ముందంజవేశామని మా నమ్మకం. అది చాలావరకు నిజం. ఆ నిజమే మా తరువాతి తరంవారికీ వర్తిస్తుంది. మేం ఏమనుకున్నా, కాలచక్రం వెనక్కి తిరగనట్టుగానే, అభివృద్ధి వెనుకంజవెయ్యదు. ప్రతివ్యక్తి తాను ఆగినచోటే ప్రగతిచక్రం ఆగిపోయిందనీ, ఆగిపోవాలనీ అనుకుంటాడు. ఇది మానవ సహజం. నేటి యువతరం కొన్నాళ్ళు గడిచాక ఇలాగే అనుకోవచ్చు. కాని ఆ తరువాతి తరంవారు వారికన్న అన్నిరంగాలలోనూ ముందంజవెయ్యడం తథ్యం. మహాభారతకాలంనాటి విలువలు ఆచారాలు మహమ్మదీయ పరిపాలననాటికి లేవు. మహమ్మదీయులనాటి విలువలు ఆచారాలు ఆంగ్ల పరిపాలననాటికి లేవు. ఆనాటి విలువలు స్వతంత్రభారతంలో లేవు. ఈ మార్పులు ఇంతటితో ఆగవు. సాంఘిక ఆర్థిక వ్యవస్థలు ఎప్పటికప్పుడు మారుతూనే ఉంటాయి. మార్పును ఎవరూ ఆపలేరు. ప్రతిమార్పూ అభివృద్ధి కాకపోవచ్చు. కాని నాగరకత మొత్తం పరిశీలిస్తే, ఈ మార్పులవెనుక కొంత అభివృద్ధి విధిగా ఉండి తీరుతుంది. ఆ మార్పులకు అనుగుణంగా రేపటి సాహిత్యాది కళలతోపాటు సినీమాకళ కూడా మారుతుంది. ఆ మార్పు వెనుక అభివృద్ధి విధిగా ఉంటుంది.

---



# కోరా

ఇటలీ పాలరాతితో చెక్కిన కుక్క విగ్రహం, మనిషి ఎత్తునిమించి బంగారురంగు బుద్ధ విగ్రహం (ఇది ఆగ్నేయ ఆసియాలో ఎక్కడో తయారయినదిగా తోస్తుంది), చెయినాభాష అక్షరాలుకల టీకెటిల్



శ్రీ కోడూరు రామమూర్తి

(ఆదేశం ఉత్పత్తి), పాతఫిడేళ్లు, విచిత్రమయిన ఆకారాలు కల ఇతర సంగీతవాద్యాలు, ఏవేవో పౌరాణిక గాథలలోని సన్నివేశాల చిత్రపటాలు, కొయ్యశిల్పాలు, పాతవస్త్రాలు, దీపాలు, తోలుబొమ్మలు, పాతపుస్తకాలు, సాలిగ్రామాలు, విగ్రహాలు, శంఖాలు ... శ్రీ కోడూరి రామ్మూర్తిగారి ఇంటికి వెళ్లగానే కనిపించేవి ఇవన్నీ, ఇంకా ఎన్నో ...... రామ్మూర్తిగారి ఇల్లు ఒక మ్యూజియమ్‌లాగ ఉంటుంది. ఆయన ఒక్కొక్క వస్తువునీ చూపించి వాటి చరిత్రని గురించి చెప్తూఉంటే ఆయనకి తెలుగు కళాకారుల మీదఉండే గాఢాభిమానం ఎటువంటిదో తెలుస్తుంది — ఎందుకంటే, ఏదయినా వస్తువు తెలుగు మాట్లాడే వాళ్లు తయారుచేసినది అయితే ఆయన ఆ విషయాన్ని మళ్లీ మళ్లీ నొక్కి చెప్తారు. రామ్మూర్తిగారితో కొంతసేపు గడిపిన వారికి — ఆయన వచ్చిన వారిని పానీయాదులతో సత్కరించటాన్ని గురించి వేరే చెప్పనవసరంలేదు—ఈ కాలం వదిలి కనీసం ఒక శతాబ్దం వెనుకకి వెళ్లినట్లుంటుంది! ఇదొక విధంగా చూస్తే ఒక ప్రమాదమే! అసలు రామ్మూర్తిగారే బొమ్మలు వేస్తారన్న సంగతిని మర్చిపోయే ప్రమాదం అది... 'కోరా'గారు ఆధునిక పద్ధతులని అనుసరించి బొమ్మలు వేస్తారు. (పాతవస్తువులమీది ప్రేమలో మునిగిపోయిన ఆయన నేటి కాలప్రభావానికి దూరం అయిపోలేదు!) 'వాటిలో 'పాత' ఏమయినా ఉందా?' అంటే, 'ఉంది!' అనవచ్చు...'కోరా'గారు పాతకాలం చిత్రకారులు కొన్ని వృక్ష విశేషాలనుంచి ఏవిధంగా రంగులు తయారుచేసి వాటిని వాడేవారో అదే విధంగా తామూ రంగులు తయారుచేసి వాటితో 'కొత్త' బొమ్మలు— ఈకాలం అభిరుచులకి కూడా సరిపోయేవి—వేస్తారు. (ఆయన మామూలు వాటర్ కలర్‌లతోవేసిన బొమ్మలు వగయిరాల సంగతి సరేసరి! వాటినిగురించి ఇక్కడ చెప్పుకోనక్కరలేదు!) అటు



దేవదాసి (తంజావూరు పద్ధతి)

వంటి బొమ్మ ఒకదానిని ఈ భారతి సంచికలో చూడవచ్చు... శ్రీ కోడూరి రామ్మూర్తిగారు కేవలం చిత్రకారులుకారు తెలుగువారి కళాభిరుచులన్నిటికీ ఒక చిహ్నం వంటివారు...

(ఒక విలేఖరి)



‘ అధరసుధ ’ (కలంకారీ పద్ధతి)

చిత్రకారుడు : శ్రీ కోడూరు రామమూర్తి.

# తమిళ భాషా సాహిత్యములపై తెలుగు ప్రభావము

డా॥ చల్లా రాధాకృష్ణ శర్మ

తమిళ నవయుగ ప్రవక్త అయిన సుబ్రహ్మణ్యభారతి 1917 వ సంవత్సరంలో 'తెలుంగ మహాసబై' (ఆంధ్ర మహా సభ) అనే ఒక వ్యాసం వ్రాస్తూ, అందులో ఇలా పేర్కొన్నారు. "రాజనీతి శాస్త్రంలో తెలుగు వారికి గల ప్రావీణ్యం అతి ప్రాచీనమైనది. పాటలీపుత్ర నగరంలో వర్ధిల్లిన ఆంధ్ర రాజ్యమూ, తరువాతి కాలంలో తమిళనాడును పరిపాలించిన విజయనగర సామ్రాజ్యమూ పేర్కొనదగినవి. తెలుగువారు తమిళుల్ని పరిపాలించిన చిహ్నాలు మన భాషలోనూ నిఘంటువుల లోనూ చెరగని ముద్రలుగా నిలిచిపోయినవి. మన సంగీత నాట్య శాస్త్రాలు కూడా నేటివరకూ తెలుగులోనే మునిగి వున్నవి. మన గాయకులు పాడే కీర్తనలలో ఉత్తమమైనవి తెలుగు కీర్తనలే. దేవదాసీలు నాట్యం చేసేటప్పుడు పాడబడే వర్ణములూ, జావళీలూ మొదలైన వాటిలో కూడా రుచికరములైనవి తెలుగు భాషలోనివే. మన గ్రామాలలో నివసిస్తున్న తెలుగు రెడ్లు, నాయుళ్లు, బ్రాహ్మణ పురోహితులు, దేవదాసీలు (శ్రీకృష్ణదేవ) రాయల వారి కాలంలో ఇక్కడికి వచ్చి స్థిరపడిన వారే. మన వివాహ సమయాలలో పాడే పాటా, లాలీ మొదలైనవన్నీ కూడా తెలుగువారి సంప్రదాయానికి చెందినవే. మన భాషలో గమనం (సునిశిత పరిశీలన) సొగసు, ఎచ్చరిక, దొర, వాడిక, కొంచెం మొదలైన నూర్లకొలది తెలుగు మాటలు కలసి మెలసిపోయినవి. తెలుగువారి యేలుబడిలో తమిళనాడులో అధర్మం అన్నది లేదు. తమిళులకు ఒక న్యాయమనీ, తెలుగువారికి మరొక న్యాయమనీ ఉండేది కాదు. తెలుగు జాతి రాజనీతి శాస్త్రంలో అందె వేసిన జాతి......"

తెలుగువారి పరిపాలనలోని వైశిష్ట్యమునే కాక తెలుగు భాషలోని మాధుర్యమును కూడా గ్రహించిన సహృదయుడు సుబ్రహ్మణ్య భారతి. ఆయన దృష్టిలో తెలుగు సుందరమైన భాష. గానానుకూలమైన భాష. భారతదేశం అనే మధుర గీతంలో తమిళ జాతీయ కవి తెలుగు భాషను ప్రశంసించిన తీరుని పరికించండి.

"విరియ గాచిన వెన్నెల రాత్రిలో
చేర దేశపు చెలులు చెంతనుండన్
సుంద రాంధ్ర పదమ్ము పాడమున్
సింధునదిని పడవ నడుపుచు నాడదాం."

తెలుగు, తమిళం, కన్నడం, మొదలైనవి దక్షిణ భారత దేశంలో ప్రచారంలో వున్న భాషలలో ప్రధానమైనవి. ఇవి బహు ప్రాచీనమైనవే కాక, తోబుట్టు భాషలు కూడా! కాగా, ఈ భాషలు వ్యవహరించే వారిమధ్య దగ్గరి చుట్టరికం నెలకొనడంలో ఆశ్చర్యంలేదు.

క్రీస్తుశకం 11 వ శతాబ్దిలో సంతరించబడిన కళింగ త్తుప్పరణి అనే తమిళ చారిత్రక కావ్యంలో తత్కర్త అయిన కవి చక్రవర్తి జయంగొండార్ కన్నడ భాషను గురించి ముచ్చటిస్తూ, అందులో కొన్ని తెలుగు మాటలూ, పెక్కు తమిళ శబ్దములూ కానవచ్చినట్లు పేర్కొన్నాడు. అనగా తెలుగు, తమిళ శబ్దాల కలయికవల్ల కన్నడం ఏర్పడినట్లు ఆయన అభిప్రాయం. కన్నడ పండితు లీ అభిప్రాయాన్ని సమర్థించరు. కాని సుప్రసిద్ధ తమిళ పరిశోధక విద్వాంసులూ, బహు గ్రంథ రచయితలూ అయిన ము. రాఘవయ్యంగారు తమ 'ఆరాయ్చ్చి త్తొగుది' అనే వ్యాస సంకలనంలో తెలుగు కన్నడ భాషలను గురించి ప్రస్తావిస్తూ, పేర్కొన్న అంశాలు గమనింపదగినవి. "అది (కన్నడం) తమిళం, తెలుగు (వడుగు) భాషల కలయికవల్ల ఏర్పడిన భాష అని ప్రాచీన తమిళ విద్వాంసుల విశ్వాసం.....ఈ ప్రమాణములను పురస్కరించుకొని చూడగా, తెలుగునకు తమిళమునకు ఉన్నంత ప్రాచీనతగలదని గ్రహించవచ్చును."

కాగా, తెలుగు తమిళములు బహు ప్రాచీనములైన భాషలనీ, వీటిని వ్యవహరించేవారి నడుమ నెలకొన్న బాంధవ్యం కూడా బహు ప్రాచీనమైనదనీ నిస్సంశయంగా చెప్పవచ్చు.

తమిళ వాఙ్మయంలో ప్రాచీనమూ, ప్రశస్తమూ అయిన గ్రంథం తొల్కాప్పియం. ఇది ప్రామాణికమైన లక్షణ గ్రంథం. దీన్ని రచించిన తొల్కాప్పియనార్ కావ్యములలో ప్రయోగింపదగిన తమిళ శబ్దములను ఇయఱ్ చొల్ (వ్యవహారంలో మార్పు చెందని తమిళ శబ్దములు), తిరిచొల్ (మార్పు చెందిన శబ్దములు—కావ్య ప్రయోగములు) దిశైచ్చొల్ (అన్య దేశ్యములు) వడసొల్ (సంస్కృత శబ్దములు) అని నాలుగు విధములుగా విభజించాడు. ఈ విభాగంవల్ల, తొల్కాప్పియర్ కాలంనాటికే తమిళంలో అన్య దేశములూ సంస్కృత శబ్దములూ చోటు చేసుకున్నట్లు చెప్పవచ్చు.

అన్య దేశములను గురించి వివరిస్తూ తరువాతి లాక్షణికులు ఇలా పేర్కొన్నారు. తమిళదేశానికి చెందిన పన్నెండు భాగములకు వెలుపలవున్న దేశములనుండి—అనగా తమిళ దేశపు సరిహద్దు దేశములనుండి—గ్రహించబడిన శబ్దములకు దిశై చ్చొల్ కళ్ (అన్య దేశ్యములు) అనే పేరుకలిగింది.

ప్రాచీన కాలంలో తమిళభాష ప్రచారంలో ఉన్న దేశాన్ని పన్నెండు భాగాలుగా చేశారు. తమిళనాడుకి ఉత్తర సరిహద్దుగా తెలుగుదేశం ఉన్నట్లు తమిళ విద్వాంసులంతా అంగీకరించిన విషయమే. తొల్కాప్పియనార్ కాలపువాడైన పనం పారనార్ 'వడవేంగడం తెన్ కుమరి యాయిడై త్తమిళ్ కూఱు నల్లుల గత్తు' అని పేర్కొన్నాడు. ఉత్తరమున వేంకట శైలమూ, దక్షిణమున కన్యాకుమారీ ఈ రెంటికీ మధ్య వున్న ప్రదేశంలో తమిళభాష వ్యవహారంలో ఉన్నట్లు పై వాక్యం స్పష్టం చేస్తున్నది.

మయిలైనాదర్ అనే మరొక ప్రాచీన లాక్షణికుడు తమిళదేశము నావరించి పదిహేడు దేశము లున్నట్లు తెలియజేశాడు. వాటిలో ఒకటి తెలింగం. తొల్కాప్పియనారు గురువైన అగస్త్యుని కాలంలోనే ఈ వివిధ దేశముల నుంచీ మాటలు కొన్ని తమిళంలో ప్రవేశించివుండవచ్చునని మయిలైనాదర్ వ్రాతవల్ల తెలియవస్తున్నట్టు యస్. వైయాపురిపిళ్ళై తమ 'ఇలక్కణ చ్చిన్దనైగళ్' (పుట 44) లో పేర్కొన్నారు.

తెలుగువారు తమిళమును అరవ మనీ, తమిళుల్ని అరవ లనీ వ్యవహరించడం పరిపాటి. అలాగే తమిళులు తెలుగుని మొదట్లో వడుగు అనే పేరుతోనూ, తెలుగువారిని వడగర్ అనీ వ్యవహరించారు. వడుగు శబ్దం ప్రాచీనమైనది. తమిళ వాఙ్మయంలో తొలియుగమైన సంగకాలంలోనే వడుగు శబ్దం వాడుకలోకి వచ్చింది. తరువాతి కాలంలో తెలుగు వారిని తెలుంగన్ అని వ్యవహరించడం జరిగింది. నేటికీ తెలుగు బలిజ కులస్థుల్ని తమిళులు వడుగర్ అనే వ్యవహరిస్తున్నట్లు తెలుస్తున్నది.

సంగకాలపు గ్రంథములైన అగ నానూఱు, పుఱ నానూఱు కుఱుంతొగై మొదలైన వాటిలో వడుగు శబ్దం తొమ్మిది చోట్ల వాడబడింది. వడుగులు తమిళమునకు భిన్నమైన భాష వాడేవారనీ పరాక్రమోపేతులనీ తమిళ సేనా నాయకులకు శత్రువులనీ చెప్పబడింది. సంగవాఙ్మయంలోనే తెలుగు నాయకుల పేర్లు కనిపించడం గమనింపదగిన విషయం.

సంస్కృత శబ్దాలతోపాటు తెలుగు మాటలు కూడా వ్యావహారిక తమిళంలోనే కాక, గ్రాంథిక తమిళంలోనూ ప్రవేశించక పోలేదు. మదరాసు విశ్వ విద్యాలయంవారు ప్రకటించిన తమిళ నిఘంటువులో తెలుగునుండి 488 మాటలు తమిళంలో ప్రవేశించినటుగా తెలుపబడింది. కాని డా. వి. ఐ. సుబ్రహ్మణ్యన్ 450 తెలుగు మాటలే ప్రవేశించినట్లు అభిప్రాయపడ్డారు. మరి యే యితర ద్రావిడ భాషనుంచికూడా ఇన్ని మాటలను తమిళం గ్రహించకపోవడం పేర్కొనదగిన అంశం.

నేటికీ తమిళులు తమ దైనందిన వ్యవహారంలో ఉపయోగించే కొన్ని తెలుగు మాటలను పరిశీలిద్దాము.

కొంజం (కొంచెం)
కొంజమా నంజమా (కొంచెమా నంచమా)
కోమట్టి (కోమటి)
కోసరం (కోసం)
నయ్‌నా (నాయన)
సిన్న (చిన్న)
ఉప్పుసం (ఉబ్బసం)
సోమారి (సోమరి)
తప్పు తంటా

వ్యావహారిక తమిళంలో—ముఖ్యంగా మదరాసు, చెంగల్పట్టు, దక్షిణ ఉత్తరార్కాడు జిల్లాల తమిళంలో—తెలుగు భాషా ప్రభావం మరింత స్పష్టంగా గోచరిస్తుంది. మదరాసు పరిసరాలలో తమిళులు కొందరు తెన్నం చెడి (కొబ్బరిచెట్టు) వాళ చ్చెడి (అరటి చెట్టు) అని వ్యవహరిస్తారు. చెడి అనగా మొక్క. చెట్టుని మరం అంటారు. చెడి, చెట్టు పర్యాయపదములుగా ఉండడంవల్ల తెలుగువారివలె మదరాసు ప్రాంతపు తమిళులు కొబ్బరిచెట్టు, అరటిచెట్టు అని వ్యవహరిస్తున్నారని భావించవచ్చు. కాని మధుర, తిరునెల్వేలి మొదలైన ప్రాంతాలలో తెన్నమరం, వాళమరం అనడం అలవాటు. మనం చెట్టూ చేమా అన్నట్లుగా చెంగల్పట్టు జిల్లాలో కొన్నిచోట్ల చెడి చెట్టు అనడం వాడుక.

మరొక ప్రయోగం. తమిళ వైష్ణవులు సెయ్‌దు కొండు (చేసికొను) అనడానికి బదులుగా సెంజిట్టు అంటారు. చేసికి ప్రతి రూపం సెంజి అనవచ్చు. కొన్ని తమిళ సమాసాలలో కూడా తెలుగు మాటలు చోటు చేసుకున్నవి. అట్లు దొడ్డి, ఎర్రంగాడు మొదలైన మిశ్ర సమాసాలు ఈ కోవకు చెందినవే. వీటిలో దొడ్డి, ఎర్ర అనేవి తెలుగు మాటలు. ఇటువంటి మిశ్ర సమాసాలు ముప్పయితొమ్మిది తమిళ నిఘంటువులో పేర్కొన బడినవి.

వైష్ణవ మత గ్రంథాలు చాలా వరకు తమిళంలోనే ఉన్నా, తమిళం వైష్ణవులకు (ఆంధ్ర వైష్ణవులకు కూడా) మత భాష అయినా, వైష్ణవుల యింటి పేర్లలో తెలుగుదనం ఉట్టిపడుతూ ఉండడం గమనింపదగినది. మాడభూషి, చక్రవర్తుల, నల్లాన్ చక్రవర్తుల మొదలైనవి వైష్ణవుల యింటి పేర్లు. తమిళులకు ఇంటి పేర్లు లేవు. శ్రీమద్రామానుజాచార్యులవారి యింటి పేరు ఆసూరివారని చెపుతారు. ఆయన ముఖ్య శిష్యులలో ఒకడు వడుగ నంబి. అనగా తెలుగు నంబి అన్నమాట. నంబి అనేది గౌరవ వాచకం.

ఇక తమిళ కావ్యాలలో తెలుగు మాటలకు తావొసగిన మహా కవులలో మొదటివాడు, కవి చక్రవర్తి బిరుదాంకితుడైన కంబకవి అనవచ్చు. కంబడు క్రీస్తుశకం 11 వ శతాబ్దికి చెందినవాడు. కొందరు 9 వ శతాబ్ది అనీ అంటారు. మహాకవి తన రామాయణంలో యుద్ధకాండలో తమ్మి, అక్కట అనే తెలుగు మాటలు ఉపయోగించాడు. సుందర కాండలో 'తొలియ కురంగు'( తొలుట అనే అర్థంలో ) అని వాడాడు. తిరుప్పుగళ్, విరలి విడుతూదు మొదలైన రచనల్లో కూడా కొన్ని తెలుగు మాటలు చోటు చేసుకున్నవి. చాల, చెప్పు (మాట చెప్పు) వంటి కొన్ని మాటలు వాడుక తమిళంలో నేడు భ్రష్టము లయినవి. ప్రాచీన కావ్యాలలో ఇవి కనిపిస్తున్నవి. (అలయుం తొళువదు చాలవుం నన్ఱు—ఆలయమును సేవించుట చాల మంచిది) కాని శ్రీలంకలోని తమిళులు తెలుగువారివలె చాల, చెప్పు, చొల్ అని వ్యవహరిస్తున్నారు. అనగా, తమిళులు సకార లేక శకారయుక్తం పలికే మాటలను (చొల్— సొల్) శ్రీలంక తమిళులు తెలుగువారి వలె చకారయుక్తంగా పలుకుతున్నారని చెప్పవచ్చు.

భాషా విషయకంగానే కాక చారిత్రకంగానూ, సాంస్కృతికంగానూ తెలుగువారికీ, తమిళులకూ మధ్య సంబంధ బాంధవ్యాలు గలవు. ఇవి నిన్న మొన్నటివికావు. అతి ప్రాచీనమైనవి. సంగకాలంనుంచీ అవిచ్ఛిన్నంగా వస్తున్నవి. సంగ వాఙ్మయంలో తెలుగు నాయకుల పేర్లు కొన్ని కనిపిస్తున్న విషయాన్ని మొదటనే పేర్కొన్నాను. ప్రప్రథమంలో తెలుగువారూ తమిళులూ శత్రుభావంతో సంచరించినా కాలక్రమాన, వారుభయుల మధ్య స్నేహభావం నెలకొన్నది. చారిత్రకదృష్టితో చూస్తే, ఈ సంబంధాన్ని మూడు విభాగాలు చెయ్యవచ్చు

తమిళులూ, తెలుగువారూ స్నేహభావంతో సంచరించిన కాలం మొదటి విభాగం. సంగకాలమునకు తర్వాత పల్లవ మహీపతి మామల్లుని సేనాధిపతి అయిన పరంజ్యోతి వాతాపిని ముట్టడించి హస్తగతం చేసుకోవడంతో తెలుగువారికీ, తమిళులకూ నడుమ రాకపోకలకు శ్రీకారం చుట్టినట్టయింది. పల్లవుల పరిపాలనాకాలంలో భక్త్యుద్యమమునకు రాజాదరణ లభించింది. ఈ ఉద్యమ నాయకులు దక్షిణా పథమంతటా పర్యటించారు. దేశంలో అంతకుపూర్వం నెలకొన్న జైన బౌద్ధ మతాల వ్యాప్తికి అడ్డుమాకలు వేశారు. ఈ భక్త్యుద్యమం తమిళుల్నీ, తెలుగువారినీ సన్నిహితులుగా చేసి వుండవచ్చు.

రెండవ విభాగం చోళరాజులు తెలుగు నాడును కైవసము కావించుకుని పరిపాలించిన కాలం. ఆ రోజుల్లో చోళ వంశీయులు చాళుక్య నృపులతో వైవాహిక సంబంధం కూడా ఏర్పరుచు కున్నారు. విమలాదిత్యుడు రాజరాజచోళుని కుమార్తె అయిన కుందవిని పరిణయమాడడం, విమలాదిత్యుని కుమారుడైన రాజరాజనరేంద్రుడు మొదటి రాజేంద్రచోళుని కుమార్తె అయిన అమ్మంగదేవిని వివాహమాడడం, రాజరాజనరేంద్రుని కుమారుడు కులోత్తుంగచోళుడు చివరికి విశాల చోళ సామ్రాజ్యానికి రాజు కావడం మొదలైన విషయాలు విజ్ఞు లెరిగినవే. ఈ వైవాహిక సంబంధాల వల్ల, తమిళులు తెలుగు దేశంలో స్థిర నివాసములు ఏర్పరుచుకోవడమూ జరిగింది.

చోళ మహీపతులు బలహీనులైన తర్వాత విజృంభించినవారిలో కాకతీయులు ముఖ్యులు. కాకతీయులకాలంలో కూడా తమిళులు తెలుగు దేశానికి రాకపోకలు సాగిస్తూ వుండేవారని చెప్పడానికి, కంబకవి 1162 నుంచి 1197 దాకా రాజ్యం చేసిన మొదటి ప్రతాపరుద్రుని ఆస్థానమును సందర్శించడమే సాక్ష్యం.

మొదటి ప్రతాపరుద్రుడు ఓరుగల్లు నేలుచున్న కాలంలో మూడవ కులోత్తుంగచోళుడు చోళరాజ్యం పరిపాలిస్తూ వుండేవాడు. ఎందువల్లనో సరిగా తెలియరాలేదుగాని, చోళునికీ, కంబకవికీ మధ్య వైమనస్యం ఏర్పడింది. అందువల్ల కంబడు మొదటి ప్రతాపరుద్రుని ఆస్థానానికి వెళ్ళినట్లూ, ఆ తమిళ కవిరాజు కమనీయ కవితా శక్తికి కాకతీయ నృపుడు ముగ్ధుడైనట్లూ తెలియవస్తున్నది. ఆ సందర్భంలో కంబకవి ప్రతాపరుద్రునిమీద ఒక పద్యం చెప్పినట్లు ఐతిహ్యం. ఆ పద్య భావమిది: 'అవనియంతయు నీ అతిథులగుటవలనను, ఐరావతంవంటి పట్టపు ఏనుగు నెక్కి వూరేగుతున్న నిన్ను చూచి మోహం పట్టలేక మదవతులు కింద పరుచుకుని శయనించుటవలనను, రుద్రా! నీ ఒరంగల్లునాడులో అరటి యాకులు కరవైనవి.'

కంబకవి తన రామాయణ మహాకావ్యంలో తెలుగు మాటలకు తావు కల్పించడమే కాక, తెలుగు నేలను పైరు పచ్చల నెలవుగా తీర్చిదిద్దుతున్న గోదావరిని కూడా ప్రశంసించాడు. ఉత్తమ కవిత గౌతమీ ప్రవాహంవలె ఉండాలని పేర్కొన్నాడు. గోదావరి నడకలో ఉత్తమ కవితా లక్షణములను దర్శించిన కంబని యీ పద్యాన్ని పరికించండి.

'బువియును క్కణియా యార్న పొరుడన్ద పులత్తిట్రాగి
అవి యగత్తురై కడాంగియైన్దిణై నెఱియ ళావి
చ్చవియుడై త్తెళిను తణ్ణెన్రొళుక్కముం తుళువి
చ్చెన్రోర్
కవియెన క్కిడన గోదావరియినై వీరర్ కణ్డార్'

(ఆరణ్యకాండం, శూర్పణగైప్పడలం)

(భూదేవికి అలంకార ప్రాయమైనదీ, శ్రేష్ఠమైన వస్తువులను పొలాలకు సమకూర్చునదీ. వేడిని పోగొట్టగల రేవులు గలదీ, పలు ప్రాంతముల మీదగా ప్రవహించునదీ, చల్లనిదీ, పొంగే స్వభావం గలదీ, పెద్దలు చెప్పిన కవిత వంటిదీ — అయిన గోదావరిని పరాక్రమోపేతులైన రామ లక్ష్మణులు దర్శించినారు.

ఈ పద్యంలో అణి, పొరుళ్, తురై, తిణై, ఒళుక్కం అనే అయిదు మాటలు వాడబడినవి. ఇవి నదిపరంగానూ, కవిత్వపరంగానూ ప్రయుక్తములు.

నదిపరం :

అణి—సౌందర్యం

పొరుళ్—సారవంతమైన నీరు, ప్రవాహవేగంలో కొట్టుక వచ్చే వండుమట్టి మొదలైనవి.

తుఱై—వివిధ ఘట్టములు (రేవులు)

తిణై—నది ప్రవహించే మార్గం.

ఒళుక్కం—వంకర టింకర నడక.

కవిత్వ పరం:

అణి—అలంకారం

పొరుళ్—ధ్వని, భావం

తుఱై—భావ వ్యక్తీకరణ విధానం

తిణై—(శృంగార వీరరస ప్రధానములైన) ఇతివృత్తం

ఒళుక్కం—శైలీ మాధుర్యం.

'కిడన్ద గోదావరి' అనడంవల్ల పొంగుతున్న గోదావరిని కంబకవి చూచినట్లు గ్రహించవచ్చు.

నేను కాకతీయుణ్ణి, నిస్సహాయుణ్ణి కాను—అని అర్థమిచ్చే 'నాన్ కాక్కత్తియన్, పోక్కత్తియన్ అల్ల' అనే రుచికరమైన సామెత ఒకటి తమిళంలో ఉన్నది.

విజయనగర సమ్రాట్టులూ వారి సామంతులనదగిన నాయకరాజులూ తమిళనాడుని వశంచేసుకుని పరిపాలించిన కాలం మూడవ విభాగం. చోళుల యేలుబడిలో తమిళులు తెలుగుదేశానికి రాకపోకలు సాగించినట్లే, విజయనగరసార్వభౌముల దొరతనంలో తెలుగువారు ఎందరెందరో తమిళదేశానికి తరలివెళ్ళి, అక్కడే స్థిరనివాసాలు ఏర్పరుచుకున్నారు. వారిలో కవి పండితులూ గాయనీ గాయకులూ మొదలైనవారున్నారు. ప్రభువులు తెలుగువారయిన కారణం వల, ఆరోజుల్లో తమిళులు కూడా తెలుగు భాషాసాహిత్యాల అధ్యయనం చేశారు. అంతటితో ఆగక కొందరు తెలుగులో చక్కని రచనలు వెలయించి తెలుగుసాహిత్యంలో కూడా స్థానం సంపాదించుకున్నారు. ఈ కోవకు చెందినవారిలో సుబ్బరామదీక్షితులు, టి. యస్. మురుగేశం పిళ్ళ, ఆర్కాటు త్యాగరాజమొదలి, అప్పావు మొదలి మొదలైనవారు చిరస్మరణీయులు.

నాయకరాజుల కాలంలో మధుర తంజావురాది ప్రాంతాలలో తెలుగు కవితకు పెండ్లిపందిళ్ళు వెలిసినవి. మధుర రాజ్యంలో తెలుగే రాజభాషగా ఉండేదనవచ్చు. ఎందుకనగా, మధుర నాయక రాజులకు సంబంధించిన 25 శాసనాలు తెలుగులోనే ఉన్నవి. ఈ దృష్టితో చూసినప్పుడు, వీరికాలంలో వసుచరిత్రకంటె రసవత్కావ్యాలకు తమిళంలో అనువాదాలు వెలయడం వింతగా తోచదు. తంజావూరునేలిన మహారాష్ట్రులు కూడా తెలుగులో రచనలు చేయడంహర్షింపదగిన విషయం. పుదుక్కోట సంస్థానధ్వజంమీద 'శ్రీ బృహదంబా సహాయం' అని తెలుగులో వ్రాయబడివుండడం గమనింపదగిన అంశం. ఎట్టియాపుర సంస్థానంలోనూ తెలుగు పండితులు ఉండేవారు. ఈ విషయాదికాన్ని అలవోకగా పరిశీలించినా, అలనాటి తెలుగువారు తమిళనాడులో సాధించిన సాంస్కృతిక విజయం మహత్తరముయిందని తెలుస్తుంది. కనుకనే తెలుగు వెలుగు తమిళుల సాంస్కృతిక జీవనం మీద కూడా కొంతవరకు పడింది.

ఈ రాజకీయ సాంస్కృతిక సంబంధాల వల్లనే తెలుగు మాటలతోపాటు తెలుగు రచనలు కూడా తమిళసాహిత్యంలో చోటు చేసుకున్నవి.

తమిళంలో యాప్పరుంగలక్కారిగై అనే ప్రశస్తమైన ఛందోగ్రంథం ఒకటి ఉన్నది. ఇది క్రీస్తుశకం 11వ శతాబ్దిలో వెలుగులోకి వచ్చింది. దీన్ని అమృతసాగరుడనే జైనుడు రచించాడు. గుణసాగరుడనే మరొక జైన రచయిత యాప్పరుంగల విరుత్తి అనే వ్యాఖ్యానం వెలయించాడు.

యాప్పరుంగలం వెలుగులోకి రాకపూర్వమే తెలుగుకన్నడ భాషలలో వడుగుచ్ఛందం, గుణ కాంకియం అనే ఛందోగ్రంథాలు వెలువడినట్లు గుణసాగరుడు తన వ్యాఖ్యానంలో ఉదాహరించాడు. వడుగుచ్ఛందం అనగా ఆంధ్రచ్ఛందం. దీన్ని వాంచియార్ అనే జైనుడు వ్రాశాడట! గుణసాగరుడు ఈ తెలుగుకన్నడ ఛందోగ్రంథాలను ఉదాహరించడం వల్ల, వీటిని అమృత సాగరుడు కూడా సంప్రదించి వుండవచ్చు. కాని వాంచియార్ని గురించి మనకు వివరాలేమీ స్పష్టంగా తెలియడం లేదు. వాంచియార్ రేచియార్గా ఉండ దగుననీ, అప్పుడు వడుగుచ్ఛందం రేచియ (రేచన) రచించిన కవిజనాశ్రయం కావచ్చునని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు పేర్కొన్నారు. కాని తమిళ వ్రాత ప్రతులలో అపరంజియార్ అనే పేరు కనిపిస్తున్నదని శ్రీ ము. రాఘవయ్యంగారు పేర్కొన్నారు. ఈ విషయంలో ఇంకా పరిశీలన జరగవలసి వుంది.

తమిళ శైవ సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన గ్రంథాలలో బసవపురాణం ఒకటి. తమిళ బసవపురాణానికి పాల్కురికి సోమనాథుని బసవపురాణం మాతృక. కన్నడ బసవపురాణానికి కూడా ఇదే మాతృక.

తమిళ బసవపురాణం క్రీస్తుశకం 14వ శతాబ్దంలో వెలువడింది. ఇది పద్యకృతి. కవిని గురించిన వివరాలుసరిగా తెలియరాలేదు. కథాకథాన దృష్టితో చూచినపుడు, తెలుగు తమిళ బసవ పురాణాలలో కొంత భేదం ఉన్నట్లు కనిపిస్తుంది. తమిళ బసవ పురాణకర్త కన్నడ బసవ పురాణాన్ని కూడా అనుసరించడం వల్ల, కథాకథనంలో భేదం ఏర్పడింది. తెలుగులో లేని కథలు కొన్ని కన్నడ బసవ పురాణంలో కనిపిస్తున్నవి. అయినా శైవ సాహిత్యంలో పాల్కురికి సోమనాథునిది ఆచార్య పీఠమని చెప్పవచ్చు.

రామరాజ భూషణుని రమణీయ కృతి అయిన వసుచరిత్రకు తమిళంలో చక్కని అనువాదం ఒకటి వెలిసింది. తమిళ వసుచరిత్ర 16వ శతాబ్దచివరి భాగంలోగాని, 17వ

## బంగారు భారతికి!

50 వత్సరములు నిండిన శుభసమయమున

మా శుభాకాంక్షలనందజేస్తూ!!

కళాభిమానులకు 1974 లో మేము అందజేయు

మాకానుక నటరత్న పద్మశ్రీ **యన్.టి.రామారావు** నటించిన

# మనుషుల్లో దేవుడు

తారాగణం

గుమ్మడి - రాజబాబు

కృష్ణంరాజు - పద్మశ్రీ రేలంగి

ధూళిపాళ - సాక్షిరంగారావు

రామ్మోహన్ - రామదాసు

అశోక్‌కుమార్ మరియు

చిరంజీవి ఫణిచక్రవర్తి

వాణిశ్రీ

పద్మశ్రీ బి.సరోజాదేవి

విజయలలిత

అంజలీదేవి

పి.ఆర్.వరలక్ష్మి - రత్న మరియు

చిరంజీవి భువనేశ్వరి

నిర్మాత: ఎ.పుండరీకాక్షయ్య - దర్శకత్వం: బి.వి.ప్రసాద్

**శ్రీ భాస్కర చిత్ర** 11, గిరిరోడ్డు మద్రాసు-17

శతాబ్ది మొదటి భాగంలోగాని వెలిసినట్లు తెలియవస్తున్నది. ఆరవీటి శాఖకు చెందిన విజయనగరాధీశ్వరుల వంశీయుడూ, తిరుచ్చిరాపల్లి జిల్లాలోని మదురై పరిపాలకుడూ అయిన తిమ్మభూపతి ప్రేరణచే తొండైమాన్తురై అంగలత్తాడుం అయ్యన్ అనే కవి వసుచరిత్రను తమిళం చేశాడు. ఈ తిమ్మభూపతి ఉదిపరసత్తాడై పరువం అనే ఒక తమిళ కృతిని కూడా అంకితం పొందాడు.

అంగలత్తాడుం అయ్యన్ శివభక్తుడట! అతడు తెలుగులో అంత పండితుడు కాడు. ఇద్దరు మిత్రుల సహాయంతో వసుచరిత్రను అతడు తమిళం చేశాడు. కాని రామరాజభూషణుని కమనీయ శ్లేషను అనువదించడం సులభమైన పని కాదు. అయినా, తమిళకవి మూలంలోని సౌందర్యాన్ని తమిళ పాఠకులకు తెలియజేయడానికి ప్రయత్నించి చాలావరకు కృతకృత్యుడైనాడు. ఈ తమిళ వసుచరిత్రను మదరాసు, ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారం వారు 1952లో ముద్రించారు. తత్సంపాదకులైన శ్రీ టి. చంద్రశేఖరన్ తమ మున్నుడిలో ఇలా తెలియచేశారు. 'తమిళంలో చక్కని కల్పనలతో విలసిల్లే కంబరామాయణం, విల్లి భారతం, నైషధం మొదలైన కావ్యాలకు తరువాతిదిగా ఈ కృతిని ఉదాహరించవచ్చు'. కంబరామాయణాదులకు తమిళవాఙ్మయంలో చాలా ప్రచారం ఉన్నదని వేరుగా చెప్ప నవసరం లేదు.

తమిళకవుల్ని ఆకర్షించిన మరికొన్ని తెలుగురచనలూ లేకపోలేదు. వెంగపూడి కృష్ణయామాత్యుడు వ్రాసిన భానుమద్విజయం తమిళం చేయబడిందని బ్రౌన్ దొరవారి అభిప్రాయం. 1600 ప్రాంతమున నివసించిన పరమానందయతి రచించిన వేదాంత వార్తికమనే తాత్త్విక రచనను సదాశివయోగి తమిళంలోకి అనువదించాడు

ఎట్టయాపుర సంస్థానాధిపతులూ హూణాంధ్ర ద్రవిడ భాషా విశారదులూ అయిన జగదీశ్వరరామకుమార ఎట్టప్ప మహారాజుగారి ప్రోత్సాహంతో సుబ్బరామదీక్షితులు కవిత్రయం వారి మహాభారతమును తమిళం చేశాడు. సుబ్బరామదీక్షితులు సంగీత సాహిత్య మర్మజ్ఞుడు. అయిన తన సంగీత సంప్రదాయ ప్రదర్శినిలో ఇలా వ్రాసుకున్నాడు. 'ఎట్టప్ప మహారాజు శ్రీ మహాభారతమందు బద్ధస్పృహులు. కవిత్రయమువారిచే తెనిగింపబడిన శ్రీ ఆంధ్రమహాభారతము నీ మహారాజు అనుమతి వలన నాచే ద్రవిడీకరింపబడి యచ్చొత్తింప బడినది.'

ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్ర కూడా తమిళం చేయబడింది. అనువాదకులు శ్రీ కోమలీశ్వరన్‌పేట్టై శ్రీనివాసపిళ్ళై. ఆరోజుల్లో ఈ యాత్రాగ్రంథం చాలా ప్రచారంలో ఉండేదనేందుకు ఈ విషయం ఒక నిదర్శనం.

తెలుగు శతకాలు కూడా తమిళనాడులో ప్రచురప్రచారంలో ఉన్నవి. ముఖ్యంగా సుమతి, వేమన శతకాలు బాగా వ్యాప్తిలో ఉన్నవి. నేటికీ పౌరాణికులు పోతన భాగవతం నుంచి (గజేంద్రమోక్షం మొదలైన ఘట్టాలనుంచి) కొన్ని పద్యాలు ఉదాహరిస్తూ వుంటారు.

వేమన పద్యాలను సీతారామప్రసాద్ (1892), పుదువై నారాయణదాసర్ (1903) ప్రభృతులు తమిళం చేశారు. తెలుగు పద్యాలను తమిళలిపిలో ఇచ్చారు. అర్థ తాత్పర్యాలు కూడా ఇచ్చారు. నారాయణదాసర్ అనువాదం పేర్కొనదగిందే అయినా వేమన పద్యాలకు మంచి అనువాదం ఒకటి వెలువడ వలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

సుమతి శతకమును ఎళుమూర్ సమరపురిముదలియార్ తమిళం చేశాడు. ఈ అనువాదం 1904లో అచ్చయింది. తమిళలిపిలో తెలుగు పద్యాన్ని మొదట ఇచ్చి, తర్వాత అనువాదం, టీకా తాత్పర్యాలు కూడా ఇవ్వబడినవి.

తమిళ సుమతిశతకంలో ఉదాహరించబడిన కొన్ని పాఠాంతరాలు పరిశీలించ దగినవి. ఉదాహరణానికి ఈ పద్యం పరికించండి.

'ఉదకము ద్రావెడు హయమును
మదమున సుప్పొంగుచుండు మత్తేభంబున్
మొదవు కడ నున్న వృషభము
జదివిన యా నీచు జేర జనకుర సుమతీ'.

చదువని యా నీచుకడకు— అని పాఠాంతరం ఇవ్వబడింది. ఇప్పుడు ప్రచారంలో ఉన్న పాఠాలు 'చదువని యానీచుకడకు' 'చదువని యా నీచు జేర'— అనేవి. తమిళ సుమతిశతకం 'చదివిన యానీచుజేర'—అన్న పాఠమును గ్రహించింది. చదువుకున్న అల్పబుద్ధిగల నీచుని చేరవలదు— అని అర్థం చెప్పబడింది. కనుక చదువని యానీచుకడకు అనే పాఠం కంటే, ప్రస్తుత పాఠం బాగుంది. కాని సి. పి. బ్రౌన్ సంపాదించిన సుమతి శతకంలో 'చదివిన యా శూద్రు కడకు' అని ఉన్నది.

మహాకవి సుబ్రహ్మణ్య భారతి చంద్రికైయిన్ కదై అనే తన అసంపూర్ణ సాంఘిక నవలలో కందుకూరి వీరేశలింగం పంతులు దంపతులకు పెద్దపీటవేశాడు. ఇది గమనించదగిన విషయం. కందుకూరివారు ఈ నవలలో ఒక ముఖ్యమైన పాత్ర. ఒక వ్యాసంలో భారతి కొండా వెంకటప్పయ్య గారిని ప్రశంసించాడు. మరొక వ్యాసంలో పోతన త్యాగరాజులను సభక్తికంగా సంస్మరించాడు. భారతి వంటి జాతీయకవి తెలుగు భాషనూ, తెలుగు మహాపురుషులనూ కొనియాడిన విషయాన్ని కనుక చూస్తే ఆ మహాకవి తెలుగు భాషాసాహిత్యాలపట్ల ఎంత ఆదరభావం గలదో వ్యక్తమవుతుంది.

ఇక దక్షిణదేశంలోని వాగ్గేయకారులపై తెలుగుప్రభావం ఇంతా అంతా అనలేము. శ్యామాశాస్త్రి, పట్నం సుబ్రహ్మణ్య అయ్యరు, తిరువత్తూరు త్యాగరాజయ్యరు ప్రభృతులు తమిళులే అయినా తెలుగులో చవి చక్కనా గల కీర్తనల

యించారు. త్యాగరాజు కృతులకు తమిళంలో వ్యాఖ్య వెలయించి తమిళనాడులో వాటి ప్రచారానికి తోడ్పడిన రామనాథపురం శ్రీనివాసయ్యంగారు సేవను సంగీతాభిమానులు విస్మరించలేరు. ఈ మధ్య శ్రీ టి. యస్. పార్థసారధి త్యాగరాజకీర్తనలకు చక్కని తమిళంలో అనువాదం సంతరించారు. ఆయనే త్యాగరాజు ప్రహ్లాద చరిత్రను కూడా తమిళం చేశారు.

ఆధునికాంధ్ర వాఙ్మయంలోని ఉత్తమ కథానికలనూ వ్యాసాలనూ తమిళం చేస్తున్న శ్రీమతి యస్. కె. సీతాదేవిని గురించి రెండుమాటలు చెప్పడం సముచితం. కళాపూర్ణోదయకథను 'రత్నమాల' అనే పేరుతో వీరు తమిళులకు పరిచయం చేశారు. శ్రీయుతులు చింతాదీక్షితులు, మునిమాణిక్యం మొదలైన రచయితల కథలను సీతాదేవి తమిళం చేసి వివిధ పత్రికలలో ప్రకటించారు. డాక్టర్ పి. వి. రాజమన్నారు గారి నాగుపాము, శ్రీ కొడవటిగంటి కుటుంబరావు గారి కుదిరిన సంబంధం మొదలైనవి కూడా తమిళం చేయబడినవి. శివగంగ వాస్తవ్యులైన శ్రీ రుద్ర తులసీదాస్ 15 గురు తెలుగు రచయితల కథలను ఒక సంపుటంగా తమిళంలో ప్రకటించారు.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి 'వేయి పడగలు'లోని కథను 'ఆయిరం తలై నాగం' అనే పేరున నేను తమిళులకు పరిచయం చేశాను. శ్రీ పి. వి. సుబ్రహ్మణ్యం 'ఏకవీర'ను తమిళం చేశారు. వీరే శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రిగారి అల్పజీవి సి (అల్పజీవి) తమిళంలోకి అనువదించారు. శ్రీమతి ముప్పాళ రంగనాయకమ్మ గారి పేక మేడలు (కాగిత మాళిగై) కూడా అనూదితమయింది. శ్రీ అడివి బాపిరాజుగారి నారాయణరావు (అను శ్రీమతి యం. యస్. కమల) యింకను మరికొన్ని తెలుగు నవలలు తమిళంలోకి వచ్చినవి. రాజపాళయం వాస్తవ్యులు శ్రీ ము. జగన్నాథరాజా గురజాడవారి కన్యాశుల్కమును తమిళంలో నాటకంగానే అనువదించారు.

వ్యక్తులేకాక, సాహిత్య సంస్థలు కూడా తెలుగు రచనలను తమిళం చేసి ప్రకటించినవి. కేంద్ర సాహిత్య అకాడెమీ, నేషనల్ బుక్ ట్రస్టు, దక్షిణ భాషా పుస్తకసంస్థ మొదలైనవి యీ అనువాద కార్యక్రమంలో నిమగ్నములై ఉన్నవి. ఈ వివిధ అనువాద రచనల వల్ల తెలుగువారూ తమిళులూ సాహిత్య వైజ్ఞానికరంగములలో మరింత సన్నిహితులవుతారని నిస్సంశయంగా చెప్పవచ్చు. కాని బెంగాలీ, హిందీ మొదలైన భాషల నుంచి వస్తున్న అనువాదాల సంఖ్యతో పోల్చి చూస్తే, తెలుగు నుంచి తమిళంలోకి వెళ్లిన పుస్తకాల సంఖ్య అత్యల్పమనక తప్పదు. ఇది శోచనీయం! భాషాధ్యయనంతో పాటు తులనాత్మక సాహిత్య పరిశీలనానికి కూడా ప్రాధాన్యం లభించినప్పుడు, ఈ పరిస్థితిలో కొంతవరకు మార్పు ఏర్పడుతుందని ఆశించవచ్చు.

తెలుగు తమిళములు తోబుట్టుభాషలు. కనుక వీటి నడుమ అతి ప్రాచీనమూ అత్యంత సన్నిహితమూ అయిన సంబంధం నెలకొనడంలో ఆశ్చర్యం లేదు. తెలుగు తమిళం నుంచి కొత్తవిషయాలు గ్రహించినట్లే, తమిళం తెలుగునుంచి కొత్తవిషయాలు గ్రహించడంలో వింతలేదు. ఇలా ఒక భాష మరొకభాషనుంచి కొత్త విషయాలు గ్రహించి తనలో లీనం చేసుకోవడం న్యూనతగానో దోషంగానో భావించరాదు. నిజానికిది అభ్యుదయ లక్షణం! సహృదయతకు నిదర్శనం. అప్పుడే మనకు భారతీయ సాహిత్య సంపదనూ, అందులోని వైవిధ్యమునూ గ్రహించడానికి వీలు కలుగుతుంది.



# కాకతీయుల శిల్పము

## డా॥ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

కాకతీయులనే పాలకవంశమువారు హనుమకొండా ఓరుగల్లూ నగరములు రాజధానులుగా క్రీ. శ. 1050 ప్రాంతము నుంచి 1325 వరకూ పాలించిన వారు. వీరు సేనానులుగా కళ్యాణి చాళుక్యులనూ, సామంతులుగా తూర్పు చాళుక్యులనూ సేవించి, విక్రమాదిత్యుడనే పశ్చిమ చాళుక్యరాజు ఇచ్చిన హనుమకొండ రాష్ట్రములో పాలకులుగా స్థిరపడిన వారు. వంశానుగతంగా యుద్ధవీరులు కనుక ఖడ్గసహాయముతోనే — చాళుక్యులు పతనమైన తర్వాత— తమ రాజ్యవిస్తరణము చేసుకొన్నారు. క్రీ. శ. 1110 ప్రాంతంలో రాజ్యానికివచ్చిన రెండవ ప్రోలరాజు కాలంలోనే, పేరుకు పశ్చిమ చాళుక్య సామంతులే అయినా, కొండపల్లి, మంథనీ పాలకులను యుద్ధంలో నిర్జించి స్వతంత్రంగా వర్తించారు. మొదటి బేతరాజు కొడుకు మొదటి ప్రోలుడి (సుమారు 1060) కాలానికి హనుమకొండ కోటమాత్రమే ఉండేదీ కట్టడాలేవీ అతడు లేపినట్లులేదు. అతని రాణి తన ఇష్టదైవము పాంచాల రాయణ్ణి ప్రతిష్ఠించి ఆలయమూ వల్లె నిర్మింపించిందట. అది ఎక్కడిదో తెలియదు. ఈ ప్రోలుని కొడుకు రెండోబేతరాజు బేతేశ్వరము అనే ఆలయము కట్టించెనట. హనుమకొండ కోటకున్న ఎత్తైన రాతిద్వార తోరణాలు ఈయన పెట్టించి ఉండవచ్చును. కొడుకులు లేక తమ కులదైవము కాకతిని అర్చించాడట్లూ, ఆమె ప్రసాదముగా రెండో ప్రోలరాజు పుట్టినాడట. కాకతియన్న దేవత దుర్గాశక్తి అని విద్యానాథుడు రాశాడు. కాని ఆమె దుర్గకాదు, మఱి యముని శక్తి చాముండి. ఈమెయే అలంపురములో జోగులాంబ (యోగేశ్వరి) పేరుతో పూజలందుకునేది ఆకాలంలో. హనుమకొండ ప్రాంతంలో కాకతమ్మ గుడి ఆ నాటికి ఉన్నట్లు కానరాదు. కాని కాకతి పురాధినాథుడు అనే బిరుదు ఉండినది బేతరాజుకు.

రెండో ప్రోలరాజు—రెండో బేతరాజు కొడుకు— 1110 ప్రాంతానికి రాజ్యానికి వచ్చాడు. పేరుకి కల్యాణి చాళుక్య సామంతుడే అయినా కొండపల్లి గోవిందరాజునీ మంథని గుండరాజునీ యుద్ధములో జయించి, చివరకి చాళుక్య రాజపుత్రుడు కుమార తైలపుణ్ణి ఎదిరించి బంధించి విడిచిపెట్టేడు ఈయన. యాదవ రాజ్య ప్రధాని కాబోలు హేమాద్రి ఇతని మీదికి కొల్లిపాక ఏలుతూండిన జగద్దేవుణ్ణి పంపితే, ఆతడినీ ఓడించాడు. ఇతని విజయోత్సాహము ఉత్తరాదినుండి వలస వచ్చిన శైవాగమ పండితుల శివాలయ నిర్మాణానికీ, తన రాణి ఇనుగుర్తిలో ప్రతిష్ఠించిన జలంధర భైరవాలయ నిర్మాణానికీ, తన మంత్రి బేతన భార్య మైలమ నిర్మించిన పద్మాక్షి ఆలయ నిర్మాణానికీ ఆమోదము నిచ్చిందని చెప్పవచ్చు. అప్పటి శివాలయాలలో చెప్పుకోదగ్గ శిల్పాలు వెలయలేదు గాని పద్మాక్షి గుట్టపైది జైనస్థావర శిల్పానికి మంచి ప్రోత్సాహము చేకూరింది. అక్కడి పార్శ్వనాథుడూ మైలమ్మా బేతనా శిల్పాలు ఈ కాలంలోనే చెక్కేరు. పద్మాక్షి గుడిలోని శిల్పాలు—పార్శ్వనాథుడూ ధరణేంద్రుడూ పద్మాక్షీ అర్ధశిల్పాలు – రాష్ట్రకూటుల కాలానివే. అక్కడి కడలాలయ వసదికి మైలమచేసిన సాయముతో అక్కడ గుడీ, బయట శిల్పాలూ ఆవిర్భవించాయి. ఓరుగల్లు కోటలోని ఏకశిల పైని ఆలయము జైనుంది— ఆ కాలానిదే. శిల్పి సంప్రదాయాల— మెట్ల శిఖరాలూ, దీర్ఘచతురస్రపు పానవట్టాలూ జైనతీర్థంకరుల రాతివిగ్రహాలూ, నవగ్రహాధి శిల్పాలూ (ఓరుగల్లు కోటలోనివి) జైనములే. పొడుగాటి ముక్కుగల గుండ్రని నల్లరాతి పానవట్ట మొకటి ఈకాలపు శిల్పుల స్వోపజ్ఞము. (ఇది రాష్ట్రకూట దానవులపాటి శిలాపాన వట్టమును అనుకరించిందన లేము) ఇనుగుర్తి జలంధర భైరవుడూ కాశేశ్వరపు అన్నపూర్ణా విగ్రహాలు ఈ కాలానివే. ఇవి వెనుకనున్న రాతిపలకకు అతికినట్లున్నా నిండు శిల్పాలే అనవచ్చును. వీటి విన్యాసములైతే పౌరాణికములే కాని తీర్పిడి స్థానికమే. జైన తీర్థంకరుల శిల్పాలకు వర్ధమానుని సింహలాంఛనాలూ సింహాసనమూ పార్శ్వనాథుడికి అమర్చే సంప్రదాయావజ్ఞ శైవ శిల్పాలకు రాలేదు.

రెండో ప్రోలరాజు కొడుకు రుద్రదేవుడు రాజ్యానికి వచ్చే కాలానికి కాకతి రాజ్యము స్థిరపడింది. ఈయన కాళీబుగ్గ, అయినవోలు, మొగిలిచర్ల దేవాలయాలు కట్టించాడు. మొదటి రెండింటి శిఖరాలూ కోటలోని శంభుని గుడి శిఖరాలవలె మెట్లు మెట్లుగానే వున్నాయి. కదంబ రాజ్యములో చిన్న జైనాలయాలు విమానపు నమోనాలో పొట్టిగానున్న మెట్ల శిఖరాలవి. కాకతీయ మండలములో ఈ శిఖరాలు, ఇటుకలతో కట్టడములో పొడుగ్గా తయారయాయి. శిఖరాలులేని ఆలయాలు రాతివికూడా ఆ కాలంలో ఉండేవి కాని శిల్పసంపద వాటిలోనూ ఏమంతలేదు. కొలనుపాక జగద్దేవ నారాయణాలయమూ అయినవోలు మైలారుదేవరగుడీ ఈ రకానివి. రుద్రదేవుడికి వర్ధమానములో దండయాత్ర చూచిన త్రికూటాలయము దొడ్డగద్దవల్లి లక్ష్మీదేవి ఆలయము నమూనాలోది—నచ్చినది కాబోలూ, తన విజయయాత్రానంతరము ఆ రూపముతో హనుమకొండలో వేయిస్తంభాలగుడి నిర్మింపించాడు. ఈ ఆలయ నిర్మాణముతో కాకతీయ శిల్పానికి కాళ్లు వచ్చాయి.

ఈ ఆలయము నమోనా నిశ్చయించబడిన తర్వాత ప్రతీ శిలాఖండమూ రాతిగని దగ్గరే శిల్పుల చేత తీర్చబడి, ఆలయస్థానములో దాని చోటులో అది అమర్చబడింది. నేటి చిన్నపిల్లలు కర్ర ముక్కలతో ఆట ఇళ్లు కట్టినట్లే నాటి వాస్తు శిల్పులు దేవాలయాలను చెక్కితీర్చిన రాతిపలకలతో పేర్చి 'కట్టి' నారు. చిత్రమేమిటంటే, ఇలాగ పేర్చి కట్టిన దేవాలయపు డాబా అంచులూ, ఆలయాల ద్వార బంధాలూ, పై కప్పులూ దానిపై మేరా, స్తంభాల పలక కుదురులూ, స్తంభాల పొడవులో సమదూరాలలో వున్న పట్టీలూ, మండపాలలో కప్పుగా పేర్చిన రాతిపలకల మేరలూ మొత్తం శిల్పాలతో నింపేరు. ఈ శిల్పాల ఇతివృత్తము అలంకారమూ శైవ, పౌరాణిక, వ్యక్తులూను.

ఆలయము మొత్తము హోయసాలుల సోమనాథాలయ పద్ధతిలో మూడు చిన్న ఆలయాలు—పొయ్యిగడ్డలు పేర్చినట్లుగా కూర్చడమువల్ల ఏర్పడింది. హోయసాలుల ఆలయాలు పెట్టెలవలె కనిపిస్తాయి, మండపాలలో చీకటి. కాకతీయుల ఆలయాలు వెలుగుగా వుంటాయి. హోయసాలుల శిల్ప వ్యక్తులు బొద్దుగా పొట్టిగా వుంటారు, కాకతీయ శిల్ప వ్యక్తులు పొడవూ సన్నమూ. వారికి అలంకార భారము జాస్తి. వీరి అలంకారాలు బరువులుకాదు. అక్కడ లతల చిక్కములు ఎక్కువ, ఇక్కడ లేవు. అక్కడ కథా శిల్పము తక్కువ, ఇక్కడ ఎక్కువ.

కాకతీయుల విజృంభణానికి ముందు వాస్తు శిల్పమూ శిలా శిల్పమూ జైనుల చేతులలో ఉండేవి. ఆలయ శిఖరాలూ, తీర్థంకర విగ్రహాలూ, సింహాసనాలూ, తీర్థంకరుల అంగరక్షకులు యక్షిణీ యక్షులూ ఇవే జైనుల శిల్ప ఇతివృత్తాలు. ఏమి మార్పులు చేసినా వీటిలోనే, వీటితోనే. కనక ఒక తీర్థంకరుని రూపమే నాలుగు వైపులా చెక్కిన చౌముఖాలూ, ఒకొక్క పెడ అరుగురిని చొప్పన నాలుగుపెడలా ఇరవై నలుగురినీ చెక్కిన చౌవీస తీర్థంకర శిల్పాలు పరిపాటి అయినాయి. పద్మాక్షి గుడిలో ఇవి కనిపిస్తాయి. తీర్థంకరులు సింహాసనము మీద కూర్చుంటే ఇరువైపులా చామరధారులూ సింహాసనము ముందు దిగువవైపు ఆ తీర్థంకరుని చిహ్నాలు— సింహమో పద్మమో శంఖమో వంటివి— చెక్కినవి ఆ కాలంలో గొప్ప జైనక్షేత్రమైన కొలనుపాక ఆలయాలలో ఉండేవి. వీరశైవులు ఆ విగ్రహాల్ని ధ్వంసం చేశారు. కొన్ని ఆలయాలలో—శైవులు వీటిని 'మఠాలు'గా మార్చుకున్నారు. తీర్థంకరుల చిహ్నాలతో పానవటాలు మాత్రము మిగిలి ఉన్నాయి. ఓరుగల్లు కోటలో శిథిలము చేసిన తీర్థంకర విగ్రహాలున్నా యీరెండు మూడు దీర్ఘచతురస్రాకార పానవట్టాలు— వర్ధమాన మహావీరుడివి— ఉన్నాయి. బాదామి చాళుక్యుల కాలపు అయిహోళీ జైనాలయాల ద్వార బంధాలమీద ఇటూ అటూ మూడేసి చిహ్నాలు—ఏనుగూ కుంభాండుడూ పూర్ణకుంభమూ—కనిపిస్తాయి. కాకతీయ రాజ్యములో ఏ ఆలయమేనా—శిల్పములేని ఆలయము ద్వారబంధాల మీద ఈ మూడింటిలో ఏ చిహ్నముతోవున్నా అది జైనాలయమని గుర్తుపట్టవచ్చును. ఓరుగల్లు కోట గోడమీది దక్షిణాన్న ఒక ఆలయము కనిపిస్తుంది నేటికీ. బైరానిపల్లిలో ఒకటుంది.

రుద్రదేవుని తర్వాత కొద్దికాలము అతని తమ్ముడు మహాదేవుడు కాకతి రాజ్యము పాలించాడు. ఇతడు యాదవులతోడి యుద్ధములో మరణిస్తే

ఈయన కొడుకు గణపతిని బంధించి ఉంచి ఆ రాజా కొన్నాళ్లకు విడిచె నంటారు. గణపతి ఓరుగల్లు కువచ్చి తాను లేనప్పుడు రాజ్య సమైక్యతను కాపాడిన సేనానులకు పెద్ద పెద్ద భూభాగాలిచ్చాడు. వారు అడవులు నరికి ఆ మేరలను సుక్షేత్రాలుగా తీర్చి చెఱువులు కట్టించి, ఆలయాలు నిర్మించారు. పాలంపేట రుద్రేశ్వరాలయమూ, కటాక్షపుర శివాలయమూ, నగునూరు త్రికూటాలయమూ, నాగులపాడు శివాలయమూ, ఓరుగల్లు కోటలోని కేశవ శ్రీ స్వయంభూ దేవాలయాలూ గణపతిదేవుని కాలంలోనే నిర్మాణమైనాయి. వీటన్నిటా శిల్పము పలపల విరిసింది. కనబడడము అలంకార శిల్పములాగే కనబడుతుంది గాని ఇది దేవాలయము మొత్తాన్ని ఏక శిల్ప ఖండముగా తీర్చిన బృహచ్ఛిల్పమనీ అనవచ్చును. పాలంపేట రుద్రేశ్వరాలయము జగద్వింత. స్తంభాలూ బోధికలూ దూలాలూ లోకప్పూ, ద్వారబంధాలూ, వాటి తోరణాలూ, మండపముల అంచుల వెంబడిని ఏర్పరచిన అరుగుల వీపులూ, డాబా అంచులూ, ఆలయాల వెలుపలి మేరా చాలక, స్తంభాలకూ దూలాలకూ కలిపే వాలుకమ్ముల (Brackets) మీద సాలభంజకలనూ సింహాలనూ చెక్కారు. ఇవన్నీ పేరుకు అర్థశిల్పాలేకాని నిజానికి నిండు శిల్పాలే. ఇతివృత్తాలు కేవలము శైవములు కావు. జీవితోత్సాహమూ, సర్వమత సంప్రదాయాలూ, సమకాలిక సుందర వాతావరణమూ రంగరించుకుపోయి ఆ కాలపు శిల్పాలుగా రూపొందాయి. సంప్రదాయాల కట్లు తెగిపోయాయి. శిల్పంలో దేవతలుకూడా తమ తాహతుమఱచి నర్తనము చేశారు. సరస్వతీ, బ్రహ్మ, శివుడూ, ఇంద్రుడూ తమ వాహనాలమీద నర్తిస్తారూ పరివారముకూడా ఆనందంలో ఒళ్లుమరచి విన్యాసాలు పోతారు. శిల్పపు పట్టీలలో డాలుపట్టుకున్న సైనికుడి పక్కన గణపతి, ఆయన పక్కన జడదారి, ఆయన పక్కన నర్తకి, ఆ పక్కన మిథునము, దాని పక్కన ఏనుగు. ఇలాగ ఎన్నో ఏనుగులు ఆలయము చుట్టూ ఒకటి పరుగు, ఇంకొకటి వెనక్కి చూస్తుంది, మరొకటి కాలుతో ఇంకో కాలు గోకుకుంటుంది. కాకతి రాజ్యములోని సరదా అంతా చిన్నరూపాలతో రాయిగట్టింది పాలంపేట రామప్పదేవాలయాలలో. రాతి దూలాల పొడూగు మేరలలో పౌరాణిక గాథలు గజాసుర సంహారమూ, శివకల్యాణమూ, గజముఖాసుర యుద్ధమూ, అమృత మథనమూ శిల్పించారు. ఇది రాతిని అంటి పెట్టుకున్న అర్ధ శిల్పముకాదు, మఱి దూలాలకు అంటించిన నిండు శిల్పము. ద్వారబంధాల దిగువన ఒకరూ ఇద్దరూ ద్వారపాలురుకాదు, జైన సంప్రదాయము ననుసరించి ఒక గుంపు. అందులోనూ కథా సాదృశ్యము! మండపాల అంచున కట్టిన లోఅరుగుల మళుపుల దగ్గర చిన్ని ఆలయాలూ వాటిలో దేవతా విగ్రహాలు గజము ఎత్తువి. హొయసాలులు వారి దేవాలయాలలో ఏర్పరచిన అవకాశాలన్నీ తమ రుచుల కనుకూలంగా మలచుకొన్నారు కాకతీయ సేనానులు. పాలంపేట ప్రత్యేకత రాతికి మెఱుగు. పాలంపేట నంది నల్లగాజుతో నిన్న పోత పోసినట్లున్నది. చెఱువుగట్టు ఆలయంలో ఇంకొక నంది, ఓరుగల్లు కోటలోని నందులూ లింగాలూ ఈ మెఱుగువే. ఎండకీ వానకి కగ్గంది ఆ మెఱుగు. ఈ మెఱుగు చందవోలు జ్యోతిర్లింగానికీ, నాగార్జున కొండ రంగనాథస్వామికీ అందింది.

గణపతిదేవుడి కాలంలో నిండు శిల్పాలు ధారాళంగా మలిచారు. సాలభంజికలు సరే. దేవాలయ ద్వారాల కిటూ అటూ పెట్టిన ఏనుగులూ, నందులూ సరే. జగద్విఖ్యాతి పొందిన ఓరుగల్లుకోట ద్వార తోరణాలు నిండు శిల్ప పరాకాష్ట కదా? పాలంపేట ఓరుగల్లుకోటా నాగులపాడూ ఆలయాలే నిండు శిల్పాలు. అవి వాస్తుశిల్పమాత్రాలు కావు. ఇక చతుర్ముఖ లింగాలూ, ద్వారపాలురూ, (నేటికీ ఆలయాలలో కనబడే) బ్రహ్మ సరస్వతీ యోగనరసింహుడూ సహస్రలింగమూ చెన్నకేశవుడూ గణపతీ, వీరభద్రుడూ, నిండు శిల్పాలు, కాకతీయులు తాము ప్రత్యేకత నిమిడ్చి రచించుకున్న విగ్రహాలే.

బసవేశ్వరుని నిర్యాణముతో విజృంభించిన వీరశైవము గణపతిదేవుని రాజధానిలోనూ ఆయన దండయాత్ర దారులలోనూ ప్రళయ నృత్యము చేసింది. వీరభద్రుని సహాయుత ఖడ్గము నాడు దక్షుని తల నేమో గాని కాకతీయుల నాడు జైనతీర్థంకర విగ్రహాల రాతి తలలనే నఱికినది. కొలనుపాకలో వేములవాడలో శివగంగలో పెనుగొండలో ఓరుగల్లులో ఆ తలలు నేటికీ కనబడతాయి తిక్కనగారితో 'హనుమకొండ నివాసులైన' జైనగురులు వాదించి ఓడిన తర్వాత వారి ఆలయాలు గణపతిదేవుడు కూల్చదోయించినాడని

సోమదేవరాజీయము. ఈ ధ్వంసమునకు ఈయనగారి నెల్లూరు దండయాత్రలో ఆటవిడుపు. అమరావతి, నాగార్జునకొండా ఉప్పుగుండూరూ జైనాలయాలు కూలేయీ విగ్రహాలు విరిగేయి. అయితే ఈ వినాశముతోపాటు వీరశైవుల మైలారు వీరశిల్పము—ప్రజాశిల్ప మందాము—మొలిచింది. యుద్ధాలలో మరణించిన శైవులకు వీరగల్లులు వెలిశాయి. వల్లభరాయుడు క్రీడాభిరామములో వర్ణించిన 'గాలంపు కొంకి కంకాళ చర్మము గుచ్చి ఉడువీధి నుయ్యేల లూగే' తలలు వెల్దుర్తిలో, మొక్కులు తీర్చుకోడానికి బాకులతో పొట్టలూ గొంతులూ చీరుకునేవారు. హైదరాబాదు ఆర్క్యాలజికల్ ఆఫీసు మ్యూజియములో, గండకత్తెరలతో మెడలను వెనుక నుంచి ఉత్తరించుకునే వారు నల్లాంలో, కత్తులను కింద మోపి పిడికిలి పట్టుతో నొక్కి వంచేవారూ 'కఱవాడి కత్తుల గనప పొరల్లలో ఉట్టి చేతుబుకోసి ఉటికే వారూ' నెల్లూరిలో కనబడతారు. ఇక అరచేతులతో కర్పూర హారతిచ్చేవారూ, సహగమనము చేసేవారూ లెక్కే లేదు. తెలుగు శిల్పములో ఈ కొత్త దీపము కాకతీయుల కాలానిదే.

గణపతి తర్వాత ఆయన కూతురు రుద్రమదేవి క్రీ. శ. 1260లో రాజ్యానికి వచ్చింది. ఈమెకు మత గురువు శివ దేవయ్య. ఆయన ప్రోత్సాహముతో ఈమె పుష్పగిరి మఠమూ ఇతర శైవమఠాలూ స్థాపించింది. అక్కడి శిల్పాలు మైలారు వీరగాథల్నీ శవథాల్నీ మట్టుకు కాక జైన సంహారాన్ని కూడా చూపిస్తున్నాయి. వీటికి తోడు శ్రీచక్రాలూ, శివ యోగుల శిల్పాలూ ఈ కాలంలో వచ్చాయి. ఇవీ ప్రజాశిల్ప పుష్పదళాలే.

రుద్రమ్మ కాలంలో ప్రత్యేకంగా వ్యాపించినవి కాకతమ్మ విగ్రహాలు. ఈమె నాలుగు చేతులతోనూ వరుసగా డమరుకమూ త్రిశూలమూ కత్తీ రక్తపాత్రా ధరించే యమునిశక్తి చాముండి, సప్తమాతృకల లోనిది. నక్క ఈమె చిహ్నము. శవము ఆసనము. గద్ద ధ్వజము. అయితే కాకతీయుల 'కాకతి'కి ధ్వజమెక్కడా లేదూ, ఆసనమున్న చోట నక్కలేదూ, నక్క వున్న చోట శవాసనము లేదు, హనుమకొండ 'భద్రకాళి' కాకతియే, భద్రకాళి కాదు, ఈమెకు శవాసనము కూడా ఉన్నది. ఈ ఆలయమూ మొగిలిచర్ల ఏకవీర ఆలయమూ రుద్రమ్మ కట్టించినవే. రుద్రమ్మ కాలంలోనే కాకతమ్మా ఏకవీరా పూజలూ విగ్రహాలూ ఎక్కువయాయి. ఏకవీర తల రూపాన్నే కనబడుతుంది. ఓరుగల్లు కోటలో, మండపాక ఆలయములో ఉండవల్లిలో. అనేక దేవాలయాలలో — జూకారంలో ప్రత్యేకంగా — కాలిలో ముల్లు తీయించుకునే వేటకత్తె పక్కన పాములను ధరించిన నగ్నయువతీ రేణుక అయిన ఏకవీరయే. కాకతమ్మా ఏకవీరా సైదోదులు. పలక్కాడు నుండి మంథని వరకూ ఈ 'భోగవతి కన్యలు మూంకాళి మాధవి'లను ఎన్ని ఆలయాలలోనైనా చూడవచ్చు. ముఖ్యంగా మండపాక 'ఎల్లారమ్మ గుడి'లో.

రుద్రమ్మ తరవాత ప్రతాపరుద్రుడు రాజ్యానికి వచ్చాడు. స్తంభాలు పేర్చి నిలబెట్టి 'కట్టిన' వేయి స్తంభాలగుళ్ళు అనేవి ఈతడు కొలనుపాకలోనూ మంథనిలోనూ ఇతర స్థలాలలోనూ నిర్మించాడు. ఈతని సేనానులు త్రికూటాలు నిర్మించారు. మంథని గౌతమేశ్వరాలయము ఈయన కాలానిదే దీనిపైన జైన తీర్థంకరుల బొమ్మలూ ఉన్నాయి' ప్రతాపరుద్రుడు శైవజైన వైష్ణవాలను సమంగా గౌరవించాడు. ఓరుగల్లు కోటలో నిల్చివున్న జైనాలయాలు ఈయన కాలంలోనే వచ్చి ఉంటాయి. ఈ కాలపు శిల్పము సాపుదేరి అలంకార భరము క్రుంగదీయని శరీర చైతన్యముతో గజిబిజిలేని నిసర్గ సౌందర్యముతో వెలసినది. హవేలీశాయంపేట పాంచాల రాయడూ, శంభుని గుడిలోని నందులూ రామన్నపేట సరస్వతీ మండపాక కాకతీ అందమైన శిల్పాలు.

చీమకుర్తి కంచువిగ్రహాలు కృష్ణుడూ రుక్మిణీ — మద్రాసు మ్యూజియములోనివి — ప్రతాపరుద్రుని కాలంలోనివి కావలెను. ఓరుగంటి విలాసినుల పోలిక దుస్తులతో సహా వాటికి చాలా ఉన్నది.

కాకతీయుల శిల్పము హోయసల శిల్పానుకారి కాదు, ఈ శిల్పానికి జీవము జీవితోత్సాహమూ సర్వసమానత్వమూనూ. దానికి మతమూ స్వర్ణకారుల నవపరిశ్రమా జీవాలు. హోయసాల వ్యక్తులని స్థిర విన్యాసాలు, కాకతీయులవి చరవిన్యాసాలు.

———

# అరవై యేళ్ల ఆంధ్రసాహిత్యంలో నిలిచేది

శ్రీ నోరి నరసింహశాస్త్రి

(వ్యాసంలో వెల్లడించిన భావాలు రచయితవే. సం.)

### I కాలావధి నిర్ణయము

అరవై యేళ్లు నిండితే షష్టిపూర్తి చేసుకుంటాము గదా! 1913 లోనే నవ్య కవిత్వమనేది ప్రత్యక్షరూపంలో 'అభినవ కవితామండలి'తో ఆవిర్భవించినది. ఆ మండలి పక్షాన రాయప్రోలు సుబ్బారావు ఆ సంవత్సరమే 'తృణకంకణము' 'కష్టకమల' ప్రచురించారు. 'తృణకంకణము' పీఠికలో ప్రాచీన కవిత్వము మీద తిరుగుబాటు ప్రకటించి తన రచన 'భావ గీతము' Lyric- అని పేర్కొన్నారు.

బొంబాయినుండి ఆంధ్రపత్రిక చెన్నపట్టణము దిన పత్రికగా చేరినది 1914 లో ఐనా, దానిని గూర్చిన విజ్ఞప్తి 9—4—1913 ప్రమాదీచ సంవత్సరాది సంచికల లోనే పంతులుగారు ప్రకటించినారు. పత్రిక చెన్నపట్టణ యాత్ర ఆంధ్రుల చరిత్రలో నూతనాధ్యాయానికి అంకురారోపణ.

1913 లోనే ప్రథమాంధ్ర మహాసభ బాపట్లలో సమావిష్టమైనది. 1913 లోనే శ్రీ గిడుగువారి 'నిజమైన సంప్రదాయము' వావిళ్లవారు ప్రచురించినారు. అప్పటికి రెండేళ్ల క్రిందటనే శ్రీ చిలుకూరి వారి 'ఆంధ్రుల చరిత్ర' ప్రథమ భాగము ప్రకటింప బడినది.

అట్లాగే 1911 లోనే ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల స్థాపింపబడి భారతీయ నవలల ఆంధ్రీకరణలు ప్రచురించసాగినా, ఆ గ్రంథాల వ్యాప్తి విస్తారమైనది 1913 నుంచే.

తిరుపతి వెంకటేశ్వరులకూ, కొప్పరపువారికీ తగాదాలు 1911 లోనే ప్రారంభమైనా, ఆ తగాదాల దుష్ఫలితాలతో పాటు, ఆంధ్ర లోకములో ఆంధ్ర కవిత్వాభిమానము సర్వసాధారణమై కవితా రచనోత్సాహము ఉత్తుంగ తరంగరూపము ధరించినది 1913 నుంచే!

1913 కు కొద్దికాలము క్రిందటనే శ్రీ గురుజాడ వారి వ్యావహారిక భాషా కవితలు ఆరంభమైనవి.

ఈ వ్యావహారిక భాషా ప్రమాదమునుండి గ్రాంథిక భాషను తప్పించవలెనను ఉద్దేశముతో, ఆంధ్ర సాహిత్యము పరిషత్తు 1911 లో అవతరించి ప్రాచీనాంధ్ర గ్రంథ ప్రచురణకు ఎంతో దోహదను చేసినది. ఆం. సా. పరిషత్తు 1913లోనే గుంటూరు కాలేజి హాలులో సమావేశము జరిపినది. ఆంధ్రదేశములో అన్ని మూలలనుంచి వచ్చిన ఆంధ్ర దేశ విద్వాంసులను, గ్రంథకర్తలను దర్శించే మహాభాగ్యము ఈ వ్యాసకర్తకు కలిగినది ఆ సందర్భములోనే.

ఈ వ్యాసకర్తకు 13 సం. లు నిండి సాహిత్యం రుచి మరిగినది 1913 నుంచే. అందువల్ల కూడా ఈ అరవై ఏళ్ల సాహిత్యంలో నిలిచేది స్మరించి అక్షర రూపమిచ్చి రసవద్రచనల మననముతో ధన్యత పొందదలచినాడు.

### II ప్రమాణ సూచన

సాహిత్యశాఖ లన్నిటిలో అగ్రగణ్యమైనది కవిత్వము. ఈ అరవై ఏళ్లలో ఆంధ్రములో భావ కవిత్వము, ప్యూచరిస్టు కవిత్వము, అభ్యుదయ కవిత్వము, అధి వాస్తవిక కవిత, వచన కవిత, దిగంబర కవిత్వము, విప్లవ కవిత్వము, జానపద కవిత్వము కొత్త కొత్త పుంతలు తొక్కినవి. ఐనా సంప్రదాయ కవిత్వము నూతన చైతన్యముతో నిశ్చలంగా సాగుతూనే ఉన్నది, దాని ఛాయ ఈ నూతన శాఖ లన్నిటిలోనూ రూఢంగానో, ప్రత్యక్షంగానో, హెచ్చుగానో తగ్గుగానో ఆవహిస్తూనే ఉన్నది.

నాటికలు నాటకాలు సహస్రాధికంగా పుట్టినవి. కథానిక ఎన్నెన్నో రూపాలు ధరించినది. నవల బహుముఖముగా విజృంభించినది. విమర్శ రంగము విస్తరించినది.

ఇన్ని శాఖలుగా విశేష వ్యాప్తి పొందిన ఆంధ్ర సాహిత్యంలో నాలుగు కాలాలపాటు నిలిచేది ఏది? ఇది ఒకరి దృష్టితో తేలే విషయము కాదు. తమ తమ దేశాల రాజకీయ ప్రాబల్యమువల్లనూ, ఈ కాలపు ప్రచార సాధనాలవల్లనూ సామాన్య జనంలోనే కాక, కొంత బుద్ధిమంతులలో కూడా వ్యాప్తి పొందుతున్న సరికొత్త సిద్ధాంతాల కొలబద్దతోనూ తేలే విషయం కాదు. దాదాపు 3,000 సం లనుంచీ నేటివరకూ నిలిచివున్న గ్రీకు సాహిత్య గ్రంథాలూ, 2,000 సం. ల పైకాలము నుంచీ నిలిచివున్న లాటిను గ్రంథాలూ, 600 సం. ల నుంచీ నిలిచిన ఇటాలియను స్పానిషు గ్రంథాలూ, 600 సం. ల నుంచీ నుంచీ వున్న ఫ్రెంచి, ఇంగ్లీషు జర్మను గ్రంథాలు, 200 సం. ల నుంచీ విజృంభించిన రష్యా సాహిత్యమూ, 150 సం. ల నుంచీ ప్రపంచాన్ని మింగుతున్న అమెరికను గ్రంథాలూ, ఎందుకు నిలుస్తున్నవి? సంస్కృతంలో కాల నిర్ణయము చేయ వీలులేని వేదాలూ, 2,000 సం. ల పైచిలుకు నిలిచిన రామాయణ భారతాలూ, 2,000 సం. లలోపుగా పుట్టి నిలిచివున్న భాసకాళిదాసాది మహాకవుల గ్రంథాలూ ఎందుకు నిలిచినవి? తమిళములో 1600ల సం. ల నుంచీ కన్నడంలో 1000సం.ల నుంచీ, ఆంధ్రంలో 900 సం.ల నుంచీ, నాలుగు

ఐదు, ఆరు వందల సంవత్సరములనుంచీ వంగ, హిందీ, మరాటీ మళయాళ, గుజరాతీ, ఒరియా మొదలయిన భారతీయ భాషలలో కొన్ని గ్రంథాలు ఎందుకు నిలిచినవి? అరబ్బీలో 1300 సం. ల నుంచీ ఫారసీలో 900 సం. ల నుంచీ ఎట్లా నిలిచినవి? ఏ భాషలోనైనా మానవీయ గ్రంథాలుగా—క్లాసిక్సుగా ఎందుకు పరిగణింపబడతాయి? ఏ లక్షణాలు నాలుగు కాలాల పాటు నిలవడానికి దోహదించినవో భావన చేయడము న్యాయము గదా!

ఏ భాషలో రచన ఐనా నిలిచేందుకు ప్రధాన కారణము రసవత్త్వము. దీనికి మన సంస్కృత లక్షణవేత్తల నిర్వచనాన్ని కొంత విస్తృతి చేయక తప్పదు. రసము, సాహిత్య సూత్రాలకు— ప్రాచీనమైనవైనా ఆధునికమైనవైనా— కట్టువడదు.

ఐతే కవి చౌడప్ప శతకము, పద్యాలలో పచ్చి బూతులు చేర్చినందుకే, నిలిచినది. 'లేడీషాటర్లీసు లవరు' తత్తుల్యమైన కారణాల వల్లనే జగద్వ్యాప్తి పొంది వ్యామోహం కలిగించినది. రాధికా సాంత్వనాదులూ ఆ జాతివే. నేటి దిగంబర కవిత్వము కూడా అటువంటి కారణాలవల్లనే నిలుస్తుందేమో చెప్పలేము. అట్లా ప్రత్యేక కారణాల వల్ల నిలిచేవి వాటి సాహిత్యగుణం వల కాదు కనుక అటువంటి వాటిని ఇందులో గ్రహించదలచ లేదు.

నిలవడానికి సర్వసాధారణంగా కొన్ని లక్షణాలు ఉపకరిస్తవి. అట్టి వాటిలో లయ ఒకటి. అందువల్ల వచనానికి కంటె ఛందోబద్ధమైన రచనలకే నిలిచేందుకు అవకాశమెక్కువ ఉన్నది. లయ జ్ఞాపక ముంచుకోవడానికీ, మళ్లీ మళ్లీ మననము చేయడానికీ అనుకూలిస్తుంది. అందువల్ల ఇందులో పద్యకావ్యాలకే ప్రథమ గణ్యత్వము వచ్చింది. కాదంబరి వంటి గద్య కావ్యాలు పుట్టలేదు కాని, పుట్టి ఉంటే అటువంటి వాటిని పద్య కావ్యాలతోపాటే పరిగణించవలసి వచ్చేది.

ఏ రచన ఐనా మరీ చిన్నదైతే., మనస్సుకు ఎక్కినా శాశ్వతంగా సంపూర్ణతృప్తి నివ్వలేదు. ఈ కాలంలో మంచి ఖండకావ్యాలు ఎన్నో మంచివి పుట్టినవి. వాటిని స్మరింపలేదు. చిన్న కథలు కూడా అంతే. అవన్నీ పూర్వమెప్పుడో ఎవరో చెప్పిన చాటువుల వంటివి. అవి నేటికీ నిలిచి ఉన్న మాట నిజమే. వాటిలో ఒక్క మెరుపు తళుక్కుమంటుంది. మెరుపుకు 'క్షణప్రభా' అన్న సార్థక నామ మున్నది.

అదేవిధంగా కావ్యము మరీ పెద్దదైనా నిలిచే గుణము ఉండడము కష్టసాధ్యము. ఏ వాల్మీకియో వ్యాసుడో చేయి చేసుకుంటే తప్ప! ఈ కాలంలో ఆంధ్రదేశంలో వ్యాసవాల్మీకులు పుట లేదు.

ఈ అరవై యేళ్ల సాహిత్యంలో నిలిచేది ఏది? చాలా కష్టమైన ప్రశ్న. ఏమి చెప్పినా దూషణ తిరస్కారాలు కుప్ప తెప్పలుగా వస్తవని తెలిసే ఈ సాహసానికి ఒడిగట్టినాను. విమర్శ పరంపరకు మనస్సు చెడిపోయి ఆసుపత్రికి పోవలసిన దౌర్బల్యము లేదు. అన్యాయంగా విమర్శించినా నిబ్బరం కోల్పోయి మాట్లాడే దౌర్బల్యం కూడా లేదు. ఈ అరవై యేళ్లబట్టీ ఆంధ్రము, సంస్కృతము, ప్రాకృతములలోనే కాక, గ్రీకు, లాటిను, ఇటాలియను, స్పానిషు, ఫ్రెంచి, ఆంగ్లము, జర్మను, రష్యను, ఫారసీ, అరబ్బీ, జాపనీసు— ఇత్యాది విదేశీయ భాషలలోనూ, వంగ మహారాష్ట్ర తమిళ కన్నడ హిందీ ఇత్యాది స్వదేశ భాషలలోనూ, 'క్లాసిక్సు' అని ప్రఖ్యాతిపొందిన మహా గ్రంథాల స్వరూపము, ముఖ్యంగా ఆంగ్లానువాదాల ద్వారా తెలుసుకోడానికి తపనతో కూడిన ప్రయత్నము— తపస్సు— అండగా చూసుకొని ఈ సాహసానికి వ్యాసకర్త ఉపక్రమిస్తున్నాడు. కొన్ని ఆంధ్ర మహా గ్రంథాలు దృష్టిలో పడక తప్పిపోయి ఉండవచ్చు. విశాల హృదయు లని భావించిన నలుగురు మిత్రులను జాబితాలు పంపుడని అర్థింపగా రెండు వచ్చినవి. ఇద్దరు ముగ్గురు సహృదయులతో సంప్రదించినాను. కొన్ని చేర్చడమా వద్దా అనే సందేహము కలిగినప్పుడు, వాటిని తీసి మళ్లీ పఠించినాను. ఐదారు సంవత్సరాల నుంచీ ఈ విషయము మథన చేస్తూ సాహితీ మిత్రులను సంప్రదిస్తూ వచ్చినాను. ఐనా కొన్ని ఉద్గ్రంథాలు తప్పిపోయి ఉండవచ్చు. ఆ గ్రంథాలకూ గ్రంథకర్తలకూ క్షమాపణ చెప్పుకొని ఉపక్రమిస్తున్నాను.

ఐనా ఒక మనవి! ఇందులో వదిలినవి చూడవద్దు. చేర్చిన వాటిని చూసి అవి నిలిచేవని వ్యాసకర్తతో ఏకీభవిస్తే ధన్యుడు. సందేహము కలిగితే ఆ గ్రంథాలు సంపాదించి జాగ్రత్తగా పఠింపుడని సహృదయులను వేడుకొంటున్నాను. ఈ పరిగణన వల్ల ఆంధ్ర సాహిత్య క్షేత్రం ఈ అరవై ఏళ్లలో ఎంత మంచి పంట పండించిందా అని తలచుకొని ఆనందించాను. ఈ ఉత్తమ కావ్యాల స్మరణ వ్యాసకర్తకు రెండు నెలల బట్టీ కలిగించిన ఆనంద మింతంత కాదు.

1913 సం. రము కాలపరిధిగా పెట్టుకొన్నందున గత శతాబ్దిలోనూ ఈ శతాబ్ది ఆరంభంలోనూ భాషాసేవ చేసిన ఉద్దండ పండితులూ రచయితలూ ఇందులో రారు. శ్రీయుతులు వేదము వేంకటరాయశాస్త్రి, కందుకూరి, కొక్కొండ, ధర్మవరం కృష్ణమాచార్యులు, చిలకమర్తి, వావిల కొలను సుబ్బారావు, నాదెళ్ల పురుషోత్తమ కవి, గురజాడ అప్పారావు, వడ్డాది సుబ్బారాయుడు, జనమంచి శేషాద్రి శర్మ గార్ల వంటివారు ఇందులో సకృత్తుగా తప్ప రారు. వారి రచనలలో శ్రీ వేదము వారి ప్రతాపరుద్రీయము రాకపోయినందుకు ఎక్కువగానూ, శ్రీ గురజాడ కన్యాశుల్కము రానందుకు తక్కువగాను, విచారము కలిగినది. శ్రీ తిరుపతి కవుల పాండవోద్యోగాలు కాల పరిధిని దాటవని భావించినాను. పాండవవిజయం ముందే వచ్చినా రెండిటి మిశ్రమము కాల పరిధిలోనే జరిగింది.

## III పద్యకావ్యాలు

1913 లో ఆంధ్రోద్యమము విజృంభించి కవులను ఉద్రూత లూగించినది. కొంత తర్వాతనే ఐనా శ్రీ విశ్వనాథ

# 'భారతీ శుభగభస్తి చయమ్ము'

## వేదం రామశాస్త్రి

'సంగీత మపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయమ్
ఏకమాపాత మధురం అన్యదాలోచనామృతమ్'

పండితులకు పామరులకు పరమానందమును పంచి పెట్టునది సంగీతము. సాహిత్యము — ఆలోచన చేసి, ఆలసించినగాని ఆనందమును కలుగజేయునిది. సంగీతసాహిత్యములు భారతీదేవి స్తనములు. ఆ స్తన్యములగ్రోలి మానవుడు పరిపూర్ణుడై వర్ధిల్లుచున్నాడు.

20 వ శతాబ్దమున ఆంధ్రుల జాతీయ జీవనముతోబాటు—అద్భుతమైన సాహిత్యసృష్టియు జరిగినది. అది 1924 వ సంవత్సరము. రుధిరోద్గారి పుష్యమాసము .సాహిత్యస్రష్టలు ద్రష్టలు కళాప్రపూర్ణులుఐన శ్రీ నాగేశ్వరరావుపంతులుగారు — ప్రతిభాపూర్ణులై, కారయిత్రీ భావయిత్రీ శక్తియుక్తులై— భారతి సాహిత్య మాసపత్రికను వెలియింపచేశారు.

'ఉద్ధరేదాత్మ నాత్మానం' — తన్ను తాను పెంపొందించుకొని ఆంధ్రజాతినంతను ఉద్ధరించిన యశస్వి— నాగేశ్వరరావు పంతులుగారు.

భారతి ప్రథమసంచిక మొదటిపుట సూర్యోదయంతో వెలిగే 'భారతి' అక్షరములలో నిగూఢమైన అర్థము దాగియున్నది. భారతి అనగా వెలుగుతో ప్రకాశించెడిదని భావము. విద్యారణ్యులు ఋగ్వేద భాష్యభూమికలో దీనిని 'భా రతీతి భారతీ' అని నిర్వచించారు. అంతేగాక—శంకరభగవత్పాదుల అనుయాయులైన సన్న్యాసులు—వారి సన్న్యాస స్వీకరణానంతరం— దీక్షానామమునకు చివర, గిరి, పూరి, భారతి మున్నగు పేర్లను ధరిస్తారు. ఇవి దశవిధములైనవి; కనుక 'దశనామ్నా' అని పేరు.

'దశనామ్ని' యందు 'భారతి' శ్రేష్ఠతమమైనది. ఇట్టి పవిత్రమైన, త్యాగచిహ్నమైన పేరు తమ మాసపత్రికకు పెట్టుటయేగాక, దానిని ఉన్నతోత్కృష్ట సంప్రదాయములతో సాహిత్య మాసపత్రికగా వెలుగొందింప జేశారు. 'గుణాః పూజాస్థానం గుణిషు న చ లింగం న చ వయః'— జాతిమత భేదములకు ప్రాధాన్యమీయక—గుణము లెక్కడ ఉన్నా పూజింపవలయునన్న ధ్యేయముతో పాటుపడిన—వసుధైక కుటుంబికులు శ్రీ నాగేశ్వరరావు పంతులుగారు.

పంతులుగారి తర్వాత 'భారతి' సంపాదకత్వ బాధ్యత స్వీకరించిన శ్రీ శివలెంక శంభుప్రసాద్‌గారు— సుమారు మూడున్నర దశాబ్దాలపాటు దానిని కడు సమర్థంగా నిర్వహించారంటే—అది శక్తియుక్తులకు, సాహిత్యాభిమానానికి నిదర్శన. సాహిత్యములో అనేక నూతన ప్రక్రియలకు ప్రవేశము కల్పించిన ధిషణా ధీశాలి శ్రీ శంభుప్రసాద్‌గారు.

ఈనాడు 'భారతి' స్వర్ణోత్సవం జరుపుకుంటోంది. అది 'భారతీ శుభగభస్తిచయమ్ము' కూడా. అంతేగాక అది 'భారతీదేవి ముంజేతి పలుకుచిలుక' 'సంగఃకస్యహి న స్వదేత మనసే మాద్వీక మృద్వీకయోః' అంటే తేనెతోకూడిన ద్రాక్ష — అందరికీ తృప్తిని కలిగించునుకదా!'

కమ్మని మాద్వీకమృద్వి అయిన మధురోహలతో, కవితలతో, మంచి విమర్శలతో, కథలతో, వ్యాసాలతో భారతి తన పాఠకులను ఇకముందు కూడా అలరిస్తుంది! తథాస్తు !!

'కాలోహ్యయం నిరవధి ర్విపులా చ పృథ్వీ.'

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by
S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street,
Madras-1 Editor : S. Radhakrishna.

# అరవై యేళ్ల ఆంధ్ర సాహిత్యంలో నిలిచేది

'ఆంధ్ర ప్రశస్తి', 'ఆంధ్ర పౌరుషము', శ్రీ తుమ్మల 'రాష్ట్ర గానము' వచ్చినవి. కాని ఆంధ్రాభిమానము కేవలం కవిత్వపు ముద్దుగా రూపు కట్టినది శ్రీ రాయప్రోలు సుబ్బారావు 'తెనుగు తోట'లో. అది ఆంధ్ర కవితా కన్యకు మేలుకొలుపు పాట. శ్రీ రాయప్రోలు భావ కవులలో అగ్రగణ్యుడు, నవ్య కవితా స్థాపకుడు. అది 1914 లో వచ్చినది. అది చదివిన ప్రథమ క్షణం నుండి నేటివరకూ వ్యాసకర్తకు మధుర స్మృతిగా నిలిచి ఉన్నది. శ్రీ రాయప్రోలు తొలి కావ్యాలలో 'తెనుగుతోట' నిలుస్తుంది. ఆయన పరిణతుడైన కొద్దీ కవితా శక్తి క్షీణించ సాగినది. ఐనా పరిణతుడైన తర్వాత కొంత కావ్య లక్షణ సిద్ధాంతాలతో కలిసినా కావ్య రూపం పొందిన 'రమ్యాలోకము' కూడా నిలుస్తుంది. ఆ రెండిటిలో తేటగీతిలో కొత్త దీప్తి నిక్షేపించినారు.

దాదాపు 'తెనుగుతోట' పుట్టినప్పుడో కొంచెము ముందుగానో పుట్టిన శ్రీ గురుజాడ 'పూర్ణమ్మ కథ' మధుర మైనదే. కాని దాని కథా వస్తువు శ్రీ రాయప్రోలువారి 'కష్ట కమల'లో వలె అన్ని కాలాలలో ఆకట్టేది కాదు. కాబట్టి నిలిచే కావ్య కోటిలో చేర్చలేకున్నాను. ఐనా దానిలో ఉన్న వ్యావహారి కాంధ్ర భాషా మాధుర్యము దాన్ని నిలిపే అవకాశమున్నది.

ఈ యుగారంభంలో తేటగీతికి ఎక్కువ వ్యాప్తి కలిగినది. ఆఛందస్సులో కొత్త మాధుర్యము చూపడానికి తోడ్పడ్డవారిలో శ్రీ వెంకట పార్వతీశ్వరకవులు ముఖ్యులు. కాని వారు ద్విపదలో వ్రాసిన 'ఏకాంతసేవ' అపూర్వాద్భుతమైన ఆధ్యాత్మికానుభూతి కలసిన మధురవాసనలతో గుబాళిస్తున్నది. 'ఏకాంతసేవ' తప్పక నాలుగు కాలాలపాటు నిలుస్తుంది.

భావ కవులలో ముందు ప్రసిద్ధికి వచ్చినవారు శ్రీ దేవుల పల్లి కృష్ణశాస్త్రి, శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రి. వారి కావ్యాలన్నీ ఖండకృతులు. అది ఎన్నో ఎంతో మధురమైనవైనా ముందుచేసిన నియమం ప్రకారము క్షణప్రభలు. శ్రీ దేవుల పల్లి నాటికలు నిలిచేవి ఉన్నవి. వాటి ప్రస్తావన ఆ సందర్భంలో వస్తుంది.

శ్రీ శివశంకరుల 'హృదయేశ్వరి' 'వకుళమాలిక' తప్ప తక్కిన ఖండకావ్యాలన్నీ ఆకోవలోనే కనుక వదలివేయబడినవి. 'హృదయేశ్వరి' ప్రపంచ ప్రసిద్ధమైన ప్రేమ కావ్యాలలో ఒకటిగా పరిగణింప వచ్చును. అందులో వకుళ వృక్షము తరుచుగా ప్రత్యక్ష మవుతుంది. 'వకుళమాలిక' ఆకథకి అపూర్వాద్భుత పక్కిలో వర్ణిస్తుంది 'వకుళమాలిక'. పగడపూవు ఎండినా వాసన బహుకాలముంటుంది. వకుళమాలిక కూడా కలకాల ముంటుంది. శ్రీ శివశంకరుల పద్య గేయ నాటికలు ఆసందర్భంలో ప్రస్తావిస్తాము.

ఆకాలంలోనే ఒక్క వెలుగు వెలిగి ఆరిపోయిన ఇద్దరు కవులున్నారు. చామర్తి రాజశేఖరరావు 23 సం. ల ఈడులోనే గతించినాడు. అందువల్ల ఎక్కువ రచనలు ప్రచురించలేదు. ప్రచురించిన కొద్ది వాటిలో 'బృందావనము' అగ్రగణ్యము. అందులో కృష్ణ రూపములో భారత నాయకాన్వేషణము చిత్రించి నాడు. శ్రీకృష్ణ కర్ణామృతము, భాగవతములలోని మధుర భక్తికి నాయకాన్వేషణ మనే నూతన శక్తి జోడింపబడినది. ప్రచారము లేక ఈ కావ్యము విమర్శకుల దృష్టికి తగినంతగా రాలేదు. ఆంధ్రులు 'బృందావనం' మరిచిపోతే, జాతిరత్నాన్ని ఒకదాన్ని—కోహినూరు వంటిదాన్ని పోగొట్టుకొన్నట్లు!

చామర్తివలె కాక శ్రీ కొడవటిగంటి వెంకటసుబ్బయ్య పరదాగా దేశాటన చేయడానికి చిన్నతనంలోనే లేచిపోయి మళ్ళీ కనిపింపలేదు. వెళ్ళుతూ 'సంధ్యారాగము' అనే పేర కావ్య సంపుటి ప్రచురించినాడు, సాహితీసమితి సభ్యులు అతని 'కళ్యాణి'ని ఎక్కువ ప్రశంసించేవాళ్ళు. కాని అతని భిక్షువు కలకాలము నిలుస్తుంది.

1924 ప్రాంతాలలో బందరు ప్రసిద్ధినుండి బయట పడి, ఆంధ్రప్రదేశ్ ప్రసిద్ధి సంపాదించి, నేడు జగత్ప్రసిద్ధుడైన శ్రీ విశ్వనాథ సత్యనారాయణ ఉన్నారు. ఆయనయౌవనములో వ్రాసిన 'గిరికుమారుని ప్రేమగీతాలు' ఉన్నవి. అవి ఖండికలే ఐనా ఏకనాయికానిష్ఠమైనవి గనుక నాలుగు కాలాలపాటు నిలుస్తుంది. వారు తర్వాత వ్రాసిన వాటిలో 'శృంగారవీధి' 'శశి దూతము' తప్పక కలకాలము నిలుస్తవి. మా దృష్టిలో 'కల్పవృక్షము' మరీ పెద్దదైపోయినది. వ్యాస వాల్మీకుల శక్తి ఆధునికుల కున్న దనడానికి మాకు సాహసము చాలదు. అదిగాక అది వాల్మీకికి వ్యాఖ్యానమంటున్నారు కవి. వ్యాఖ్యానాలు కావ్యాలు కావుగదా! దానికి జ్ఞానపీఠపురస్కారము వచ్చినందుకు ఆనందమే, దాని విలువ లక్ష రూపాయలు గనుక! 'కిన్నెరసాని పాటలు' సభాపరివ్యాప్తమైనవి. వారు సభలలో చదివే తీరులో ఆపాటల ఆకర్షణ మున్నది కాని కావ్యము కాదు కనుక, వాటిని నిలిచే కావ్యకోటిలో చేర్చలేదు.

శ్రీ విశ్వనాథ కంటె ముందే కావ్యరచన ఆరంభించిన శ్రీ పింగళి కాటూరి కవులున్నారు. ముఖ్యంగా కృష్ణాపత్రిక ద్వారా వారి 'సౌందరనందము' విస్తారవ్యాప్తి పొందినది. అందులో ఉండవలసిన బౌద్ధ వాతావరణము కంటె గాంధేయ వాతావరణముండడము ఔచిత్యభంగమని మాబోంట్ల సందేహము. కాని అటువంటి ఔచిత్య భంగాలు ప్రపంచ సాహిత్యాలలో కొత్తలు కావు. షేక్స్పియరు నాటకాల నిండా అట్టివి కానవస్తున్నవి. అది గాక అందులో పద్యరచన మధురంగా సాగింది. అందువల్ల 'సౌందరనందము' నిలిచే కావ్యాలలోది అనక తప్పడంలేదు.

మొదటి రోజులలో ప్రసిద్ధికి వచ్చిన కవులలో, బసవరాజు అప్పారావు శ్రీ గురజాడ అడుగుజాడలలో నడిచిన వాడంటారు. కాని నిజానికి శ్రీ బసవరాజు స్వచ్ఛమైన కవితాత్మగల స్వతంత్ర కవి. ఆయన కావ్యాలు మధురమైనవైనా ఖండికలు గనుక పరిగణించే వీలులేదు. వారు వినిపించగా విన్న 'వాయుసందేశము' అనే దూతకావ్యముండవలె. అది ఆంధ్రదేశంలో ప్రధాన ప్రదేశాలను వర్ణిస్తుంది. అదిఎంత ప్రయత్నించినా దొరకలేదని వారి కావ్యాలు ప్రచురించిన వారన్నారు. ఎన్నటికైనా దొరికితే అది నిలుస్తుంది. ఇట్లా అవాంతరకారణాల వల్ల నిలిచే కావ్యాలు కొన్ని పురిటిలోనే సందుగొట్టి పోవడము విచారకరము!

(తరువాయి వచ్చేసంచికలో)